# విషయసూచిక

శ్రీరస్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్ర

# వచనరామాయణము

## కిష్కింధాకాండము

### 1-వ సర్గము

**శ్రీరాముఁడు పంపాసరోవరవైభవముఁజూచి విరహవేదనపడుట**

ఆరణ్యకాండమున రాముని దీన రక్షణ తత్పరత్వము వర్ణింపఁబడినది. కిష్కింధాకాండమున మిత్ర రక్షణ పరత్వము వర్ణింపఁబడుచున్నది.

రాముఁడు లక్ష్మణసమేతుఁడై తామరలతోను, కలువలతోను గూడి చేఁపలచే నిండినదయియుండు నా పంపాసరస్సు సొంపును జూచి మొదట సంతసమునంది, సీతను దలఁచి నింద్రియవైకల్యము నొంది, మరునిబారిం దవిలి లక్ష్మణునితో నిట్లనియె:

సౌమిత్రీ, ఈ పంపాసరస్సు వైడూర్యములమాడ్కి నిర్మలమైన యుదకము గలదియు, వికసించిన కమలములచే నొప్పారునదియు, పెక్కు వృక్షములచే శోభిల్లునదియునై చెలువారుచున్నది. సౌమిత్రీ, పంపాసరస్తీరమునఁ జూడ్కి కింపొదవించుచుండు నరణ్యమును జూడుము. దీనియందలి పర్వతములంబోలు చెట్లెల్ల శిఖరములతోఁ గూడినయట్లు ప్రకాశించుచున్నవి. ఈ పంపాసరస్సు చిత్రములయిన యరణ్యములుగలదియు, పెక్కు తెఱఁగులయిన పుష్పములతోఁ గూడినదియు, చల్లని నీరు గలదియు, పాములు, ఏనుఁగులు, పులులు, పక్షులును మున్నగుమృగములును మెండుగఁగలదియు, పద్మములచేఁ

వ్యాప్తమయినదియు, మిక్కిలి యింపయినదియునై యున్నందున భరతునియెడబాటుచేతను, సీతాపహరణముచేతను గలిగినశోకముచేఁ బీడితుఁడనైయున్న నాకును సంతసం బొదవుచు నొప్పుచున్నది. నలుపు ఆకుపచ్చనిరంగులు గలిసిన యీ పచ్చికనేల చెట్లనుండిరాలిన బహువిధములయిన పువ్వులతో నిండినదై; రత్నకంబళ్లు పఱచినట్లు మిక్కిలి ప్రకాశించుచున్నది. పుష్పరాసులతో నిండిన వృక్షశిఖరములు కొనలందుఁ బూచిన పూవులతోఁ గూడిన తీఁగెలచేఁ జుట్టఁబడి యెంతయుఁ బ్రకాశించుచున్నవి. లక్ష్మణా! యింపయిన గాలి గలదియు, పుష్పఫలభరితములైన వృక్షములుగలదియు, నెత్తావిగలదియు నైనందున నెక్కువ కామవికారము హెచ్చించెడు వసంతర్తువు సమీపించియున్నది. జలధరములగు మేఘము లుదకమును వర్షించునట్లు, పుష్పమయములగు వృక్షములు పుష్పములను గురిపించుచున్నవి. వీనిరూపు చూడుము. కొనలందలి చెట్టు లెల్ల గాలిచే మిక్కిలి కదలుచు రమ్యములైన ఱాలమీఁదఁ బువ్వులు చల్లుచున్నవి. లక్ష్మణా! చూడుము. క్రిందఁబడినవియు, పడుచున్నవియు చెట్లయందే యున్నవియునగు పూవులతో వాయువు పూవుబంతులాట యాడుచున్నట్టులున్నది. పుష్పభరితములైన చెట్లకొమ్మలు గాలి వీచుటచేఁ గదలఁగా నా పూవుల నడుమనుండిన తుమ్మెదలు వెలుపలికి వచ్చి రేఁగి యా వాయువును గూర్చి గానములు చేయుచున్నట్లు మ్రోగుచున్నవి.

లక్ష్మణా! నట్టువగాండ్రచే నాట్యమాడించుచుఁ బాటకుఁడు వెనుకనుండి పాటపాడునట్లు, వాయువు వృక్షములను గదలించుచు మదించిన కోయిలకూఁతలచే గానముచేయించుచుఁ బర్వతగుహలనుండి వెలుపలికి వచ్చుచున్నవాఁడు. అంతటఁ గడు వేగంబున వీచుచుండు గాలిచే నీ చెట్లొక్కదానితో నొకటి చేరినకొనలుగలవై, సరములుగాఁ గ్రుచ్చఁబడియుండునట్లు గనఁబడుచున్నవి. ఈ రమ్యమగు గంధము గల గాలి చందనముపగిదిఁ జల్లనై, బడలిక దీర్చుచు మెల్లఁగా వీచుచు సుఖముగా సోఁకుచున్నది. మధ్యగంధముగల వనములందలి యీ వృక్షములు గాలికిఁ గదలినవై, తేనెటీఁగలధ్వనులచే గానముచేయునట్లు కనఁబడుచున్నవి. పర్వతములు రమ్యములైన కొండనెత్తములందు చక్కని పుష్పములుగల మనోహరములగు వృక్షములు గలిగి

యుండుటంజేసి యొండొంటితోఁ గలసిన శిఖరములుగలవానియట్లు ప్రకాశించుచున్నవి. ఈ వృక్షములు పుష్పములచేఁ గప్పఁబడిన కొనలు గలవై, గాలి వీచుటచేఁ గదలుచు, నింపుగా గానముచేయుచుండు తుమ్మెదలు కొనలయందుఁ గలిగియుండుటవలన, నల్లని కురులు గలిగి, పుష్పములు జుట్టున కలంకరించికొని, తలయూచుచుఁ బాడెడు గొప్ప పాటకులమాడ్కిఁ గనఁబడుచున్నవి. లక్ష్మణా! చక్కఁగాఁ బూచిన యీ కొండగోఁగుచెట్లను జూడుము. ఇవి బంగారుభూషణముల నలంకరించి కొని, పచ్చనిపట్టువలువలు గట్టిన మానుసులవలెఁ గన్పట్టుచున్నవి. లక్ష్మణా! ఈ వసంతర్తువు యింపుగులుకు పెక్కుపక్షుల నాదములతోఁ గూడినదయి సీతను బాసియున్న నాకు సంతాపమును హెచ్చించుచు నున్నది. శోకాక్రాంతుఁడనై యున్ననన్ను మన్మథుఁ డింకను సంతాప పెట్టుచున్నాఁడు గదా! ఈ కోయిల నేను లొంగినందుకు సంతసముచేఁ జక్కఁగా నుబ్బినదై, నన్ను హేళనమునకుఁ బిలుచుచున్నది. సుమిత్రా నందనా! యీ చక్కనైన సెలయేటియందలి నీరుకోడి మన్మథపీడితుఁడ నగుఁ నన్నుఁ జూచి, సంతసముతో మఱింత కూయుచు నా మనసునకుఁ గడు వెతను గలిగించుచున్నది. తొల్లి నాప్రియకాంత యాశ్రమంబులం దున్నయప్పుడు, నీరుకోళ్ళకూఁతలను విని నన్నీ కూఁత వినరమ్మని పిలిచి, కడు నుప్పొంగుచుండెను.

లక్ష్మణా! యట్లు వింతగొల్పు పక్షులన్నియుఁ బెక్కు తెఱఁగులైన ధ్వనులను జేయుచు, నచ్చటచ్చటనుండి చెట్లకును, పొదలకును, తీఁగెల జొంపములకును వచ్చి చేరుచున్నవి చూడుము. లక్ష్మణా! ఆఁడుపక్షు లెల్ల మగపక్షులతోఁ జేరి, తమగుంపులు గొనియాడుచుండఁ దేఁటుల నాదముల విని యానందించుచుఁ జెవులకింపుగాఁ గూయుచున్నవి. నీరుకోళ్లను, గండుంగోయిలలును గూయుచుండుటచేత నీ వృక్షములు నాకు మదనవేదన నెచ్చించుచున్నవి. అశోకపుష్పముల గుత్తులనెడు నింగలములు గలదియు, తుమ్మెదలఝుంకారము లనెడు ధ్వనులుగల దియు, చివుళ్ళనెడి యెఱ్ఱని మంటలుగలదియునైన యీ వసంతర్తు వనెడి యగ్ని నన్ను దహింపఁగోరుచున్నది. తిన్నని పలుకులు గలదియు, సన్నని కంటిఱెప్పలు గలదియు, మెత్తని వెండ్రుకలతోఁ గూడినదియు

నయిన యీ ప్రియం గానక నేను ప్రాణములతో నుండి యేమి యుప యోగము?

ఓ దోషరహితుఁడా! చెలువు మీఱిన కానలతో నొప్పారు చున్నదియు, నెల్లదెసలను గోయిలలతోఁగూడినదియునైన యీవసంత కాలము నా ప్రియయగు సీతకుఁ బ్రియమైనది. మన్మథునిసంతాపముచేఁ బుట్టిన దుఃఖ మను నగ్ని హోత్రుఁడు వసంతకాలంపుసొంపుచేఁ బెంపొంది నన్ను వేగిరముగా దహింపఁగలఁడు. ప్రియం గానక చెన్నుమీఱిన వృక్షములం జూచుటచే నా మదనసంతాపము మీఁదు మిక్కిలి హెచ్చుచున్నది. సీత గంటికిఁ గానరాకయు, సురతకాలంపుఁజెమ్మట నార్చి, యలఁత దీర్చునట్టి వసంతుఁడు కంటికిఁ గనఁబడుచును నా శోకంబు పెంపొనరించుచున్నారు. సౌమిత్రీ! లేడికూనకంటిం గానక వెతలకును వగపులకుం బాలయియుండు నన్నిపు డీ కనికరములేని వసంతమారుతము పెచ్చుగ మాడ్చుచున్నది.

ఈ నెమళు లచ్చుటచ్చుట స్ఫటికంపుఁ గిటికీలంబోలు తమ తెక్కల విచ్చుకొని నర్తనముచేయుచున్నవి. ఈ నెమళు లాడునెమళ్ళతోఁ గూడి మిక్కిలి మదించి, మరునివశమునఁ జిక్కియున్న నాకెక్కువ మదన వికారము గలిగించుచున్నవి. లక్ష్మణా! చూచితివా యీ యాఁడునెమ్మి మరునిబారిం జిక్కి, కొండచరులందు నటించుచున్న తన ప్రియుఁడగు నెమ్మికడ నృత్యము సల్పుచున్నది. మగనెమలియు, తన తెక్కలను విచ్చుకొని, కూఁతలచే నన్ను హేళనము చేయునట్లు నటించుచు మదన వికారమునుజెంది యాఁడునెమ్మిని వెంబడించుచున్నది. నెమ్మియొక్క ప్రియకాంత నే రాక్షసుఁడును దొంగిలింపలేదుకదా! కాఁబట్టియే యీ నెమ్మి తన కాంతతోఁగూడ నింపుగులుకువనములందు విహరించుచున్నది.

ఈ వసంతర్తువున వనవాసము నాకుఁ గడు నోర్వరానిదై యున్నది. లక్ష్మణా, తిర్యగ్జంతులందుఁ గూడ వల పన నెట్టిదో! చూడుము! ఎంతవలపు లేనిది యీ యాఁడునెమలి, మోహము నాఁపఁజాలక తానే యిట్లు మగనికడఁ దిరుగుచుండునే! విశాలకన్నులు గలదగు నా ప్రియకాంతయు రాక్షసునిచే నపహరింపఁబడకుండెనేని, మదనవికారము గలదై యెక్కువ మక్కువతో గూడి నాకడకు వచ్చి యుండునుగదా! ఈ వృక్షములందలి పుష్పము లెక్కువ కాంతిగలిగి

మనోహరములుగా నున్నను, తుమ్మెదలతోఁగూడ వ్యర్థముగా నేలరాలి పోవుచున్నవి. పక్షులెల్ల నొండొరులం బిలుచుకొనుచున్నవో యన్నట్లు శ్రోత్రానందముగాఁ గూయుచు, నా కెక్కువ మదనవికారముం గలిగించుచున్నవి.

నా ప్రియకాంత యెచ్చట నున్నదో యచ్చటఁగూడ నిపుడు వసంతర్తువు వచ్చియుండునేని, నా ప్రియురాలగు సీతయు వలపులం జిక్కి నావలెనే దుఃఖించుచుండును. ఆ సీత యుండుచోట నిప్పుడు వసంతర్తువు రాకయుండును. వచ్చియున్నఁ గలువకంటియగు సీత నన్నుఁ బాసి యెట్లు జీవించియుండఁగలదు? లేక నా ప్రియకాంత యుండు చోట వసంతర్తువు వచ్చియున్నదేమో! చక్కని పిఱుఁదులుగల నాసీత శత్రువుల బెదరింపుల కోర్చి యేమిచేయుచున్నదో? నడివయసుదియు, తామరరేకులంబోలు కన్నులుగలదియు, తిన్నగా మాటాడునదియు నైన నా ప్రియకాంత యుండు ప్రదేశమున వసంతకాలము వచ్చి యుండునేని, నా ప్రాణప్రియ నా వియోగము సైపఁజాలక తప్పక ప్రాణముల విడువఁగలదు. పతివ్రతయగు నా సీత నన్నుఁ బాసి ప్రాణములతో నుండఁజాల దని యిప్పుడు నాకు దృఢముగాఁ దోఁచుచున్నది.

సీత తప్పక తన తలంపెల్ల నాయం దుంచియుండునది. నేనును ఆ సీతయం దన్నితెఱఁగుల నెక్కువ యనురాగ ముంచియున్నాను. ప్రియకాంతనే తలంచుచుండుటచేత నా కీ పువ్వుల నెత్తావిని జూఱఁగొనుచు వచ్చెడి తిన్నని చల్లని గాలి యగ్నిహోత్రసదృశమై యున్నది. సీతతోఁ డనున్నప్పు డేమలయమారుతము నాకు విడువక సుఖకరముగా నుండెనో, ఆ గాలి యిప్పుడు నా కెల్లప్పుడు విచారమును గల్గించుచునే యున్నది. మునుపు, సీత నాతో నుండునప్పుడు, ఏ కాకి యాకాశంబుఁజేరి కూయుచుండెనో, ఆ కాకి యిప్పుడు సీత దగ్గఱ లేనప్పుడు చెట్టునఁ గూర్చుండి మిక్కిలి సంతోషముతోఁ బాడుచున్నది. ఈ వాయసమే యిప్పుడు పంచవటియందు సీతావిరహమును గలిగించినది. ఈ పక్షియే యిప్పుడు నన్ను సీతకడకుఁ గొనిపోవఁ గలదు.

లక్ష్మణా, పక్షులెల్ల విరియఁబూచిన కొమ్మలుగల చెట్లయందుఁ గూర్చుండి, మన్మథోద్రేకము గలిగించునట్టి కూఁతలఁ గూయుచున్నవి చూడుము. లక్ష్మణా, ఒకతేఁటి గాలి కెగిరిన యొక బొట్టుగుచెట్టు

యొక్క పూవులగుత్తిని జూచి, మద్యపానమువలనిమత్తుచేఁ గదలు చున్న ప్రియురాలికడకుం బోలెఁ గడువేగిరముగా వచ్చుచున్నది. విరహులకు స్వాభావికముగా దుఃఖమును బెంచునట్టి యీ యశోక వృక్షము గాలి కెగురుచున్న యీ పూవుగుత్తులచే నన్ను బెదరించు చున్నది. లక్ష్మణా, పూఁతతో వెలయు మామిడిచెట్లు మైపూఁత పూసికొని, మనసున రతిసుఖము గోరుచున్న కాముకులమాడ్కిఁ గనఁ బడుచున్నవి. నరశ్రేష్ఠుండవగు సౌమిత్రీ, కిన్నరు లీవింతలైన వనసమూ హములం దచ్చటచ్చటఁ దిరుగుచున్నారు చూడుము.

ఈ నెత్తావిగల తామరపువ్వులెల్ల బాలసూర్యునివలె నీటియం దంతట వెలుఁగుచున్నవి చూడుము. ఈ పంపాసరోవరము తేటనీరు గలిగి, రాయంచలతోను, గన్నెలేళ్ళతోను గూడి, పలువన్నెలుగల తామరపువ్వులును, నల్ల కలువలును సౌగంధికములునుగలదై యొప్పు మీఱియున్నది. మఱియు నీ పంపాసరోవరము బాలసూర్యునిం బోలి నవియు తుమ్మెదలు తిరుగుటచే సడలియున్న కేసరములుగలవియునగు పంకజములతోఁ గూడి యొప్పుచున్నది. చక్రవాకపక్షులును, గట్టులందు చిత్రములైన యనేకవనములును గలిగి, నీరు త్రాగవచ్చెడి యేనుఁ గులయొక్కయు మృగములయొక్కయు సమూహములతోను ఎంతయు వన్నెమీఱియున్నది. లక్ష్మణా, నిర్మలమయిన యీ పంపాసరోవరోద కము నందలి పంకజములు గాలిచేఁ గొట్టుబడినయలలవేగముచేఁ గొట్టు మిట్టాడుచు మిక్కిలి ప్రకాశించుచున్నవి.

" తామరపూవులరేకులంబోలు కన్నులుగలదియు, నెల్లప్పుడు తామరపువ్వులం దెక్కువ ప్రేమగలదియునైన వైదేహినిం గానక జీవించియుండుట నాకు మనము లేదు. అక్కటా! యేమి మరునికటికి దనము. చక్కని రూపముగలదియు, ముద్దుగులుకుమాటలు పలుకునదియు నైన సీత గనఁబడక, దొరకనిస్థితియం దుండఁగా, ఆ సీత నీ మరుఁడు మాటిమాటికి జ్ఞప్తికివచ్చునట్లు చేయుచున్నాఁడు. వీఁడు క్రూరుఁడు గాఁడేని, యిట్లు నొచ్చియున్న నన్నింకను బీడించునా? ఈ వసంతము చక్కఁగఁ బూఁచిన వృక్షములతోఁ గూడి నన్నింకను బాధింపకేని, నే నిప్పటికిఁ గలిగియుండు మన్మథునిబాధ నోర్చుకొనియుండఁ గలుగు

దును. లక్ష్మణా, నే నా సీతతోఁగూడి యున్నప్పు డే యేవస్తువులు నా మనసున కింపొదవుచుండినవో, అవియెల్ల నిప్పుడు ప్రియురాలిం బాసి యుండుటచే నా మనసుకు వగపు పుట్టించుచున్నవి. లక్ష్మణా, నే నిప్పుడు తామరపువ్వులరేకులను జూచిన, నవి సీతయొక్క కన్నులతో సమానము లని తలఁచుచున్నాను.

చెట్లనడుమఁ బుట్టి, పద్మకింజల్కములమీఁదినుండి వీతెంచు నీ గాలి సీత నిట్టూర్పువలె మనోహరముగ నున్నది. లక్ష్మణా, పంపాసరస్సుయొక్క దక్షిణముననున్న కొండచరియఁ జూడుము. అచ్చటఁ బూవులు పూచిన దగుమనోహరమయిన కొండగోఁగు చెట్టొక్కటి యున్నది. ఈ ఋశ్యమూక మను పర్వతోత్తమము పలురంగుల కావి తాలతోఁగూడి, వాయువేగముచేఁ బలురంగులుగల దుమ్మును లేపుచున్నది. లక్ష్మణా, యీ పర్వతమునందలి చరియలంతటఁ జక్కఁగాఁ బుష్పించినవియు, నాకులు లేనివియునై రమ్యములైయుండు మోదుగుచెట్టు లుండుటచే నా పర్వతసానువులు మంటలుగలవిమాడ్కి వెలుఁగుచున్నవి. పంపాసరస్తీరరుహములగు నీ జాజి, మల్లెతీఁగెలు, గన్నేరుచెట్టులును జక్కఁగా వికసించినవై, యొక్కటితో నొకటి గలిసికొని, నెత్తావిగలిగి యున్నవి. చక్కఁగా విరిసిన మొగలిపొదలును, వావింటిచెట్టులును, అడవిమొల్లలును, మొల్లపొదలును వాసనం గుబాళించుచు నెంతయు విరాజిల్లుచున్నవి. కదంబవృక్షములు, ఉలిమిరిచెట్లు, ఖర్జూరపుఁజెట్లు, నల్ల యశోకవృక్షములు, పున్నకములును విరులుగలవై, నలుదెసలఁ బరిమళము నెఱపుచున్నవి. కొండల పైభాగములందు సింగపుఁగేసరములమాడ్కి వెలుఁగుచున్న లొద్దుగుచెట్లు, ఊడుగుచెట్లు, గోరింటచెట్లు, పూర్ణకవృక్షములు, వేపచెట్లు, మామిడిచెట్లు, కలిగొట్టుచెట్లు, కాంచనపుఁజెట్లు పుష్పభరితములయి యెంతయు శోభిల్లుచున్నవి.

నారింజచెట్లు, ఏఱుమద్దిచెట్లు, గేదంగిచెట్లు, విరిగిచెట్లు, దిరిసెన చెట్లు, శింశుపావృక్షములు, చంద్రచెట్లు, బూరుగు, మోదుగు, ఎఱ్ఱ గోరింట, నెమ్మి, కానుఁగుచెట్లు, శ్రీగంధపుఁజెట్లు, స్యందనవృక్షములును వెలయుచున్నవి. సౌమిత్రీ చూడుము. ఈ పంపాసరస్తీరరుహములగు పెలకొలఁది వృక్షములు చక్కఁగాఁ బుష్పించి, పుష్పించినకొన లతోఁ గూడిన తీఁగెలచేఁ జుట్టుకొనఁబడినవై వెలయుచున్నవి. లక్ష్మణా,

యౌవనముచే మదించిన జవ్వనులు తమ ప్రియులనే వెంబడించి యుండునట్లు, ఈ చెట్లు గాలికిఁ గదలుచున్నను, తీఁగెలా చెట్లకొమ్మల నెడఁబాయక యవిపోయినట్లెల్ల వానిని గలిసికొనియె పోవుచున్నవి. గాలి చెట్టునుండి చెట్టునకును, పర్వతమునుండి పర్వతమునకును, వనము నుండి మఱొక్క వనమునకును బోవుచుఁ బెక్కువృక్షముల పూఁదేనియల రుచిచూచుటచే మిక్కిలి తనివినొందినదానివలె తిన్నగ వీచుచున్నది. కొన్ని వృక్షములు పుష్పములచే నిండినవై, తేనియవాసన గలిగియున్నవి. మఱికొన్ని వృక్షములు మొగ్గలతోఁ గూడి, నల్లని చాయగలవానిమాడ్కిఁ గానంబడుచున్నవి. తుమ్మెదలును "ఈ పుష్పమునందుఁ దేనియ నిండియున్నది. ఈ పువ్వునందుఁ దేనె తియ్యనై యున్నది. ఈ కుసుమము చక్కగా విరిసియున్నది." అని యాశతోఁ బువ్వుపువ్వులోపలను దూఱుచున్నది. ఈ తేఁటి యొక పువ్వున వాలి, మఱల లేచి, వేగిరముగా మఱొక పువ్వునకుఁ బోవుచున్నది. ఈ తీరున నిది తేనె గ్రోలవలయు ననెడి యాసతోఁ బంపా సరస్సుగట్టున నున్న చెట్టు లన్నిటియందును దిరుగుచున్నది. ఈ నేలయందు విస్తారముగాఁ జెట్లనుండి పువ్వులు దమంతట రాలుటచే, నిది పువ్వులు పఱచిన పాన్పువలె సొబగుమీఱి, సౌఖ్యకరముగాఁ గనబడుచున్నది. ఈ కొండ నెత్తములం దొక్కొక్కచోట నొక్కొక్క తీరుగల పువ్వులు రాలుటవలనఁ బసుపు నలుపు మొదలగు పలురంగులు గల సెజ్జ లేర్పఱుపఁబడినవో యనునట్లు కానఁబడుచున్నవి.

లక్ష్మణా, వసంతకాలమున నీ చెట్లయందలి పువ్వుల కలిమిని జూచితివా! ఇయ్యవి యొక్కదానిమీఁద నొకటి పోటి గలిగియున్నవో యన్నట్లుగా నొక్క చెట్టునకంటె మఱొక్కచెట్టు విరివిగాఁ బూచియున్నది. ఈ వనపాదపములు చక్కగాఁ బూఁచిన కొమ్మలతోఁగూడి, తుమ్మెదల ఝంకారములతో నిండి యొండొరులం బిలుచుచున్నవో యన్నట్టులు వెలయుచు నెంతయుఁ జెలువుమీఱుచున్నవి. లక్ష్మణా, ఈ నీరుకోడి తేటనీటిని జొచ్చి తన ప్రియతోఁ గూడి రమించుచున్నది. ఇయ్యది చూడ నా మనసున కెంతయు మదనవేదన హెచ్చుచున్నది. గంగానది కింతటి చక్కని రూపుగల దేని, యప్పుడప్పు గంగానది మనోహరమ్మగుటకు- గుణములు - గలదియని

లోకములందు మిక్కిలి ప్రసిద్ధి గాంచియుండును. ఇప్పుడా పతివ్రత యగు సీత దొరకునేని, నే నిచ్చటనే యీ సీతతోఁ గూడియుందునేని, నా కింద్రలోకము నక్కఱలేదు; అయోధ్యయు నక్కఱలేదు. ఇట్లు మనోహరములగు పచ్చికబయళ్ళయందా సీతతోఁగూడి విహరించు చుందునేని నా కే చింతయులేదు; ఇతరవస్తువులమీఁద నాశయులేదు. ఈ మహీరుహములు చక్కని యాకులు కలిగి, పలుతెగలయిన పుష్ప ములతో నిండినవై యుండుటంజేసి, కాంతావియోగముచే పొక్కి యుండు నాకు మనోవికారమును బెంచుచున్నవి. సౌమిత్రీ చల్లనినీరు గల యీపంప పద్మములచే శోభిల్లుచు, హంస, కారండవ, చక్రవాక, ప్లవ, క్రౌంచాదులగు జలపక్షులతో నొప్పి, నీరు ద్రావ వచ్చిన వరా హములు మొదలగు మృగములతోఁ గూడి యింపుగాఁ గూయు చున్న పక్షులతో నెంతయు శోభిల్లుచున్నవి. తమప్రియులంగూడి మోద మొందుచున్న వివిధములగు పక్షులు చంద్రముఖియు, జవ్వనియు, తమ్మికంటియునైన ప్రియకాంతను గానక దానినే తలఁచి వగచుచుండు నాకు విరహవేదనను మఱింత హెచ్చించుచున్నవి.

లక్ష్మణా, వింతలైన యీ చరులందుఁ దమ ప్రియలతోఁ గూడి రమించుచున్న జింకలఁ జూడుము; మృగాక్షియగు సీతం గోలుపోయి విరహవేదనచేఁ గుందుచున్న నన్నును జూడుము. ఈ మనోహర మగు చరియయందుఁ దిరుగు పెక్కు మృగములును పక్షులును తమ ప్రియ కాంతలతోఁ గూడి యిచ్చటి కచ్చటికిఁ దిరుగుచుండుటఁ జూడ నాకు మదనవేదన మఱింత హెచ్చుచున్నది. ఆ నా కాంతను జూచిననే కాని నా మనంబునకు నెమ్మది గలుగదు. లక్ష్మణా, సన్ననినడుముగల యాసీత నాతోఁగూడి నీ చక్కని పంపాసరస్తీరమున వీచు గాలిని సేవించుచు నుండునేని, నేను బ్రాణములతో నుందును. లక్ష్మణా, అదృష్టశాలు రగు మానవులు పద్మముల కమ్మని తావిని గొని, తిన్నగా వీచుచు శోకమును బోఁగొట్టెడి యీ పంపాసరస్తీరపుఁ దోఁటలలోనిగాలిని సేవింతురు. నడివయసుదియు, పద్మపత్రములంబోలు కన్నులుగలదియు నైన నా ప్రియయగు జానకి నన్ను విడనాడినదయి స్వాధీనముఁదప్పి తన ప్రాణముల నెట్లు దాల్చియుండఁగలదు? నేను వనవాసము ముగించి మఱలఁ బట్టణంబునకుఁ బోవునప్పుడు ధర్మముల నెఱిఁగినవాఁడు,

సత్యము పలుకువాఁడు నగు జనకన్నృపాలుఁడు తన కూఁతు సేమము నడిగిన నేనేమి బదులు చెప్పుదును? తండ్రి న న్నడవికిఁ బొమ్మనఁగా నే నడవికి వచ్చునప్పుడు, నిర్భాగ్యుఁడనైన న న్నెడఁబాసి యుండఁజాలక నీతికి లోఁబడి కూడవచ్చిన ప్రియురాలగు సీత యిపు డెచ్చట నున్నదో! లక్ష్మణా, రాజ్యముఁ గోల్పోయి, విచారగ్రస్తుఁడనై యున్న న న్నేసీత వెంబడించి వచ్చినదో, యట్టి సీతను బాసి, సంతసము దప్పి యెట్లు నేను ప్రాణములతో నుండఁగలను? చక్కని కనుఱెప్పలు గలదియు, నెత్తావిగలదియు, ఒచ్చెములు లేనిదియునై సొబగుమీఱు చుండు సీత మోముమును జూడక నా మనము మిక్కిలి కుందుచున్నది. లక్ష్మణా, సీత చిఱునవ్వు మోముతో నడుమనడుమఁ బరిహాసపూర్వకము లయినవియు, తియ్యనివియు, రసవంతములయినవియు, మే లొనఁగూర్చునవియునైన పలుకులు పలుకు టెప్పుడు వినఁగలను? నడివయసున నున్నదియు, పతివ్రతయునైన సీత వనమున వనటనొందియు మదన బాధచేఁ గృశించియున్న నన్నుఁగూర్చి, దుఃఖము లేనిదివోలెను, సంతోషచిత్తురాలికై వడియు బాగుగా మాటాడుచు, నన్ను సంతోష పెట్టెను. లక్ష్మణా, నేను మఱల నయోధ్యకుఁ బోయినపుడు, నాతల్లి, "కోడ లెక్కడ" అని మక్కువతో నడుగఁగా, నే నామె కే మని బదులు చెప్పుదును? లక్ష్మణా, నీవు పోయి, తోఁబుట్టువులం దెక్కువ ప్రేమముగల భరతునిం గూడి సౌఖ్యముతో నుండుము. నేను జానకిని విడనాడి యొకనిమిషమైనను మనఁజాలను." అని లక్ష్మణునితోఁ జెప్పి రాముఁడు విరహవేదన నోర్వఁజాలక, దిక్కులేనివానికై వడి విల పించుచుండును.

అట్లు ధీరుఁ డయినను సీతావియోగవేదనచే వగచుచుండు రామునిఁ జూచి, లక్ష్మణుఁడు సమయోచితముగను, బదులులేకుండు నట్లు నిట్లనియె: "పురుషోత్తముఁడా, రామా, దుఃఖము నణఁపుము. నీకు మేలయ్యెడుఁగాక. కలుషాత్ములుగాని నీబోటిధీరు లెంత యాపద లందును వ్యసనము నొందరుగదా. ప్రియజనమునం దెక్కువ స్నేహ ముంచినయెడ, వారిం బాసినప్పు డెక్కువ వ్యసనము గలుగును గావున, ప్రియజనమునం దెక్కువ ప్రేమ యుంపరాదు. దీపపువత్తి తడిసి యున్నను, ఎక్కువ స్నేహముండు నేని కాలిపోవును. రాఘవా!

నీ ప్రియురాలి నపహరించిన రావణుఁడు పాతాళమునకుఁగాని, లేక యంతకుఁ గ్రిందికిఁగాని బోయినను, ఆతఁ డెవ్విధమునను ప్రాణములతో నుండఁజాలఁడు. ఆపాపాత్ముఁ డగు రావణునిసంగతి మొదటఁ దెలిసికొందము. పిమ్మట వాఁడు సీతను దెచ్చియిచ్చిన సరే లేనిచో వానిని వధింతము. ఆ రావణుఁడు సీతను వెంటఁ దీసికొని యదితి గర్భము చొచ్చినను, వానిని వధించెదను. ఓ పూజ్యుఁడా! మే లొసఁగునట్టిది నెమ్మది. అట్టి నెమ్మది నొందక కార్యము సిద్ధింపదు గావున నీవు దీనబుద్ధి వదలి, శాంతి నొందుము. కార్యము చెడిపోయిన వారె ప్రయత్నపడక యా కార్యమును నెఱవేర్చుకొనఁజాలరు. ఆర్యా! ఉత్సాహమే బలిమిగలది. ఉత్సాహమునకంటె మించిన బలము లేదు. ఉత్సాహవంతుని కీలోకము దుర్లభమైనది యొక్కటియు లేదు. ఉత్సాహవంతు లెప్పుడును నాశ మొందరు. కావున మన ముత్సాహమువూని సీతం బడయుదము. మహాత్మా! నీవు శోకమును వెనుకకుఁ ద్రోసి, మోహమును వీడి, కార్యమును సాధింపుము. నీవు ధైర్యవంతుఁడవుగను, శక్తిగలవాఁడవుగ నున్నను, నీ ప్రభావము నేల యెఱుఁగకున్నావు?" అని యిట్లు లక్ష్మణుఁడు శాంతపఱుపఁగా, రాముఁడు దుఃఖాక్రాంతచేతస్కుఁడయినను, వగపును మోహమును బాసి, మిక్కిలి ధైర్యము నొందెను. 2954

ఎన్న రానిపరాక్రమంబు గల యా రాముఁడు చింత నాపుకొని కడురమ్యములైన చెట్లతోఁ గూడి, మనోహరమైయున్న పంపాసరస్సును దాఁటిపోయెను. మహాత్ముఁడగు రాముఁడు వనమునంతయు, సెలయేళ్ళను, పర్వతగుహలను జూచుచు, లక్ష్మణసమేతుఁడయి సీతను గానక, మనమున వగచుచుఁ బయనమైపోయెను. రాముఁడు ముందు నడచుచుండఁగా, లక్ష్మణుఁడు మదపుటేనుఁగుకైవడి నడచుచుఁ ధీరహృదయుఁడయి, మెలఁకువతోఁ గూడి యా రామునికి రాజధర్మములు చెప్పియు, మృగాదులవలన నపాయము గలుగనీకయుఁ గాపాడుచుండెను. 294-572

VAL V.4

అట్లు రామలక్ష్మణులు వచ్చుచుండఁగా, వానరాధిపుఁడును, బలవంతుఁడునైన సుగ్రీవుఁడు ఋశ్యమూకపర్వతశిఖరమున నుండి, ఆశ్చర్య

మును గలిగించురూపముగలవారగు నా రాజపుత్త్రులం జూచి మిక్కిలి యులికిపడి, కొంచెమైనను గదలక మెదలక యుండెను. ధైర్యశాలి యగు నా సుగ్రీవుఁడు గజముమాడ్కిఁ దిన్నగాఁ బోవుచు నప్పర్వత సమీపంబునఁ బెద్దయుఁ బ్రొద్దు సంచరించుచుండు నారాజపుత్త్రులం జూచి, దిగులొంది, వాలి పంపిన మాఱువేసములు దాల్చిన బంటులో యని తలఁచి భయ మను సముద్రమున మునింగినవాఁడై యెక్కువ వెతనొందెను. ఆ సుగ్రీవుని మంత్రు లగు వానరులును పరాక్రమ శాలు లగు రామలక్ష్మణులం గాంచి, "వీరు వాలిబంటు" లని వెఱచిన వారలై, పావనంబును, సుఖప్రదమును, శరణుచొచ్చినవారిం గాపాడు నదియు, సంతతము వానరుల కునికిపట్టయినదియునైన మతంగాశ్రమంబు నకుఁ బోయి చేరిరి.

## 2-వ సర్గము

సుగ్రీవుఁడు హనుమంతుని రామలక్ష్మణుల విచారించుటకై పంపుట

మహాత్ములును, మేటి యాయుధములు దాల్చిన వాఁడిమగలునైన యన్నదమ్ములగు రామలక్ష్మణులఁ జూచి, వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు వాలి యంపిన భటులేమో యని సంశయపడినవాఁడై, మనసున దిగు లొంది, దెసలెల్ల విలోకించుచు నారాటమొంది యొకచోట నిలువక, తా నున్నచోటనె యుండుటకు నిచ్చగింపనివాఁడయ్యె. కడు భీతుఁ డయిన యా కపీంద్రుని మనస్సు వ్యసనాక్రాంత మయ్యెను. ధర్మాత్ముఁ డగు సుగ్రీవుఁడు మిక్కిలి భీతినొంది, కొంతతడవు తనమంత్రులం గూడి మేలుకీళ్ళ నరసి వారితో నిట్లనియె. "వీరు వాలియొక్క వేగులు. వీరు మనసంగతి తెలిసికొనుటకై మోసముతో నారబట్టలను గట్టుకొని చొరరాని యీ వనమునకు వచ్చియున్నారు" అని సుగ్రీవుఁడు చెప్పఁగా, సుగ్రీవునిమంత్రు లందఱు గొప్పవిలుకాండ్రగు రామలక్ష్మణులను జూచి, యాచరియ విడిచి మఱియొక్క శిఖరమునకుఁ బోయి చేరిరి. అట్లొక్కొక్క గుంపునకు నాయకులయిన వానరులు యూథపుల కధిపతియు, వానరోత్తముఁడు నయిన యా సుగ్రీవునిచుట్టును అతని కేయుపాయము గాకుండునట్లు కను పెట్టికొని కాచుకొనియుండిరి. ఇట్లు వానరు లొక్క

చోటినుండి మఱియొక్క చోటికిని, ఒకపర్వతముమీఁదినుండి మఱి యొక్కపర్వతముమీఁదికిని బోవుచుఁ దమ వేగముయొక్క బలిమిచేఁ బర్వతశిఖరములనుసైతముఁ గదలించుచు, నా దుర్గముననున్న పుష్పించిన చెట్ల నన్నింటిని విఱిచిరి. వానరము లిట్లు దాటిపోవుచు నా పర్వతముననున్న జింకలను, పిల్లులను, పులులను వెఱపించుచుఁ దిరుగుచుఁ బోయి, మఱొక్క పర్వతశిఖరముఁ జేరి తమ యధిపుఁడగు సుగ్రీవునిసన్నిధానమునఁ జేతులు గట్టికొని నిలఁబడియుండిరి.

ఇట్లు వాలి పంపిన మోసగాండ్రో యని సంశయించి, భీతిచేఁ గడగడ వణఁకుచున్న సుగ్రీవుం జూచి, మాటలందు నేర్పరియగు హనుమంతుఁడు, "మీ రందఱు వాలినిమిత్తమయిన యీ తత్తరపాటు వదలుఁడు. ఇది పావన మగు మలయపర్వతము. ఈ పర్వతమున వాలి వలనిభయము లేదు. హరిశ్రేష్ఠా, నీ వేవాలికి వెఱచి యిట్లు పరుగెత్తితివో, యట్టిక్రూరస్వరూపుఁడును, క్రూరుఁడును నగు వాలి యిచ్చట గానరాఁడు. పాపాత్ముఁడగు నే నీయన్నవలన నీవు భయపడుచున్నవో, యాదుష్టాత్ముఁడగు వాలి యిక్కడ కానరాఁడు. నీ కిచ్చట భయకారణం బేమియు నాకుఁ గానరాదు. ఓవానరోత్తమా! నీ కోఁతితనము తెలిసినదియేకదా. నీవు చపలబుద్ధికలవాఁడవు గనుక, మనోస్థైర్యము లేక యున్నావు. వానరోత్తమా! తెలివియు యోచనయుంగలవాఁడవై, భావములంగ్రహించి యన్నిపనులు చేయుము. ఏల యన, బుద్ధిహీనుఁడగు రాజు సర్వభూతములఁ బాలింపఁజాలఁడు" అని చెప్పెను.

సుగ్రీవుఁడును హనుమంతుఁడు సెప్పిన మంచి పలుకులు విని, యా హనుమంతునితోఁ గడు మేలయిన పలుకులం జెప్పెను. "ఓ హనుమంతుఁడా! నిడుద చేతులును, విశాలకన్నులును గలవారై, ధనుర్బాణగదలం దాల్చిన దేవకుమారులం బోలిన వీరిం జూచిన నెవరికి వెఱపు పుట్టదు? ఈ పురుషోత్తములు వాలి పంపిన వేగులని తలంచెదను. రాజులకు పెక్కండ్రు మిత్రు లుందురు. ఒక్కొక్క రొక యాలోచన చెప్పుదురు. కాఁబట్టి రాజులయెడ నమ్మక ముంచుట తగినపని కాదు. రాజు గూఢచారులగు శత్రువులను దెలిసికొనవలయును. అట్లు తెలియక నమ్మియుండు రాజును, శత్రువులు తాము నమ్మనివారయి సందు

గనిపెట్టి యాతనికి నాపదలం గలిగింతురు. వాలియో రాచకార్యముల పట్లంగడు నేర్పరి. రాజులు పెక్కుపాయములం దెలిసినవారు. కావున నట్టి మోస గాండ్రగు శత్రువుల మారువేసముదాల్చినయట్టి మోస గాండ్రమూలముననే యెఱుంగవలయును. హనుమంతుండా! నీవు మారువేసము దాల్చి, వారిచేష్టల యభిప్రాయములను, రూపమును, మాటలను గనిపెట్టి, వారు మంచిమనసు గలవారని తెలియుదువేని, పొగడ్తలచేతను, స్వాభిప్రాయములం దెల్పుటచేతను వారిని నమ్మించి, వారి యభిప్రాయముం దెలిసికొనుము. ఓ హరిపుంగవా! వారు విండ్లను దాల్చి యేల యీవనమున కేతెంచిరో యడిగి తెలిసికొనుము. నా కనుకూల మగునట్లు వారితో మాట్లాడి వీరు మంచి మనసుగలవారలా? లేక వాలి పంపంగా వచ్చిన వేగులా? ఈ సంగతి వారి నడతలు, మాటలు మొదలగువానిం గనిపెట్టి తెలిసికొని రమ్మని సుగ్రీవుండు సెప్పెను.

ఇట్లు కడు భయంకరుండును, శత్రువుల కలవిగానివాండును నైన సుగ్రీవుండు సెప్పిన పలుకులు విని, యాతనియానతిని శిరసావహించి, మహానుభావుం డగు హనుమానుండు బలిష్ఠులగు రామలక్ష్మణు లున్న చోటికిం బోయెను.

## 3- వ స ర్గ ము

**హనుమంతుండు రామలక్ష్మణులసంగతి విచారించుట**

పవననందనుం డగు శూరుండయిన హనుమంతుండు బుద్ధిశాలియగు సుగ్రీవునియానతి గైకొని, మోసంపుందలంపుగలవాం డగుటచే స్వీయ రూపము వదలి, యతిరూపము దాల్చి, ఋశ్యమూక పర్వతశిఖరము నుండి పైకెగిరి యా రామలక్ష్మణులున్న చోటికి దుమికి, మృదువును, సత్యమును నైన పరాక్రమముగలవారును, శూరులును నైన యా రామ లక్ష్మణులకు సవినయముగ మ్రొక్కి, పలుతెఱంగులం గొనియాడి, యథా విధిగం బూజించి తిన్నని యింపుగులుకు పలుకుల నిట్లనియె,

ఓ నరోత్తములారా! మీరు దేవతలం బోలినవారును, కఠిననియ మములుగల తాపసులు నైన రాజర్షులుగం గన్పట్టుచున్న వారలు. నిగనిగ

మెఱయు మేనిడాలుగల మీ రీ దేశమున కెట్లు వచ్చితిరి? మీ రేల యీ పంపాతీరవృక్షములనేలను దేఱిపాఱఁ జూచుచున్నారు? మిమ్ముఁ జూచి యీ వనమున నున్న మృగపక్షులగుంపు లెల్ల వెఱచుచున్నవి. మీకాంతిచే నీపంపాసరస్సునందలి తేట నీరెల్లఁ దళతళ మెఱయుచున్నది. ఇట్టి సరోవరప్రాంతమునఁ దిరుగుచు, మునివేషధారులై ధైర్యవంతులు బంగరుకాంతివంటిశరీరము కాంతిగలవారు నారబట్టలఁ గట్టినవారు హస్తిహస్తము లంబోలు నిడుదచేతులుగలవారు, సింహమువంటి గంభీరదృష్టిగలవారు, సింగముకంటె నెక్కుడు బలిష్ఠులు, ఇంద్రధనుస్సునుబోలినధనుస్సును జేతఁ బూని శత్రువులను సంహరించువారు, కలిమిగలవారు, చక్కనైనవారు, ఆఁబోతులవంటి వీరులు, మెఱుఁగు గలవారునైన నరోత్తములగు మీరు మావంటి వారికి వెఱపుగల్గించుచు, నిట్టూర్పులు నిగిడించుచున్నారు. మీ రెవరు? మీ మేనిడాలు చేత ఋశ్యమూకము వెలయుచున్నది. తమ్మిరేకులం బోలు కన్నులుగలవారలు, వీరులు, దేవతలంబోలువారలు, రాజ్యపరిపాలనార్హులునైన మీరు జడలగుంపును దాల్చి యేల యీ పర్వతమునకు వచ్చితిరి. మీ రొండొరులం బోలి, శూరులై స్వర్గలోకమునుండి యథేచ్ఛగాఁ బుడమికి దిగివచ్చిన సూర్యచంద్రులం బోలి నిగనిగ మెఱయుచున్నారు. మీరు వెడఁదఱొమ్మును, సింగపుమూపురములును గలిగి, మనుజులయ్యు, దేవతలో యనఁబరఁగి, కడు నుత్సాహవంతులై మదించిన యాఁబోతులమాడ్కి నున్నవారలు. మీ బాహువులు నిడుదలు, గుండ్రనివియునై పరిఘాయుధమునుబోలి, సకలభూషణముల దొడుగఁ దగినవిగ నున్నను, ఏల భూషణవిభూషితములు గాకయున్నవి? మీ రిరువురును వింధ్యమేరుపర్వతములచే నలంకృతములయియుండు నీభూమండలమునెల్ల సగిరికాననముగఁ బాలింపఁజాలినవారని తలఁచెదను. వింతగొల్పునవియు, నున్నవియు, వింతయైన బంగారుపూఁత పూసినవియునైన యీ విండ్లు మేలికడాతాపఁబడిన దేవేంద్రుని వజ్రాయుధములమాడ్కి వెలుంగుచున్నవి. ఈ యమ్ముల పొదులు ప్రాణములకుఁ దుది గలిగించునట్టి బుసకొట్టుచున్న ఘోరసర్పములమాడ్కి వెలుఁగుచున్నకఱకుటమ్ములతో నిండియున్నవి. మీ చేతి గదలు రెండును మిక్కిలి నిడుదలై, వెడల్పు గలిగి, పుత్తడిరంగు గలిగి,

కుబుసము విడిచిన పాములవలెనొప్పి వెలయుచున్నవి. ఓ రాజపుత్రులారా! నే నిన్ని తెఱఁగుల మిమ్ము నడుగుచున్న నొక్కమాటకైన బదులు సెప్పకున్నా రదేమి?

ధర్మకార్యము లొనర్చు స్వభావముగల శూరుఁడయిన సుగ్రీవుఁడను వానరోత్తముఁ డొక్కఁడు గలఁడు. అతఁడు తనతోఁబుట్టువు మూలమున నిడుమ చెంది, వగపాలై యీవనమెల్లఁ దిరుగుచున్న వాఁడు. మహాత్ముఁడగు వానరపతియైన సుగ్రీవుఁడు పంపఁగా నే నిట కేతెంచితి. నన్ను హనుమంతుఁ డని యందురు. న్యాయపరుఁడగు సుగ్రీవుఁడు మీతోఁ జెలిమిగోరుచున్నాఁడు. నేను వాయుపుత్రుఁడను. వానరుఁడను. ఆ సుగ్రీవునికి మంత్రిని. నా కీభిక్షురూపంబు నియతంబు గాదు. నేను దలఁచినరూప మెత్తఁగలను. తలఁచినచోటికిఁ బోవఁ గలను. ఆ సుగ్రీవునిమేలు గోరి ఋశ్యమూక పర్వతమునుండి యిట కేతెంచితిని. అని నేర్పరియగు హనుమంతుఁడు వాక్యార్థము నెఱుఁగఁ గలవారును, శూరులునయిన రామలక్ష్మణుల కిత్తెఱఁగునఁ జెప్పి, యంత టితోఁ దన మాటలను ముగించెను.

శ్రీమంతుఁ డగు రాముఁడు హనుమంతుని పలుకు లాలకించి, మొగంబునఁ జెలువగవు గన్పట్ట దండ నిల్చియున్న లక్ష్మణునిం గూర్చి, "లక్ష్మణా, ఈతఁడు మహాత్ముఁడయిన కపీంద్రుఁడగు సుగ్రీవుని మంత్రి. ఆతనినే మనము చూడఁగోరియుండ, మనకొఱ కాతనిమంత్రియే వచ్చెను! శత్రుసంహారకుఁడా! మాటలందు నేర్పరి యగు నీ సుగ్రీవునిమంతిరితోఁ దేనియలు వెల్లివిరియఁ బ్రేమ ముట్టిపడ మాటాడుము. ఋగ్యజుస్సామములను వేదత్రయము పఠింపనివాని కిట్లు మాటాడ వీలగునే? ఇతఁడు వ్యాకరణమంతయుఁ బెక్కుమాఱులు చదివిన వాఁడు. కాఁబట్టి యితఁ డెంతయు మాటాడినను, వీని నోటినుండి యొకింతయునపశబ్దము రాదయ్యె. ఇతనిముఖమునఁగాని, కన్నులందుఁ గాని, నొసటఁగాని, బొమలందుఁగాని, తక్కిన యవయవములందుఁగాని యెచ్చటను నొక్కదోషమైనను గానరాదుగదా, ఇతఁ డాడుమాటలు విస్తారముగాకయు, సందియములేకయు, తడవు గలుగకయు, ఱొమ్ము నుండిపుట్టి కంఠమూలమువలన మధ్యమస్వరముతో వినఁబడుచున్నవి.

ఇతఁడు వ్యాకరణవిరుద్ధము గాకుండునట్లును, సరసముగను, తొందర లేకయు మనస్సు నాకర్షించునట్టి శుభకరమైన మాట పలుకుచున్నాఁడు. వింతలైన యర్థములుగలిగి, ఉరఃకంఠశిరస్సులందు స్పష్టోచ్చారణగల యీ హనుమంతుని మాటల విన్నవాఁ డెవ్వఁడు సంతసింపఁడు? సంహరింపఁబూని, కత్తి చేతదూసిన పగతుఁడుగూడ నితనిపలుకులు వినిన, తోడనే ఖడ్గముఁ గ్రిందఁబడవేయును. రాజున కిట్టి గుణవంతుఁడగు దూత యుండఁడేని, యాతఁడు కార్యముల సాధించు టెట్లు? ఏ రాజున కిట్టి గుణములు గలిగిన కార్యసాధకులైన మంత్రు లుందురో, ఆ రాజు లట్టిదూతలపలుకుల నాలకించి, యీ ప్రకారము నడచుకొన్నచో నన్ని కార్యములు సిద్ధింపఁగలవు."

ఇట్లు రాముఁడు సెప్పఁగా, మాట్లాడ నేర్పుగల లక్ష్మణుఁడు విని, మాటలయభిప్రాయము నెఱుఁగఁగల హనుమంతునిఁ గూర్చి, "ఓ పండితుఁడా! మహాత్ముఁడయిన సుగ్రీవునిగుణములు మాకుఁ దెలియును. మేమును వానరాధిపుఁడగు సుగ్రీవునే వెదకుచున్నారము. సాధువా! హనుమంతుఁడా! సుగ్రీవుని మాటగా నీ వేమి చెప్పితివో, నీవు చెప్పిన చొప్పున దాని నట్లే చేసెదము." అని యిట్లు లక్ష్మణుఁడు చెప్పఁగా, మారుతనందనుఁడగు హనుమంతుఁ డాతనిపలుకులు విని మిక్కిలి సంతోషపడి, మనమునఁ గుదుటపడి వాలిజయమునిమిత్తమయి యీ రామలక్ష్మణులతోఁ జెలిమి యొనర్పఁ దలఁచినవాఁ డయ్యెను.

## 4-వ సర్గము

**లక్ష్మణుఁడు హనుమంతునికిఁ దమవృత్తాంతముఁ దెల్పుట**

మాటలందు నేర్పరియైన వానరశ్రేష్ఠుఁడగు హనుమానుఁడు లక్ష్మణుఁడు సెప్పిన తేనియలొలుకుపలుకులు విని, "రాముఁడు సుగ్రీవునితో నెయ్యమొనర్ప వచ్చియున్నాఁడు. ఇతనికి సుగ్రీవునివలనఁ గార్య మున్నది. కావున సుగ్రీవుఁడు గోరినపనిని రాముఁడును జేయఁగలఁడు. ఇఁక సుగ్రీవునికి రాజ్యలాభము గలుగఁగలదు." అని సుగ్రీవునిం గూర్చి తనమనమునఁ దలపోసి ప్రమోదమందినవాఁడై, రామునిం గూర్చి, "ఓ రాజా! పంపానకస్తీరవనములచే శోభిల్లునదియు,

పెక్కు కూళమెకముల కునికిపట్టునగు నీ ఘోరారణ్యమున కేల తమ్మునితోఁగూడి వచ్చితివి?" యని యడిగెను.

అంత రాముఁడు హనుమంతునివాక్యము విని లక్ష్మణునివైపు చూచి సైగ చేసెను. అంత లక్ష్మణుఁడు హనుమంతునిఁ గూర్చి మహాత్ముఁడైనరామునిసంగతి యిట్లనియె. "ఓ హనుమంతుఁడా! కాంతిమంతుఁడును, ధర్మమునందుఁ గడుఁబ్రేముడి గలవాఁడు నైనదశరథనరపాలుఁడు బ్రాహ్మణాదివర్ణముల వారి నెల్లపుడు మర్యాదఁ దప్పక పరిపాలించుచుండెను. ఆతనిపై నితపలకును, అతనికి నితరులపైనను విరోధము లేదు. ఆతఁడు జనులందఱియందు బ్రహ్మదేవునిపగిది దయాళువై యుండును. ఆ దశరథుఁడు సంతతిఁ గోరి, యగ్నిష్టోమాదులగు పెక్కు యాగములుసేసి, యఋలకుఁ గావలసినంత యిచ్చెను. ఆతని కితఁడు పెద్దకొడుకు; ఇతనిని రాముఁ డందురు. ఇతఁడు సకలజీవకోటికిని శరణ్యుఁడు. తండ్రియానతిమీఱనివాఁడు. వీరుఁడగు నీరాముఁడు దశరథునికొడుకులలో నెల్ల నెక్కువ గుణవంతుఁడు. రాజలక్షణములును, రాజసంపదయుం గలవాఁడు. తండ్రి యితనిని రాజ్యమునుండి పొమ్మనఁగా, నన్నుఁ గూడఁ బిలిచికొని యీ వనమున నుండ వచ్చెను. ఎక్కువకాంతిగల సూర్యుని సాయంకాలమున వెలుఁగు వెంబడించునట్లు ప్రతాపవంతుఁడగు నీరాముని సీత వెంబడించి వచ్చెను. నే నీతనికిఁ దమ్ముఁడను. నన్ను లక్ష్మణుఁ డందురు. మేలు మఱవనివాఁడు, శాస్త్రముల నెఱిఁగినవాఁడు, సుఖము లనుభవింపఁ దగినవాఁడు, ఉత్తముఁడు, మనసునం దెల్లప్పు డన్నిభూతములకును హితముఁ గోరువాఁడునైన యీ రాముఁ డైశ్వర్యముఁ బోఁగొట్టుకొని, యడవులకు వచ్చినను, అతనిగుణములచే నే నాతనికి శుశ్రూష యొనరింపవచ్చితిని. మే మందఱము వనమున నుండఁగా, నేనును రాముఁడును లేనిసమయమునఁ గామరూపియగు నొక రాక్షసుఁ డీతని భార్య నపహరించెను. ఆ యపహరించిన రాక్షసుఁ డెవ్వఁడో తెలియరాదు. దితిపుత్త్రుఁడు దను వనువాఁడు శాపమువలన రాక్షసత్వము నొందిన మాకు మార్గమధ్యమునఁ గనఁబడెను. 'సీతనుగూర్చి నీ కేమైనను దెలియునా?' యని యాతనిని నడుగఁగా, "నాకుఁ దెలియదు. ఋశ్యమూకమున సుగ్రీవుండను వానరోత్తముఁడున్నాఁడు. ఆతఁడు

సీత నెత్తికొనిపోయినవానిని నెఱుఁగఁగలఁ"డని యాతఁడు మాతోఁ జెప్పెను. దను విట్లు మాతోఁ జెప్పి, శాపవిముక్తుఁడై, దివ్యశరీరము ధరియించి సుఖముగా స్వర్గమునకుఁ జేరెను. పవననందనా! మా సంగతి యిది. ఉన్నదియున్నట్లు చెప్పితిని. మే మిపుడు సుగ్రీవునిశరణుఁ జొచ్చితిమి. ఈ రాముఁడు మున్ను యాచకులకు ధనము లొసఁగి, విస్తారమైన కీర్తిఁ జెంది లోకరక్షకుఁడయియుండియు, నిప్పుడు సుగ్రీవుని దిక్కుగాఁ గోరుచున్నాఁడు. ఏరామునితండ్రి ధర్మవంతుఁడును, శరణాగతరక్షకుఁడునై యుండెనో, అట్టి దశరథునకుఁ బుత్రుఁడయి, సకలజనరక్షణమందు నేర్పుగల రాముఁ డిప్పుడు సుగ్రీవుని శరణుచెందఁ గోరుచున్నాఁడు. మునుపు ధర్మాత్ముఁడును, శరణుచొచ్చిన వారిం గాపాడువాఁడునైన నా యన్నయగు నే రాముఁడు సర్వజనమునకు రక్షకుండై యుండెనో, ఆ రాముఁ డిప్పుడు సుగ్రీవుని శరణుచొచ్చి యున్నాఁడు. ఎవనియొక్క మహిమవలనఁ బ్రజలందఱు సంతోషపడు చుందురో, అట్టి రాముఁడు వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవునియొక్క యనుగ్రహమును గోరుచున్నాఁడు. లోకమునందలి సకలసద్గుణవంతులయిన నృపాలురను ఏ దశరథనృపాలుఁడు గాపాడెనో, యా దశరథునికి జ్యేష్ఠపుత్రుఁడయిన రాముఁడు కపీంద్రుఁడయిన సుగ్రీవుని శరణు చొచ్చియున్నాఁడు. వ్యసనముచేఁ గొట్టుపడి, నొచ్చి శరణుచొచ్చియుండు రామునితో వానరాధిపుఁడగు సుగ్రీవుఁడు చెలిమి చేయునుగాక !

ఇట్లు దీనత్వముతోఁ బలుకుచుఁ గండ్ల నీరుపెట్టుకొనుచున్న లక్ష్మణునిఁ జూచి, మాటలనేర్చినవాఁడగు హనుమంతుఁ డిట్లనియె "ఇట్టి బుద్ధిమంతులును, కోపము నడఁచుకొన్నవారును, విషయాశ లేనివారునైన మీవంటివారి దర్శనమునకయి యా సుగ్రీవుఁడు ప్రయత్నము చేయవలసియుండెను. అట్టివార లగు మీ రాతనిభాగ్యవశమున నతనికి దర్శన మొసఁగుటకై స్వయముగా వచ్చియున్నారు. ఆ సుగ్రీవుఁడు తనయన్న యగు వాలి యేదియోకారణమునఁ దన భార్యను హరించి, తన్ను వంచించి రాజ్యమునుండి తఱుమఁగొట్టఁగా, నీపర్వతమునకు వచ్చియున్నాఁడు. సూర్యునిపుత్రుఁడగు సుగ్రీవుఁడు మాయందఱితోడ్పాటున సీతను వెదకువిషయమున మీకు సాహా

య్యము చేయఁగలఁడు. ఆ సుగ్రీవునికడకుఁ బోవుదము రండు." అని హనుమంతుఁడు తియ్యని పలుకులతోఁ జెప్పెను.

ధర్మాత్ముఁడయిన లక్ష్మణుండును హనుమంతుని పలుకులు విని, మర్యాదకుఁ దగినట్లు హనుమంతుని గౌరవించి, రామునిఁ గూర్చి, "రాఘవా! నా పలుకులను హనుమంతుఁ డంగీకరించి, సంతసముతో యథార్థముఁ జెప్పెను. ఆ సుగ్రీవునికిని మనవలనఁ గార్యమున్నది. కావున నీ కార్యము నెఱవేరినట్లయ్యెను. ఈ పవననందనుఁడగు శూరుఁడయిన హనుమంతుఁడు తేటమాటలుగలవాఁడై, సంతసము మీఱ స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు. ఇతఁ డనృతము చెప్పువాఁడు కాఁడు"అని చెప్పెను.

అంతట బుద్ధిమంతుఁడును, మంచిమనస్సు గలవాఁడును, కీర్తిమంతుఁడును నయిన వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు కపటసన్న్యాసిరూపము విడిచి, వానరరూపము ధరియించి, శూరులగు రామలక్ష్మణులను వనవీఁపుమీఁద నెక్కించుకొని, యాసుగ్రీవుఁ డున్న ఋశ్యమూకపర్వతశిఖరమునకుఁ బోయెను. 24·1·72

## 5-వ సర్గము

### సుగ్రీవుఁడు రామునితోఁ జెలిమి యొనర్చుట

హనుమంతుఁడు రామలక్ష్మణులను దోడ్కొని, వెఱపుచే ఋశ్యమూకమునుండి మలయపర్వతమునకుఁ బోయియున్న సుగ్రీవునిం గని "వానరేంద్రా! గొప్పపండితుఁడును, గట్టి పౌరుషము గలవాఁడునైన యీ రాముఁడు తమ్మునితోఁ గూడ వచ్చియున్నాఁడు. ఈ రాముఁడు వీడనిపరాక్రమముగలవాఁడు. ఇతఁ డిక్ష్వాకువంశమున దశరథునికిఁ బుత్రుఁడుగ జన్మించినవాఁడు. ధర్మమార్గముఁ దప్పనివాఁడు; పితృవాక్యపరిపాలకుఁడు. అట్టి యతం డరణ్యమున భార్యతోడ వసించియుండఁగా, రావణుఁ డతనిభార్యయగు సీత నెత్తికొనిపోయెను. ఆసీతను వెదకుటకై రాముఁడు నీ సాహాయ్యము గోరుచున్నాఁడు. రాజసూయములు, అశ్వమేధములు పెక్కులు చేసి, యే నృపాలుఁ డగ్నిహోత్రునిఁ దనివినొందించెనో, ఏనృపాలుఁడు యాచకులకు లక్షలకొలఁది ధనమును గోవులను నొసఁగెనో, ఎవఁడు జితేంద్రియుఁడై న్యాయపథము దప్పక



సుగ్రీవుఁడు రామునితోఁ జెలిమియొనర్చుట.　　కిష్కింధ—20

భూమండలముఁ బాలించెనో, అట్టి దశరథనృపాలునికిఁ బుత్రుఁడయిన రాముఁడు సీతను వెదకు నిమిత్తము నిన్ను శరణుచొచ్చియున్నవాఁడు. అన్నదమ్ములగు నా రామలక్ష్మణు లిప్పుడు నీతోడిచెలిమి గోరి వచ్చియున్నారు. వీరు మిక్కిలి మర్యాదసేయఁదగినవారు. వీరి నెదుర్కొని యాతిథ్యమొనర్పుము" అని చెప్పెను.

సుగ్రీవుఁడును హనుమంతునియొక్క మాటలను విని, మనస్సున సంతసించినవాఁడై, దిగులు విడిచి, రాముని వలనివెఱపును వీడెను. మఱియు నవ్వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు మానవరూపము ధరియించి, యందఱికిఁ గడుఁ జూడఁదగినవాఁడై వచ్చి రామునితోఁ బ్రేమమీఱ "ఓ రామా! నీవు ధర్మముతప్పనివాఁడవు; పరాక్రమవంతుఁడవు; సర్వభూతములయెడఁ బ్రేమగలవాఁడవునని నీ గుణములెల్ల హనుమంతుఁడు నాకు వాస్తవముగాఁ జెప్పెను. నీవు వానరుఁడనైన నాతోఁ జెలిమిఁగోరి వచ్చుట నాకే చాల గౌరవమును, గొప్ప లాభమునై యున్నది. నాతోడి చెలిమి మీ కావశ్యమేని, ఇదిగో చేయి చాఁచితిని. నీ చేతితో నాచేయి పట్టుకొనుము. శాశ్వతమైన యొక యేర్పాటు చేయుము" అని చెప్పెను. రాముఁడు సుగ్రీవుఁడు చెప్పిన మంచిమాటను విని, సంతుష్టాంతరంగుఁడై, తనచేతితో నాతనిచేయి పట్టి, చక్కని స్నేహమువూని గట్టిగాఁ గౌఁగిలించెను.

అంతట శత్రుసంహారియైన హనుమంతుఁడు రామలక్ష్మణులఁ గొనివచ్చిన పిదప సన్న్యాసిరూపము విడిచి, స్వస్వరూపముఁ దాల్చి, రెండుకట్టెలు చిలికి యగ్నిని పుట్టించి, మండునట్లుచేసి, చక్కఁగాఁ బుష్పములచేఁ బూజించి, యా రామసుగ్రీవులనడుమ నుంచెను. ఇట్లు జ్వలించుచున్న యగ్నిహోత్రునికి రామసుగ్రీవులు ప్రదక్షిణము గావించి చెలిమి చేసికొనిరి. అంత సంతుష్టాంతరంగులైన యా రామసుగ్రీవు లొండొరు లెంత తడవు చూచుచున్నను దనివి నొందరైరి. అప్పుడు సుగ్రీవుఁడు రామునిఁ జూచి, "ఓ రామచంద్రా! నీవు మనస్సున కొప్పిన స్నేహితుఁడవయితివి. ఇఁక నాదుఃఖమే నీదుఃఖము. నాసుఖమే నీసుఖము. నీదుఃఖమే నాదుఃఖము. నీసుఖమే నాసుఖము" అని సంతుష్టాంతరంగుఁడయి చెప్పి, ఆకులు, పూవులు గలిగిన యొక కొమ్మను విఱిచి క్రిందఁబఱచి తానును రాముఁడును దానిపయిఁ గూర్చుండెను. హను

మంతుఁడును సంతసించి చక్కఁగాఁ బూఁచిన యొకచందనపుఁగొమ్మను విఱిచి యా లక్ష్మణున కాసనంబొసఁగెను.

అంతట సుగ్రీవుఁడు గడుమోదమంది, యానందబాష్పములచే నిండిన కన్నులుగలవాఁడై, రామునింగూర్చి, "ఓ రామా! వాలి నా భార్యను లాగికొని, నన్నుఁ గొట్టి తఱుమఁగా, నతనికి వెఱచి యతనికిఁ జొఱరాని యీ వనమున భయములేక తిరుగుచు నిపుడు నిన్నాశ్రయించితిని. రాఘవా! నా యన్నయగు వాలిచే వంచితుఁడనై, యాతనితోఁ బగఁబూని, యాతనికి వెఱచి కలగుండుపడి, యేమియుఁ దోఁచకయున్నాను. ఓ మహాత్మా! కాకుత్స్థా! వాలివలనిభయముచే నొచ్చియున్న నాకభయ మొసఁగుము. శ్రీరామా! ఆవాలివలని భయము నాకు లేకుండునట్లు చేయుము" అని చెప్పెను.

ఇట్లు సుగ్రీవుఁడు సెప్పఁగా, ధర్మముల నెఱిఁగినవాఁడు, ధర్మము నడపుటయందుఁ బ్రేమగలవాఁడు, ప్రతాపవంతుఁడునైన రాముఁడు విని నవ్వుచు నిట్టులనియె. ఓ కపిశ్రేష్ఠా! స్నేహితుఁ డయినందుకు ఫలముపకారము చేయుటే యని నే నెఱుఁగుదును. నీభార్యను దొంగిలించిన యా వాలిని నేను వధించెదను. ఓ సుగ్రీవా! యీ నా బాణములు సూర్యునివెలుఁగువంటి వెలుఁగుగలవి; గ్రద్దఱెక్కలుగట్టినవి; ఇంద్రునివజ్రములం బోలునవి; వాఁడికొనలుగలవి; చక్కని గణుపులు గలవి. కోపముచే బుసకొట్టుచున్న పాములంబోలునవి. ఈ బాణములను దుష్టుఁడయినవాలిపైఁ బడునట్లు వేసెదను. సర్పములంబోలు వాఁడిబాణములతో వాలిని గొట్టి, పర్వతమును ద్రోసినట్లుగా నతనినిఁ గ్రిందఁ ద్రోసెదను.

అని రాముఁడు చెప్పిన తనకు మేలుగలిగెడు మాటను విని, సుగ్రీవుఁడు మహానందమును బొంది, రామునింగూర్చి, "పురుషోత్తమా! నేను నీయనుగ్రహమునఁ బ్రియురాలిని, రాజ్యమును నెట్లు పొందుదునో! నాకుఁ బగతుఁడయిన నాయన్న నెట్లు చంపవచ్చునో, అట్టి ప్రయత్నమును జేయవలయును" అని రామునితోఁ జెప్పెను.

శ్లో. సీతాకపీన్ద్రక్షణదాచరాణాం రాజీవహేమజ్వలనోపమాని,
సుగ్రీవరామప్రణయప్రసఙ్గే వామాని నేత్రాణి సమం స్ఫురన్తి.

రామసుగ్రీవులు చెలిమిచేసికొన్నప్పుడు సీతయొక్క కమలములం బోలు నెడమకన్నును, వాలియొక్క పసిఁడివన్నె గల యెడమకన్నును, నిప్పుకంబోలు రావణుని యెడమకన్నును నొక్కటేపర్యాయముగా నదరెను. (స్త్రీలకు నెడమకన్నదరుట శుభముగనుక సీతకు మేలును, పురుషుల కెడమకన్నదరుట యశుభము గావున వాలిరావణులకు కీడు గలుగునని యీ వామాక్షి స్పందనము తెలియఁజేయుచున్నది.)

## 6-వ సర్గము

### సుగ్రీవుఁడు రామునికి సీతభూషణములఁ జూపుట

సుగ్రీవుఁడు సంతసించి, రఘునందనుండగు రామునింగూర్చి వెండియు నిట్లనియె: "ఓ రామా! నీవెందుకై నిర్జనవనమునకు వచ్చి యుంటివో ఆసంగతి హనుమంతుఁడు చెప్పఁగాఁ దెలిసికొంటిని. నీతమ్ముఁడగు లక్ష్మణుఁడును నీవును సీత నొంటరిగ విడిచి వనమునఁ దిరుగుచుండఁగా, రావణుఁడు సందుగనిపెట్టియుండి, జటాయువును సంహరించి, యా జానకి నెత్తికొనిపోయెనుగదా. ఓ రామా! నీవు వేగిరమే భార్యావియోగమువలనఁ గలిగిన దుఃఖము వీడుదువు. సోమకాసురునిచే హరింపఁబడిన వేదములను మత్స్యావతారమెత్తిన విష్ణువు తెచ్చినట్లు, నే నా సీతను దెచ్చెదను. శత్రుసంహారీ! ఆబిడ పాతాళమున నున్నను, స్వర్గమున నున్నను నే నామెను దెచ్చి యిచ్చెదను. రాఘవా! యిమ్మాట నిజమని నమ్ముము. మహాబాహూ! ఇంద్రాది దేవతలకుఁగాని, అసురులకుఁగాని నీప్రియురాలిని విషముగలిపిన భక్ష్యమునుబోలె ననుభవించుటకు వీలుగాదు. రామా! నీకాంతను దెచ్చియిచ్చెదను. నే నింతకుముం దొక కాంత యాకసమునఁ బోవుచుండఁగాఁ జూచితిని. ఆ బిడయె సీతగా నుండనోపును. సందియము లేదు.

ఆయమను కట్టిఁడియగు రావణాసురుఁడు గొనిపోవుచుండఁగా, "రామా! రామా! లక్ష్మణా!" అని వికృతంపుగొంతుతో నఱచుచు నా రావణునియంకముమీఁద నాగరాజపత్నివలె వెలయుచుండినది. తలఁచఁగా నాబిడయె సీతయైయుండవచ్చును. నేను నానలుగురుమంత్రులతోడ ఋశ్యమూకపర్వతశిఖరమునఁ గూర్చుండియుండఁగాఁ దాన

యుత్తరీయమున మేలిమియాభరణముల మూటఁగట్టి మానడుమఁ బడ వైచినది. రాఘవా! మే మామూల్లె నెత్తి దాఁచిపెట్టితిమి. దానిం దెచ్చెదను. వానిలోనిభూషణముల గుర్తింపుము" అని చెప్పఁగా, రాముఁడు ప్రియములు పలుకుసుగ్రీవునిఁ జూచి, "చెలికాఁడా! యేల జాగుసేసెదవు? వేగ తెమ్ము" అని యడుగఁగా, సుగ్రీవుఁడు రామునికి మేలుసేయఁగోరి, చొఱరానిపర్వతగుహాలోపలికిఁ జొచ్చి యామేటి యాభరణములు గట్టినయుత్తరీయమును దెచ్చి "ఇదిగో చూడుము" అని రామునకుఁ జూపెను.

అంత రాముఁడా యుత్తరీయమును, చక్కనినొమ్ములను గైకొని, చంద్రుఁడు మంచుచేఁ గప్పఁబడినచందమునఁ గన్నీటిచేఁ గ్రమ్మఁబడినవాఁడయ్యెను. అట్లు రాముఁడు సీతయందలి చెలిమిచేఁ దొఱలుచున్న కన్నీటిచే దృష్టి తెలియకుండునట్లు గ్రమ్మఁబడినవాఁడై, "హా ప్రియురాలా!" యని పిలపించుచు ధైర్యము విడిచి, పుడమిపై వ్రాలెను. అంత రాముఁ డాతొడవుల నెల్లఁ దనడెందముపయి నిడి కొని, త్రొక్కఁబడినట్టి పుట్టలోనిపాముమాడ్కి కడు తీవ్రముగా నిట్టూర్పు విడిచెను. ఇట్లు విడువక కన్నీరు మున్నీరై పాఱుచుండఁగా, రాముఁడు ప్రక్కన నిలిచియుండిన లక్ష్మణునిఁ జూచి, దీనముగా దుఃఖింపఁ జొచ్చెను.

"లక్ష్మణా! సీత గొంపోవఁబడుచుండగాఁ దన యొడలినుండి యుత్తరీయమును, తొడవులను దీసి క్రిందఁబడవైచినది చూడుము. సీత గొంపోవఁబడుచుండునప్పుడు, ఆసీత తొడవులను బచ్చికబయళ్ళ యందుఁ బడవేసియుండును. కాఁబట్టియే, యివి దెబ్బ తగులక మునుపున్న తీరుగలవిగానే కానఁబడుచున్నవి" అని యిట్లు రాముఁడు పలుకఁగా, లక్ష్మణుఁ డన్నను జూచి, "ఆమె దొడుగు బాహుపురు లెట్టివో; కమ్మ లెట్టివో నాకుఁ దెలియదు. నే నెల్లప్పు డామెపాదములకు మ్రొక్కటం జేసి, యామె కాలియందెలుమాత్రము నే నెఱుఁగుదును" అని చెప్పెను.

అంతట రాముఁడు దీనుఁడై సుగ్రీవునిఁ జూచి, "సుగ్రీవా! నా ప్రాణప్రియురాలగు సీతను భయంకరరూపుఁడగు రక్కసుఁ డే దిక్కునకుఁ గొనిపోవుచుండఁగా, నీవు చూచితివి? నా కింతటి గొప్ప వ్యసన

నము దెచ్చిపెట్టిన యా రక్కసుఁ డెక్కడ నుండువాఁడు? ఆరాక్షసుని నిమిత్తమందఱ రక్కసులను బరిమార్చెదను. అతఁడు సీతను గొని పోవుచు, నాకుం గోపమును గలిగించి, తన ప్రాణనాశమునకై మృత్యు ద్వారము తెఱచియుంచుకొనియున్నాఁడు. ప్లవంగాధిపా! నాయసుఁగుఁ జెలిని వనమునడుమనుండి యేరావణుఁడు హింసించికొనిపోయెనో, యారావణుఁ డెక్కడనుండువాఁడో యిప్పుడే చెప్పుము. అతనిని యమ పురికిఁ బంపెదను" అని సుగ్రీవుని నడిగెను.

## 7-వ సర్గము

### సుగ్రీవుఁడు రాముని, రాముఁడు సుగ్రీవుని నోదార్చుట

రాముఁ డార్తుఁడై యిట్లు పలుకఁగా, సుగ్రీవుఁడు విని, కన్నీటిచే డగ్గుత్తిక గలుగుచుండఁగా, చేతులు జోడించి, కన్నుల నీరు గార్చుచు నిట్లనెను! "రామా! చెడ్డకులంబునఁ బుట్టిన యాపాపాత్ముఁ డగు రాక్షసుఁ డుండుచోటుగాని, వానిబలవిక్రమములుగాని, వాని కులముగాని నాకుఁ దెలియవు. శత్రుసంహారీ! నీవు శోకము వీడుము. సత్యముగా నేను ప్రతిజ్ఞచేయుచున్నాను. సీత నీకు దొఱకులాగున ప్రయత్నము చేసెదను. రావణుని, వానిబలగమును సంహరించి, స్వకీయ పౌరుషంబు కృతార్థమగునట్లుచేసి, నీవు సీతను బడసి, యెట్లు సంతసింతువో, యట్టిప్రయత్నము వేగిరమె చేసెదను. నీవు వ్యసనమునొందినది చాలును. నీకు స్వాభావికముగా నుండుధైర్యమును దలంపునకుఁ దెచ్చికొమ్ము. ఇట్టి చులకదనము నీవంటివారికి సాటిగాదుగదా. నాకును భార్యకోల్పోవుటవలన గొప్ప వెత సంభవిల్లినది. అయినను, నేను నీయట్లు శోకమును బొందను; ధైర్యమును వీడను. నే నల్పుఁడనగు కోతినైనను, ఆభార్యనుగూర్చి వగవను. నీవు ధైర్యసంతోషములు గలవాఁడవు; సకలశాస్త్రముల నెఱిఁగినవాఁడవు. నీవంటివాఁడు శోకము నొందఁదగునే? నీవు ధైర్యముపూని, స్వయముగా వచ్చుచుండు కన్నీటిని నాఁపుకొనుము. బలవంతులకు లక్షణమయిన ధైర్యమును వీడకుము. వ్యసనమందును, ద్రవ్యనాశమునందును, ప్రాణములకు ముప్పుదెచ్చు నంతయాపదయందును స్వబుద్ధితోఁ జక్కఁగా నాలోచించునట్టి ధైర్యవంతుఁ డెన్నటికిని నశింపఁడు. ఏ నీచజనుఁడు

ధైర్యములేక వ్యసనాదులు వచ్చినప్పుడు కలవరపాటు నొందు చున్నాఁడో, వాఁడెక్కువ బరువువేసిన యోడ నీట మునుఁగునట్లు వడిఁ జేయునదిలేక చింత యనుకడలియందు మునిఁగిపోవుచున్నాఁడు. ఇదిగో చేతులు జోడించి, నిన్ను వేఁడుకొనెదను. చనవుచే నిన్నాదరించెదను. ధైర్యము నవలంబింపుము. దుఃఖమున కెడమీకుము. ఎవరు శోకంబు వీడక మాటిమాటికిఁ దలఁపునకుఁ దెచ్చుకొను చుందురో, వారికి సౌఖ్యము గలుగదు. వారిప్రతాపము నడఁగును. కావున నీవు శోకమునొందుట తగదు. శోకమునకు లోఁబడినవానికిఁ బ్రాణము లుండుట కూడ సందియమే. కావున రాజేంద్రా! నీవు శోకము వదలి, ధైర్యమునే యవలంబింపుము. నేను జెలిమిచే నీ కీతవగు మాట చెప్పితిని కాని, నీకుపదేశము చేయునంత గొప్ప వాఁడను గాను. "మనచెలికాఁ డింతదూరము చెప్పుచుండఁగా, మనము చింతపడుట తగదని యెంచియైనను శోకము వీడుము."

సుగ్రీవుఁ డిట్లు తిన్ననిమాటలుసెప్పి బుజ్జగింపఁగా, రాముఁడు కన్నీటిచేఁ దడిసియుండు తనమోమును బట్టకొంగుతోఁ దుడిచికొని, యెప్పటియట్లె ధైర్యమువూని, యాసుగ్రీవునిఁ గౌఁగిలించి, "సుగ్రీవా! ప్రేమగలవాఁడు, మేలుగోరువాఁడునగు చెలికాఁడు చేయవలసిన కార్యమును నీవు చేసితివి. అది నీకుఁ దగియున్నది. సమయోచితముగానున్నది. చెలికాఁడా! నీవు బుద్ధి సెప్పితివిగాన, నే నిదిగో శోకమువదలి ధైర్యము పూనితిని. ఇట్టి స్నేహితుఁడు తఱచుగా దొరకుట యరుదు. అదియు నిట్టి యాపదయందు దొరకుటయనునది నాభాగ్యవశమున నే. ఇఁక నీవు సీత నపహరించిన చెడ్డనడతగల క్రూరుఁడగు నారావణాసురుని వెదకుటకుఁ బ్రయత్నముచేయవలయును. నే నిప్పుడు నీకై యేమిచేయవలయునో చెప్పుము. వర్షాకాలమున మంచినేలయం దేది వి త్తినను ఫలించునట్లు, సకలకార్యములు నాయెడ నిప్పుడు సార్థకములు గాఁగలవు. హరిపుంగవా! నేనును నీయెడఁ బ్రేమతో నేదిచెప్పితినో, అదియెల్ల వాస్తవమని నమ్ముము. నే నింతకు మున్నెప్పుడు కల్లలాడినవాఁడను గాను. ఇఁకమీఁదను జెప్పను. నే నొట్టుపెట్టికొని చెప్పెదను. నీవేది చెప్పినను జేయ సిద్ధుఁడనై యున్నాను."

అట్లు రాముఁడు ప్రతిజ్ఞాపూర్వకముగాఁ జెప్పినమాటను విని, సుగ్రీవుఁడును, వానిమంత్రులును మహదానందము నొందిరి. ఇట్లు రామసుగ్రీవు లిరువురు మిక్కిలి మైత్రినొంది యొండొరులకుఁగల సుఖదుఃఖములను గూర్చి తలపోసికొనుచుండిరి. బుద్ధిశాలియగు వానరగణముఖ్యుఁడగు సుగ్రీవుఁడు మహాత్ముఁడగు నరేంద్రునియొక్క పలుకులు విని, తనకార్యమును నెఱవేఱినట్లె తలంచినవాఁడాయెను.

## 8-వ సర్గము

రాముఁడు సుగ్రీవుని వాలితోడి వైరమునకుఁ గారణంబు నడుగుట

సుగ్రీవుఁడు రామునివాక్యము విని, సంతసించినవాఁడై లక్ష్మణుని సమక్షమున రామునిఁజూచి యిట్లనియె. "ఓ రామా! సకలసద్గుణములతోఁ గూడిన నీవు నాకుఁ జెలికాఁడవైతివి గనుక నాయెడ దేవతలు సర్వవిధముల దయ తలఁచిరి. ఇది నిజము. నీవు సహాయుఁడవై యుండఁగా దేవేంద్రునిరాజ్యమైనను బొందఁజాలుదును. అట్లుండఁగా నారాజ్యము నాకు దొరకుటయం దేమి సందియ మున్నది? రఘువంశమునఁబుట్టినట్టి నీ వగ్నిసాక్షికముగా నాకుఁ జెలికాఁడవైతివి, కావున నేను నాబంధువులకును జెలికాండ్రకును గారవింపఁదగినవాఁడ నయితిని. రామా! నేనును నీకుఁదగిన చెలికాఁడ నసుసంగతి నీకుఁ దిన్నగాఁ దెలియఁగలదు. నాగుణములను నేనే చెప్పుకొనఁజాలినవాఁడనుగాను. ధైర్యవంతులు ధైర్యము నెప్పటికి వీడనిచందమున, మహాత్ములగు నీ బోటిపండితులయొక్క చెలిమి గడుఁ దిరముగా నుండును. చెలికాండ్రు తమచెలికాండ్రయొక్క వెండి, బంగారు, వస్త్రములు, తొడవులు మొదలగునవి వేఱుగాఁ దలఁపరు. చెలికాండ్రు తమద్రవ్యములు తమచెలికాండ్రవిగను, తమచెలికాండ్రద్రవ్యములు తమవిగాను దలంతురు. భాగ్యవంతుఁడైనను, బీదయైనను, దుఃఖముగలవాఁడయినను, సుఖముగలవాఁడయినను, దోషియైనను, దోషరహితుఁడయినను లోకమునఁ జెలికాఁడే గొప్పదిక్కు. ఎక్కువ చెలిమియున్నప్పుడు స్నేహితులు తమచెలికాండ్రకై, ధనమును విడుతురు; సుఖములను విడుతురు; వేయియేల? ప్రాణములనైనను విడుతురు." అంత రాముఁడు సుగ్రీవునియింపు పలుకులు విని, దేవేంద్రునివలెఁ దేజరిల్లువాఁడును, బుద్ధిమంతుఁడునైన

లక్ష్మణుఁడు ముందట నిలిచియుండ, "సుగ్రీవా! నీవు చెప్పినది నిజమే" యని చెప్పెను.

అంతట రాముఁడును, బలవంతుఁడగు లక్ష్మణుఁడును నిలఁబడి యుండుట చూచి, వానరేంద్రుఁడగు సుగ్రీవుఁడు దృష్టి నావనమున నన్ని దెసలఁ బాఱఁజేసి, యచ్చటికిఁ జేరువను బువ్వులతో నిండి, కాలఁది యాకులుగలిగి తుమ్మెదలతో శోభిల్లుచున్న యొక చెట్టునుజూచి, దానియందు యాకులును బువ్వులును దట్టముగ గలిగియున్న యొక కొమ్మను విఱిచి క్రిందఁబడవైచి తాను రామునితోఁగూడఁ గూర్చుండెను. హనుమంతుఁడు రామసుగ్రీవులు గూర్చుండుటను జూచి, తానొక చెట్టు కొమ్మవిఱిచి, క్రిందఁబఱచి విధేయుఁడయిన లక్ష్మణునిఁ గూర్చుండఁ జేసెను.

ఫలపుష్పములచే నిండియున్న యా ఋశ్యమూకపర్వతశిఖరమునఁ గొమ్మమీఁద సుఖముగాఁ గూర్చుండి సముద్రముచందమున గంభీరుఁడయిన రామునిఁజూచి, సుగ్రీవుఁడు గడుమోదమంది, ప్రేమచేఁ దిన్ననియింపుమాటలు సంతోషాధిక్యముచేఁ దడఁబడ నిట్లనియె. "ఓ రామా! వాలి నాభార్య నపహరించి, నన్ను మోసపుచ్చి తఱుమఁగా, నే నా వాలికి వెఱచి, వ్యసనపీడితుఁడనై యీ ఋశ్యమూకపర్వతమున సంచరించుచున్నాను. రాఘవా! నేను వాలిచే వంచితుఁడనై, యతనితోఁ బగవూని, యతనికి వెఱచి, భయమున మునిఁగి, మనస్సున నిలుకడ లేకయున్నాను. జనులకందఱకు నభయమొసఁగువాఁడా! వాలికి వెఱచి, మిక్కిలి నొచ్చి, దిక్కుదోఁచక యల్లాడుచున్న నాయెడ ననుగ్రహముంచుము."

అని యిట్లు సుగ్రీవుఁడు వేఁడఁగా, ధర్మజ్ఞుఁడును, ధర్మమునం దాసక్తుఁడును, తేజోవంతుఁడునునైన రాముఁడు నవ్వుచు సుగ్రీవునకు బదులు చెప్పెను. "వానరేంద్రా! చెలికానికి లక్షణ ముపకారముచేయుటయె. శత్రువున కపకారముచేయుటయె లక్షణము. సుగ్రీవా! నీప్రియురాలియు నపహరించినవాలి నిప్పుడే సంహరించెదను. సుగ్రీవా! యీనాబాణములు మహావేగముగలవి; ఱెక్కలుగలవి; తీవ్రమైనతేజస్సుగలవి; ఱెల్లుపొదయందుఁ బుట్టినవి; పొన్నులుకులు గలవి; గ్రద్ధఱెక్కలు గట్టినవి, దేవేంద్రునివజ్రాయుధముఁబోలునవి; చక్కనిగణుపులు; కడువాఁడికొన

లునుం గలిగి, కోపవంతములగు సర్పములంబోలునవి. సుగ్రీవా! తోఁబుట్టువురూపముతో నీకు శత్రువై కీడొనర్చిన యా వాలిని బర్వతంబునుంబోలె నాబాణములచేఁ జీకాకుపఱచెదను” అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

వానరసేనానాయకుఁడగు సుగ్రీవుఁడు రామునిపలుకులు విని సాటిలేని సంతోషము నంది, ‘నీమాట బాగున్నది’యని చెప్పి రామునిఁజూచి, “నేను వ్యసనముచేఁ గొట్టుపడియున్నాను. వ్యసనముచేఁ గుందుచుండు వారికి నీవే గతివి. నీవు చెలికాఁడవు గావున నీతో నాకష్టముల నెల్లఁ జెప్పుకొని దుఃఖించెదను. ఓ రామా! నీవు చేయియిచ్చి యగ్నిసాక్షికముగాఁ జెలిమిచేసికొంటివి గనుక, నీవు నాకుఁ బ్రాణములంటె మిన్నయైనవాఁడవయితివి. నే నాతుసత్యవాక్యముగాను బెట్టి బాసచేసెదను. నీవు నాకు సరివయసునేస్తకాఁడవు గనుక, నామనస్సును సర్వదా పీడించునట్టి మనోవేదనను నీతో నమ్మకముగాఁ జెప్పుచున్నాను.” అని యిట్లు చెప్పి, కన్నీరు దృష్టిఁ గప్పుచుండఁ గన్నీటిచే మాటలు డగ్గుత్తికపడుచుండ, గొంతెత్తి మాటాడఁజాలనివాఁ డాయెను. అయినను, సుగ్రీవుఁడు రామునియెదుట ధైర్యమవలంబించి, నదీప్రవాహమువలెఁ బెల్లు వేగముతో వచ్చుచున్న కన్నీటి నాఁపుకొనెను. ప్రతాపశాలియగు సుగ్రీవుఁడు కన్నీళ్లనాఁపుకొని, తేటకండ్లను బాగుగాఁ దుడుచుకొని, నిట్టూర్పువిడిచి, రామునితో నిట్లనియె. “ఓ రామా! మునుపు బలవంతుఁడగు వాలి నన్ను యౌవరాజ్యమునుండి తొలఁగించి, నిష్ఠూరంపుమాటలాడి, రాజ్యమునుండి వెడలఁగొట్టెను. అంతియకాక, వాలి నాకుఁ బ్రాణములకంటె మిన్నయైన ప్రియురాలి నపహరించెను. నాసంగాతకాం డ్రెవ్వరెవ్వరో వారి నందఱిని చెఱసాలయం దుంచెను. రామా! కపటగ్రాంతమనస్సుగల యా వాలి నావినాశమునకై యెన్నియో ప్రయత్నములు చేసెను. వాలి నన్నుఁ జంపుటకై పెక్కుమాఱులు వానరులను బంపెను. వారి నందఱిని నేను జంపితిని. ఓ రాఘవా! మీరు వాలిపంపినవేగుల రను సందియముచేతనే మిమ్ముఁ జూచి దగ్గఱకు రా వెఱచితి. భయకారణము సంభవించునప్పుడు జనులందఱు వెఱతురుగదా! ఈ హనుమంతుఁడు మొదలగువారు మాత్రమే నాకుఁ దోడైయున్నారు. నే నిన్ని యిడుమలఁ బడినను;

ప్రాణములను దాల్చియున్నాను. ఈ వానరులు మాత్రమే నాయందుఁ బ్రేమగలిగి, నన్నన్ని దెసలను గాపాడుచున్నారు. నేను పోయినచోటి కెల్ల నన్ను వెంబడించి వచ్చుచున్నారు. నిలిచినచోట నిల్చుచున్నారు. రామా! పెక్కుమాటలేల? సంక్షేపముగా నొక్కమాట చెప్పెదను. పరాక్రమశాలియని ప్రసిద్ధిగాంచిన నాయన్నయగు వాలియే నాకు విరోధి. ఆతఁడు నశించినపిమ్మటనే నాదుఃఖము చల్లారును. నా సుఖమును జీవితమును వానివధించుటవలననే కలుగునవిగా నున్నవి. రామా! దుఃఖపీడితుఁడనైన నేను దుఃఖనివారణోపాయముఁ దెల్పితిని. వ్యసనముగలవాఁడయినను, సుఖవంతుఁడయినను, చెలికానికిఁ జెలికాఁడే విడువనిగతి" అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను.

రాముఁడు సుగ్రీవుని పలుకులు విని, యతనిం జూచి, "సుగ్రీవా! నీకును వాలికిని యేల వైరము గలిగె? వాస్తవము వినఁగోరుచున్నాను. మొదట వైరకారణము దెలిసికొని, యొండొరుల బలాబలములను నిర్ణయించి యావల నీకు సుఖము గలుగునుపాయము వెదకెదను. సుగ్రీవా! నీవు వాలివలనఁబడిన భంగపాటును విన్నతోడనే వర్షర్తువునందలి నదీప్రవాహవేగమువలె బలిమిగల యాగ్రహము నామనసును గడగడలాడించుచు వచ్చుచున్నది. నేను విల్లెక్కుపెట్టునంతలోపల సంతసమంది విశ్వాసముంచి నాకు వైరకారణము చెప్పుము' ఏలయనిన, నేను బాణము విడిచితినేని, నీశత్రువు హతుఁడయినట్లె తలఁపుము" అని యిట్లు చెప్పఁగా, సుగ్రీవుఁడు తననలువురు మంత్రులతోఁగూడి, సాటిలేని యానందమునొంది, లక్ష్మణాగ్రజుఁడగు రామునితోఁ దనకును వాలికిని గల వైరకారణ మంతయు వాస్తవముగాఁ జెప్పఁదొడఁగెను.

## 9-వ సర్గము

### సుగ్రీవుఁడు తనకును వాలికినిగల వైరమునకుఁ గారణముఁ దెల్పుట

తొల్లి నా యన్నయగు వాలి శత్రుసంహారియై నా తండ్రికిని, నాకును మిగుల మన్ననచేయఁదగినవాఁడై యుండెను. మాతండ్రి కాలధర్మము నొందఁగా, మంత్రులందఱు గలిసి "యాతఁడు పెద్దకొడుకనియు, కడు గౌరవము నొందినవాఁడనియు నెంచి కపిరాజ్యమున

నతని నభిషేకించిరి. వాలి తాతముత్తాతలనుండి వచ్చు వానరరాజ్యమును బాలించుచుండఁగా, నే నన్ని వేళలందును వాలికి విధేయుఁడనై పరిచారకునిమాడ్కిఁ జెప్పినపనులనెల్లఁ జేయుచుంటిని.

అప్పుడు ప్రతాపశాలియగు దుందుభియొక్క మొదటికొడుకగు మాయావి యను నొక యసురుఁ డుండెను. ఆ మాయావికిని వాలికిని స్త్రీ నిమిత్తము గొప్పవైరము గలిగినది. అది లోకప్రసిద్ధమైన విషయము. ఆ మాయావి యొక్కనాఁడు నడికిరేయి యందఱు నిద్రించుచుండఁగా, కిష్కింధాపురముగవనివాఁకిటికి వచ్చి, సింహనాదముచేసి, వాలిని యుద్ధమునకుఁ బిలిచెను. అప్పుడు గాఢనిద్ర చెందియుండిన నా యన్న భీకరమైన సింహనాదమును విని, యులికిపడి లేచి, యా సింహనాదమున కోర్వక, యప్పుడు వేగముతో నాతనిమీఁదికిఁ గవిసెను. వాలి యాగ్రహముచే నసురశ్రేష్ఠుఁడగు నామాయావిని జంపుటకు వెడలఁగా, నప్పుడు నేనును, ఆఁడువారును వినయముతో వలదని చెప్పితిమి. అతఁడు బలముచే మామాటలను సరకుసేయక యా మాయావిమీఁదికిఁబోయెను. అప్పుడు నేనును వాలిమీఁదిప్రేమచే నతని కేమి విపత్తు సంభవించునో యని యావాలివెంబడిఁ బోయితిని.

ఆ మాయావి నాయన్నను, ఆతనివెంబడి వచ్చుచున్న నన్నును జూచి, యదరినవాఁడై కడువేగిరముగాఁ బరువెత్తెను. ఆ మాయావి యట్లు వెఱపుతోఁ బరుగెత్తుచుండఁగా మేమును వానిని వెంబడించి తఱిమితిమి. ఆరేయి వెన్నెల బాగుగాఁ గాయుటచే దారి బాగుగాఁ దెలియుచుండెను. అప్పుడు మాయావి మేము కడుఁ జేరువకు వచ్చుటఁ జూచి, వేగముతోఁ దృణప్రచ్ఛన్నమైయున్న చొఱరాని యొక్క మహాబిలమునఁ బ్రవేశించెను. అట్లు శత్రువు బిలము చొచ్చుటం జూచి, వాలి రోషమునొంది, యింద్రియక్షోభమును బొంది, నన్నుఁ జూచి యిట్లనెను. "ఓ సుగ్రీవా! సొరంగముసొచ్చి, యా యసురునిఁ జంపి వచ్చునంతవఱకును నీవు బిలద్వారమునందు జాగ్రత్తతో నుండుము" అని వాలి చెప్పఁగా, శత్రుసంహారియగు వాలితో నేను కూడ వచ్చెద నని ప్రార్థించితిని. అయినను నావేఁడికోలు నియ్యకొనక, యతఁడు నాచేతఁ దనపాదములమీఁద నానపెట్టించుకొని యా గొప్ప సొరంగమునఁ బ్రవేశించెను.

అతఁడు బిలమునఁ బ్రవేశించినది మొదలు పూర్తిగా నొకఁ యేఁడు గడచెను. ఈ యొక యేఁడును నేనా బిలద్వారముకడఁ గావలి కాచి యుంటిని. మాయన్న యప్పటికిని రాకపోవుట చూచి యన్నయందలి ప్రేమచేఁ జిత్తకలంకము నొంది, యతనికిఁ గీడుమూడియుండునని శంకించితిని. అటుతర్వాతఁ జాలఁగాలమునకు నాబిలమునుండి నెత్తురు నురుగులు గట్టుచు నెట్టుగాఁ బైకివచ్చెను. అది చూచి, నేనుతలఁచినట్లె వాలి మడిసెనని మిక్కిలి విచారము నొందితిని. బిలగర్భమున గొప్పచున్న యసురుని కూఁతలను, యుద్ధరంగమునఁ బడఁబడి యఱచుచున్న యన్న యొక్క గొంతుచప్పుడును వింటిని. నే నాగుఱుతులవలన మాయన్న వాలిహతుఁ డయ్యెననియె యెంచి, పర్వతముంబోలు గొప్ప ఱాతితో నాగుహా ద్వారమును మూసి, సోదరమరణమునకు వగచుచుఁ గిష్కింధ కేతెంచి, యీసంగతి యెవరికిఁ జెప్పకయున్నను, మంత్రులెట్లో తెలిసికొని యందఱు కలిసి యాలోచించి నన్నుఁ బట్టాభిషిక్తుం జేసిరి. రాఘవా! నేను పట్టాభిషిక్తుఁడనై రాజ్యమును న్యాయమార్గమునఁ బాలించు చుండగా, వాలి యసురశ్రేష్ఠుఁడగు మాయావిని జంపి, యాబిలము మూతను దెఱచికొని పైకివచ్చి కిష్కింధకుఁ జనుదెంచెను. అప్పుడు నేను పట్టాభిషేకమునొంది రాజ్యముఁ బాలించుటఁగని, వాని కన్నులు బగ్గున మండఁగా నా మంత్రుల నందఱను విఱిచికట్టి నన్న రాని మాటల నాడెను. రాఘవా! నే నప్పు డాతనిని నిగ్రహింపఁ జాలినవాఁడ నయ్యు, అన్నయను గౌరవముచే నామన స్సందు కియ్యకొనవయ్యెను. అంతటితో నూరకుండక, శత్రుసంహారముచేసి మాయన్న క్షేమముతో వచ్చెనుగదాయని, మహాబలుఁడగు నతనిని గౌరవించుటకై యెదురేఁగి, యభివాదనము చేసితిని. అట్లు నేను గోత్రప్రవరములు చెప్పి మ్రొక్కి యాతనిపాదములను నాశిరస్సుతోఁ దాఁకినను, వాలి యాగ్రహము పూని, నాయందనుగ్రహించి దీవనలు సల్పఁడయ్యెను.

## 10-వ సర్గము

**సుగ్రీవుఁడు తనప్రవాసనమునకుఁ గారణముఁ దెల్పుట**

తర్వాత సుగ్రీవుఁడు రామునిఁ జూచి వెండియు నిట్లనియె: "ఓ రామా! వినుము. అంత నట్లేతెంచి యత్యంతము కుపితుఁడై

యాటోపముతోనున్న నాయన్నను జూచి, యతని కోపము చల్లార్చి సంతసము గలిగింపఁగోరి, నే నీతీరున బతిమాలితిని. "ఓ యన్నా! యదృష్టవశమున సేమముతో వచ్చితివి! నీవు శత్రువును బరిమార్చితివి. అనాథుఁడనయిన నాకు నీ వొక్కఁడవే కదా నాథుఁడవు. మఱియు నీవనాథుల కష్టముఁ బాపి సంతోషపెట్టువాఁడవు. ఇదిగో యుదయించిన పున్నమచందురుని బోలునదియు, పెక్కు కమ్ములు గలదియునగు తెల్లనిగొడుగు; నేను దానిని పట్టెదను వింజామరములు వైచెదను. నాపైఁ గోపపడకుము. వానరాధిపా! నే నొక్క సంవత్సర కాల మా సురంగద్వారముకడఁ దుఃఖముతోఁ గాచియుంటిని. అప్పటికి నీజాడగానిపింపలేదు గాని బిలద్వారమునుండి నెత్తురు పైకి వచ్చెను. అదిచూచి నీవు సంహరింపఁబడితివని తలఁచి నేను వ్యసనమున మునిఁగితిని. అట్లు నామనసు దుఃఖమున మునిఁగి, యింద్రియములు నెలవులు తప్పి యేమియుఁ దోఁపక కొంతతడ వుండి, యా రాక్షసుఁడు మఱల రాకుండుఁగాక యని యొక పర్వతశిఖరము నా బిలమున కడ్డముగా మూసి, యాప్రదేశమునుండి వెడలి కిష్కింధను బ్రవేశించితిని. ఇచ్చట మంత్రులును పురజనులును కడు విచారమంది యరాజకప్రభుత్వము లేకుండుటకై నాకుఁ బట్టము గట్టిరే కాని, నేను కోరి పట్టాభిషేకముఁ జేసికొన్న వాఁడను కాను. నీవె యెల్లప్పుడు గౌరవింపఁదగిన తేఁడవు. నే నెల్లప్పుడు మునుపటి వలె నీకు వరవుడవు చేయుచుందును. నీవు దేశాంతరమున నున్నందున నీకు మాఱుగా రాజ్యపరిపాలనరూపమయిన యాజ్ఞ చెల్లించితిని. నిష్కంటకమైన యీ రాజ్యమును మంత్రిపురజననగరములతోడ నాకడ నిల్లడపెట్టితివని భావించి, నీవు మఱలఁ గైకొనుము. నీరాజ్యమును నీ కప్పగించెదను. శత్రుసంహారకా! దయాళువా! నాయెడఁ గోపము సేయకుము. నిన్నుఁ బ్రార్థించెదను. ఇదిగో నేను చేమోడ్పు గావించితిని. మంత్రులును పురజనులును గలిసి రాజులేని దేశమును జయింపఁగోరి, నాకు నిర్బంధపూర్వకముగాఁ బట్టాభిషేకము గావించిరి.

అని యిట్లు నేను వినయముతోఁ జెప్పుచున్నను, అవ్వాలి నన్నుఁ బలుమాఱు బెదరించి, 'ఛీ! నీవు దహింపఁబడుదువుగాక!" యని చెప్పి,

నన్ను నరాని పెక్కుమాటల ననెను. అంతటఁ జాలింపక మంత్రులును, పౌరవృద్ధులను, పెక్కండ్రు చెలికాండ్రను జేర్చి నన్ను వారినడుమ నిల్పి, వారందఱితో నన్నుఁగూర్చి పరమనీచములైన మాటల నిట్లు పలికెను. "ఓ జనులారా! ఒకనాటిరేయి కడుఁ జెడ్డబుద్ధిగలవాఁడు, క్రూరుఁడునైన మాయావియను గొప్ప యసురుఁడు నాతో యుద్ధము సేయఁగోరి, పెద్దబొబ్బ వెట్టి నన్ను నిక్కిఁ బిలిచినసంగతి మీ రెఱుఁగుదురు గదా! ఆ మాయావియొక్క సింహనాదములను విని రాజగృహము నుండి నేను వెడలితిని. నా వెంటనే యీ పెనుమోసగాఁడగు తమ్ము డును వచ్చెను. నేను రెండవవానితోఁగూడ వచ్చుటంజూచి యా బలిమిగల మాయావి వెఱపుమీఱఁ బరుగిడఁ జొచ్చెను. వాఁడు పరు విడుటఁ గని మేమును వాని వెంబడించి పరుగిడితిమి. మేము వెంబడించి పరుగెత్తుట గాంచి, యా మాయావి యొక సొరంగము చొచ్చెను. కడు ఘోరమైన బిలము నా రాక్షసుఁడు సొచ్చుటఁ గని యీ క్రూర దృష్టిగల నాతమ్మునితో "ఓరీ తమ్ముఁడా! యీ రక్కసునిఁ జూచిన నాకు వానిని జంపక మఱలుటకు వీలుగాఁబోదు గావున, నేను వీనిని జంపి మఱల వచ్చునంతవఱకు నీబిలద్వార సమీపప్రదేశమునఁ గాచి యుండుము" అని సుగ్రీవునితోఁ జెప్పి, వీఁ డిచ్చట నుండు నని యెంచి యా గుహాలోపలఁ జొచ్చితి. అసాధ్యుఁడైన యామాయావిని వెదకి కనుగొనుటకు నాకొకసంవత్సరము పట్టెను. నే నా బిలమున భీకరుం డైన యా మాయావిని నిర్భయముగాఁ గనిపెట్టి, వానిని బంధుసమే తముగాఁ బరిమార్చితిని. పాతాళమున నాతోఁ బోరి దెబ్బలు తిని యా మాయావి యార్వఁగా, నతనినోటినుండి నెత్తురు వెలువడి యాబిలమంతయు నిండెను. నేను శూరుఁడగు దుందుభిపుత్రుఁడయిన మాయావిని జంపి, పైకి వచ్చుచుండఁగా, నా బిలము మూయఁబడి యుండుటంజేసి చీకటి గ్రమ్మియుండెను. అట్లుండఁ జూచి, "సుగ్రీవా! సుగ్రీవా!" యని యెన్ని తడవలు మొఱయిడినను బదులు లేకుండుట యెఱిఁగి, "అక్కటా! ఇఁక మనగతి యే"మని కడుఁ జింతించి, యెట్ట కేలకు ధైర్యముపూని, పెక్కుమాఱులు గాళ్ళతోఁ దన్ని, యామూఁత మొగురఁగొట్టి, బయటికి వచ్చి యెప్పటియట్ల పట్టణముఁ జేరితిని. ఈ ఘాతుకుఁడగు సుగ్రీవుఁడు తోఁబుట్టువను ప్రేమముగూడ మఱచి,

రాజ్యాపేక్షతో నన్ను సొరంగములోపలనే యుంచి గొప్పబండతో మూసి వచ్చినాఁడు. ఇఁక వీని మోము చూడఁదగదు" అని యందఱి ముందట నన్నవమానించి జంకుమాని, నా యాలి నీడ్చుకొని నన్నుఁ గొట్టి కట్టుబట్టతోఁ దఱిమివేయఁగా, నే నాతనికి వెఱచి, భూలోక మంతయుఁ దిరిగి యేపఱి, యీ పర్వతమొక్క కారణవశమున వాలి కెక్కరానిదైనందున నీ పర్వతమున భార్యాపహరణదుఃఖముచేఁ గృశించియున్న వాఁడను.

రామా! నాకును వాలికిఁ గలిగిన వైరమునకుఁ గారణముఁ దెలిపితిని. రాఘవా! ఏపాపము నెఱుఁగని నాకెంత యాపద సంభవించినదో చూడుము. సకలలోకుల కభయము నొసఁగువాఁడా! వాలిని సంహరించి, భీతిచే నవస్థపడుచున్న నాయెడ ననుగ్రహము చేయుము." అని యిట్లు సుగ్రీవుఁడు చెప్పఁగా, ప్రతాపవంతుఁడును, ధర్మజ్ఞుఁడునునైన రాముఁడు చిఱునవ్వు నవ్వుచు సుగ్రీవుంజూచి, న్యాయయుతముగా నిట్లనియె. "ఓ సుగ్రీవా! యీవాఁడియమ్ములు సూర్యునిమాడ్కిఁ దేజరిల్లునవి. ప్రయోగించినచో వ్యర్థములగునవి గావు. దురాచారుఁడైన యీవాలిమీఁద నీబాణము లతివేగముతోఁ బోయిపడఁగలవు. నీభార్యను హరించిన యీవాలి యెంతపర్యంతము నాకంటఁ బడఁడో, అంతపర్యంతమే చెడునడవడిగల యీపాపాత్ముఁడు బ్రతికియుండును. నే నిప్పుడు భార్యను గోలుపోయి పడరానిపాటు పడుచున్నాను గావునను, నీదుఃఖము నిట్టిదేగనుకను, నీవు శోకసాగరమున మునిఁగియున్నావని తలఁచెదను. నిన్ను వేగిరముగా నీ శోకసముద్రంపుదరిఁ జేర్చెదను. నీవు కోరినకోర్కెను బుష్కలముగా నొందఁగలవు" అని రాముఁడు సుగ్రీవుని మంచిమాటలచే నోదార్చెను. తనకు మేలొదవునట్లుగాఁ జెప్పిన యీరామునిపలుకులు విని సుగ్రీవుఁడు పరమానందము నొంది వక్ష్యమాణప్రకారముగా నిట్లని చెప్పెను.

## 11-వ సర్గము

### సుగ్రీవుఁడు వాలిప్రభావ మెఱిఁగించుట

రాముఁడు తనపౌరుషంబు వెలుఁగ, ముద ముప్పొంగఁ జెప్పిన పలుకులు విని, సుగ్రీవుఁడు రామునిం బూజించి, పలువిధములఁ గొని

యాడి యిట్లనియె: ఓ రాఘవా! నీవు కినుక పూనుదు వేని వెలుఁగు నవియు, వాఁడిమిగలవియు, ఆయపట్టులఁ జాఁకునవియునైన యమ్ముల తోడ్పాటుచేఁ బ్రలయకాలసూర్యుండునుంబోలె లోకము నెల్లఁ గాల్చి వేయుదువు.

రాఘవా! వాలికిఁగల ధైర్యశౌర్యములు వినిపించెదను. వానిని సావధానముగా విని యావలిపనిం జేయుము. వాలి యుషఃకాలమున లేచి సూర్యోదయము గాకమునుపే పడమటిసముద్రమునుండి తూర్పు సముద్రమునకును, దక్షిణసముద్రమునుండి యుత్తరసముద్రమునకును గష్టములేకుండఁ బోయివచ్చును. వాలి తనబలిమి మెఱయఁ గొండల కొనల కెక్కి గొప్ప శిఖరములనైనను పెళ్ళగించి, మీఁది కెగురవైచి పట్టుకొనును. తన బలము వెల్లడియగుటకై చక్కగా వేళ్ళుపాఱిన యెన్నియో చేవగల గొప్పమ్రాఁకులను విఱుచును.

తొల్లి, కైలాసశిఖరముసుబోలిన యాకారముగలవాఁడును, చేవగలవాఁడునునైన మాహిషరూపంబుఁ దాల్చిన దుందుభియను పేరుగల రక్కసుఁడొక్కఁడు వేయి యేనుఁగులబలము గలిగియుండెను. అతఁడు బ్రహ్మనుగూర్చి తపసుచేసి పెక్కువరములఁ బడసెను. ఆ దుష్టాత్ముఁడగు దుందుభి తన యెక్కువ బలిమికిని, వరములకలిమికిని గడు గరువమొంది, గొప్పదేహమును దాల్చి, యేటిమగఁడగు సముద్రునిఁ జేరి, రత్నములగనియగు నాయేటిమగని సరకుసేయక "నదుల ఱేఁడా! నాతోఁ గయ్యము సేయరమ్ము" అని పిలిచెను. అప్పుడు నృపాలా! ధర్మాత్ముఁడగు బలవంతుఁడైన సముద్రుఁడు, మృత్యుదేవత ప్రేరణచే వచ్చియున్న యాదుందుభిం జూచి, "యుద్ధమునందు నేర్పు గల ఓ దుందుభీ! నేను నీతోడఁ గయ్యంబు సేయఁజాలినవాఁడను గాను. నీతో యుద్ధము సేయఁగలవానినిఁ జెప్పెదను వినుము. తాపసుల కెల్ల ముఖ్యమయిన యునికిపట్టును, శంకరుని మామయు, పెక్కుగుహ లును సెలయేళ్లునుగల వాఁడును, లెక్కలేని జాళ్లసందులతోఁగూడిన వాఁడునైన హిమవంతుఁ డనుపర్వతరాజు మహారణ్యమున నున్న వాఁడు. అతఁడు నీతోఁ గయ్యమొనరించి, నీ కెక్కువ సంతసము గావింపఁగలఁడు. వానికడకుఁ బొమ్ము" అని చెప్పెను.

అసురాధిపుఁ డామాట విని, సముద్రుఁడు తనకు వెఱచె నని యెంచి, వింటినుండి జాఱినయమ్ముకైవడి వేగిరముగా హిమవత్పర్వత వనమునకు వచ్చి, యేనుఁగులవలె గొప్పవగు నా పర్వతమునందలి తెల్లఱాల నెల్లఁ గొమ్ములతోఁ జిమ్మి ఱొప్పెను. అప్పుడు హిమవంతుఁడు తెల్లమబ్బువంటి తిన్ననైన చక్కని రూపము ధరియించి, తన శిఖరముననే నిలిచి, దుందుభిం గని "ధర్మపరుఁడవగు ఓ దుందుభీ! నన్ను నీవు నొప్పింపకుము. నేను యుద్ధములందు గట్టివాఁడను గాను. ఏను మునిజనులకుఁ దావలమయినవాఁడను" అని చెప్పఁగా, దుందుభి బుద్ధిమంతుఁ డగుహిమవంతుని మాటను విని, కోపముచేఁ దనకన్ను లెఱ్ఱనచేసి హిమవంతు నుద్దేశించి, "నీవు యుద్ధమునఁ జాలనివాఁడవై నను, నాకు వెఱచి యుద్ధప్రయత్నమును మానినవాఁడవైనను, సరే. నేను పోరుఁగోరియున్నాను. నాతో సమరము సేయఁగలవాని నొక్కనిఁ జెప్పుము" అని యడిగెను. ధర్మాత్ముఁడయిన హిమవంతుఁడు పూర్వ మెవ్వరు సెప్పని దుందుభిపలుకులు విని, యలుక గదుర నయ్యసురోత్తమునిఁ జూచి యొక మాటఁ బలికెను. "ఓ దుందుభి! వాలియను వానరేంద్రుఁడు వైభవమున నన్నిపట్టణముల మీఱియున్న కిష్కింధా పట్టణము నేలుచున్నాఁడు. అతఁడు గొప్పచదువరి. వేల్పు ఱేనింబోలు పరాక్రమముగలవాఁడు. వన్నెగలవాఁడు. యుద్ధమున నేర్పరి. దేవేంద్రుఁడు నముచితోయుద్ధము సేసినట్లు, నీతో సమానముగా గొప్ప ద్వంద్వయుద్ధము సేయఁగలఁడు. ఓ యసురాధిపా! ఆతఁడు యుద్ధమున గొప్ప శూరుఁడు. ఆతని నెవ్వరును గెల్వఁజాలరు. కావున నీవు యుద్ధము గోరుదువేని, వేగిరముగా నావాలికడ కేగుము" అని హిమవంతుఁడు దుందుభితోఁ జెప్పెను.

ఆ దుందుభి హిమవంతునిపలుకులు విని, మిగులఁ గోపముతో, వాఁడికొనలుగలిగి చూపఱకు వెఱపుపుట్టించు మహిషరూపము దాల్చి, వర్షాకాలమున నీటితో నిండినదై యాకసమున నుండు గొప్ప మేఘముకైవడి వెలుఁగుచు వెడలివచ్చి, కిష్కింధాపురము సొచ్చి, పురద్వారముఁ జేరి చేరువ నున్న చెట్ల నెల్ల విఱుచుచు, గిట్టలతోఁ బుడమిని బ్రక్కలించుచు, గర్వ మచ్చుపడ నాద్వారమును

గజేంద్రునికై వడిఁ గొమ్ముతోఁ గోరాడుచు భూమి యదరునట్లు దుందుభి వాద్యముకై వడి గొప్పఱంకె వేసెను.

అంతిపురమున నున్న వానరేంద్రుఁడగు వాలి యీశబ్దము విని యొర్వఁజాలక, నక్షత్రగణముతోఁ గూడవచ్చెడు జంద్రునివలెఁ దన కాంతలతోఁ గూడ వచ్చి దుందుభిం గాంచి, విడివిడిమాటలతో "ఓ బల వంతుఁడా! నీవు మహిషరూపముదాల్చి నాపురమువాకిటి నడ్డగించి యేల యిట్లఱచుచున్నావు. నీవు దుందుభివిగదా! నీసంగతి నే నెఱిఁగితిని. ప్రాణములను గాపాడుకొనుము. పోయిరమ్ము" అని దుందుభితోఁ జెప్పెను.

దుందుభి వాలిపలుకులు విని కోపముచే నెఱ్ఱనైనకన్నులుగలఁ వాఁడై, "ఓ శూరుఁడా! ఆఁడువారియెదుట నిట్టి పలుకులు పలుకుట తగదు. నాతోడ యుద్ధము సేయుము. పిమ్మట నీబలిమి నెఱిఁగెదను. ఓరీ కోఁతీ, యీ రేయియెల్ల నాకోపము నాఁపుకొనియుండెదను. నీవు ప్రొద్దుపొడుచువఱకు విచ్చలవిడిగా స్త్రీలంగూడి కామ సుఖములం దేలుము. నీ చెలికాండ్రగు వానరులనెల్లఁ గౌఁగిలించి, వారికిఁ గావలసి నది యిమ్ము. నీవు వానరులకెల్ల నధిపతివి. కావున వారికెల్లఁ గోరినది యిచ్చి, చెలికాండ్ర నెల్ల సంతసపఱపుము. కిష్కింధాపురమెల్ల బాగుగాఁ జూచిరమ్ము. నీకు సాటియైనవానికిఁ బట్టముగట్టుము. కాంతలంగూడి యథేచ్ఛగా విహరింపుము. నేను నీ పొగరడంచువాఁడను. త్రాఁగు బోతై కైపుగలిగియున్నవానిని, ఏమఱుపాటుతో నున్న వానిని, నిద్దురపోవుచున్నవానిని, నిరాయుధుండయినవానిని, నీవలెఁ గామసుఖ ములం దవిలియున్నవానిని లోకమున శత్రువు సంహరింపఁగూడదు. ఎవఁ డట్లు తెలియక చంపునో, వాఁడు శిశుహత్య గావించినవాఁ"డని వాలితో నెక్కువ గర్వముతోఁ బలికెను.

వాలి యప్పుడు తార మొదలగు కాంతల నెల్ల విడనాడి, చిఱు నవ్వు నవ్వి కోపముతో నాయసురోత్తముఁడగు దుందుభివంకఁ జూచి, తిన్ననిపలుకులతో నిట్లనియె. ఓ దుందుభీ! "వీఁడు కైపుమీఁద నున్నాఁడు" అని తలంపకుము. నీవు బవరమునకు వెఱవవేని రమ్ము. ఇదిగో యుద్ధమున నీమదమే నాకు వీరపానముగు నని తలఁపుము" అని దుందుభితోఁ జెప్పి, యుగ్రుఁడై తండ్రియగు దేవేంద్రుఁ డొసఁగిన

పసిఁడిహారమును దాల్చి యుద్ధమునకు వెడలెను. కపిశ్రేష్ఠుఁడగు వాలి యప్పుడు పర్వత సదృశుఁడయినదుందుభికొమ్ములను బట్టికొని, ప్రలయ కాలమేఘమువలె గర్జించుచు గిరగిరఁ ద్రిప్పి క్రిందఁ ద్రోసెను. అట్లు వాలి త్రోయఁగాఁ గ్రిందఁబడిన యాదుందుభి చెవులనుండి రక్తము గాఱెను. ఒండొరులు జయముఁగోరి, కినుకవూని వాలిదుందుభులు గొప్పపోరొనర్చిరి. దేవేంద్రుని కెనవచ్చు పౌరుషముగల వాలి యా దుందుభిని బిడికిళ్ళతో గ్రుద్దెను; మోఁకాళ్ళతోఁ బొడిచెను; ఱాల తోఁగొట్టెను; చెట్లతో మోదెను. అప్పుడు వాలిదుందుభులు సమముగాఁ బోరుచున్నను గొంతసేపటికి దుందుభి డస్సెను. వాలి మఱింత రేఁగెను. దుందుభి చెయువులు దక్కి, మగఁటిమియుడిగి, బలములేక యెదిరినిఁ గవ్వకొనఁజాలకుండుట యెఱింగి, వాలి యతనినిఁ బైకెత్తి నేలఁగొట్టెను. వాలి ప్రాణాంతికమైన యుద్ధమున దుందుభిని నుగ్గు చేయఁగా, గొప్పదేహముగల యాదుందుభి క్రిందఁబడి, ప్రాణములఁ దొఱఁగెను. అంత వాలి సత్త్వయుడిగి నిర్జీవుఁడయిన యాదుందుభిని యిటటు పొఱలించి యెక్కువ వేగముతో నొకయోజనముదవ్వునఁ బడునట్లు విసరివైచెను. అట్లు వేగముచే విసరివేయఁబడిన యాదుందుభి నోటినుండి కాఱిన నెత్తుటిబిందువులు గాలి కెగిరి, మతంగమహాముని యాశ్రమమున వచ్చిపడినవి.

అయ్యాశ్రమమున నున్న మతంగమహాముని యాదుందుభినోటి నుండి కాఱిపడిన యారక్తబిందువులను జూచి, యలిగినవాఁడై, "ఎవఁ డితఁడు దురాత్ముఁడు, ఎవఁడో నాపై నెత్తుటిబొట్లు చిమ్మి నన్నపరిశుద్ధునిఁ గావించెను. అతఁడు దురాత్ముఁడు, బుద్ధిహీనుఁడు, అవినయుఁడు, మూఢుఁడునైయున్నట్లు కానఁబడుచున్నాఁడు" అని తనలోపల నిట్లను కొని, పర్ణశాల వెలుపటికి వచ్చి మహిషరూపముఁదాల్చి, పర్వతమువలెఁ జచ్చిపడియున్న యొక రాక్షసునిఁజూచి, యోగబలముచే నది వాలి యొనర్చిన కార్యమని యెఱిఁగి, "ఎవఁ డీ యసురునితనువును జిమ్మి నా యాశ్రమమంతయు నెత్తుటిచుక్కలచే నపరిశుద్ధము గావించి, యిచ్చటి చెట్లనెల్ల విఱిచెనో, వాఁ డీ వనమునఁజొఱరాదు. అట్లు వాఁడు చొచ్చునేని, తప్పక మరణము నొందును. ఈ నావనమున నలుప్రక్కల యోజనముదూరములోపల వాఁడు ప్రవేశించునేని మఱల ప్రాణ

ములతో నుండఁడు. ఇది తప్పదు. వాని పరిచారులు నెవ్వారు నావన మున నున్నారో, వారు నిచ్చట నుండఁదగదు. వారెల్ల నాశాపవచ నము విని వెంటనే సుఖముగాఁ బోవుదురు గాక! వారు నా శాపవార్త వినియు, నేను బిడ్డవలెఁ బెంచిన యీ నావనమునందలి యాకులు మొల కలు పండ్లు దుంపలు నాశముచేయఁగోరి యిచ్చట నుందురేని, వారిని శపించెదను. ఈ యొకదినము వారికి గడువొసఁగితిని. ఈ దినమున నీ వనము వదలక రేపు నాకంటఁబడు వానరుఁడు పెక్కువేలయేండ్లు కొండవైయుండును" అని యా దుందుభిమేనిఁ జిమ్మిన వాలి కోర్వరాని శాపము నొసఁగెను.

అంత వానరులందఱు మతంగముని యొసఁగిన శాపము విని యా వనమువిడిచి, వాలికడ కేగిరి. అప్పుడు వాలి వారిం జూచి, "మీరం దఱు మతంగవనమున నుండువారలుగదా. మీ రంద ఱేల నాకడ కేతెంచితిరి? వానరుల కందఱకు సేమమేకదా" యని యడిగెను. అప్పుడు వానరులందఱు బంగారుమాలికగల వాలితో నతనికి ముని యొసఁగిన శాపమును, తమరాకకుఁ గారణము నెఱుఁగఁజెప్పిరి. అంత వాలి వానరులు చెప్పినమాట విని వెంటనే యా మహర్షికడకేగి యంజలిచేసి, "మహాత్మా! నాతప్పిదము మన్నింపు" మని ప్రార్థించెను. ఆ మతంగమహర్షి యా వాలి ప్రార్థనమును గైకొనకయే తన యాశ్ర మములోపలికిఁ జొచ్చెను. వాలియు శాపము దగులునేమో యన్న భీతిచే వంతనొంది, యీ ఋశ్యమూకపర్వతము చొచ్చుటకుఁగాని, చూచుటకుఁగాని కోరఁడు. రామనృపాలా! యీవనమున నతఁడు ప్రవేశింపఁ డన్నసంగతి యెఱిఁగి, దిగులువిడిచి, చెలికాండ్రతోఁగూడి తిరుగుచున్నవాఁడను. ఓ రామా! ఇదిగో కనఁబడునది వాలి బలగర్వ ముచే విసరివైచిన యాదుందుభియొక్క యెముకలరాశి. ఇది యొక్క గొప్పపర్వతముమాడ్కి నెత్తుగాఁ గానఁబడుచున్నది. ఇవిగో పెద్దలుఁ గొమ్మలుగల యేడు మద్దిచెట్లు. వాలి తనబలిమిచే నొక్క చెట్టున దూఱి పోవునట్లు బాణమేయఁగలఁడు. రామనృపాలా! యీ వాలివీర్యము సాటిలేనిది. ఇది నీ కెఱుఁగఁజెప్పితిని. ఇట్టి బలాఢ్యుఁడయిన వాలి నెట్లు యుద్ధమున సంహరింపఁ జాలుదువో తెలియకున్నది" యని సుగ్రీ వుఁడు రామునితో ననెను.

అట్లు సుగ్రీవుఁడు పలుకుటఁజూచి, లక్ష్మణుఁడు నవ్వుచు "సుగ్రీవా! రాముఁ డెట్టికార్యము సేసి చూపిన, వాలి వధముసేయఁగలఁడని నమ్ముదువు చెప్పుము" అని యడుగఁగా, సుగ్రీవుఁడు లక్ష్మణుంగూర్చి, "తొల్లి వాలి యీ యేడు మద్దిచెట్టులలో నొక్కొక్కదానిని బాణమొక్క యేటునఁ జెట్టునడుమ దూఱిపోవునట్లు పలుమాఱు గొట్టియున్నాఁడు. రాముఁడు నట్లె యొక్కబాణము నొక్కచెట్టున నొక్కయేటునకు దూఱిపోవునట్లేయునేని, ఈ చచ్చిన మహిషముయొక్క కళేబరము నొక్కపాదముచే నెత్తి యెనిమిదివందల మూరలదూరమునఁ బడునట్లు చిమ్మెనేని, అప్పుడు రాముని పరాక్రమముగని, యితఁడు వాలిం దెగటార్పఁగలఁడని నమ్మెదను" అని చెప్పెను. ఇట్లు లెట్టనికనుఁగొనలుగల రామునిఁ గూర్చి పలికి సుగ్రీవుఁడు కొంతతడవు చింతించి, మఱల రామునిఁజూచి, "వాలి శూరుఁడు; శూరులను జంపినవాఁడు; బలపరాక్రమములలో సాటిలేనివాఁడని ప్రసిద్ధిగన్నవాఁడు; దేహబలమును, బుద్ధిబలమును గలిగినవాఁడు; ఇంతకుమున్నెప్పుడు బవరములం దోటమినొందనివాఁడు. దేవతలకుఁగూడఁ జేయ నలవికాని పను లెన్నియో యితఁడు చేసియుండుట చూచి, యీతనికి వెఱచి, యీ ఋశ్యమూకపర్వతము నొందినవాఁడను. వానరేంద్రుఁడగు వాలి యొరులకు గెల్వ నలవికానివాఁడును, ఎదిరింప నసాధ్యుఁడును, పరులయవమానము నోర్వనివాఁడునునై యుండుటం దలఁచికొని, హనుమంతుఁడు మున్నుగాఁగల మేటి యనుఁగుఁజెలికాండ్రతోఁ గూడ నీ పర్వతము విడువకయున్నవాఁడను. పురుషోత్తమా! స్నేహితులందుఁ బ్రేమగలవాఁడా! కొనియాడఁదగిన గుణములుగల యుత్తమమిత్రుఁడవగు నీవు నాకు హిమవంతము దొఱికినట్లు దొఱికితివి. అయిన నేల వెఱతువనిన, బలవంతుఁడగు నా చెడు తోఁబుట్టువుయొక్క బలము నెఱిఁగినవాఁడను. సమరమందు నీబలిమి యెట్టిదో నాకుఁదెలియదు. నేను నీ మగఁటిమిని సమక్షమునఁ జూచినవాఁడనుగాను. ఓ రాఘవా! నేను నీపరాక్రమము నలక్ష్యపఱచుచున్నాననియు, వాలియొక్క పూర్వవిక్రమముఁ దెలిపి నిన్ను బెదరించుచున్నాననియుఁ దలఁపకుము. మఱేమియనిన, అతఁడు చేసిన మగఁటిమి పనులు తలఁచుకొన్న నాకుఁ దత్తరపాటు గలుగుచున్నది. రాఘవా! నీమాటలు, బుద్ధియు, మగతనము, రూపమును నిప్పురుగప్పిన

నిప్పునుబోలె నీయందున్న యెక్కువ తేజస్సును దెలుపుచున్నవి." అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను.

మంచినడతగల యా సుగ్రీవుఁడు చెప్పిన యా మాటను విని, నిడుదచేతులుగలవాఁడయిన లక్ష్మణుని యన్నయగు రాముఁడు చిఱునవ్వు మోమునఁ గదుర సుగ్రీవుంగూర్చి "వానరా! మాబలిమివిషయమయి నీకు నమ్మకము లేదేని, యితఁడు యుద్ధము సేయఁగలఁడని కొనియాడఁదగిన నమ్మకము గలిగించెదను" అని చెప్పి, యా దుందుభికాయము నవలీలగాఁ దనకాలిబొట్టనవ్రేలితో నెత్తి పదియోజనముల దవ్వునఁ బడునట్లు చిమ్మెను.

అంత శూరుఁడగు సుగ్రీవుఁడు శుష్కించిన దుందుభిదేహమును రాముఁడు పదియోజనములదూరమునఁ బడునట్లు బొట్టనవ్రేలితో జిమ్మినఁ జూచి వెండియు నాతనితో లక్ష్మణునిముందట నిట్లనియె. "చెలికాఁడా! తొల్లి వాలి యీ దుందుభి దేహమును జిమ్మినప్పు డిది పచ్చిదై, నంజుడు గలిగి చెక్కుచెదఱనిదిగ నుండెను. ఇప్పు డది యెండ కెండి, గాలి కాఱి, వానకుఁ జివికియున్నందునఁ దేలికదై, నంజుడులేక, కసవుపోఁచవలె నైయున్నది. అప్పుడు నాయన్న వాలి దీనిని గడుఁ బ్రయాసముతో విసరికొట్టెను. రఘునందనా! నీ విప్పుడు దీనిని గడుఁ జులకనగా విసరివైచితివి. ఈ కార్యముచే నీ బలమెక్కువో, వాలిబలమెక్కువో తెలియరాదు. రాఘవా! యీ దుందుభిదేహము అప్పుడు తడిది, యిప్పు డెండుదియను గొప్ప వార యుండుటయే మీ యిరువురి బలము నెఱుఁగువిషయమున సందియమున కెడమిచ్చుచున్నది. కావున నొక్క మద్దిచెట్టు నొక్కబాణముచేఁ జీల్తువేని యప్పుడు మీ యిరువురి బలాబలములు స్పష్టముగాఁ దెలియఁగలవు. రామా! యేనుఁగుతొండము మాడ్కిఁ గడు నిడుపైన నీ విల్లెక్కువెట్టి, యాకర్ణాంత మీడ్చి గొప్ప శరము విడువుము. నృపకుమారా! నీ వేయు బాణమీచెట్టును భేదింపఁ గలదు. ఆ విషయమున నాకేమియు సందియము లేదు. అయినను నా మనస్సునకుఁ దృప్తిగలుగునిమిత్తము నిన్నీపనిఁ జేయఁ బ్రేరించుచున్నాఁడనుగాని, నిన్నుఁ బరీక్షించుటకుఁగాదు. నే నొట్టువెట్టికొని చెప్పెదను, వెలుఁగులలోనెల్ల సూర్యుఁడును, మహాపర్వతములలోనెల్ల హిమవంతుఁడును, మృగములలోనెల్ల సింగము నెట్లు శ్రేష్ఠములో, అట్లు

పరాక్రమవంతులలోనెల్ల నీవు శ్రేష్ఠుఁడవు" అని సుగ్రీవుఁడు రాముని తోఁ బలికెను.

## 12-వ సర్గము

### సుగ్రీవుఁడు వాలిని యుద్ధమునకుఁ బిలుచుట

ఎక్కువ వెలుఁగుగలవాఁడును, శత్రువుల గర్వము నడఁచు వాఁడునైన రాముఁడు సుగ్రీవుఁడు సెప్పిన పలుకులువిని, యతనికి విశ్వాసముఁ గలిగించుటకై భయంకరమయిన వింటిని గైకొని యొక ఛే బాణమును సంధించి, యల్లెత్రాటి ధ్వనులచే దిశలు పిక్కటిల్ల నారిని మీటుచు చెట్లపైఁ బ్రయోగించెను. బలవంతుఁడయిన యా రాముఁ డేసిన స్వర్ణాలంకృతమైన బాణము ముహూర్తకాలములోపల కొండ చరియయందున్న యేడు మద్దిచెట్లను చెకలించి, పుడమింజొచ్చి, క్షణ ములోపల మఱింత వేగముతో మఱలి తనయునికిపట్టగు నమ్ములపొది యందుఁ జొచ్చెను.

వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు రాముఁ డొక్కబాణ మేయుటచే నేడు సాలములును దెగుటఁ జూచి, యెక్కువ యాశ్చర్యము నొంది, మెడలోని హారములు నేలపయి జీరాడుచుండ సాగిలఁబడి సాష్టాంగప్రణామమాచరించి, యా రామునియపారప్రజ్ఞకుఁ గడు మోదమందుచు, ధర్మముల నెఱిఁగినవాఁడును, అస్త్రవేత్త లందఱి లోపల శ్రేష్ఠుఁడును, శౌర్య ధైర్యాదిగుణములు గలవాఁడునైన రామునిఁజూచి యిట్లనియె.

ఓ పురుషోత్తమా! ఇంద్రాదిదేవతలంద ఱాయుధములతో నెత్తి వచ్చినను, ఓ ప్రభూ! నీవు వారి నందఱిని సంహరింపఁజాలినవాఁడవు. అట్టి నీకు వాలి యన నెంతమాత్రము! రామా! యేడు మ్రాఁకులను భూమి నొక్క బాణముచేఁ జీల్చిన నీయెదుట నెవఁ డనిమొననిల్చి యుద్ధముసేయఁజాలును? ఇపుడు నాకు విచారము దొలఁగెను. ఎక్కువ యానందమును గలిగెను. దేవేంద్రవరుణులఁబోలిన నీవు నాకు నెచ్చెలివై యుండ నాకుఁ గొఱఁత యేమియున్నది? కాకుత్స్థా! నీవు నా మేలు గోరినవాఁడవు గావునఁ దోఁబుట్టువనెడి మిషతోఁ బుట్టియున్న నాబగతు నిప్పుడె తెగటార్పుము. ఇదిగో నేను దోసిలిగట్టి మ్రొక్కుచున్నాను" అని సుగ్రీవుఁడు రాముని బతిమాలెను.

అంతట గొప్ప పండితుఁడైన రామునుఁడు చూడ నింపుగొలుపు సుగ్రీవునిఁ గట్టిగాఁ గౌఁగిలించికొని, లక్ష్మణునితో నీ సంగతి యాలోచించి, యతనియనుమతి గైకొన్నపదంపడి సుగ్రీవునింజూచి, "చెలికాఁడా! మనము కిష్కింధకుఁ బోదము. నీవు వేగిరముగ ముందుగాఁ బొమ్ము. అచ్చటికిఁ బోయి నీ భ్రాతృధముని వాలిని గయ్యమునకుఁ బిలువుము" అని చెప్పెను. అంత వారు మువ్వురు వేగముగాఁ బయనమై, వాలిపాలించెడి కిష్కింధాపురముఁజేరి, యొరులకుఁ గానరాకుండునట్లు చొరరాని యొకవనమునఁ జెట్లమఱుఁగున నిలిచిరి. అంత సుగ్రీవుఁడు వాలిని జగడమునకుఁ బిలుచునిమిత్తమై మిక్కిలి ధైర్యము పూని, చప్పుడున నాకాశము పిక్కటిల్లునట్లు ఘోరమైన నాదము చేసెను.

బలవంతుఁడగు వాలి తమ్మునియొక్క యా సింహనాదమును విని యలుకఁబూని, పోరునకుఁ గట్టాయితుఁడయి, యస్తపర్వతశిఖరము నుండి సూర్యుఁ డుదయించుమాడ్కి పట్టణము వెలువడివచ్చెను. ఆవాలి సుగ్రీవుల కిరువురికిని, ఆకసమునఁ దేజరిల్లు బుధాంగారకగ్రహములకుఁ బోలెను, మహాఘోరయుద్ధము జరిగెను. అంత వారొండొరులు కోపముచే మేనుమఱచి, పిడుగుపడిన ట్లొక్కొరి నొక్కరఱచేతితో బాఁదుకొనిరి; పిడికిళ్లతో గ్రుద్దుకొనిరి. అప్పుడు రాముఁడు విల్లు చేతఁబూని, యా వాలిసుగ్రీవులం జూచి, యా వాలిసుగ్రీవు లిద్ద ఱశ్వినీదేవతల మాడ్కి నొండొరులం బోలియున్నందున, ఇయ్యిరువురిలో నెవ్వఁడు సుగ్రీవుఁడో, ఎవఁడు వాలియో యెఱుఁగనందునఁ దన బాణము నెవ్వరిపైన వేసిన నేమగునోయని ప్రాణాంతకమగు బాణమును విడువ మనంబునఁ దలఁపఁడయ్యెను.

ఇంతలోపల వాలి సుగ్రీవుని బాగుగ మర్దించెను. సుగ్రీవుఁడు వాలి యొక్క దెబ్బల కంగములు శిథిలముగాఁగా, మేనెల్ల నెత్తుటిచేఁ దడియఁ గడుడస్సి, తనకు బాసటచేయవచ్చిన రామునిఁ గానక, యింకఁ దాఁ బోరాడఁజాలనని తలఁచినవాఁడై, వెనుకకు మఱలి, వాలి వెంటఁ దఱుముచు వచ్చుచుండఁగా నతని చేతికిఁ జిక్కక ఋశ్యమూకపర్వత మహావనముసేరెను. వాలియుఁ బరాక్రమముయొక్క తేజస్సుచే దేదీప్యమానుఁడై శాపభీతిచే మతంగాశ్రమముఁ జొచ్చిన సుగ్రీవుని వెంటా

డక "ఓరీ! తప్పించికొంటివి పొమ్ము" అని చెప్పి, మహాక్రోధముతోఁ దనపురమునకు మఱలివచ్చెను. అంత రాముఁడు లక్ష్మణుని, హనుమంతునిఁ దోడ్కొని యా సుగ్రీవుఁ డున్న చోటికి వచ్చెను.

సుగ్రీవుఁడు లక్ష్మణసమేతుఁడై వచ్చిన రామునిఁజూచి, సిగ్గుచేఁ దలవంచి దీనస్వరముతో నిట్లనియెం. "ఓ రాఘువా! నీపరాక్రమముఁ జూపి నీయెడ నమ్మికఁ బుట్టించుకొని, నన్నుఁ బోయి వాలిని గయ్యము నకుఁ బిలువమంటివిం. శత్రువు నన్నుఁ జావుదెబ్బలు కొట్టఁగాఁ జూచు చుంటివిం. దీన నీకేమి లాభముగలిగెను? ఓ రాఘువా! నీ వాదినముననే నేను వాలిని గొట్టనని యున్నది యున్నట్లు చెప్పఁగూడదా? నే నిట్లిక్కడికేగి యా పగవానిచేతఁ జావుదెబ్బలు తినకయుందునుగదా. నిన్ను నమ్మినందుకు నా కెంత యాపద దెచ్చితి" వని కడు శోకమున రామునితోఁ జెప్పుకొనెను.

గొప్ప నడతగల యా సుగ్రీవుఁ డిట్లు పలుకఁగా, రాముఁడు మిక్కిలి జాలినొంది, తిన్నని పలుకులతో నిట్లనియె. "ఓ చెలికాఁడా! సుగ్రీవా! నీవు శోకక్రోధములు వీడుము. నేనేల బాణము విడువనైతినో కారణము సెప్పెద వినుము. సుగ్రీవా! నీవును, వాలియు నొక్కటే వేషము దాల్చియున్నారు. మీరొకటే పొడుగును లావును గలిగియున్నారు. నీ నడకవంటిదిగనె యతనినడకతీరునున్నది. నీయుడుపులు ఆతనియుడుపు లొక్కటితీరున నున్నవి. ఇట్లొక్కవేషముననె కాక, కంఠస్వరము, చూపు, సొంపు, మగటిమి, మాటలుం జూచిన, వానిలోను భేదము గనఁబడకున్నది. ఓవానరశ్రేష్ఠుఁడా! మీరూపముల పోల్కివలన నెవ్వఁడు వాలియో. ఎవఁడు సుగ్రీవుఁడో తెలియఁజాలక, యేసినమాత్రముననే శత్రువుం బరిమార్చు కడువడిగల నా బాణము నేయనైతిని. నాబాణమో తిరుగుపాటులేనిది. అట్లు తెలియక ప్రయోగించిన బాణము నీపైననే పడినచో మొదటికి మోసము వచ్చునుగదా. అంతియకాక, నేను రూఢిగాఁ దెలిసికొనక, ముందువెనుకలు యోచింపక బాణప్రయోగము చేసియుందునేని, యాబాణము విధివశమున శూరుఁడవైన నీకే తగిలి, కపీశ్వరా, నీవు మృతినొందినచో, నాయవివేకమును, బసితనమును లోకమున "రాముఁడు మూఢుండనియు, పసితనపుఁజేష్టలింక నాతఁడు విడువలే"దనియుఁ బ్రసిద్ధికెక్కునుగదా

ఒక్కరనుట యటుండనిమ్ము; శరణొసఁగినవానిం జంపుట యను మహా పాపము నాకు సంభవించునుగదా! సుగ్రీవా! నేనేమి, లక్ష్మణుఁడేమి, సీతయేమి మేము నీయధీనులమై యున్నవారము. ఈ యడవియందు నీవెకదా మాకు దిక్కు కావున సుగ్రీవా! నీవు మఱల యుద్ధము చేయుము. నా విషయముఁగూర్చి సందియపడకుము. సుగ్రీవా! యింక నొక నిమిషమున వాలి నాయొక్క బాణపుదెబ్బచేఁ గ్రిందఁబడి పొరలు నపుడు నీవు చూడఁగలవు. అయిన నీవు వానితో ద్వంద్వయుద్ధము సేయునప్పుడు నిన్ను గుర్తించుటకుఁ దగిన యొక యానవాలు దాల్చుము" అని సుగ్రీవునితోఁ జెప్పి, లక్ష్మణుంజూచి, "లక్ష్మణా! యీ కనఁబడుచున్న కొండచరియందుఁ జక్కఁగా విరిసిన గజపుష్పియను తీగను గోసి, యీతనిమెడయందు మాలగా వేయుము" అని లక్ష్మణు నితోఁ జెప్పెను.

అంత లక్ష్మణుఁ డాగజపుష్పితీగను గోసి తెచ్చి, యా సుగ్రీవుని మెడలో వైచెను. ఆ పువ్వులతీఁగెను దాల్చిన యా సుగ్రీవుఁడు నక్షత్రగణములచేఁ జుట్టఁబడినసూర్యునితెఱఁగునను, కొంగల వరుస తోనుఁగూడిన సంజప్రొద్దు మేఘముమాడ్కిని దేజరిల్లుచు, రాముని మాటయందు మనసు నుంచి, వాలి యేలెడి కిష్కింధకు వెండియు నేఁగెను.

## 13-వ సర్గము

—సుగ్రీవుఁడు రెండవతూరి వాలిమీదికి యుద్ధమునకుఁ బోవుట—

ధర్మాత్ముఁడయిన లక్ష్మణుని యన్న యగు రాముఁడు స్వర్ణ భూషణాలంకృతమైన గొప్పవింటిని, సూర్యునిమాడ్కి వెలిఁగెడి జయముగలిగించు బాణములను జేతఁబట్టి, ఋశ్యమూకమునుండి వాలి మగఁటిమితోఁ బాలించుచున్న కిష్కింధాపురమునకుఁ దఱలెను. మహా ధీరుఁడగు నా రామునికి ముందట బలిసినమెడగల సుగ్రీవుఁడును, బల వంతుఁడగు లక్ష్మణుఁడును నడచిరి. వెనుకప్రక్కన వీరుఁడగు హను మంతుఁడు, నళుఁడు, నీలుఁడు, వానరసేనలకు నాయకుఁడయినయొక్కవ ప్రతాపముగల తారుఁడును వెంబడించిరి. అట్లు వా రందఱుతఱలి, పుష్పఫలభారముచే వంగిన చెట్లను, తేటనీటితోఁ బాఱుచున్న సాగరంగ

మములగు నదులను కొండఅాల చీలికలను, పర్వతములను పర్వతగుహ లను,ఎత్తుశిఖరములను,రమ్యములై యుండు కొండచరియలను,వైడూర్య మణులవలెఁ బచ్చనైన తామరాకులును, చక్కఁగఁ బూచిన తామర పువ్వులును గలిగి, బెగ్గురుపక్షులు, చాతకపక్షులు, హంసలు, నీరుకోళ్లు, చక్రవాకపక్షులు మొదలగు పెక్కు పక్షులు చేయు శ్రావ్యనాదము లతోఁగూడి మనోహరములై యున్న తటాకములను, లేఁబచ్చికమొల కలఁదిని నిర్భయముగా వనప్రాంతములం దంతటఁ దిరుగుచున్న లేళ్ళను, తెల్లని దంతములు గలిగినవియు, ఘోరములునునై గుంపులుగుంపు లుగాఁ గూడి యడవులందలి చెట్లనెల్లఁ బెళ్ళగించుచుఁ దిరుగుచు నెత్తు చరులు గలిగినట్టి నడయాడుఁ గొండలో యనఁదగియుండునవియు, నేలదుమ్ముచే నిండిన మేనులు గలవియు, క్రొక్కారుమొగుళులం బోలునవియునై కొలఁకులను బాడుచేయుచున్న వన్యగజములను, మఱియు ననేకములైన వన్యమృగములను, ఆకాశమునఁ బఱతెంచు నట్టి పక్షులను జూచుచు సుగ్రీవుని యానతిచొప్పునఁ బోవుచుండిరి.

వా రట్లు వేగిరముగాఁ బోవుచుండఁగా, రఘునందనుఁ డొక్క చోట దట్టమైన చెట్లతోపును జూచి, "సుగ్రీవా! దట్టమైన యీచెట్ల తోపు చుట్టు నరటిచెట్లుగలిగి, మేఘమండలము మాడ్కి విస్తారమై యాకాశమందలి మేఘజాలముచందమునఁ బ్రకాశించుచున్నది. చెలి కాఁడా! ఇదేమియో తెలియవలయునని కుతూహలము గలుగుచున్నది. నీవు నా కుతూహలమును దీర్పవలయు" నని సుగ్రీవు నడిగెను.

మహాత్ముఁడైన యా రాఘవుఁ డడిగిన మాట విని, సుగ్రీవుఁడు నడచిపోవుచునే యా వనమహిమను రామునికిఁ జెప్పఁ దొడఁగెను. "రాఘవా! యీ తపోవనము మిక్కిలి విశాలమయినది. బడలికను దీర్చునట్టిది. దీనియందుఁ బెక్కు తోఁటలు గలవు. మధురములైన పండ్లును, తియ్యని తేటనీరును గలవు. ఈ వనమున సప్తజనులనెడి యేడుగురే మునీంద్రులు కఠిననియమంబులు పూని, తలక్రిందుగా నిలిచి, నీటఁ బరుండి, యేడురాత్రుల కొక్కపర్యాయము వాయు వాహారముగఁ గలవారలై, యేడునూఱుల సంవత్సరములు తపస్సు చేయుచుండి బొందితో స్వర్గమును బొందిరి. రాఘవా! యిట్టి ప్రభా వముగల యమ్మునీంద్రుల యాశ్రమమిది. చెట్లు దీనిచుట్టును ప్రహరి

వలె నున్నవి. ఈ యాశ్రమమున నింద్రాదిదేవతలుగాని రాక్షసులు గాని ప్రవేశింపఁజాలరు. పక్షులీవనమునఁబాఱవు. తక్కిన వన్యమృగము లును బ్రవేశింపవు. అట్లు తెలియక యెవ్వరైన నిందుఁబ్రవేశింతురేని, యచ్చటినుండి మఱలిరారు. ఇచ్చటనింపుగలుకుధ్వనులుగల సొమ్ముల సందడులును, గీతవాద్యధ్వనులును వినఁబడుచుండును; కస్తురినెత్తావి గుబాళించుచుండును; గార్హపత్య, ఆహవనీయదక్షిణాగ్నులనెడి మూఁడగ్నులు వెలుఁగుచుండును. ఇదిగో పావురపుమేని డాలు గలిగి దట్టమైయున్న పొగయుఁ జెట్లనుగ్రమ్ముకొనుచుఁ దేజరిల్లుచున్నది చూడుము. ఈచెట్లు కొనలందుఁ బొగతో నిండినవై, మేఘమండలము లచేఁ గ్రమ్మఁబడిన వైడూర్యమయపర్వతములో యనఁ బరఁగుచున్నవి. ధర్మాత్ముఁడా! రాఘవా! నీవు భక్తితో చేతులుజోడించి, లక్ష్మణునితోఁ గూడ నీమునులకు మ్రొక్కుము. ఆత్మజ్ఞానులగు నీమునీంద్రుల కెవ్వరు మ్రొక్కుచున్నారో, వారు దేహారోగ్యముగలవారై యుందురు. అని సుగ్రీవుఁడు రామునికి బదులుచెప్పెను.

అంత రాముఁడు సుగ్రీవునిపలుకులు విని, తానును దమ్ముఁడును జేతులు జోడించికొని యమ్మహాత్ములగు ఋషీశ్వరులకు వందనమాచ రించెను. ధర్మాత్ములయిన రామలక్ష్మణులు మ్రొక్కిన తర్వాత, సుగ్రీ వాదులగు వానరులును నమస్కరించిరి. తర్వాత వారందఱు సంతోష భరితులై యచ్చటినుండి తఱలిరి. అట్లు వారందఱు సప్తజనాశ్రమము దాఁటి చాలదవ్వేగి, యొరులకుఁ జొరనలవికానివిధమున వాలిచేఁ గాపాడఁబడుచుండు నా కిష్కింధాపురముఁజూచిరి. అంత రామలక్ష్మణ సుగ్రీవులు సూర్యునిఁబోలు వెలుఁగుగలవారయి, యాయుధములు దాల్చి, పగతునిఁబరిమార్చుటకు దేవేంద్రునిపుత్త్రుఁడగు వాలిచేఁ బాలింపఁబడుచున్న కిష్కింధాపురము మఱలఁబ్రవేశించిరి.

## 14-వ సర్గము

### సుగ్రీవుఁడు సింహనాదము సేయుట

శ్రీరాముఁడు మున్నుగువారందఱు వేగముగా వాలియేలెడి కిష్కింధాపురము సేరి, యచ్చట నొక చొఱరాని వనమునఁ జెట్ల మఱుఁగుననుండిరి. అరణ్యసంచారమునఁ బ్రేమగలిగి వెడల్పు మెడతోఁ

గూడిన యాసుగ్రీవుఁడు తనదృష్టిని నలుదెసలఁ బర్వఁజేసి యెక్కువ కోపమునొంది, పరిజనముతోఁగూడి, పెనుగాలి వీఁచఁగా నుఱుముచున్న గొప్ప మేఘమువలెనే నాకసము బ్రద్దలగునట్లు పెడబొబ్బపెట్టి యా వాలిని యుద్ధమునకుఁబిలిచెను. లేతసూర్యునివంటివాఁడును, గర్వించిన యేనుఁగువలెనడచువాఁడునునైన యాసుగ్రీవుఁడట్లు సింహనాదము నేసి, పనులందు నేర్పరియగు రామునిఁజూచి, "రామా! వానరులనెడి వలలతోఁబర్వఁజేయఁబడినదియు, పసిండితోరణములుగట్టినదియు, టెక్కెములతోను, యంత్రములతోను గూడినదియునైన వాలివీటికి వచ్చి చేరితిమి. శూరుఁడా! వాలివధమువిషయమున నీవే ప్రతిన మున్నొనరించితివిగదా! ఫలింపుసమయము వచ్చినప్పుడు అది లతను వేగిరమే పుష్పింపఁజేయునట్లు, నీ వీప్రతిజ్ఞను నెఱవేర్పుము" అని చెప్పెను.

సుగ్రీవుఁ డిట్లు పలుకఁగా, న్యాయశీలుఁడును, శత్రుసంహారియు నైన రాముఁడు సుగ్రీవునింగూర్చి యిట్లనియె: "సుగ్రీవా, లక్ష్మణుఁడు గుఱుతుపట్టునిమిత్తమై యొకగజపుష్పిలతను నీమెడయందు వేసియున్నాఁడు. దీనిచే నిన్ను గుఱుతుపట్టవీలగును. సుగ్రీవా! యీ మాలిక నీకంఠమున వైచుటచే, నీవు నక్షత్రములచేఁ జుట్టఁబడిన చంద్రునివలెఁ గడు వెలుఁగుచున్నావు. కావున నీవు సుగ్రీవుఁడవని నేను సులభముగా నెఱుఁగఁగలను. ఇక, యుద్ధమున నొకబాణమును ప్రయోగించి నీకు వాలివలన గలిగినవైరమును భయమును పోఁగొట్టెదను. సోదరరూపముననున్న శత్రువగువాలిని సుగ్రీవా, నాకుఁ జూపినదే తడవుగా అతఁడు నాచేఁ జచ్చి ధూళిని బ్రుంగఁగలఁడు. అతఁడు నాకంటఁ బడి యసువులతో బ్రతికిపోవునేని, యపుడు నాపై దోషము పెట్టి నన్ను నిందింపుము. నీకన్నుల యెదుటనే మద్దిచెట్ల నేడింటిని బాణముచే ద్రుంచితినిగదా! ఆ నాచేత వాలి నిపుడు చచ్చినవానిగాఁ దెలియుము. వీరుఁడా! నేనెంతయిక్కట్టున నున్నను, ధర్మలోపము గలుగు నన్న భీతిచే నింతకుమున్ను కల్లలాడినవాఁడనుగాను. ఇఁక మీఁద నెప్పటికిని నాడను. దేవేంద్రుఁడు వానగురిపించి, చేనియందు మొలచిన పైరును దనివి నొందించు చందమున, నేఁ జేసినప్రతిజ్ఞను బూర్తినేసి, నీకు సంతోషముఁ గలిగించెదను. నీ వీతత్తరపాటును వీడుము. సువర్ణమాలగల వాలి విన్నమాత్రముననే వెడలివచ్చు

నంతటి గొప్ప సింహనాదం బౌ వాలిగాకక్తై కావింపుము. ఆవాలి బలముచే వెలుఁగువాఁడు; తనబలిమిఁ దాఁ బొగడుకొనువాఁడు; నీకు లొంగనివాఁడు; యుద్ధమునఁ బ్రేమగలవాఁడునై నందున నీసింహనాదము విన్న మాత్రమునఁ దడవుసేయకవచ్చును. మొనకాండ్రు యుద్ధరంగమునఁ బగతురనేసెడి యవమానముల నోర్వరు. తమబలిమికొలఁది యొకేఁగిన వా రందుమ నాతియెదుటఁ బగతురతిరస్కారము నోర్తురే. కావున వాలి నీ పెడబొబ్బ విన్నమాత్రమునఁ గయ్యమునకు వెడలి వచ్చును" అని శ్రీరాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

బంగారువన్నెగలవాఁడగు సుగ్రీవుఁడు రాముని పలుకులు విని, యాకాశము పగిలిపోవుచందమునఁ బెడబొబ్బవెట్టెను. ఆసుగ్రీవుని గొప్ప యార్పునకు, రాజు న్యాయాన్యాయములఁ బరికింపమిచేఁ బరుల దౌర్జన్యముచేఁ గలఁతఁజెందిన కులస్త్రీలచందంబున గోవులు తత్తరపడి పరుగులిడెను. బవరమున గొట్టఁబడినతేజీలమాడ్కి మెకములెల్లఁ బఱు విడుచుండెను. పుణ్యక్షయముచే గ్రహములు పుడమినిబడునట్లు పక్షు లెల్లనాకసమునుండి క్రిందఁబడెను. ఇట్లు శౌర్యముచేఁ బెంపొందిన ప్రతాపముగలవాఁడును, మేఘమండలముమాడ్కి గర్జిల్లువాఁడును, బలశాలియని ప్రసిద్ధిఁగాంచినవాఁడును నైన యాసుగ్రీవుఁడు గాలిచేఁ గదలునలలుగల సముద్రుని చందమునఁ గడుత్వరగా బెడబొబ్బవెట్టెను.

## 15-వ సర్గము

### తార వాలిని యుద్ధప్రయత్నమునుండి నివారించుట

అంత శత్రుతిరస్కారము నోర్వనివాలి యంతఃపురమునఁ దారతోఁ గూడియుండునప్పుడు మహాత్ముఁడగు సుగ్రీవునిసింహనాదమును వినెను. సకలజంతువులకు భయంకరమైన యాసుగ్రీవుని నాదము విన్నంతమాత్రమున వాలికి పొంగు కుంగెను. పట్టరాని యాగ్రహమును బొడమెను. వాలి రోషముఁబూని, సంధ్యాకాలపుసూర్యునిం బోలె నెఱ్ఱనివెలుఁగుగలవాఁడై, రాహువుచే మ్రింగఁబడిన సూర్యుని మాడ్కి వెంటనే కాంతిహీనుఁడై, తనభయంకరములగు గొప్పకోఱలఁ జూపుచుఁ గోపము గదుర మండుచున్న నిప్పునుబోలినవాఁడై, యేనుఁగులు సొచ్చి కలియఁబెట్టి కమలములం బెఱికివేయఁగాఁ గాడలుమాత

ముగల మడుగునకై వడిఁ దేజరిల్లెను. అంత వాలి యోర్వఁజాలని యాసుగ్రీవుని నాదమును విని భూమి బ్రద్దలగునట్లు నడచుచు వేగముతో దుమికెను.

అప్పుడు తార యులికిపడి, తడఁబడి ప్రేమంబుమీఱ వాలినిఁ గౌఁగిలించి మేలును గలిగించుమాట నిట్లు పలికెను. తలిమమునుండి వేకువ లేచిననరుఁడు తా ననుభవించి వాడుపాఱియున్న పూవులదండను దీసివేయుచందమున నదీప్రవాహము మాడ్కి. వచ్చుచున్నయీకోపము నాఁపుకొనుము. వానరపుంగవా! రేపు తెల్లవాఱ నితనితోఁ బోరుదువు. శూరుఁడా! ఇందువలన నీశత్రువునకు గొప్పదనముగాని నీకుఁ జులకదనముగాని కలుగఁబోదు. నీవిప్పు డింత వేగిరముగా యుద్ధమునకు వెడలుట యుక్తంబుగా నాకుఁ దోఁపలేదు. నిన్నెందుకు నివారించెదనో యందుకుఁగారణముచెప్పెద నాలింపుము. తొల్లి సుగ్రీవుఁడు వచ్చి నీకెక్కువ కోపముకలిగించి, నీపరాక్రమమోర్వఁజాలక నీవు తఱుమఁగాఁ బరుగెత్తినవాఁడు. అట్టివాఁ డిప్పుడు నిన్ను లేపి, కయ్యమునకుఁ బిలుచుచున్నాఁడు. వాఁడు నీచేఁ జావదెబ్బలుతిని, తఱుమఁబడినవాఁడు. అట్టివాఁడిప్పుడు తానే మఱలివచ్చి యుద్ధమునకుఁ బిలుచుటఁజూడ నాకెక్కువసందియము గలుగుచున్నది. అసుగ్రీవుని యార్పుట వినునప్పు డతనిగర్వమును, ప్రయత్నమును, ధ్వనియు, ఆడంబరమును జూడఁగా, దానికేదియో గొప్ప కారణముండవలయు నని తోఁచెడి. ఇతఁడెవనినో తోడుచేసికొనివచ్చియున్నాఁడు కాని, వేఱుగాదని తలఁచెదను. బాసటగలవాఁడు గనుకనే యితఁడిట్లు గర్జనముచేయుచున్నాఁడు. వాలీ! సుగ్రీవునికి సహాయుఁడయి వచ్చినవాడు సామాన్యుఁడుగాఁడని తలంపుము. సుగ్రీవుండు స్వాభావికముగా నిపుణుఁడు బుద్ధిమంతుఁడును గనుక, నీపరాక్రమము హెచ్చైనదో, లేక తనన్నేహితునిపరాక్రమము హెచ్చైనదో పరీక్షించిచూచి, యాతనివీర్యము నీవీర్యమున కంటె గొప్పదని యెఱిఁగియె, యట్టివానిని దోడ్కొనివచ్చియున్నాఁడు. వీరుఁడా! మునుపు కుమారుఁడగు నంగదుఁడు చెప్పినహితవాక్యమును నీకు వినిపించెద నాలింపుము. మన కుమారుఁ డంగదుఁడు వనప్రాంతమునకుఁ బోయియుండివచ్చెను. అతఁడాప్తులగు వేగులు దెలిపినవృత్తాంతమును నాకుఁదెలిపెను. అదేదియన,

ఇక్ష్వాకువంశసంభవులును, సంగరమున నేరికిని గెల్వ నలవికాని వారును, పరాక్రమశాలురని వాసికెక్కినవారును, అయోధ్యాపురీశుఁడగు దశరథునికిఁ బుత్రులును, శత్రువులకు లొంగనివారును, శూరులునునైన రామలక్ష్మణు లను రాజపుత్రులు సుగ్రీవునికి మేలుసేయుటకై ఋశ్యమూక పర్వతమునకు వచ్చియున్నారఁట. నీ తమ్మునికి సహాయుఁడయిన రాముఁడు ప్రసిద్ధుఁడు; బవరమునఁ గ్రూరుఁడు; శత్రుసేనలం బరిమార్చువాఁడు; ప్రళయకాలాగ్నింబోలెఁ బ్రజ్వరిల్లువాఁడు; మఱియు నాతఁడు సాధువుల కాశ్రయ వృక్షమైనవాఁడు; ఆపదనొందినవారికి గొప్ప యాదరువైనవాఁడు; నొచ్చినవారికిఁ బ్రాపు; కీర్తికిఁ బ్రధాన పాత్రమైనవాఁడు; లౌకికవైదికజ్ఞానములుగల వాఁడు; తండ్రిమాట మీఱనివాఁడు. గైరికాదులగు ధాతువులకెల్ల పర్వత మునికిపట్టయిన యట్లు సుగుణములకెల్లఁ బెన్నిధియైనవాఁడు. కావున శత్రువులకు జయింపనలవికానివాఁడును, యుద్ధమున నింతటివాఁడని తెలిసికొన వీలుగానివాఁడును, మహాత్ముఁడునునైన రామునితోడి వైరము నీకుఁ దగదు. ఓ శూరుఁడా! నీ కొకటి చెప్పెదను. నీపైఁ దోషముఁ జెప్పను. నీ కితవగుమాట చెప్పెదను. దానిని విని యాప్రకారముగాఁ జేయుము. నీవు తడవుసేయక సుగ్రీవునికి యువరాజపట్టాభిషేకము సేయుము. బలవంతుఁడగుతమ్మునితో విరోధింపకుము. నీవు సుగ్రీవునితోడి వైరము దవ్వుననే విడిచి, యాతనితోను రామునితోను జెలిమిచేసికొనుము. అది యుక్తమని తలఁచెదను. ఈసుగ్రీవుఁడు నీకుఁజిన్నవాఁడు. వీఁడచ్చట నున్నను, ఇచ్చటనున్నను నీకుబంధువు. లోకమున వానితో సాటియగు బందుగుఁ డెవ్వఁడును లేఁడని నేఁ దలఁచెదను. కావున నితనిని దగ్గఱకుఁదీసి, కోరినదియిచ్చి, గౌరవించి నీకు బాసటయైయుండునట్లు చేసికొనుము. ఆసుగ్రీవుఁడును ఈ వైరము మాని, నీచేరువ నుండుఁగాక. పొడుగు మెడగల యాసుగ్రీవుఁడే నీకు శాశ్వతబంధువుగా నున్నవాఁడు. కావున, తమ్మునితోఁ జెలిమిచేసికొనుము. ఇప్పుడు దీనికంటె వేఱొండుపాయము లేదు. నీవు నాకు మేలొనర్పఁగోరుదువేని, నేను నీకు మేలుబోధించుదానవని యెఱుఁగుదువేని, నాప్రార్థనము నియ్యకొని నామాటప్రకారము నడచుకొనుము. నాథా! శాంతింపుము. నాహిత వాక్యము నాలింపుము. ఆగ్రహము పూనకుము. దేవేంద్రునితో

సమానుఁడగు రామునితోడి వైరము నీకెప్పటికిని యుక్తముగాదు. అని యప్పుడవ్విధమున తార వాలికి హితమును, పథ్యమును నైన మాటయే చెప్పెను. అయినను వాలికి మృత్యుకాలము సమీపించి, మృత్యుదేవత యతనిని ప్రేరణచేయుచున్నందున, తార చెప్పినయిత వగు మాట లాతనికి రుచింపవయ్యెను.

## 16-వ సర్గము

### రాముఁడు వాలిని బడవేయుట

ఇవ్విధమునఁ జంద్రునిఁబోలు మోముగలతార పలుకఁగా, వాలి యా తారపలుకులు తిరస్కరించి యామెతో నిట్లనియె. ఓ చక్కని మోముగలదానా! నా తమ్ముఁడును, మీఁదుమిక్కిలి శత్రువునైన యీ సుగ్రీవుఁడు యుద్ధమునకై గర్జనసేయుచుండఁగా, నితనియాటోపము నే నేకారణమున సైరింతును? ఓ పిఱికిదానా! శత్రువులచేఁ దిరస్కార మొందనివారును, యుద్ధమునందుఁ బగతురకు వెఱచి మఱలనివారును నైన శూరులు తమశత్రువుల తిరస్కారము నోర్చుట మరణప్రాయ ముగా నెంతురు. గొంతులేనిసుగ్రీవుఁడే నాతోఁ గయ్యముసేయఁగోరి యొప్పుచు నార్భాటముసేయుచుండ, నే నాయార్భాటము నెట్టు లోర్చి యుందును ? ఓసీ ప్రియురాలా ! రాముఁడు నన్నేమైనఁ జేయునేమో యని యారామునిఁగూర్చి విచారపడకుము. ఆతఁడు న్యాయము నెఱిఁ గినవాఁడు; నెనరుగలవాఁడు. అట్టి యతఁడు నిర్దోషినైన నావిషయ మున నేల పాపముసేయఁగలఁడు? తారా! నీవు చెలులతోడ నంతిపురము లోనికి మఱలుము. ఎందుకు మఱల నన్ను వెంబడించుచున్నావు? నీవు ప్రియురాలవైనందున నాయెడ నెక్కుడు ప్రేమమును భక్తిని జూపితివి. నే నాసుగ్రీవుని నెదుర్కొనెదను. నీ తత్తరపాటు వీడుము. ఆసుగ్రీవుని యహంకారము నణఁతునే కాని, ప్రాణములఁదీయను. నే నీసుగ్రీవుని ప్రాణములఁ దీయక, యతనినిఁ జెట్లతో మోదియు, పిడికిళ్లతో గుద్దియు నన్ని తెఱఁగుల బాధించెదను. ఆసుగ్రీవుఁడు నా దెబ్బల కోర్వఁజాలక పరుగిడఁగలఁడు. ఓ తారా! నీవు విన్నసంగతిఁ జెప్పి, చాల సాయమొనరించితివి. నాయెడఁగల ప్రేమను జూపితివి. ఆదురా త్ముఁడగు సుగ్రీవుఁడు నేను ప్రయత్నముతోఁ జూచిన నాబలిమి నోర్వఁ

జాలఁడు. నీవిఁక నా వెంబడి వత్తువేని నన్నుఁ జంపినట్లొట్టుపెట్టెదను. నీవు మఱలిపొమ్ము. నే నా సుగ్రీవుని సంగరమున గెల్చి, జయము వడసి వచ్చెదను, అని వాలి తారతోఁ జెప్పెను.

ప్రియములాడునట్టిదియు, దాక్షిణ్యముకలదియునైన తార యా వాలిని గౌఁగిలించుకొని, యశుభ భయమున మెల్లగా నేడ్చుచుఁ దనమగనికిఁ బ్రదక్షిణము గావించి, తనపెనిమిటికి గెల్పుగోరుచుండునది గావున మంత్రపూర్వకముగా మంగళమును జెప్పి, దుఃఖముచే మైమఱచి, చెలులతోడ నంతఃపురప్రవేశము సేసెను. అంత వాలియుఁ బెనుఁబాముమాడ్కి నిట్టూర్పువిడుచుచుఁ గోపముతోఁగూడినవాఁడై పట్టణమునుండి వెడలెను. ఎక్కువ వెలుఁగుగలవాఁడును, ఎక్కువ కోపము గలవాఁడునైన వాలి నిట్టూర్పు నిగిడించి, పగతునిఁజూచుతమితో నంతటఁ దనదృష్టిని నిగిడించి పసిడివన్నెగలవాఁడును, నడుమునకుఁ బట్ట గట్టి, యుద్ధమున కాయితుఁడై యగ్నిహోత్రుని చందమునఁ దేజరిల్లుచున్నవాఁడునైన సుగ్రీవునిఁజూచెను. అంతటఁ గడురోషము గలవాఁడైన వాలియు సుగ్రీవుఁడు తనబలిమిమీఱ నిలఁబడియుండుటఁ జూచి, తానును నడుమునకు దట్టి గట్టిగా బిగియఁగట్టెను. శూరుఁడయిన వాలి యట్లు దట్టిగట్టికొని పిడికిలిపట్టి, యుద్ధమునం దెక్కువ మోహముగల వాఁడై యా సుగ్రీవు నెదుర్కొనిపోయెను. సుగ్రీవుఁడును కాంచనమాలచే నొప్పుచున్న వాలినిఁగూర్చి గట్టిపిడికిలిపట్టి పైకెత్తుకొనివచ్చెను. వాలియుఁ గోపముచేఁ గన్నులెఱ్ఱఁగఁజేసి, కడువేగముతోఁ దనమీఁదికిఁ గవియుచున్న యుద్ధకుశలుఁడగు సుగ్రీవునిఁ జూచి యిట్లనియె.

ఓరీ! యిదిగో చక్కఁగాఁ బ్రేళ్లగదియఁజేర్చి గట్టిపిడికిలి పట్టితిని. నేను వేగముతో నొకగ్రుద్దుగ్రుద్దుదునేని, యాగ్రుద్దుతోడనే ప్రాణములు వీడఁగలవు" అనివాలి చెప్పఁగా సుగ్రీవుఁడును గడునలిగి, వాలింజూచి, "ఓరీ! నాపిడికిలియె నీనెత్తినిబడి నీప్రాణములను దీయును గాక" అని చెప్పెను. అంత వాలి కోపముతోఁ బిడికిటఁబొడువఁగా, సుగ్రీవుఁడును గడునలిగి, వేగిరముగ నవ్వాలిపైకి దుముకుచు నెత్తురు గ్రక్కుచు, సెలయేళ్లతోఁగూడిన పర్వతముమాడ్కిఁ బ్రకాశించెను. అంత సుగ్రీవుఁడు దన ప్రతాపముచే నొకచెట్టును వేళ్లతోడఁబెఱికి వజ్రాయుధముతోఁ బర్వతమును గొట్టినట్టు లాచెట్టుతో వాలి నన్ని

యంగములకును దగులునట్లు మోదెను. వాలియు నాచెట్టుయొక్క వ్రేటునకు మిక్కిలినొచ్చి, సముద్రమునందలి యెక్కువ బరువుతోఁ గూడిన వర్తకుల యోడకైవడిఁ గడుఁజలన మొందెను. భయంకరమయిన బలపరాక్రమములు గలవారును, గరుత్మంతునిఁ బురుడించు వడిగలవారును, ఒడళ్లు పెరిగి భయంకరరూపముతోనున్నవారును నైన వాలిసుగ్రీవు లాకాశమున వెలుఁగుసూర్యచంద్రులం బోలినవారలై, యొండొరులఁ దాఁకుచు అవకాశమునకై వేచియున్నవారునునగుచు సమరము చేసిరి. అప్పుడు వాలి బలపరాక్రమముగలవాఁడై పెంపొందుచుండెను. సూర్యుని పుత్రుఁడగు సుగ్రీవుఁ డెక్కువశౌర్యంబు గలవాఁడయినను వాలితోఁ బోరలేక తగ్గుచువచ్చెను. అట్లు సుగ్రీవుఁడు వాలితోఁబోరి గర్వమెల్లఁ బోఁగొట్టుకొన్నను, ప్రతాపహీనుఁడయినను, రోషము దగ్గకున్నందున వాలితోఁ దన హస్తలాఘవము చూపుచు యుద్ధము చేసెను. ఆవాలిసుగ్రీవులు కొమ్మలతోను, కొనలతోఁగూడిన చెట్లతోను గొట్టుకొనియు, వజ్రాయుధంపుటంచులంబోలు గోళ్ళతో రక్కియు పిడికిళ్ళతో గ్రుద్దియు, మోఁకాళ్ళతోఁబొడిచియు, పాదములతోఁ ద్రొక్కియు, చేతులతో మాటిమాటికిఁజఱచియు, వృత్రాసురదేవేంద్రులపగిది ఘోరయుద్ధముఁజేసిరి. ఆవనచారులగు వాలిసుగ్రీవులు రక్తమునఁ దోఁగి యొండొరులను మేఘములకైవడిఁగప్పుచు సంగర విహారము సల్పిరి.

అప్పుడు సుగ్రీవుఁడు డస్సి, వాలితోఁబోరలేకను క్రిందఁమీఁదను దెసలను మాటిమాటికిఁ జూచుచుండుటను రాముఁడు చూచెను. అంతఁ గడుతీవ్రమగు తేజస్సుగల రాముఁడు సుగ్రీవుఁడు నొచ్చియుండుటను గని వాలివధమునకై, బాణముపై దృష్టిఁ బోనిచ్చి, సర్పసదృశమైన యా బాణమునుగొని వింట సంధించి, యముఁడు కాలచక్రమును బోలె నాధనుస్సును వంచి చెవివఱకు నీడ్చి నారి మీఁటెను. ఆధనుష్టంకారమునకు నావనమున నుండు గొప్పపక్షులును, మృగములును బ్రలయకాలంబునందుఁ బోలెఁ గడు భీతినొంది దిక్కులుదోఁచక నలు దెసలకుఁ బరుగులిడెను. అట్లు రాముఁ డాకర్ణాంత మీడ్చి యేసిన బాణము వజ్రముంబోలునాదముగలదై పిడుగువలెమండుచుఁ బోయి యావాలి ఱొమ్మునఁ బడెను. నరశ్రేష్ఠుఁడగు రాముఁడు ప్రళయకాల

మృత్యువుంబోలినదియు, స్వర్ణరజతభూషణాలంకృతమైనదియు, శత్రు హింసచేయునదియునై వెలుఁగుచున్న బాణమును హరుఁడు పొగతోడఁ గూడిన యగ్నిని దనమోమునుండి వెడలించునట్లు వాలిపై నేయఁగా, నెక్కువ వీర్యంబుగలవాఁడును, బలగర్వితుఁడునైన వానరేశ్వరుఁడగు వాలి రామునియమ్ము ఱొమ్మునఁ దాఁకుటచేఁ గాంతిహీనుఁడై, మయి మఱచి, నేలమీఁదఁబడి నెత్తుటి వెల్లువయందుఁ బడినవాఁడై స్మృతిఁ దప్పి, యాశ్వయుజమాసమునఁ బున్నమనాఁ డుత్సవమైన పదంపడిఁ గ్రిందఁద్రోయఁబడిన యింద్రాయుధమువలెను, గాలికిఁగూలిన చక్కఁగాఁ బుష్పించిన యశోకవృక్షము కైవడియు విరాజిల్లుచుండెను.

## 17-వ సర్గము

### వాలి రాముని దూరుట

రాముఁడు కడువాఁడిబాణము నేయఁగా, రణరంగమున శూరుఁడును, స్వర్ణభూషణములు దాల్చినవాఁడునైన వాలి మొదలునఱికిన చెట్టువలెను, పగ్గములు తెగిన దేవేంద్రునిధ్వజముకైవడిని దనయంగములెల్ల నేలనానునట్లు కూలఁబడెను. వానరగణాధిపుఁడగు వాలి పుడమినిఁ గూలినప్పుడు, భూమండలము చంద్రుఁడు లేని యాకసముకైవడిఁ గాంతివిహీనమాయెను. ఆ మహాసమర్థుఁడగువాలి క్రిందఁబడినను, అతనిదేహమునుండి కాంతి, ప్రాణములు, తేజస్సు, బలమును తొలఁగవయ్యె. దేవేంద్రుఁడొసఁగిన వజ్రమణిమయమగు శ్రేష్ఠమైన సువర్ణహారము వాలి ప్రాణములను, తేజః కాంతులను నాపి పట్టికొనియుండెను. కాంచనమాల దాల్చిన యా వానరాధిపుఁడగువాలి సంజెప్రొద్దుటి యెఱుపుగ్రమ్మియుండు మేఘముచందమునఁ బ్రకాశించెను. ఆ వాలి క్రిందఁబడినను, ఆతఁడు కంఠమునఁదాల్చిన మాలయు, దేహమును, ఆయపట్టున నాఁటియున్న యారాముని బాణమునను మూఁడు భాగములుగ విభజింపఁబడిన ట్లాతనితేజస్సు వెలుఁగుచుండెను. ఆరాముఁడు తన వింటినుండి ప్రయోగించినబాణము తఱుచుగా స్వర్గమునకే మార్గముఁజూపునది కావున శూరుఁడయినవాలికిని నుత్తమగతిని గలుగఁజేయఁ గలిగెను. అప్పుడు రాముఁడు లక్ష్మణసమేతుఁడై సంగరమునఁగూలి, మంటలు చల్లాఱిన యగ్నిహోత్రునికైవడి నున్నవాఁ

డును, తన్నుఁ బడనేసిన వీరుఁడెవఁడో యని గారవముతో మెల్లగాఁ జూచువాఁడును, పుణ్యక్షయమున స్వర్గమునుండి క్రిందఁబడిన యయాతి వలెను, ప్రలయకాలమునఁ గాలునిచేఁ బుడమిని ద్రోయఁబడిన సూర్యుని వలెను కాంతిపోలఁగియున్న వాఁడును, వేల్పు జేనికై వడిఁ బగతురకు గెల్వ నలవికానివాఁడును, బగతురకోర్వఁజాలనివాఁడును, సింహమువలె వెడదఱొమ్ముగలిగినవాఁడును, నిడుద చేతులవాఁడును, ప్రకాశించు మోమును, పచ్చనికన్నులును గలవాఁడును, దేవేంద్రుఁడొసఁగిన బంగారుదండచే నొప్పినవాఁడునైన మహేంద్రనందనుఁడగు వాలినిఁ జూచి, దగ్గఱకుఁబోయెను.

ఆవాలియు బలిమిగలవారగు రామలక్ష్మణులఁ జూచి, రామునిఁ గూర్చి పరుసదనము దోఁప, వినయమ్ముమీఱ, న్యాయానుసారముగా నిట్లనియె: "రామా! నీవు రాజపుత్త్రుఁడవు; శూరుఁడవని ప్రసిద్ధిగాంచిన వాఁడవు; మాపటికింపుగొలుపువాఁడవు; సత్కులీనుఁడవు; సత్త్వగుణము గలవాఁడవు; వెలుఁగుగలవాఁడవు; పితృవాక్యపరిపాలనము మొదలగు గొప్పవ్రతము లాచరించువాఁడవు. ఇట్టి గుణవిశిష్టుఁడవయిన నీవు యుద్ధరంగమున మఱొక్కనితోఁ బోరుచున్న నన్ను బాణముతో ఱొమ్మునఁ గొట్టితివి. ఇట్లొకనివైపునకుఁ దిరిగియున్న నన్ను ఱొమ్మునఁ గొట్టి యేమిఫలము సంపాదించితివి? 'రాముఁడు దయాళువు; జనులకు మేలుసేయుటం దాసక్తిగలవాఁడు; నొచ్చినవారియెడ జాలిఁగనబఱచు వాఁడు; ఆశలను గెల్చినవాఁడు; సదాచారము నెఱింగినవాఁడు, నియమము దప్పనివాఁడు" నని భూలోకమున జనులందఱు నీకీర్తిని బొగడుచుందురు. దమము, శమము, క్షమ, ధర్మము, ధృతి సత్యము, పరాక్రమము, అపరాధులను శిక్షించుట యనునవి రాజులగుణములు. ఆగుణములెల్ల నీయందుండుననియు, నీవు సద్వంశమునఁ బుట్టినవాఁడవనియు నమ్మి, "తార, నీవు యుద్ధమునకుఁ బోవల"దని నన్ను నివారించుచున్నను, ఆమాటలను సరకుసేయక సుగ్రీవునిఁ దలపడితిని. నేను నిన్నుఁజూడక మఱొక్కనితోఁ బోరాటము సేయుచు నేమాఱు పాటుతో నుండఁగా, నీవు బాణముతోఁ గొట్టవని నేఁ దలఁచియుంటిని. నీవు చెడుబుద్ధిగలవాఁడవనియు, ధర్మరతుఁడను వేషముదాల్చినవాఁడవనియు, అధర్మపరుఁడవనియుఁ బాపంపునడతగలవాఁడవనియు

నే దెలియనైతిని. బాగుగా నెదిగినగడ్డితో నొకబావి గప్పఁబడి యున్నప్పుడు జను లది బావియని తెలియక దానిమీఁద నడచుచుఁ బోయి, యాబావిలోఁబడినట్లు, నీవును ధర్మజ్ఞతాదిగుణములు గల వాఁడవని యెంచి నే నీగతినొందితిని. నివురుగప్పిన యగ్నిహోత్రుని కైవడి, సత్పురుషవేషధారివగు పాపుఁడవైన నీవు కపటధర్మ వేషధారి వని నే నెఱుంగ నైతిని.

ఓ రామా! నేను నీదేశమున కేదియైనఁ గీడొనర్చితినా? లేక నీపట్టణమున నేదియైనఁ దప్పుచేసితినా? లేక నిన్నేమైన నవమానించి తినా? నీవు నిరపరాధుఁడనైన నన్నేల చంపితివి? ఎల్లప్పు డడవిలోని దుంపలను, పండ్లను దిని, యడవియందుఁ గ్రుమ్మరుచుండువాఁడను. అదియుఁగాక, నేను నీతో నిప్పుడు యుద్ధమునకుఁ బూనక మఱి యొక్కనితో యుద్ధముసేయుచు నాతనియందే దృష్టియుంచియుంటిని. అట్టి సమయమున నీవు నాపై బాణము వేసితివే యది నీకు న్యాయమా? ఓ రాజా! నీవుధర్మము నడపువాఁడవని కపటవేషము దాల్చియున్నట్లు కనబడుచున్నది. క్షత్రియకులమునఁబుట్టి, శాస్త్రములెల్లఁజదివి, ధర్మ సందేహముల నెల్ల నెఱిఁగినవాఁ డెవ్వఁడు బూటకపుధార్మిక వేషము పూని యిట్టి క్రూరకర్మమును జేయును? రామా! రాజకులమున జన్మించి, ధర్మము తప్పనివాఁడవని ప్రఖ్యాతిగంటివి. నీవు సాధువవు గాకపోయినను, సాధువవను వేషముతో నెందుకుఁ దిరుగుచున్నావు? ఱేఁడా! నెమ్మది, ఓర్పు, శాంతము, మంచినడవడి, నిజముపల్కుట, సంతోషము, పరాక్రమము, తప్పుచేసినవారిని దండించుట యనునివి రాజగుణములు. రామా! మేము ఫలములు, దుంపలుందినుచు నడవు లందుఁ గ్రిమ్మరుచుండువారము. ఇది మా స్వభావము. నీవు మనుజుఁ డవు. మానవులకు ఱేఁడవు. మానవేశ్వరుఁడవయిన నీకు వానరుల మైన మాతో నేమి పనియున్నది? లోకమున వెండి, బంగారు, భూమి యనునవి కలహమునకుఁ గారణములు. అట్టివి యేవియు నీకును మాకును సంబంధించినవి లేవు. నేనుండెడి యీ వనంబువలనఁగాని, మేము దినెడి పండ్లవలనఁగాని నీ కేవివాంఛగలదు? నీతియు, దండ నమును, తిరస్కారమును, అనుగ్రహించుటయు, వీనిలోపల నెయ్యది

యెప్పుడెచ్చట నుపయోగింపవలయునో, అది యెఱిఁగి రాజులు ప్రయోగించుచుందురుగాని, స్వేచ్ఛమెయి వర్తింపరు.

నీ వన్ననో స్వేచ్ఛయే ప్రధానముగాఁ గలవాఁడవు; కోప స్వభావుఁడవు; నిలుకడలేనివాఁడవు. రాజధర్మములఁ దప్పినవాఁడవు; ధనుః ప్రయోగమునందే శ్రద్ధగలవాఁడవు.నీకుధర్మమున గౌరవము లేదు. అర్థసంపాదనమునందు నిలుకడలేనివాఁడవు. నీ విచ్ఛ చొప్పున నడచుచు నింద్రియము లే తెరువున కీడ్చుచున్నవో అల్లెల్లఁ బోవువాఁడవు. ఓ నరాధిపా! తప్పులేనినన్ను వధించి, యొక నింద్యమైన కార్యము చేసి, దీని నేల చేసితివని పెద్దలడిగిరేని, నీవు వారినడుమ నిలఁబడి యేమి బదులుసెప్పుదువు? రాజును వధించినవాఁడు, బ్రహ్మహత్య చేసినవాఁడు, గోవధకర్త, చోరుఁడు, ప్రాణివధంబున నిరతుఁడు, నాస్తికుఁడు, అన్నకంటె ముందుగాఁ బెండ్లాడినవాఁడు వీరందఱు నర కమును బొందుదురు. కొండెములుచెప్పువాఁడు, లోభి, విశ్వాస ఘాతుకుఁడు, గురుభార్యను బొందువాఁడు వీరు పాపలోకముల నొందుదురు. దీనికి సందియము లేదు. ఓ రామా! మృగయావిహారము నిమిత్తము నిన్ను వధించితినందువేమో? వానరచర్మము ధర్మపరులగు నీబోటిసత్పురుషులు ధరింపరు. రోమములును, నెముకలను బనికి రానివి. మాంసము భక్షింపఁదగినదికాదు. ఏదుపందులు, అడవి పందులు, ఉడుము, కుందేలు, తాఁబేలునను నైదుగోళ్ళుగల మృగ ములు భక్ష్యములుగాని, తక్కిన నైదుగోళ్ళుగల మృగములు భక్ష్య ములు గావు. రాజా! విద్వాంసులు పంచనఖుఁడనైన నా చర్మమును, నా యెముకలను దాఁకరు. నా మాంసమును దినరు. అట్టి యభక్ష ణీయుఁడను, అస్పృశ్యుఁడనునైన నన్నేల వ్యర్థముగా సంహరించితివి. తార యీ సంగతియెల్ల నెఱిఁగినది; నా మేలుగోరి, "నీవిప్పుడు పోవలదు" అని యథార్థమును, హితమునునైన మాటనుజెప్పెను. నేను గాలపాశమునకు లోఁబడినవాఁడనై, యా తార చెప్పిన హితసత్య వాక్యముల వినక వచ్చి, యిట్లు మృత్యువుపాలయితిని. కాకుత్స్థా! సచ్ఛీలముగల పతివ్రతయగు మగువ దుష్టుఁడయిన మగనిచేఁ బాలింపఁ బడనియట్లు, అధార్మికుండవయిన నీవేలికగానుండఁగాఁ బుడమి న్యాయ పరిపాలితమైన దగునే?

లోలోపల నితరులకుఁ గీడొనరించువాఁడవు, వంచనాస్వరూపుఁడవు, అల్పుఁడవు, శాంతస్వభావుఁడవుబోలె నటించువాఁడవు, పాపచింతగలవాఁడవునైన నీ వెట్లు మహాత్ముఁడయిన దశరథునకుఁబుట్టితివి? గొప్ప నడవడి యను కట్టుత్రాళ్ళను ద్రెంచుకొన్నదియు, పెద్దలధర్మము లనెడు మార్గమును మీఱిపోవునదియు, ధర్మమను నంకుశమునకు లోఁబడనిదియునైన రాముఁ డను నేనుఁగు నన్నుఁ జంపెను. అమంగళమును, అయుక్తమును, పెద్దలచే నిందింపఁబడినదియు నైన యిట్టి కార్యమొనర్చితివే? నీవు పదుగురు పెద్దలలోపలికిఁ బోయినప్పుడు వారి కేమి చెప్పెదవు? ఓ రాజా! జాలిమాలిన మాపై నీ వెంతటి విక్రమముచూపితివో, అంతటి విక్రమము నీ కపకారమొనర్చినవారియెడఁ జూపఁజాలకుందువని తలఁచెదను. ఓ నృపకుమారా! నీవు కనఁబడుచు యుద్ధముఁ జేసియుందువేని, యిప్పటికి 'నాచే నీల్గి యమునిఁ జూచి యుందువు. మద్యపానమునేసి, నిద్రించుచున్న నరునిఁ బాముగఱచిన చందమున, నీవు గంటికిఁ గానరాక మఱుగుననుండి సమరమున శత్రువులకు సాధింపరాని నన్నుఁ జంపితివి. ఓ రామా! సుగ్రీవునిసాహాయ్యముంగోరి యీపనిచేసితినందువేమో? నీ వీసంగతి నాకు ముందుగాఁ దెలిపియుందువేని, నే నొకపూటలోపల సీతను దెచ్చి నీకిచ్చియుందునే. సుగ్రీవునియిష్టముఁజేసి కార్యము సాధింపఁగోరి యింతపని చేసితివి గదా. ఆ మాట నాతోఁజెప్పియున్న నా రావణునిఁ జంపి నా మెడకుఁ గట్టికొని యీడ్చి తెచ్చియిచ్చియుందును. నీవే సీతను దెచ్చియిమ్మని యానతియొసంగియుందువేని, తొల్లి మధుకైటభు లనెడి రాక్షసులు దొంగిలించి పాతాళమున దాఁచిన శ్వేతవర్ణముగల గర్దభిరూపిణియైన శ్రుతిని హయగ్రీవుఁడగు విష్ణువు సాధించినట్లు, ఆ సీత పాతాళమునను, లేక సముద్రజలమునను నా రావణునిచే దాఁపఁబడియున్నను, ఆమెను దెచ్చియుందునే. నేను స్వర్గతుఁడయినపిదప సుగ్రీవుఁడు రాజ్యము వడయుట యనునది న్యాయ్యము. నీ వన్యాయముగా నన్నుఁజంపి, యీ సుగ్రీవునికి రాజ్యమొసఁగుట యనునది న్యాయ్యము గాదు. లోకమునఁ బుట్టినవాఁడు తీరున మృతినొందుట వాస్తవమే. నేనెట్టులో మృతినొందుదును. నీ విప్పు డొనర్చినపని నీకు యుక్తముగాఁ దోఁచునేని నామాటలకు సమాధానము నాలోచించి

చెప్పుము" అని బలశాలియగు దేవేంద్రతనయుఁడయినవాలి చెప్పి, బాణము దెబ్బకు నొచ్చి, మోమునఁ గళలేనివాఁడై సూర్యునిఁబోలె వెలుఁగుచున్న రామునిఁజూచుచు నూఱకుండెను.

## 18-వ సర్గము

—రాముఁడు వాలివాక్యములకు బదులు సెప్పుట—

ఇవ్విధమున బాణముచేఁ గొట్టఁబడి, తెలివిదప్పియున్న యా వాలి రామునింగూర్చి వినయయుతమును, ధర్మార్థములతోఁ గూడినదియు, కఠినమైనదియునైన మాటఁజెప్పెను. అప్పుడు రాముఁడు వాలిచేఁ దూలనాడఁబడి, వెలుఁగులేని సూర్యునికైవడియు, నీరెల్లఁగురిసి వెలసిన మేఘముచందమునను, చల్లాఱిన యగ్నిహోత్రునిభంగియుఁ గళ దప్పి యున్నవాఁడును, ధర్మార్థములతోఁ గూడినవాఁడును, వానర శ్రేష్ఠుఁడును, వానరసేనలకెల్ల నధిపుఁడునైన వాలింగూర్చి యీ క్రింది తెఱఁగున బదులు సెప్పఁదొడఁగెను:

వాలీ! నీవు మూఢుఁడవై, ధర్మార్థకామముల నిజస్వరూపమును, లోకనడవడిని నెఱుఁగక యిప్పుడు నన్నేల యిట్లు దూఱుచున్నావు? ఓరి నాయనా! వాలీ! నీ నడతలెల్ల మంచివో చెడ్డవో నేర్పరులైన వారిని, పెద్దలను, పూజ్యులైన గురువులనడిగి తెలిసికొనక, వానరసహజమయిన చాపల్యమువలన నన్నేల యూరక నిందింపఁ గోరుచున్నావు! ఈ పుడమియు, ఈ పుడమియందలి పర్వతములు, వనములును ఇక్ష్వాకు వంశమువారివి. కావున నీపుడమియందుండు, పర్వతవనములందు నుండు మృగములేమి, పక్షులేమి, మానవులేమి యంతయు వారి యుత్తరువునకు లోఁబడి నడువవలయును. వారి దేశములందున్న సకలప్రాణులను వారనుగ్రహింపను గలరు; నిగ్రహింపను గలరు. అట్టి యీ భూమండలమును ధర్మమునడుపువాఁడును, నిజముతప్పనివాఁడును, కపటములేనివాఁడును, ధర్మ, అర్థ, కామములనిజస్వరూపము నెఱిఁగినవాఁడును, చెడ్డవారిని దండించుటకును, మంచివారిని గనికరించుటకును బూనినవాఁడును నగు భరతుఁడు పాలనచేయుచున్నాఁడు. నయవినయములును, సత్యవాక్యపరిపాలనమును, పరాక్రమమునుగలిగి, దేశకాలస్వరూపము నెఱిఁగినవాఁడయిన భరతుఁడీ

పుడమి కేలికయైయున్నాఁడు. మేమును, తక్కినరాజులును ఆ భరతుఁడు న్యాయయుక్తముగాఁజేసిన యాజ్ఞలనుగొని, ధర్మవృద్ధినిగోరుచు నీపుడమి యెల్ల సంచరించుచున్నాము. రాజశ్రేష్ఠుఁడయి, ధర్మమునఁ బ్రేమగల భరతుఁడు పుడమి యేలుచుండఁగా నెవఁడు ధర్మలోపమును గలిగించును? అట్లిశ్రేష్ఠమైన ధర్మమునకు హానిగలిగించునేని, స్వధర్మమునుండి చలింపనివారమైన మేము భరతునియాజ్ఞను ముందిడుకొని, యట్టి ధర్మహాని గలిగించువారలనెల్ల న్యాయముదప్పక శిక్షించుచున్నారము. నీ వన్ననో ధర్మమును జెఱిపినవాఁడవు; లోకులు దూరునట్టిపని చేయువాఁడవు. కామతంత్రములం దవిలి రాజమార్గమునుదప్పి నడచుచున్నాఁడవు. అన్నయుఁ దండ్రియు, విద్యాదానముచేసినవాఁడును, వీరు ముగ్గురును ధర్మమార్గమున నడచువానికిఁ దండ్రులని చెప్పఁబడుదురు. న్యాయమార్గముచొప్పున నడవవలయునని తలంపుండునేని, తమ్ముని, గుణవంతుండగు శిష్యునిఁ దనకొడుకుంబోలెనే చూచుకొనవలెనని పెద్దలు చెప్పుదురు. వానరా! ధర్మము సూక్ష్మమైనది; పెద్దలకుఁగూడ మిక్కిలి తెలియరానిది. సర్వభూతములమనస్సుల నుండునట్టి పరబ్రహ్మస్వరూపుఁడు ధర్మాధర్మములకుఁ గారణములైన మంచి చెడ్డల నెఱుఁగును. పుట్టుగుడ్డివాఁడు పుట్టుగుడ్డులతోఁజేరి యాలోచించు తెఱఁగున గురుశిక్ష నొందనివారును, చపలులునైన వానరులతోఁ జపలుఁడవైన నీవు మంతనము చేయుచున్నాఁడవు. ఇఁక నీ కెట్లు ధర్మస్వరూపము దెలియనగును? నే నీ మాటను నిరూపించిచెప్పెదను. నీ వాగ్రహముచే నోడలుమఱచి నన్నూరక నిందింపకుము.

ఓ వానరేంద్రుఁడా! నేను నిన్నెందుకు సంహరించితినో వానికి కారణమిదె చెప్పెదను వినుము. నీవు శాశ్వతమైన యాచారమును వదలి బుద్ధిమంతుఁడగు తమ్ముఁడు సుగ్రీవుఁడు బ్రతికియుండఁగా, నతనిభార్య యగు రుమతోఁ గ్రీడించుచున్నాఁడవు. తమ్ముఁడు కొడుకుతో సమానుఁడుగనుక తమ్మునిపెండ్లాము కోడలితో సమానురాలు. నీవు పాపంపుఁబనులుచేయువాఁడవు గానఁ గొంచెమయినను సంశయింపక, మోహముఁబట్టఁజాలక కోడలితో రమించుచున్నావు. నీ కిది న్యాయమే? వానరా! కావున ధర్మముఁదప్పి, తమ్మునిభార్యను బొందుట యను మహాపరాధము నొనరించితివి గనుక నిన్నిప్పుడిట్లెఱఁగునఁ

బడనేసితిని. వానరేంద్రా! లోకముయొక్క నడవడివదలి, ధర్మము మీఱి నడచువానికిఁ దగినశిక్ష చంపుటకంటె వేఱొకటిలేదు. క్షత్రియ కులోద్భవుఁడను నేను. ధర్మాధర్మవిచారణ నాకార్యము. కావున నీ వొనర్చిన పాపం, బోర్వలేక యీ కార్యం బొనరించితిని. ఎవఁడు కామం బణఁచుకొనఁజాలక కూఁతురిని, తోఁబుట్టినదానిని తమ్మునిభార్యను గూడుచున్నాఁడో, వానికి వధమే దండనమని శాస్త్రములు చెప్పు చున్నవి. సకలధర్మములనెఱిఁగిన భరతుఁడిప్పుడు పుడమియేలిక. మే మన్ననో వానియాజ్ఞ చొప్పున నడచుకొనుచు ధర్మాధర్మములఁ బరికించు వారము. నీవు ధర్మముదప్పి నడుచుచుండఁగా, నిన్ను పేక్షచేయుట యుక్తమగునే? భరతుఁడు జనులకెల్లఁ దండ్రివంటివాఁడు గనుక న్యాయముఁదప్పినవారిని జట్టముచొప్పున దండించుచుఁ గామవృత్తు లయినవారిని దండింపవలయునని కంకణముకట్టియున్నవాఁడు. వాన రులదొరా! మేము భరతునియాజ్ఞప్రకారము నడుచుకొనువారము, గనుక, నడవడి తప్పి నడుచుకొనెడునట్టి మీబోఁటులనెల్ల శిక్షించు టకుఁ గడఁగియున్నారము. అంతియగాక, నాకు సుగ్రీవునితోడి చెలిమి లక్ష్మణునితోడిచెలిమివంటిది. సుగ్రీవుఁడు రాజ్యమునుగోరియు, భార్యను గోరియు నాతోఁ జెలిమి నొనరించుకొనెను. నాకు మేలుచేయుట యందుఁ గడు శ్రద్ధగలవాఁడు. నీ వతనిభార్యను లాగుకొంటివి. రాజ్యమునుండి తఱిమితివి. కనుక ని న్నేను సంహరింపవలసె. ఋశ్య మూకపర్వతమున వానరులు కొందఱిసమక్షంబున నీ శత్రువును జంపి, నీకు రాజ్యమును భార్యను నొసఁగెదను అని ప్రతిజ్ఞ యొనరించితిని. ఆ ప్రతిజ్ఞ యిప్పుడెట్లు నేను మీఱుదును? కాఁబట్టి యీ పైఁజెప్పిన ధర్మవిరుద్ధములుగాని గొప్పకారణంబులచే నీవధము యుక్తమేకావున నీవు దీని నంగీకరింతువు గాక! నీ వధ మన్ని తెఱఁగుల యుక్తమనియె తలఁపుము.

ఓ వాలీ! పూర్వకాలమున మనువు సదాచారబోధకములైన రెండుశ్లోకములను జెప్పియున్నాఁడు. ధర్మశాస్త్రపండితు లైనవారు గూడ వానిని గ్రహించియున్నారు. నేను నట్లె యాచరించితిని. మాన వులు పాపములొనర్చి, రాజులచేఁ దమపాపములకుఁ దగిన శిక్షలను బొందినవారలై, పాపములనుండి విడువఁబడి పుణ్యాత్ములగు సజ్జనుల

మాడ్కి స్వర్గమునొందుదురు. దొంగలు రాజులచే వినుర్శింపఁబడి శిక్షితులై కాని, తప్పుతేలనిపక్షమున విడువఁబడినవారలై కాని, దొంగతన మనెడి పాపమునుండి విడువఁబడుదురు. అట్లుకాక రాజులు దోషులను విచారింపకయె యుందురేని, యా దొంగతనమువలని పాపమును దామే పొందుదురు. తొల్లి యొకప్పుడు మాపెద్దలలో నొక్కఁడగు పూజ్యుఁడయిన మాంధాతకాలమున నొక నీచుఁడు నీవలెఁ బాప మొనరింపఁగా, నా మాంధాతయు నా నీచుని కిత్తెఱఁగుననే క్రూర దండనము విధించెను. ఓ వాలీ! నీవును, ఆ నీచుఁడును మాత్రమే కాదు, ఎందఱో మఱించి పాపములను జేసియేయున్నారు. రాజులు ఆ పాపముల నొనరించినవారిని విచారించి, వారికి దండనరూపమైన ప్రాయశ్చిత్తములను జేసియున్నారు. వారి కా పాపములట్లే క్షీణించుచున్నవి. వానరశార్దూలా ! నీవగపు మానుము. న్యాయ్యముగానే నీవధము చేయఁబడినదిగాని మేము మా యిచ్ఛచొప్పుననే నడచి యీ కార్యము చేసినవారముగాము. వానరశ్రేష్ఠా! నీవధమునకు మానవ ధర్మము ననుసరించి యింతవఱకుఁ గారణము చెప్పితిని. ఇఁక నీ వానర ధర్మమునననుసరించి మఱియొక్క కారణముగూడఁ జెప్పెద నాలకింపుము. దృష్టాంతపూర్వకముగాఁ జెప్పిన యాకారణమును వింటివేని నీవు నాపై నాగ్రహమునొందవు. హరిశ్రేష్ఠుఁడా! నేను నిన్ను మఱుఁగుననుండి చంపినందుకై నీవు నన్ను నిందించితివని నాకు మనోదుఃఖము లేదు. కోపమును లేదు. రాజులు మఱుఁగుననుండియు, కనఁబడుచునుండియు, వలలొడ్డియు, త్రాళ్లుగట్టియు, మఱి యనేకవిధములైన మాయోపాయములచేఁ బెక్కుమృగములను వేఁటాడుదురు. మాంసాపేక్షగల మానవులు పరుగెత్తువానిని గాని, మిక్కిలి తత్తరపాటునొందినవానిని గాని, నమ్మినవానినిగాని, నిలఁబడియున్నవానినిగాని, యేమఱుపాటు నందినవానినిగాని, మెలఁకువతోనున్నవానిని గాని, పెడమోము పెట్టిన వానిని కాని యెట్టివానినైన మృగములను వేఁటాడుదురు. దీన దోషము లేదు. ధర్మవిశారదులగు రాజర్షులును వేఁటకుఁబోవుదురు. వాలీ! నీవు కొమ్మలందుఁ దిరుగు మృగమవుగావున నీవు నాతో యుద్ధము నేసినను, చేయకున్నను నిన్ను మృగమను హేతువుచేఁ జంపితిని. దీనియం దేమియు దోషము లేదు. వానరశ్రేష్ఠా ! రాజులు పొందరానివస్తువులను, ధర్మ

మును, ప్రాణమును, మేలును నొసఁగువారలు. దీనికే సంశయమును లేదు. దేవతలే మనుష్యస్వరూపముతో దుష్టనిగ్రహ శిష్టపరిపాలనము లకై యీ భూమండలమునఁ దిరుగుచున్నారు గావున వారిని హింసింపఁ జనదు; తిట్టఁజనదు; ఆక్షేపింపరాదు. ఇంపుగాని పలుకులు మాటాడ రాదు. నేను మాతాతముత్తాతల పద్ధతి చొప్పున నడచికొంటిని. అట్టి నన్ను, నీవు ధర్మస్వరూపము నెఱుఁగక రోషముమాత్రమే పూనిన వాఁడవై నన్నుఁ బలుతెఱఁగుల దూషించుచున్నావు" అని రాముఁడు వాలికి సమాధానంబుఁజెప్పెను.

రాముఁడిట్లెఱుఁగునఁ జెప్పఁగా, వాలి, యేల రామునిఁదెలియక దూషించితినని మనమున మిక్కిలి నొచ్చినవాఁడై, ధర్మవిషయమునఁ దనమనముఁ జొప్పించి, జేసినది చెడ్డదేయనియు, రామునియెడ దోషమే మాత్రము లేదనియునెఱిఁగి, యంజలిబద్ధుఁడై రామునిఁగూర్చి యిట్లనియె: "ఓ నరోత్తమా! నీవు చెప్పినది యెల్లనిక్కము. దానియం దేమియు సందియము లేదు. నాబోటినీచుఁడు తమబోటి గొప్పవారడిగిన వార్తలకు బదులుసెప్పఁజాలఁడు. ఓ రాఘవా! నే నింతకుముందు తెలియక తమకప్రియములగు శాస్త్రవిరుద్ధములైన మాట లాడితిని. వానిని మన్నించి, నాయెడ నాగ్రహము నొందకుండఁ గోరెదను. ఓ రామా! నీవు నీతిశాస్త్రరహస్యములెల్ల నెఱిఁగిన వాఁడవు. జనులకు మేలొనఁ గూర్చుటయందు శ్రద్ధగలవాఁడవు. కార్యమును (శిక్షను), తత్కారణ మును (తప్పిదమును) దెలిసికొనుటయందు నీబుద్ధి మిక్కిలి తేటయైనది. చెదరనిది. కావున నీవు నన్నుఁజంపుట యుక్తమేకాని యన్యముకాదు; ధర్మసూక్ష్మముల నెఱిఁగిన యో రామా! ధర్మమార్గమును మీఱిన వాఁడను, అధర్మముఁజేసినవాఁడను నైన నన్నుమన్నించి, ధర్మమార్గ మును దెల్పునట్టి మాటల నుడివి నన్నుఁగడతేర్పుము. నేను జచ్చిపోవుచున్నానేయని నాకు వ్యసనము లేదు. తారనుగూర్చియు, చుట్టాలను గూర్చియు వ్యసనము లేదు. సద్గుణములుగలవాఁడును, బంగరుబాహుపురులు గలవాఁడును నైన నా పుత్త్రుఁడగు నంగ దుని దలఁచుకొన్నమాత్రముననే వ్యసనమున మునుఁగుచున్నాఁ డను. నేను వానిని బాల్యమునుండి బుజ్జగించితిని. కావున వాఁడు నా మరణముచే ధీనుఁడై, సూర్యుఁడు పానముచేయుటచే

నీ రెండిపోయిన చెఱువుమాద్కి నెండిపోవఁగలఁడు, బాలుఁడును, తెలివిచాలనివాఁడును, ఏకపుత్త్రుఁడును, సుహాబలవంతుఁడును, నాకుఁ గడుఁబ్రియుఁడునునైన యీ యంగదుని నీవే కాపాడవలయును. నీవు దుష్టశిక్షకుఁడవు; శిష్టపరిపాలకుఁడవు. కార్యాకార్యముల విమర్శించుట యందు నేర్పరివి. కావున, నీవు సుగ్రీవాంగదులను సమానముగాఁ జూచుకొనుము. నృపాలా! భరతలక్ష్మణులయం దెట్టితలంపు పెట్టి యున్నావో, అట్టి తలంపే సుగ్రీవాంగదులయందు నుంచవలయును. తార తానుగా సుగ్రీవుని కెట్టియపరాధము నేయనిదైనను, నేను సుగ్రీవునికిఁ గీడొనర్చుటచేఁ దానును గీడొనర్చినదగును. కావున సుగ్రీవుఁ డాకంటుపెట్టుకొని తారనెంతమాత్ర మవమానింపకుండు నట్లు నీవు చేయవలయును. నీ యనుగ్రహమువడసి, నీ వశమునందుండి నీమనసు ననుసరించి నడచుకొనువాఁడు రాజ్యము నొందఁగలఁడు? భూమండలమేలఁగలఁడు. వేయేల? స్వర్గమునుగూడ నాక్రమించుకొనఁ గలఁడు. నీమూలమున మరణమునొందఁ గోరియే, తార వలదని నివారించుచున్నను, తమ్ముఁడగు సుగ్రీవునితోడ ద్వంద్వయుద్ధమునకు వచ్చితిని" అని వానరాధిపుఁడగువాలి వినయముతో చెప్పి యూరకుండెను.

రాముఁడు, మోహముంబాసి చక్కని తెలివితోఁ గూడియున్న వాలిని ధర్మసూక్ష్మముల యర్థము తేటపడునట్లు తిన్ననిపలుకులతో సమాధానపఱుపఁదొడఁగెను; "ఓ వాలీ! నీ విందుకై సంతాపము నొంద వలదు. మే మంగదాదులవిషయమున నెట్లు నడచుకొందుమో యని కాని, నే నెట్లు చేయరానిపనులను జేసితినోయని కాని విచారము నొందవలదు. మేము నీకంటె ధర్మమునందు విశేషానుభవము గల వారము గావున నీవొనర్చిన మహాపాతకమునకుఁ దగిన దండనము విధించుటచే నీ పాపములెల్లఁ దొలఁగెనని తలఁచెదము. ఏ నృపాలుఁడు దండింపఁదగినవారిని దండించుచున్నాఁడో, తప్పుచేసిన యే వాఁడు తన తప్పిదమునకుఁదగిన శిక్షను బొందుచున్నాఁడో, వారిరువురును దమ పాపములునశించినవారయి కృతార్థులగుచున్నారు. కావున నీవు శిక్షాస్మృతియందుఁ జెప్పినతీరున శిక్షను బొందితివి గనుక, నీపాపము నుండి తొలఁగినవాఁడవై, యెప్పటి యట్ల ధర్మస్వభావమునుబొందితివి. వానరేంద్రా! నీ మనసునందలి శోకమును, మోహమును, భయమును

వీడుము. విధినతిక్రమింప నేరికిని ధరముగాదు గనుక నీవును విధ్యను స్మృతమైన యీ యవస్థను బొందితివిగావున దీనినిగూర్చి శోకము వీడుము. వానరాధిపా! యీ యంగదుఁడు నీయెడ నెట్లు భయభక్తులు గలిగియున్నాఁడో, అట్లే సుగ్రీవునియందును, నాయందును నుండును గాక! మేమును నీవలెనే వీనియందుఁ బుత్రవాత్సల్యము గలిగి యుందుము" అని రాముఁడు వాలితోఁ జెప్పెను. వాలి, ధర్మమార్గము ననుసరించువాఁడును, రణశూరుఁడును, మహాత్ముఁడునైన రాముఁడు నెమ్మదితో నింపుగులుకఁ జెప్పినమాటనువిని, రాముని నుద్దేశించి, "మహేంద్రుని కెనవచ్చువాఁడా! భీమపరాక్రమా! మహాప్రభూ! నరాధిపా! బాణమునాఁటుటచే నొచ్చి, మైమఱచి, తెలివిలేక నిన్నె న్నియో యనరానిమాటల నంటిని. నీవు నాయెడఁ గరుణించి, కోపము మాని తప్పులను మన్నింతువు గాక!" యని సవినయముగాఁ బలికెను.

## 19-వ స ర్గ ము

### తార వాలిమరణము విని వాలికడ కేతెంచుట

వానరమహారాజగు వాలి రామునిబాణముచేఁ గొట్టఁ బడి క్రిందఁబరుండినవాఁడై, రాముఁడు సకారణముగఁజెప్పిన బదులు పలుకులు విని, యందులకుఁ బైన మాటఁజెప్పఁజాలనివాఁడై, సుగ్రీవుని చేత తాలతోను, చెట్లతోను మితిమీఱు దెబ్బలుతిని యుండుట చేతను,రామునిబాణము నాటుటచేతను మిక్కిలి బాధపడుచు,ప్రాణము పోవుసమయమున మూర్ఛనొందెను. అంతట వాలిభార్యయగుతార తన భర్తయగు వానరేంద్రుఁడైన వాలి రాముఁడు ప్రయోగించిన బాణముచే జమునివీటి కేగెనను కడుదారుణమైన యప్రియమగు మగని మరణవార్తవిన్నదై మిగుల నడలి పలుత్రోవలుగల పర్వతగుహా రూపమైన కిష్కింధనుండి కొడుకును దోడ్కొని వెడలెను. భయంకర పరాక్రమంబు గల యంగదునియనుచరు లగు వానరు లందఱు వింటిని జేతఁ దాల్చియున్న రామునిఁ గని పాఱిపోయిరి. తమ గుంపుకాఁపును కోలుపోవుటచేత గుంపునుండి చెదరి పరుగెత్తుచున్న మృగముల మాడ్కిఁ గడువెఱపుతో నేతెంచుచున్న వానరుల నా తార చూచి, మిక్కిలి దుఃఖమునొంది, రామునిబాణములచే వెంబడింపఁబడుచు

న్నారో యనుచు నట్లు రామునికి వెఱచి పఱతెంచుచున్న వానరులను సమీపించి, "ఓ వానరులారా! కట్టిఁడియగు సుగ్రీవుఁడు రాజ్యముఁ గోరి, రామునిచే వేగముగాఁబోవు క్రూరబాణములను బ్రయోగిం పించి చంపినం జంపనిమ్ము. వానర సేనలకెల్ల నధిపుఁడగు వాలిని విడిచి యేల యిట్లు నీచులై తీరని వెఱపుతోఁ బరుగెత్తుచున్నారు" అని యడిగెను.

కోరిన రూపమెత్తఁగల యా వానరులందఱు వాలిపత్నియగు తారయడిగిన పలుకులను విని, సమయోచితముగను, స్పష్టముగను నిట్లని యాతారతోఁ బలికిరి.

"ఓ బ్రదికియున్న కొడుకుగలదానా! యెక్కడికిఁబోయెదవు? మఱలుము. పుత్త్రుఁడగు నంగదునిఁ గాపాడుకొనుము. యముఁడు రాముని యవతారముతో వచ్చి వాలిం జంపి కొనిపోవుచున్నాఁడు. వాలి సుగ్రీవుఁడు ప్రయోగించిన వృక్షములను, గొప్ప ఱాతిబండలను నుగ్గుచేసి, వజ్రాయుధముఁబోలు బాణములతో రామునిచేఁ జంపఁ బడెను. దేవేంద్రునిపరాక్రమముఁ బోలు పరాక్రమముఁగల వానరశ్రేష్ఠుఁ డయిన వాలి వధింపఁబడఁగా కిష్కింధనుండి వచ్చిన యీ వానరబల మెల్లఁ జెదరి యిదిగో మఱలి కిష్కింధకుపాఱి వచ్చుచున్నది. పట్టణము వాకిళ్ళకడఁ గావలియుంచుము. అంగదునికిఁ బట్టాభిషేకము చేయుము. వాలి పుత్త్రుఁడగునంగదునకుఁ బట్టాభిషేకమొనరించెద వేని, వానరులెల్ల నతనికిఁ గొలువుకాండ్రయియుందురు. ఓ చక్కనిమోముగలదానా! నీవు మేముచెప్పినచొప్పున నీవొనరింపవేని, యీ కిష్కింధలోపల నుండుటయె కష్టమగును.ఏలయనిన, నీశత్త్రువులగు వానరులితరదుర్గము లను సైతమాక్రమింపఁగలరు. ఇచ్చటఁ గుటుంబులును, కుటుంబము లేనివారునైన వానరులు పెక్కండ్రున్నారు. వాలి వారినందఱిని వం చించి తఱుమఁగొట్టియున్నాఁడు. అట్లు తమభార్యలను బహుకాలము విడిచి యున్నవారును, వంచితులునయిన సుగ్రీవాదులగు దాయాదుల వలన మనకెక్కువ భయము గలుగును" అని వాలిసేనలు తారతోఁ జెప్పెను.

నీచబుద్ధిగల యా వానరు లాడినమాటలను విని, చిఱునవ్వు మోముగల యా తార తన గొప్పతనమునకుఁ దగినమాటల నిట్లనియె.

“ఓ పరిచరులారా! వానరాధిపుఁడును మహాసమర్థుండునునయిన నా పెనిమిటి పోయినపదంపడి నాకుఁ బుత్రునితో నేమి కావలెను? రాజ్యముతో నేమి కావలెను? వేయేల? ఈ ప్రాణములెందుకు? రాముఁడు ప్రయోగించినబాణముచేఁ గ్రిందఁబడిన బలశాలియగు నా మగనిపాదములను జేరుకొందును” అని తార చెప్పి, వంతచేఁ గృశించినదై, యేడ్చుచు, చేతులతో నెత్తిని, ఱొమ్మును బాదుకొనుచు వాలికడకుఁ బరుగెత్తెను. అట్లు పరుగెత్తుచువచ్చి, పూర్వము యుద్ధమున నేరికి వెఱవనియసురేంద్రులను సంహరించినవాఁడును, దేవేంద్రుఁడు వజ్రాయుధమును బ్రయోగించునట్లు గొప్పపర్వతములను విసురువాఁడును, పెనుగాలివేగమువంటి వేగముగలవాఁడును, గొప్పమేఘములకూటముల ధ్వనింబోలు ధ్వనిగలవాఁడును, దేవేంద్రునిపరాక్రమముబోలు పరాక్రమముగలవాఁడును, వర్షించినిలిచిన మేఘమువలె శాంతుఁడై యున్నవాఁడును, గర్జించువారిలోపల భయంకరముగ గర్జించువాఁడును, శూరుఁడును, శూరుఁడయిన రామునిచేఁ వధింపంబడినవాఁడై, మాంసముగోరిన సింహముచేఁ జంపఁబడిన సింహమువలె నున్నవాఁడును, బలశౌర్యపరాక్రమాదులు గలిగియుండియుఁ దమ్మునిభార్యనపహరించిన దోషమునకై రామునిచే సంహరింపఁబడినవాఁడైనందున, జనులందఱిచేఁ బూజింపఁబడి, టెక్కెముతోఁగూడి తిన్నెచే వెలయుచున్నదైనను బాముతోఁ గూడియుండుటచే గరుత్మంతునిచేఁ బాడుచేయఁబడిన చైత్యమువలె నున్నవాఁడునై పుడమిఁగూలియున్న వాలింజూచెను. వాలివెంబడి శ్రేష్ఠమయిన వింటినవలంబించి నిల్చియున్న రాముని, రామునితమ్ముని లక్ష్మణుని, తనభర్తయొక్క తమ్ముని సుగ్రీవునిఁజూచెను. అంత వారి నందఱిని దాఁటి, యుద్ధరంగమున జచ్చిపడియున్న పెనిమిటిని జూచి, వ్యసనమును, తత్తఱపాటునుపొంది మూర్ఛిల్లి నేలపైఁబడెను. అంత మఱల నిద్ర లేచినదానివలె లేచి “నాథా” యని యఱచి మృత్యుపాశముచేఁ గట్టఁబడియున్న భర్తనుజూచి విలపించెను. సుగ్రీవుడును గోరువంకపిట్టవలె నఱచుచున్న తారను, తారతోఁగూడ వచ్చిన యంగదునిఁజూచి, తానును వ్యసనమునొందెను.

## 20-వ సర్గము

### తార వాలింజూచి విలపించుట

రాముని వింటినుండి విడువఁబడినట్టిదియు, ప్రాణములఁ దీయునది యునైన బాణముచేఁ గొట్టఁబడి నేలఁ గూలియున్న వాలినిజూచి, పున్నమచంద్రునిబోలు మోముగల తార చేరవకేతెంచి పెనిమిటినిఁ గౌఁగిలించుకొనెను. అట్లు తార గౌఁగిలించుకొనిలేచి, చింతచేఁ గలంగిన హృదయముతోఁ గూడినదై, బాణముచేఁగొట్టఁబడి మొదలుదెగిన చెట్టువలెఁ బడియున్నవాఁడును, ఏనుఁగునుబోలినవాఁడును, దేవేంద్రుని కెనవచ్చుపౌరుషముగలవాఁడును నైన తన ప్రియుఁడగు వాలింజూచి యిట్లుగున విలపింపఁదొడఁగెను.

"రణమున శత్రువులకు భయంకరుఁడవును, ప్రతాపవంతుఁడవును, శూరుఁడవును నైన యో వానరేంద్రా! నీ మాట దాఁటనిదాననయిన నేను దుఃఖపరవశనై యిచ్చటికి వచ్చియుండ నీవు నాతోడ నేల మాటలాడకున్నావు? వానరశ్రేష్ఠుఁడా! లెమ్ము. మేటిపాన్పుమీఁదికి రమ్ము. ఇట్టి నృపశ్రేష్ఠు లిట్లుగున నుత్తనేలపైఁ బరుండుదురే? పుడమి ఱేఁడా! నీకు భూమిదేవి కడుఁబ్రియురాలని తోఁచుచున్నది. లేకున్న, నీవు ప్రాణములు పోయినను, నన్నుఁబాసి యీ భూకాంత నన్నియంగములు దగులునట్లు బిగి కౌఁగిటంజేర్చియున్నావు గదా? ధర్మమార్గమునఁ బుడమినేలునట్టి యోశూరుఁడా! నీవు స్వర్గమునకుఁ బోవుదారి నొక్కపురమును కిష్కింధనుబోలె సొగసైనదాని నేర్పఱచుకొంటివి కాఁబోలు! కాఁబట్టియే యీ కిష్కింధాపురము బాసిపోవుచున్నావు. ఇప్పపూల కమ్మనితావులు గల వనములందు వసంతాదిఋతువులందు మాతోఁగూడి యేయే విహారంబులు సల్పుచుంటివో, యవి యెల్ల నడఁగిపోయె. వానరాధిపులకెల్ల నధిపుఁడవగు నీవు మృతినొంద, నేను వంత యనుకడలియందు మునిఁగి, సంతసముదక్కి, కోర్కెలెల్ల వీడితిని. ఓ నాథా! నాహృదయము నీమరణవార్త వినియు, మృతినొందిన నిన్నుఁజూచియు, వంగలార్పుచేఁ గుంది, వేయిముక్కలుగఁ బగులకయున్నదిగా! అక్కటా! నాహృదయమెంతటి కటికిదనము గలది యనవచ్చును! వానరేంద్రా! నేను నీ

మేలుగోరి "యిప్పుడు నీవు సుగ్రీవునితోడి కయ్యమునకుఁ బోవల" దని యంటిని. నీవు మొఱకుదనముచే నామాట పెడచెవినిబెట్టి వచ్చి యిచ్చట నీగతి నొందితివి. శత్రువుల గర్వమణఁచునట్టి యో నాథా! రూపమునను, ప్రాయమునను మదించిన జాణలగు నచ్చరలతోఁగూడి, వారిమనముల స్వాధీనపఱచుకొనుదువు. నీకు మృత్యుకాలము సమీపించె. కావుననే యెవరికిలొంగని నీ విప్పు డీసుగ్రీవునికి లోఁబడి మృత్యువుపాలయితివి. నే నింతకుమున్ను దుఃఖ మన నెట్టిదో యెఱుఁగనిదానను. అట్టి నా కిప్పుడు వైధవ్యమను దుఃఖము సంప్రాప్తమాయె. ఈ దుఃఖమున మాడుచుఁ దిన్నదనముతోఁగూడి యనాథనై యెట్లు మనఁగలను? వానరాధిపా! నీవు సుగ్రీవునియాలిని గైకొని, వాని నడవులకుఁ దఱిమితివి. దానికి ఫల మిప్పు డనుభవించితివి. సుఖము లందఁదగినవాఁడును, శూరుఁడును, మెత్తనివాఁడునైన యంగదుఁడు మనకడ మిక్కిలి గారాబముతోఁ బెరుగుచుండెను. నీపైఁ గంటువెట్టియున్న సుగ్రీవుఁ డీ చిన్నకుఱ్ఱవాని నెట్టి యిడుమలం బెట్టునో? యేమిచేయునో?' అని తన నాథుంగూర్చి చింతించుచు, నడుమ నడుమ కొడుకుంజూచి, "నాయనా! ధర్మమునందుఁ బ్రేమగలవాఁడయిన నీ తండ్రిని బాగుగాఁ జూడుము. ఇఁక నీ కా నాయన మోమగపడుట యరుదుకాఁగలదుగదా!" అని కొడుకుంజీరి వెండియుఁ దననాథునిఁ జూచి, "యోనాథా! నీ కొడుకునోదార్పుము. శిరమున ముద్దాడి చెప్పవలసినమాట చెప్పుము. ఇఁక నీమాట లతనికి దొరకవుగదా! రాముఁడు నిన్నుఁ జంపి గొప్పపని చేసినవాఁడయ్యె. సుగ్రీవునికిఁ జేసిన వాగ్దత్తము నెఱపి ఋణమునుండి వీడినవాఁడయ్యెను" అని చెప్పి, సుగ్రీవుంజూచి, "సుగ్రీవా! నీ శత్రువగుసోదరునిఁ జంపితివి. నీకోర్కి యీడేఱె. ఇఁక నీ పత్నియగు రుమను బొంది, దిగులువిడిచి విచ్చల విడిగా రాజ్య మనుభవింపుము. వానరాధిపా! నేనింతగాఁ బలవించుచున్నను, నీవేల నాతోఁ బ్రేమమీఱ మాటాడకున్నావు? ఇచ్చట నే నొక్కతెనే కాక, పెక్కండ్రు చక్కని ప్రియకాంతలు వచ్చియున్నారు. వారి నెల్లరఁ జూడుము. బాహుపురులుదాల్చిన బాహువులుగల యో నాథా! యీ యంగదునిఁబాసి మఱలనిచోటికి బోవుచున్నావు. పుత్రునెడఁ బ్రేమగలనాథా! ఇట్టి సకలగుణవిశిష్టుండైన కొడుకు నెడఁ

బాసి పోవుట నీకుఁ దగునే? సొగసువేషముగల యోప్రియనాథుఁడా! నేనుగాని, మన బిడ్డఁడుగాని యే యపరాధముజేసితిమి? వీరుఁడా! యట్టికారణము లేకున్న మమ్మిరువుర నెడఁబాసి, యెప్పటికి మఱలని తావునకుఁ బయనమైతివిగదా! నిడుదచేతులు గల వానరవంశాధినాథుఁడా! నేనొక్కవేళఁ దెలియక యేదియైన నీ కిష్టముగానిపని కావించి యుండునేని దానిని మన్నింపుము. శూరుఁడా! యిదిగో నేను నీపాదంబులకు శిరముతో మ్రొక్కుచున్నదానను" అని తార విలపించెను. ఆతారవిలాపమును చూచి, యచ్చటనున్న వానరాధినాథుని యంతిపురపుటతివలందఱు గూడి, దీనుఁడైన యంగదుని బుజ్జగించుచుఁ గడు శోకపీడితలై, పెల్లుగా రోదనముసేసిరి. అట్లు సౌందర్యవతియగు తార యితరకాంత లందఱితోఁగూడఁ దననాథునిచేరువ జాలిపుట్టునట్లేడ్చుచుండి, యావల దననాథుఁడు పడియున్నచోటఁ బ్రాయోపవేశము చేయ నిశ్చయించినదాయెను.

## 21-వ సర్గము

### తార ప్రాయోపవేశమునకుఁ బూనుట

అంత, వానరశ్రేష్ఠుఁడయిన హనుమంతుఁడు పుడమినిబడి, యాకాశము నుండి క్రిందఁబడిన చుక్కవలెనున్న తార నిత్తెఱంగున నూరడింపఁ దొడఁగె. "ప్రాణులందఱు వారువారొనర్చు మంచిచెడ్డ పనుల కనురూపములైన సుఖదుఃఖములను బొందుదురుగావున నొక్కరింగూర్చి మఱియొక్కరు చింతించుటచే నుపయోగములేదు. ఈ దేహము నీటిబుగ్గవంటిది. ఇప్పటికున్నది మఱికొంతసేపటికి లేదు. ఇట్టి శరీరము ధరించిన జాలినొందఁదగిన నీవు వాలిఁ గూర్చి జాలి నొందెదవు. దీనవైన నీవు దీనుఁడైన యెవనినిగూర్చి విచారపడెదవు? ఈనశ్వర దేహమున నెవ్వఁడెవ్వనికిఁగాను విచారపడవలయును. నీవు జీవపుత్రకవు. కాఁబట్టినీ పుత్త్రుఁడగు నంగదుని యోగక్షేమము లరయుచు నతనిమేలునకై చేయవలసిన కార్యములనుగూర్చి విచారించి చేయుచుండుము. నీకుఁ బుత్త్రుఁడున్నాఁడు గావున నీకు సహగమనము సేయ నవసరములేదు. జీవరాసులరాకపోకలు నిత్యము కావని నీకుఁ దెలియును. కావున మృతజీవికి శుభమునుగలిగించు పారలౌకిక క్రియలు చేయింపవలెను.

రోదనాదికర్మములు పనికిరావు. ఏవాలి జీవించియుండఁగా, వేలసంఖ్యకు మించిన వానరులందఱు తమతమపాళ్ళు పంచుకొని జీవనము సేయుచుం డిరో, యట్టి వాలి మృతినొందెను. ఈ వాలి న్యాయమునం దాసక్తి గలవాఁడై, సామము, దానము, క్షమమును ముఖ్యముగాఁ గలవాఁడై, న్యాయమార్గమున వచ్చినపుడమిం బాలించుచుండి, యాయువుదీఱుటం జేసిం, పరలోకమునకుఁ బోయెను. నీ వాతనిఁగూర్చి చింతించుటతగదు. ఓ యనిందితురాలా! వానరశ్రేష్ఠులందఱును, ఈ నీ పుత్రుఁడగు నంగ దుఁడును, ఈ వానరరాజ్యమును నీ యధీనమయ్యె. నీవె దీనినెల్ల భరింపవలయును. ఓ భామినీ! యింక శోకసంతాపములు వీడుము. నీ పోషణము నందినవాఁడై యంగదుఁడు రాజ్యపరిపాలనముఁ గావించుఁ గాక. పుత్రులుగలిగినందుల కేమియుపయోగమో, ఏది ప్రకృతము చేయఁదగినపనియో, యట్టిపితృకార్యము వాలికి నంగదునిచేఁ జేయిం పుము. అదియె యిప్పుడు చేయవలసినపని. వాలికి సంస్కారము చేయిం పుము. అంగదునికిఁ బట్టముగట్టుము, నీకుమారుఁడు సింహాసనమెక్కఁగా నీవు చూచితివేని, యీ దుఃఖము కొంత యుపశమింపఁగలదు" అని హనుమంతుండు తారతోఁ జెప్పెను.

పెనిమిటి మరణశోకముచేఁ జిక్కియున్న తారయు నా హను మంతుని మాట విని, తనయెదుటనిలిచియున్న యా హనుమంతునిఁ గూర్చి యిట్లనియె. "ఓ హనుమంతుఁడా! అంగదుంబోలిన నూఱుగురు పుత్రులు గల్గియుండుటకంటె మృతుఁడయినను శూరుఁడయిన యా వాలిని కౌఁగిలించుకొనుటయె మేలు, వానరశ్రేష్ఠుఁడయిన వాలి కుత్తర క్రియలు సలుపుటకుఁగాని, యీ యంగదునికిఁ బట్టాభిషేకము సేయు టకుఁగాని నేను జాలినదానను గాను. ఆ యంగదునికి సుగ్రీవుఁడు పిన తండ్రి. ఆతఁడే యింకమీఁద జరుగు కార్యములెల్ల జరిపింపవలసిన వాఁడు. వానరోత్తముఁడవగు హనుమంతుఁడా! యంగదునిఁగూర్చి తండ్రికిఁబిదపఁ దల్లియె కొడుకుయొక్క క్షేమలాభములను విచారించు కొనవలయునని చెప్పితివి. అది సరియైన యుద్దేశముగాదు. కొడుకునకు బంధువు తండ్రిగాని తల్లిగాదు కావున, తండ్రితో సమానుఁడయిన పినతండ్రియైన సుగ్రీవుఁడే యన్నిసంగతులను విచారించుకొనును. ఓ హనుమానుఁడా! నాకు వానరవీరుఁడగు వాలిని కౌఁగిలించుటకంటె

నిహపరములందు రెంటియందుమించినది వేఱు లేదు. నాయెదుటఁ జచ్చియున్న శూరుఁడైనవాలి పరుండియున్న యీ పాన్పునొందుటయే నాకు యుక్తము, దానికంటె వేఱొకటి నాకుఁ గావలసినది లేదు." అని తార హనుమంతునితోఁ జెప్పెను.

## 22-వ సర్గము

### వాలి సుగ్రీవుని కంగదు నప్పగించుట

కొనయూపిరితోనున్న యా వాలి మెల్లగా నిట్టూర్పు విడుచుచు నంతటఁ జూచుచుఁ దనకొడుకు నంగదునిఁ గనుఁగొనుటకు ముందే సుగ్రీవునిఁ జూచెను. అట్లు చూచి, వానరేంద్రుఁడగు వాలియు గెల్పునొందిన యా సుగ్రీవునిఁ బిలిచి, ప్రేమమీఱిన పలుకులతో నతని కిట్లనియె.

ఓరి సుగ్రీవుఁడా! నిన్ను రాజ్యమునుండి తఱుముటచే, నీభార్యను లాగికొనుటచె నేను పాపకార్యము జేసితినని నాయెడ దోషముఁ దలంపకుము. నావిధినాచే నట్టి దుష్కార్యములం జేయించెను కాని, నేను బుద్ధిపూర్వకముగాఁ జేసినవికావు. నాయనా! మన మిరువురము నొక్కసెసమయమునఁ దోఁబుట్టుదనమువలని ప్రేమయు, రాజ్యసౌఖ్యమును గలిగియుండునట్లు విధి లిఖింపఁడయ్యె. కావుననే మనకిట్టి వైరము గలిగె. ఆ దైవవిధానముఁ దప్పింప నెవ్వనికైనఁ దరమా? కాదు. ఈ వానర రాజ్యము నిప్పుడే చేపట్టుము. నే నిప్పుడు జమునివీటి కేగుచున్నాను. నా ప్రాణములనే కాక, యీ రాజ్యమును, విస్తారమయిన యీ కలిమిని, ఒచ్చెములేని గొప్పకీర్తిని నే నిదిగో విడుచుచున్నాను. వానరరాజా! యిట్టి వేళయందు నేఁ జెప్పుమాట నీకు సులభముగాఁ జేయఁదగినది కాకయున్నను, దానిని జేయఁగోరెదను. ఈ యంగదుఁడు సుఖము లనుభవింపఁ దగినవాఁడు, గారాబముతోఁ బెరిగినవాఁడు, పసివాఁడు, తెలివికాఁడు. వీఁడు కన్నులనిండఁ గన్నీరుపెట్టుకొని యెట్లు నేలకుఁ గఱచుకొనియున్నాఁడు చూడు! వీనిని నీ ప్రాణములకంటెఁ గడుఁబ్రియునిఁగాఁ జూచుకొందువుగాక! నేను లేకపోయినను, వానికిఁ గావలసినవి యెల్ల నొసంగి, కాపాడుచుండుము. వానరాధిపా! నావలె నీవే యీ పిల్లవాని కన్నిటి నియ్యవలయును. అన్నిదెసల రక్షింపవల

యును. భయపడవలసిన తరుణములం దభయ మొసఁగవలయును. నీవు తక్క నిఁక వీనిని గాపాడువాఁ డెవ్వఁ డున్నాఁడు? ఈ తారకొడుకు కాంతిగలవాఁడు; నీతోసాటి యగు పరాక్రమముగలవాఁడు. రాక్షస సంహారసమయమున నీ కితఁడు ముందట వచ్చి నిలువఁగలవాఁడు; బలిమిగలవాఁడు, ప్రాయపువాఁడు, చేవకాఁడునైన తార కొడుకగు నీ యంగదుఁడు సమరమునఁ దనపరాక్రమము చూపి, తన బల్మికిఁ దగిన పనులను జేయఁగలఁడు. ఈ సుషేణునికూఁతురగు తార పను లందలి చిక్కులను విడఁదీసి నిర్ధారణచేయుటయందును, రాఁబోవు నాపదలను దెలుపుటయందును గడు నేర్పుకత్తె; ఈమె యేకార్యము సరియని చెప్పునో, అదినిశ్చయముగా నట్టిదేయగును. తార యొక్క యభిప్రాయ మొక్కటియు విరుద్ధముగా నడవదు. నీవు రాముని కార్యము నిస్సంశయముగాఁజేసి తీరవలయును. చేయనిచోఁ బాపము గలుగును. అంతియకాక రాముఁడు తనమాట వినక తన్నవ మానించినందుకై యలిగి, నిన్ను సంహరింపనువచ్చును. సుగ్రీవా! నాకు దేవేంద్రుఁ డొసఁగిన యీ బంగారుదండను దాల్పుము. ఈ మాలయం దెక్కువకాంతి యున్నది. నేను మృతినొందుదునేని, యీ పసిఁడిమాల కాంతిలేనిదగును.”

ఇట్లు వాలి సోదరునియందలిప్రేమతోఁ జెప్పఁగా, సుగ్రీవుఁడు విని, సంతసమువీడి, జాలినొంది, రాహువుచే మ్రింగఁబడినచంద్రుని మాడ్కిఁ బ్రకాశమ్ములేకయుండెను. అట్లు సుగ్రీవుఁడు విన్నదనంబు నొంది, యుక్తమైన యా వాలిమాట ప్రకారము నడువనియ్యకొని, పరాకుమాని యన్న యానతిగొని, బంగారుమాలను గైకొనెను.

ఆవాలి యట్లు పసిఁడిదండను తమ్మునికొసఁగి, మరణమునకు సిద్ధుఁడై, స్నేహముమీఱఁ దన యెదుటనిలిచిన యంగదునిఁజూచి, “నాయనా! నావియోగము నోర్చికొని, దేశకాలములనెఱిఁగి, ప్రియా ప్రియములకును, కష్టసుఖములకు నోర్చుకొని, సుగ్రీవుని మాట చొప్పున నడచుకొనుచుండుము. నిడుదచేతులవాఁడా! నీవు నాయెడ నే ప్రకారముంటివో, యట్లు నీ పినతండ్రికడను భయభక్తులతో నడచు కొనుచుంటివేని, యతఁడు నావలెనే నిన్నుఁ బ్రేమతోఁ జూచుకొను చుండఁగలఁడు. శత్రుసంహారీ! యీ సుగ్రీవునిపగతురతోడను, వారి

మిత్రులతోడను జేరకుము. వారితో మంతనము లాడకుము. ఓర్పు గలిగి, యజమానుని కార్యములందు జాగరూకుఁడవై సుగ్రీవుని యిష్టము చొప్పున నడచుకొనుచుండుము. ఎక్కువ చెలిమిగలిగి యుండుటయు, చెలిమి లేకుండుటయు నను నీ రెండును గొప్పదోషములే కావున సామాన్యస్థితి నవలంబింపుము." అని చెప్పి, గ్రుడ్లు తేలవైచి, బాణముయొక్క వేదనకుఁ గడునొచ్చి, భీకరములయిన పండ్లు వెలికగుపడ నోరుతెఱచి ప్రాణము వదలినవాఁ డయ్యెను.

అంతట నచ్చటనున్న వానరశ్రేష్ఠు లందఱు నిర్జీవుఁడయిన వాలిని జుట్టుకొని, "వానరులకెల్ల దొరయగువాలి మృతినొందఁగా, కిష్కింధా పురము పాడయ్యె. తోఁటలుఁ పర్వతములు, వనములును సొంపు దఱిగినవయ్యె. వానరశ్రేష్ఠుఁడయిన వాలి చావఁగా, వానరు లందఱు కాంతిదఱిగినవారయిరి. ఏవాలి వేగముతోఁ బరుగెత్తునప్పుడు, అతని వేగమునకు, అడవులు తోఁటలును పూవులతో వెంబడించినవో, అట్టి కార్యము నిప్పు డే వాఁడు చేయఁగలఁడు? తొల్లియొక్కప్పు డేవాలి బలశాలియగు గోలభుండను గంధర్వునితోఁ బదునైదు సంవత్సరములు రేయింబగళ్ళును నిలువక యుద్ధముచేసి, దుష్టుఁడయిన యాగోలభునిఁ బదునాఱవయేట సంహరించి, మాకెల్ల నభయమొసఁగెనో, అట్టి గొప్ప కోరలుగల యావాలి యెట్లు సమరమున మడిసెనో!" అని విలపించిన వారలై, సింగముతోఁగూడిన కాఱడవియం దాఁబోతును గోలు పోయినవై యరణ్యమునఁ దిరుగుపసులమాడ్కి వానరేంద్రుఁడయిన వాలిం గోలుపోయిన వానరులెల్ల సుఖమునొందరైరి. అంతఁ దారయు వ్యసనసాగరమున మునిఁగినదై, మృతుఁడైన తన పెనిమిటిమోముం జూచి, చెట్టు నఱుకఁబడినవెంటనే, దానితోఁగూడఁ జుట్టుకొన్న తీగెయు నేలఁబడునట్లు, వాలింగౌఁగిలించి నేలఁబడెను.

## 23-వ సర్గము

### తార వాలింగూర్చి విలపించుట

అంత తార యట్లు నేలఁబడి, వానరేంద్రుని మోమును ముద్దాడి, మృతుండై లోకాంతరమునొందిన వాలింగూర్చి యిట్లెలుఁగున విలపించెను. "ఓ నాథా! నేను నీతో యుద్ధమున కిప్పుడు పోవలదని చెప్పి

తిని. నామాట వినకయిచ్చట వచ్చి మడిసి,మిట్టపల్లములు గలిగి, చదును గాక తాలతోఁగూడి యోర్వఁగూడని యీ కటికి నేలపై బరుండి యున్నాఁడవు. వానరశ్రేష్ఠా! నీకు నాకంటెఁ బుడమిదేవి పయి నెక్కుడు ప్రేముడిగలయట్లు తోఁచుచున్నది. కావుననే నీవీ భూమిం గౌఁగిలించు కొని, నాతో మాటలాడక పరుండియున్నావు. శూరుఁడా! సాహసము గలవాఁడా! కాంతుఁడా! యిట్టి నీవు సుగ్రీవునివశమయి పోయితివి కదా! సుగ్రీవుఁడే బలవంతుఁడయ్యె. ఆహా! దైవమాయ యిట్టిదే! బలిమికలవాఁడు తక్కువవానికి లోఁబడుట విధిబలముచేతనే కదా! వానరముఖ్యులు, ఋక్షశ్రేష్ఠులు బలవంతుఁడవైన నిన్నుఁ గొల్చు చున్నారు. ఈ వానరవీరులయొక్కయు, దుఃఖితుఁడయిన యంగదుని యొక్కయు ప్రలాపమును వ్యసనపడుచుండు నంగదునియొక్కయు, నాయొక్కయు మాటలను విని యేల బదులు చెప్పకున్నావు? ఓ శూరుఁడా ! నీవు తొల్లి శత్రువులఁ బరిమార్చి యే వీరశయనమునఁ బరుండఁ బెట్టితివో, నీ విప్పుడు పోర నీల్గి యే వీరశయనమునఁ బరుండి యున్నావో? ఇదియకా యీ వీరశయనము. ఒచ్చెములేని బలిమియు, సత్కులమును గలవాఁడా! యుద్ధమునం దాసక్తిగలవాఁడా! పగతుర గర్వమడఁచువాఁడా! నాప్రియా! అనాథను నన్నొంటరిగా విడిచి, నీ వేగితివిగదా! వివేకి తనకూఁతు నెప్పటికిని శూరునకియ్యరాదు. నేను శూరుని పెండ్లామయి, నిర్భాగ్యురాలనై విధవనయితిని చూడుము. నా పొంగు కుంగె; నాశాశ్వతగతి త్రుంగిపోయె. అగాధమయిన గొప్పదుఃఖసముద్రమున మునిఁగిపోయితిని. నాథునిఁ బోఁగొట్టుకొనియు నా హృదయము నూఱువ్రయ్యలు గాకయున్నది గాన నిక్కముగా, ఈ నా హృదయ ముక్కుతోఁ జేయఁబడినదియు, ఉరిదియయినదియు నని తలఁచెదను. నాకు నెచ్చెలియు, మగఁడును, ఇష్టుఁడును, బవరమునఁ బరులనాక్రమించు మొనకాఁడును నైన వాలి మరణమునొందె.

మగువ మగండులేనిదగునేని, పెక్కురు కొడుకులుగలదిగా నుండినను, కలిమిపెంపు గలదిగానుండినను, దానిని లోకులు విధవ యని యందురు. తక్కిన వెన్నియున్నను, ఆపేరు రాకపోదు. ఈ జన్మ మిఁక నాకేల? వీరుఁడా! లక్కవంటి రంగుగల బట్టపఱచిన పాన్పుపైఁ బరుండినట్లు, నీవు స్వకీయదేహమునుండి వెలువడిన రక్తప్రవాహము

నందుఁ బరుండియున్నాఁడవుగదా! వానరోత్తమా! నీ దేహము రక్తము చేతఁ దడిసియుండుటంజేసి, నేను నాచేతులతో గట్టిగాఁ గౌఁగిలింప లేనట్లు, చేతులు జాఱుచున్నవి. వాలిసుగ్రీవులు బద్ధవైరులైయుం డఁగా, రాముఁ డొక్కబాణమేసి వాలిని సంహరించుటచే, సుగ్రీవుని భయముదీఱెను. సుగ్రీవుఁడు పనినెఱవేర్చుకొన్నవాఁ డయ్యెను. ఓ వాలీ! నీవు మృతినొందినపిదప నిన్నొకతడవనైనను గౌఁగిలించు కొందుననిన నీ హృదయమున నాటినబాణమ్ము నాకెడమీయకున్నది. కావున నిన్నూరక చూచుచుండవలసినదాననై యున్నాను" అని తార పెక్కువగల వగలంబొగిలినదాయెను.

అప్పుడు నీలుఁడు, కొండగవియందు దాఁగియున్న విషముగల పామును లాఁగినట్టు లావాలిహృదయమున నాటియున్న యమ్మును లాగెను. ఆవాలి యొమ్మునుండి తీయుచున్న యా యమ్ముడాలు సంజ వేళయందలి కెంజాయగల క్రొంకుమొట్టునందుఁ దాఁకుపగటియెకిమీని డాలుచందమునఁ జూపట్టుచుండెను. ధరాధరమునందలి పలురంగులు గల కావిరాళ్ళనుండి వెలువడు నీటిధారలవలె నా వాలియొడలి గాయ ములనుండి నెత్తుటిధారలు వెలువడెను. అప్పుడు తారయు దుమ్ముతో మేనెల్లనిండి బాణపుదెబ్బలచే నిర్జీవుఁడై యున్న తనమగనియొడలి దుమ్మును ద్రోయఁగోరినదై, తనకండ్లనుండి కాఱుకన్నీటిచేఁ దడిపిన దాయెను.

అట్లు తార కన్నీరు కాఱించి, నెత్తుటిచే మేనెల్లఁ దడిసినతన పతింజూచి, పచ్చని కన్నులుగల తన ముద్దులకొడుకగు నంగదుం బిలిచి, "ఓరీ కొడుకా! నీతండ్రి పడునట్టి కడపటియవస్థను జూడుము. ఈ ఘోరకృత్యముచే నీ వాలిసుగ్రీవుల వైరమడఁగెను. లేఁతసూర్యుని పగిది వెలుఁగువాఁడును, జమునివీటి కేగుచుండువాఁడును, శత్రువుల గర్వ మడఁచువాఁడునునైన వానరేంద్రుఁడగు తండ్రికి నమస్కరిం పుము" అని యంగదునితోఁ జెప్పెను. వెంటనే యంగదుఁడు లేచి, "నే నంగదుఁడను" అని చెప్పుచు, బలిసిన గుండ్రనిచేతులతోఁ దన తండ్రిపాదములఁ బట్టెను.

అప్పుడు తార వెండియుఁ దన భర్తంగూర్చి, "ఓ నాథా! నీ కొడుకంగదుఁడు మ్రొక్కుచున్నాఁడు. నీ వెప్పటివలె "పుత్త్రుఁడా!

చిరంజీవివి గమ్ము" అని దీవింపకయున్నావు. సింహాముచేఁ జంపఁబడిన యెద్దును ఆవు గనదూడతోఁగూడఁ గొల్చునట్లు, నేనును బుత్రసమేతనై, రణనిహతుఁడవైన నిన్నుఁ గొల్చుచున్నాను. నాథా! యుద్ధమను జన్న మొనర్చి, రామబాణము లనెడు నీటియందు దీక్షాంత స్నానము భార్య నగునన్ను విడిచి యేల సేసితివి? అవభృథమునఁ బత్నీసమేతుఁడై స్నాన మొనర్పవలయునుగాదే! తొల్లి దేవేంద్రుఁడు నీయుద్ధచాతుర్యమునకు మెచ్చి యిచ్చిన పసిండిదండ నీమెడయందుఁ గనఁబడ లేదు? అ దెచ్చటఁబోయె? సౌఖ్యముల నొసఁగువాఁడా! మేరు పర్వతము నడుమనుండుటం జేసి, సూర్యుఁ డస్తమించునప్పుడుగూడ సూర్యకిరణములు మేరుమహీధరమునుండి మఱలనట్లు, నిర్జీవుఁడవైనను నిన్ను రాజకళ విడువకున్నది. నాథా! నేఁజెప్పిన యితవగు పలుకును విననైతివి. నిన్ను నివారింపఁజాలనైతిని. నీవు యుద్ధమున సమసి నన్నును, నా కొడుకును నన్యాయము సేసితివి. ఇప్పుడు నీవు నన్ను విడువఁగా, నా మోముకళయుఁ దగ్గిపోయె" అని పెక్కు తెఱఁగు వగలం బొగులుచుండెను.

## 24-వ స ర్గ ము

### సుగ్రీవుఁడు వాలివధమునకై యనుతాపము నొందుట

అంత బలవంతుఁడగు సుగ్రీవుఁడును తార యాఁపరాని కన్నీటఁ దొప్పఁదోఁగి, దుఃఖ మను మహాసముద్రమున మునిఁగియుండుటను జూచి, తానును నపూర్వమైన తన యన్నయొక్క చావునకు మిగుల వగలఁబొగిలెను. అంత సుగ్రీవుఁడు కండ్లనిండుగఁ గన్నీరు పెట్టుకొని, మనమున వగఫునొందుచుఁ బరిజనులం గూడి మెల్లగా రామునిచేరువ కేతెంచి, వింటిని, సర్పముంబోలు బాణమును ధరిఁచియున్న వాఁడును, పరాక్రమశాలియని పేరెన్నిక గన్న వాఁడును, సకలశుభలక్షణోపేతుఁడును నై నిలఁబడియున్న యారామునితో నిట్లనియె.

"నరేంద్రా! నీ వెంతపని చేయుదువని చెప్పితివో, యంతపని సేసి నాకు రాజ్యము దొరకునట్లు చేసితివి. అయినను, రాజపుత్రా! నాకీ రాజ్యసుఖములందును, తుదకు నా ప్రాణములందును మనసు విఱిగెను. రామా! యీ వాలియొక్క దేవేరి కడు విలపించుచుండ,

వగలంగూడి పట్టణ మెల్ల ఘోషించుచుండఁగా, అన్నమడియగా, అంగదుఁడు వనకికిఁ బ్రాపెవ్వరని మిణుకరించుచుండఁగా, నాకు రాజ్య సుఖములందు మనము దగులలేదు. ఇక్ష్వాకు వంశోద్భవా! మొదట వాలియెడఁగల కినుకవలనను, ఓర్వలేమివలనను, ఎక్కువ బాధ వలనను ఆవాలివధము చేయవలసినది యని యొప్పుకొంటిని. ఇప్పు డీ వానరయూథనాథుఁడు చావఁగా, నేనేల యింతటి దారుణ కృత్యము నేయించితినని భోరింబోరి మనమునఁ బొగులుచున్నాఁడను. వివరింపఁగా, నాకిప్పు డా పర్వతోత్తమమగు ఋశ్యమూకమున నెట్లో యొకతీరునఁ గాలముఁ బుచ్చుచు నుండుటయే మిగుల మంచిదిగా నున్నది. ఈ వాలిం జంపినంతటఁ వచ్చు స్వర్గమైనను నా కక్కఱలేదు. మహాత్ముఁడును, బుద్ధిమంతుఁడునునైన వాలి నన్నుఁ దతిమి "ఓ సుగ్రీవా! నేను నిన్నుఁ జంపుటలేదు. నీ విచ్చమైఁ దిరుగు"మని చెప్పెను. ఆ పలుకు లాతని గొప్పదనమునకును వివేకమునకును దగి యున్నవి. ఆ వాలివధరూపకార్యము నీచుఁడనైన నాకుఁ దగియున్నది. రాఘవా! ఆశ మునుకొని యుండుటచే రాజ్యమునకును, దుఃఖమున కును గల తారతమ్యమిట్టిదని యెఱుఁగక, మహాగుణవంతుఁడైన యన్న మరణమునకుఁ దమ్ముఁడైన నే నియ్యకొంటిని. లోకమున నెవ్వఁడయినఁ దమ్ముఁ డనువాఁ డిట్టి గొప్పవాఁ డగునన్నను జంపఁ గడఁగునే? నా యట్టిపాపి యీ పుడమిని మఱొక్కఁడు లేఁడు. వాలి తన గొప్పతన మును దాఁటనివాఁడగుటచే నన్నుఁ జంపవలె ననుతలంపు వాలికిఁగలుగ దయ్యె. నేను ద్రోహబుద్ధి గలవాఁడనైనందున నన్నయొక్క ప్రాణము లను గొనునంతపాపమున కొడిగట్టుకొంటిని. నేను మొదట యుద్ధము నకు వచ్చినప్పుడు వాలి నన్నొక కొమ్మను దీసి మోదెను. నే నామోదు తాళఁజాలక గిజగిజ తన్నుకొనుచుండఁగా, వాలి నన్ను బుజ్జగించి, "ఓరీ! యిఁక నిట్లు యుద్ధమునకు రాకుము" అని నాకు బుద్ధిసెప్పెను. ఈతఁడు తోఁబుట్టుదనమును, సజ్జనస్వభావమును, నడవడిని గాపా డెను. నే నన్నన్, కామమును, క్రోధమును, కోఁతిస్వభావమును జూపితిని. నరేంద్రా! తొల్లి దేవేంద్రుఁడు త్వష్టకొడు కగు విశ్వ రూపునిఁజంపి, మహాపాతకమును గట్టుకొన్నతీరున, నేనును అన్నను జంపి, యోచింపఁదగనిదియు, విడువఁదగినదియు, కోరఁదగినది గాని

దియు, చూడఁదగినది కానిదియునైన యీ పాపము నొడిఁగట్టుకొంటిని. నేనుజేసిన ద్రోహకార్యము నొక్కఁడు విన్నచో నన్నుఁ జూడఁడు, దగ్గఱఁజేర్పఁడు. నా సాహాయ్యముఁ గోరఁడు. తుదకుఁ దలయెత్తి నా మోమునైనను చూడఁడు. అక్కటా! నేనెంత ద్రోహినైతిని! ఆ యింద్రుఁడుచేసిన బ్రహ్మహత్యాపాతకమును భూమి, జలము, చెట్లు, స్త్రీలును గావలెనని పంచుకొనిరి. ఆతఁడు గొప్పవాఁడు గనుక నతని పాతకము నవి పంచుకొనెనుగాని కోఁతినైన నే నొనర్చిన తోఁబుట్టువుం జంపిన పాపము నేవాఁడు పంచుకొనును? రాఘవా! నీతిమార్గముఁ దప్పినదియు, వంశనాశకరమైనదియు నయిన యింతటిపాపము నొనర్చిన నాకీ ప్రజలగౌరవమెుండె యువరాజపదవియెుండె, రాజ్యమెుండె యెందుకు? సకలజననింది తమును నీచమును, లోకమున నొక్కరిచేతను జేయఁబడనిదియు నయిన యిట్టి పాపకృత్య మొనర్చితిని. ఈ గొప్ప వేతయె వర్షజలప్రవాహము పల్లమునకేగునట్లు నన్ను ముంచుచున్నది. తోఁబుట్టువుఁజంపుట యను వెనుకటిమేనును, దోఁకయుఁగలదియు, వేడిమియను తొండము, కన్ను, శిరస్సు, కొమ్ములుగలదియు, పాపరూపమయినదియు నయిన మదపుటేనుఁగే పారుచు నదిగట్టులను బడఁద్రోయునట్లు నన్నుఁ గ్రిందఁ ద్రోయుచున్నది. ఓ మానవాధినాథా! పుటమువేయఁబడిన వన్నెలేనిబంగారము మాలిన్యమును వెలికిద్రోయు నట్లు నామనముననుండు ధర్మవృత్తమును నీ పాపము నోర్వఁజాలక వెడలిపోవుచున్నది. రాఘవా! బలవంతులైన వానరశ్రేష్ఠులయొక్కయు, ఈ యంగదునియొక్కయు, ప్రాణములు నావలనఁ గలిగినవధ్వపుచే సగముపోయినవని యెంచెదను. మంచిగుణములుగలవాఁడు, చెప్పిన మాట వినువాఁడునయిన కొడుకును బడయవచ్చునుగాని యంగదునితో సమానుఁడగు కొడు కెక్కడ దొఱకును? మఱియు నే దేశమునకేగిన నాకుఁ దోడబుట్టువు దొరకగలఁడు. ఇవి రెండు నీ జన్మమున నాకిఁక లేవు. ఓ పూజ్యుఁడా! అంగదు డొక్కవేళ బ్రతికియుండునేని, వాని తల్లియగు తారయుఁ బుత్త్రరక్షణమునకై జీవించియుండును. అట్లుకాక యంగదుడు పితృవియోగముచే క్షీణించునేని తారయుఁ బుత్త్రశోకముచే జీవింపఁజాలదని నేను దృఢముగా నమ్మియున్నాఁడను. రాఘవా! నేను నా యన్నతోను, కొడుకుతోను జెలిమిగోరి, తీక్ష్ణముగ

మండుచున్న యగ్నిం బ్రవేశించెదను. ఈ వానరశ్రేష్ఠు లందఱు నీ మాటచొప్పున నడచుచు సీతను వెదకఁగలరు. రాజపుత్రా! నేను నశించి నను నీకార్యము తప్పక నెఱవేఱఁగలదు. నేను కులమునకుఁ జెఱుపన చేటన్నైనవాఁడను. నే నిఁకఁ బుడమినుండుట సరిగాదు. నేను పాపాత్ముఁ డను. నా కగ్ని ప్రవేశముసేయ ననుమతియొసఁగుము" అని యిట్లెలఁ గున వాలితమ్ముఁడగు నా సుగ్రీవుఁడు దీనముగాఁ బలుకఁగా, పగతుర జోదులం బరిమార్చు రాముఁడును కొండొక సేపు కండ్లనీరు పెట్టుకొని విచారము నొందినవాఁ డయ్యెను.

భూమిదేవివలె నోర్పుగలవాఁడును, లోకపాలుఁడునయిన రాముఁ డప్పుడే విచారము నొంది, తనచాయఁ బలుమాఱుచూచుచు, వ్యసనసాగరమున మునిఁగినదై పలవించుచున్న తారను బూనికతోఁ జూచెను. అప్పుడు వానరయూథనాథుఁడయిన తనమగనిని గట్టిగాఁ గౌఁగిలించుకొని నేలమీఁదఁ బరుండియుండునదియు, గొప్ప గుణములు గలదియునయిన సొగసుకన్నులు గలదగు తారను మంత్రిశ్రేష్ఠులందఱు లేవఁదీసి కూర్చుండఁబెట్టిరి. ఆతార తనపెనిమిటిని గట్టిగాఁ గౌఁగిలించి కొని యున్నందున మంత్రులు రెండుచేతులసందులఁ జేతులుపట్టి యెత్తి నను, వారిచేతులనడుమనుండి యొడిసి పట్టు విదిలించుకొని క్రిందఁ బొరలుచు, బలాత్కారముగా వారిచే లేవనెత్తఁబడి, సూర్యుని మాడ్కిఁ దన వెలుఁగుచే మెఱయుచున్న ధనుర్బాణధారియైన రామునిఁ జూచెను. జింకపిల్లకన్నులంబోలు కన్నులుగలదియైన యా తార రాజ చిహ్నములతోఁ జక్కఁగా నొప్పినవాఁడును, సొంపుమీఱు కన్నులు గలవాఁడును, ఇంతకుమున్ను తనచేఁ జూడఁబడనివాఁడు నయిన రామునిఁజూచి "ఈతఁ డాకాకుత్థ్సవంశోద్భవుఁడయిన రాముఁ"డని యెఱిఁగినదాయెను. సత్కులమున జన్మించిన యా తారయు మిక్కిలి దుఃఖమునొంది నొచ్చినదై సొలయుచుఁ గడువేగిరము వేల్పుతేనికెన యగువాఁడును, శత్రువులకు లొంగనివాఁడును, మహానుభావుఁడును నయిన రాముని సమీపమునకు వచ్చెను. నిర్మల స్వభావురాలగు నా తార తత్తరపాటొంది, ధైర్యమువీడి, గొప్ప మనస్సుగలదై యుద్ధ రంగమున గుఱిచూచి యేయఁగల యా రామునిఁజేరి యిట్లనియె.

ఓ రాఘవా! నీ వప్రమేయుఁడవు; మూఢులకుఁ బొందరాని

వాఁడవు; ఇంద్రియాళి నెల్ల జయించినవాఁడవు; గొప్ప ధార్మికుఁడవు; తఱుఁగని కీర్తిగలవాఁడవు; వివేకివి; భూమివలె నోర్పుగలవాఁడవు. రక్తసదృశ నేత్రములుగలవాఁడవు; మహాబలశాలివి; దృఢాంగుఁడవు; ధనుర్బాణములను జేతఁ దాల్చినవాఁడవు. ఇట్టి నీవు మానుషదేహ బలంబును విడిచి దివ్యదేహబలము నొందితివి. ఓ రామా! నీ వేయొక్క బాణముతో వాలినిఁ జంపితివో, అట్లే యా యొక్క బాణముతో నొక్క పెట్టున నన్నును గూల్చుము. నీచేఁ జంపఁబడినదాననై, నేనును నా ప్రియునికడ కేగుదును. నన్నుఁబాసి నామగఁ డొక్కనిమిషమైన నుండఁజాలఁడు. తామరపూవుల ఱేకులంబోలు కన్నులుగల నామగండు స్వర్గమునకేగియు, పలుతెఱంగులైన యెఱ్ఱని క్రొమ్ముడులుగలిగి, వింత గొల్పు వేషములఁదాల్చిన యచ్చరలంజఱెంజూచియు, వారితోఁ గూడు టకు మనమున నిష్టపడఁడు. మనోహరమైన పర్వతంపు దరియందు నీవు సీతనుబాసి యెట్లు కుందుచున్నావో, ఆ చందముననే నా ప్రియుఁ డును ననుఁబాసి స్వర్గమునందు సైతము వ్యసనమును విన్నదనమును బొందఁగలఁడు. రామా! ప్రాయంపుఁబురుషుఁడు స్త్రీ విరహముచే వ్యసనమునొందునను విషయము నీకు స్వానుభవవేద్యమే కదా. వాస్త వము నెఱిఁగినవాఁడవుగాన నన్నుఁజంపుము. అట్లయినచో వాలి నన్నుఁ జూడకుండుటచేఁ గలుగువ్యసనము నొందకుండును. మానవాధిపకుమారా! "ఇది యాఁడుదికదా, ఆఁడుదాని వధించుట పాపము. ఆ పాపమునకేల నే నొడిగట్టుకోవలెనని తలంతువేమో! ఈ నా ప్రాణమును వాలిదేయని యెంచి నన్నుఁ బరిమార్పుము. నీకును స్త్రీవధపాతకము సంభవింపదు. ధర్మశాస్త్రవచనములు వేదము లనేకము లును, "భార్య భర్తయొక్క యాత్మయేకాని వేఱుగాదు" అని చెప్పుచున్నవి. లోకమునఁ బత్నీదానమునకంటె గొప్పదానము వేఱొ క్కటి లేదు. కావున నేను వాలియాత్మనే కనుకను భార్యాదానము శ్రేష్ఠమే కనుకను నన్నుఁ జంపుము. దాన నీకుఁ బుణ్యమేకాని పాత కముగలుగదు. వీరుఁడా! నీవును నా ప్రియుఁడైనవాలికి నన్నొసఁగు టచేఁ బుణ్యమేపొందుదువుగాని, నావధముచే స్త్రీవధపాతకమ్ము నీకుఁ గలుగదు. నొచ్చినదానను, నాథుఁడు లేనిదానను, భర్తచేతవంచింపఁ బడుచున్నదానను నయిన నన్నును జంపుము. నరేంద్రా! మదపు

ఏనుఁగు కైవడి నొయ్యారముతో నడచువాఁడును, వానరాధిపుఁడును, నేర్పుకాఁడును, మేలిమి పసిండిదండను దాల్చినవాఁడునయిన నా ప్రియునిఁ బాసి చిరకాలము జీవింపఁజాలను. కావున నన్ను వధించి నా ప్రియునికడఁజేర్చి యా పుణ్యమును గట్టుకొనుము." అని యిట్లు పలుకుచున్న తార నూరడించుచు మహాత్ముఁడగు రామభూవిభుండిట్లనియె.

ఓ వీరునిభార్యా! శూరునిపెండ్లామవైన నీ విట్టులు విచారములఁ గుందుట తగదు. బ్రహ్మదేవుఁడు జనులనెల్ల సృజించెను. కనుక జనులంద ఱాతని యానతి చొప్పున సుఖదుఃఖములఁ బొందుదురని యందఱు పలుకు... ము ల్లోకములును ఆ బ్రహ్మకు లోఁబడి యతఁ డేర్పఱచిన సుఖ... ఖముల... సుండును. వానిని మీఱుట కెవరును జాలరు. ఇంత తడవు నీవు వ్యసనమునొందితివి. ఇఁక నీపుత్త్రుఁడు యువరాజపట్టము నొందునుగాన, దుఃఖమునందినట్లే సుఖము నందఁ గలవు. కావున నీబోఁటిశూరుని యిల్లాండ్రు విధి త్రిప్పటలనుగూర్చి వగవరు. ఏది యేవేళకు వచ్చిన, దాని నావేళ ననుభవింపవలయునని దృఢనిశ్చయముమై నుందురు." అని యిట్లు ప్రభావముగలవాఁడును, శత్రుసంహారియునయిన రాముఁ డూరడింపఁగా, చక్కని రూపముగల దగు వీరునిభార్యయగు తారయు గొంతెత్తి కొంతసేపు రోదనముసేసి యంతట నూరటనొందెను.

## 25-వ సర్గము

### వాలిని దహనమొనర్చుట

వెండియు రాముఁడు లక్ష్మణునితోఁడఁగూడి, వారితో సమానమయిన వ్యసనమునంది, సుగ్రీవతారాంగదులను గూర్చి యిట్లనెను! "మృతినొందినవానిం గూర్చి విశేషము దుఃఖించిన, నాతనికి మన శ్శాంతి గలుగదు. కావున నిఁకఁ జేయవలసినపని యోజింపుఁడు. లోకాచారము ననుసరించి నడచుకొనవలెను. ఇంక నేడువవలదు. దైవమును మీఱి యెట్టిపనినిచేయ శక్యముకాదు. లోకములో నన్నింటికిని దైవమేకారణము. ఎల్లపనులకును దైవమే సాధనము. సకలభూతములను తమతమ పనులఁజేయించుటయందు దైవమే కారణము. ఎవఁడును దేనికిని కర్తగాడు ఎవఁడును ఎవనిని ఆజ్ఞాపించుట కధికారిగాఁడు. లోకము స్వభావసిద్ధముగనున్నది. దానికి దిక్కు దైవము. దైవ

మాత్మను మీఱజాలదు. దైవమునశింపదు. దైవమునకు లోఁబడి యాదైవము నెవ్వఁడు మీఱివర్తింపఁడు. దైవమునకు మనవాఁడు పొరుగువాఁడను భేదము లేదు; కారణము గావలెనని లేదు; ఇతఁడు బలశాలికదా యని చూడఁడు; ఆతని కొక్కఁడు చెలికాఁడనియు, నొక్కఁడు దాయాదుఁడనియు ఈ మొదలగు సంబంధములు లేవు. ఆ దైవముయొక్క చేష్టలకుఁ గారణము లేదు. అది పురుషునికి లోఁబడినదిగాదు. మఱియేమి యనిన జ్ఞానవంతుఁడగువాఁడు, ఏది సంభవించినను, అది దైవముయొక్క కార్యమనియు, మనుష్యునకు ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధపురుషార్థములు వానివానికర్మాను సారముగా గలుగుచుండుననియు, ఆ విషయమున మానవుఁడు వ్యసన మొందరాదనియుఁ దెలియుచుండవలయును. వానరేశ్వరుఁడగు వాలియు నాచే వధింపఁబడి, పాపంబులనుండి విడువఁబడి, ధర్మార్థ కామములతోఁగూడి, తా నొనర్చిన కర్మమునకుఁదగిన ఫలమునొందెను. మహాత్ముఁడగువాలియుఁ బ్రాణములను రక్షించుకొనక యుద్ధము నొనర్చి, స్వధర్మము నడపుటవలనఁ దాను ముందుగెల్చిన స్వర్గమునకుఁ బోయి చేరెను. దైవము బలవత్తరము కావుననే వాలి దైవమునకుఁ లోఁబడెను. కావున వ్యసనమునొంది యుపయోగము లేదు. ఇఁకఁ జేయవలసినకార్యముఁ జేయుఁడు" అని రాముఁడు సుగ్రీవాదులతోఁ జెప్పెను.

రాముఁ డి త్తెఱఁగునఁ జెప్పి ముగింపఁగా, పగతురవీరులం బరిమార్చునట్టి లక్ష్మణుఁడు వంతచే మైమఱచియున్న సుగ్రీవునిఁజూచి, "సుగ్రీవుఁడా! యింక లెమ్ము. వాలికిఁ జేయవలసిన యూర్ధ్వదేహసంబంధి క్రియలను జరిపింపుము. నీవు తారాంగదసమేతుఁడవై వాలిదహము కొఱ కెండిన శ్రీగంధపుఁజెక్కలు మున్నగు కట్టెల నధికముగాఁ దెప్పింపుము. వాలికి సంస్కారము చేయవలయుఁగానఁ జింతాక్రాంతుఁడై యున్న యంగదు నూఱడింపుము. సుగ్రీవా! యీ పురమెల్ల నీ యధీనమై యున్నది. నీవు దుఃఖించిన నీ పురమెల్ల దుఃఖించునుగావున నీవు మూఢునియట్లు దుఃఖము నొందకుము. అంగదునితోఁజెప్పి, పూల దండలను, పలుతెఱంగులగు వస్త్రములను, ఆజ్యమును, తైలమును, సువాసనద్రవ్యములను దెప్పించి; యావలఁ జేయవలసిన కార్యములఁ

జేయుము. ఓ తారుఁడా! నీవు వేగముగ నేగి పల్లకినొకదానిని బట్టించుకొనిరమ్ము. కార్యముల నెప్పుడును త్వరగా జరుపుట మేలు. అందును నిష్క్రియమయమున మరింత మేలు. పల్లకీని మోయఁగలవారును, బలవంతులునునయిన వానరులను సిద్ధపఱపుము" అని చెప్పి, యన్నయొక్క చేరువ నిలువఁబడియుండెను.

లక్ష్మణునిమాట విని, తారుఁడు పల్లకిఁ దేరఁ ద్వరపడుచు గుహకుఁ బోయి, పల్లకినెత్తించికొని, మఱల వేగమే యేగుదెంచెను. బరువు మోయఁగల మొనగాండ్రగు వానరులచే మోసికొని రాఁబడుచుండునదియు, మేల్మియాసనముతోఁ గూడినదియు, రథముఁబోలినదియు, చిత్రింపఁబడినపక్షులతోను, వృక్షములతోను, బంటులబొమ్మలతోను గూడినదియు, అన్నివైపులఁ జక్కఁగా బిగింపఁబడినదియు, గవాక్షములతోఁ గూడినదియు, సిద్ధులవిమానములం బోలినదియు, చక్కఁగా నమర్పఁబడినదియు, విశాలముగానున్నదియు, విశ్వకర్మచేఁ జక్కఁగా జేయఁబడినదియు, కొయ్యతోఁజేసిన చిన్నికొండలతోఁ గూడినదియు, చక్కని పనితనముగలిగి శోభిల్లునదియు, ఉత్తమభూషణములచేతను, పలురంగుల పూవులదండలచేతను నొప్పారుచున్నదియు, విలాసార్థమైన గుహాలతోను, అరణ్యములతోను గప్పఁబడినదియు, ఎఱ్ఱని గందపుఁబూఁతగలదియు, పూవులచేఁ గప్పఁబడినదియు, బాలభానుబింబము యొక్కవర్ణముతో వెలుఁగుచున్న తామరపూవుదండలచేఁ నలంకరింపఁబడినదియు నయిన పల్లకిఁజూచి, రాముఁడు లక్ష్మణునితో "వాలి నీపల్లకియం దుంచికొనిపోయి దహనము గావింపవలయు" నని యానతిచ్చెను.

అప్పుడు సుగ్రీవుఁడు రోదనముసేయుచు, తాను నంగదుఁడును నిర్జీవుఁడయిన వాలినిబట్టి పల్లకియం దెక్కించి, నానావిధభూషణపుష్పమాలావస్త్రములచే నలంకరించి, వానరులంజూచి, "అన్నగారి కుత్తరక్రియలు బాగుగా జరుపవలయును. వానరులందఱు నానావిధములగు రత్నముల నవారిగా యాచకులకు వెదఁజల్లుచు పల్లకిముందు నడతురుగాక" అని యానతియొసఁగెను. లోకమునందలి రాజుల వైభవమునకుఁ దగినట్లుగా, వాలికి నుత్తరక్రియలు సత్వరముగా వానరులు నడిపించిరి. అప్పుడు తారుఁడు మున్నగు నాప్తులయిన వానరు లందఱు తమబంధు

వును బోఁగొట్టుకొని యార్చుచు నంగదునిఁ దోడుకొని వేగ నడిచిరి. అంత వాలియధీనముననున్న తారమున్నగు ప్రియురాండ్రయిన వానర కాంతలందఱు, ననాథలయి 'వీరుఁడా! వీరుఁడా!' యని దీనస్వరముతోఁ పలుమాఱు విలపించుచు పల్లకిని వెంబడించిరి. ఆ వానరకాంతల యేడ్పులమ్రోఁతలకు నడవులనడుమనున్న పర్వతములును, వనములును నంతటను మాఱుమ్రోఁత లీనుచుండెను. అట్లు మోయఁజాలినవానరు లందఱు చింతచేఁ జిక్కినవారలై, విజనమై, జలసమృద్ధమైయుండు నొక్క సెలయేటియిసుక తిన్నెపయిఁ బేర్చిన చితిసమీపమున తమమూపుర ములనుండి పల్లకినిదించి, యేకాంతస్థలమున దుఃఖించుచునుండిరి.

అంతటఁ దార పల్లకిలోఁ బరుండఁబెట్టియున్న తన పతినిఁజూచి, మిక్కిలి వంతనొంది యాతనిశిరమును దన తొడపై నిడికొని "అక్కటా! వానరమహారాజా! హా! నాథుఁడా! హా! నాపై ప్రేమగలవాఁడా! హా! ఉత్తమపురుషుఁడా! హా! మహాబాహువా! ఓ నాప్రియా ! నన్నుఁ గన్నెత్తిచూడుము. వీరందఱు నీ వియోగశోకముచె నొచ్చియున్న వారు. వీరినందఱ నేల చూడకున్నావు? నాథా! నీవు విగతప్రాణుఁడ వయినను, నీమోము చిఱునవ్వునవ్వుచు నున్నట్లును, బ్రతికియున్న ప్పుడుం బోలె సాయంకాలపు సూర్యునివన్నెతో సాటియగు వన్నె గలిగియుండు నట్లును గనఁబడుచున్నది. వానరాధిపా! యీ రాముఁడు నీపాలిటి యమధర్మరాజయ్యె. ఈ రాముఁడు వనమున నొక్కబాణ ముచే నిన్నుఁగూలనేసి మమ్మునందఱ ననాథలంగావించె. రాజేంద్రా! నీమనసున కెక్కిన యీ వానరకాంతలందఱు ఇప్పు డింతదవ్వు నడచి వచ్చిరే.నీ వదికనుట లేదా! చందురునిఁబోలు మోములుగల యీ కాంత లెల్లరు నీ కెక్కిన ప్రియలుగదా ! వానరపుంగవుఁడైన యీ సుగ్రీవుని నిప్పు డేల చూడకున్నావు? ఓరాజా ! తారుఁడు మున్నగు నీ మంత్రు లును, పురజనులు నిన్నుఁజుట్టి నిల్చియున్నారు. వీరికందఱికి సెలవిచ్చి పంపుము. మనము మదనపర తంత్రులమై యీ వనముల విహరింతము" అని తనప్రియునింగూర్చి విలపించెను.

ఇట్లు భర్తృమరణజనితశోకముచేఁ జిక్కి విలపించుచున్న తారను వానరకాంతలందఱు వంతచేనొగిలినవారలై యావలికి లేవఁదీసి కొనిపోయిరి. తరువాత నంగదుఁడు చింతచే నిద్రియజ్ఞానము లేనివాఁడై

రోదనము నేయుచు సుగ్రీవునితో డ్పాటున వాలిని జితిపై నెక్కించెను. డెందమున మిగులగుందినవాడై యంగదుడు శాస్త్రవిహితరీతిని జితికి నిప్పంటించి, దీర్ఘప్రయాణమునందరలిన తనతండ్రి కప్రదక్షిణము గావించెను. వానరులు వాలికి యథావిధిగ దహనసంస్కారముఁజేయించి, తర్పణము గావించుటకై చల్లనినీటితోఁగూడిన పవిత్రమైన యొక సెలయేటిగట్టునకు వచ్చి చేరిరి. అచ్చట వారందఱు అంగదుని ముందిడుకొని, సుగ్రీవతారలతోఁగూడ వాలికిఁ దర్పణముచేసిరి. రాముఁడును దీనుఁడైనసుగ్రీవునితో సమానమగు వ్యసనముగలవాఁడై వాలికిఁ బ్రేతకర్మలనెల్ల దాపున నుండి జరిపించెను. అంత సుగ్రీవుఁడు మేటిపౌరుషముగలవాఁడును, ఇక్ష్వాకువంశవీరుఁడగు రామునిచేఁ జంపఁబడినవాఁడునునైన వాలి కిట్లు దేహసంస్కారముగావించి వెలుఁగుచున్న యగ్నిని బోలిన ప్రతాపముగలవాఁడును, లక్ష్మణసమేతుఁడునునైన రాముని దగ్గఱకుఁ జేరెను.

## 26-వ సర్గము

### సుగ్రీవుని పట్టాభిషేకము

అనంతరమున మంత్రులగు వానరులు వాలిమరణశోకముచే నొచ్చినవాఁడును, తడిబట్టగలవాఁడునైన సుగ్రీవునిచుట్టు నిలుచుండి, మంచిపనులను జేయువాఁడగు నిడుదచేతులవాఁడైన రామునికడకేగుదెంచి, చేతులుజోడించి, ఋషులు బ్రహ్మను గొల్చువిధమున నారామునిఁ గొల్చు చుండిరి.

అప్పుడు బంగరు కొండడాలువంటి మేనిడాలుగలవాఁడు, బాలసూర్యుని పగిది వెలుఁగుమోముగలవాఁడునైన వాయునందనుఁడగు హనుమంతుఁడు రామునింగూర్చి, "ఓ ప్రభూ! తమయనుగ్రహమునం జేసి, సుగ్రీవుఁడు పొందుట కలవికానిదియు, తాతతండ్రులనాటినుండి వచ్చినదియునైన యీ మహావానరరాజ్యమును బడసెను. సుగ్రీవుఁడు మీ యనుజ్ఞ వడసి, యమాత్యవర్గముతోడ నందమగు పురము ప్రవేశించి మిత్రులతోఁగూడ నెల్లకార్యములఁ నాచరింపఁగలఁడు. ఇతఁడు యథావిధిగా నానావిధంబులగు సుగంధతీర్థములచేతను, ఔషధజలములచేతను బట్టాభిషిక్తుఁడై తమ్మురత్నములచేతను, పూవుల

చేతను విశేషముగాఁ బూజింపఁగలఁడు. ఇచ్చటనుండి తాము రమ్యమగు నీకిష్కింధకు నేతెంచి, వానరులకంఁదఱి కెక్కువ యానందము గలిగించుచు, సుగ్రీవునకు రాజ్యమునొసఁగుఁడు" అని చెప్పెను.

బుద్ధిమంతుఁడును, మాటలందు నేర్పరియు, శత్రుసంహారియు నైన రాముఁడు హనుమంతునిపలుకు లాలకించి, యతనితో "ఓరీ! నాయనా! హనుమంతుఁడా! మాతండ్రి నన్నుఁ బదునాలుగేండ్లు వనవాసముచేయున ట్లాతిచ్చెను. కావున నేను పురమునుగాని గ్రామమునుగాని ప్రవేశింపను. శూరుఁడగువానరశ్రేష్ఠుఁడయిన సుగ్రీవుఁడు వేగమే కలుములతో నిండినది యగు చక్కనైన కిష్కింధను బ్రవేశించి, యథావిధిగా రాజ్యాభిషిక్తుఁడగును గాక!" అని చెప్పి, తాను నడవడులనెఱింగినవాఁడగుటంజేసి, మంచినడవడిగలవాఁడును, విశేషబలపరాక్రమములుగలవాఁడు నగు సుగ్రీవునింగూర్చి, "సుగ్రీవా! యీ యంగదుఁడు నీయనన్నఁ గొడుకు; బలిమిని నీకెనవచ్చువాఁడు. ధైర్యవంతుఁడు. యువరాజపదమునకుఁ దగినవాఁడు. కావున వీనిని యువరాజపదమున నభిషేకముసేయుము. ఇప్పుడు వర్షాకాలము వచ్చెను. నాయనా! వార్షికము లనఁబడెడి నాలుఁగుమాసములలో నీశ్రావణమాసము మొదటిది. ఇది సీతను వెదకుటకుఁ దగినసమయము గాదు. నీవు పత్తనమునకుఁ బొమ్ము. నేను లక్ష్మణసమేతుఁడనై, యీ ఋశ్యమూక పర్వతముననే యుండెదను. ఈ పర్వతగుహాయు రమణీయమై విశాలమై యోర్వఁగూడినంత సమశీతోష్ణముగల వాయువుతోఁగూడినదై, విశేషమగు నీటివసతిగలిగి, విస్తారములయిన కమలోత్పలములతోఁ గూడియున్నది. కార్తికమాసము రాఁగానే నీవు రావణవధమునకుఁ బ్రయత్నింపుము. అదియె మన కేర్పాటు. సాధువర్తనుఁడా! నీ విప్పుడు నిజనగరముఁ బ్రవేశింపుము. పట్టాభిషిక్తుఁడవయి నీహితులకందఱకు బహుమానము లొసఁగి సంతోషపఱుపుము" అని సుగ్రీవునితోఁ జెప్పెను.

వానరాధిపుఁడగు సుగ్రీవుఁ డిట్లు రామునివలన ననుజ్ఞవడసినవాఁడయి, యింతవఱకు వాలిచేఁ బాలింపఁబడుచుండిన కిష్కింధాపురము సొచ్చెను. పెక్కువేల వానరులు మ్రొక్కుచు, నాతనివెంటఁ బ్రవేశించి యంతటఁ గొలిచియుండిరి. ఆ సుగ్రీవుఁడు పురమునకు

వచ్చినప్పు డచ్చటిజనులందఱు వానరగణాధిపుఁడగు నా సుగ్రీవుని దర్శించి మనస్సునఁ గొఱఁతలేనివారలయి సాష్టాంగముగాఁ బుడమిని సాగిలఁబడి మ్రొక్కిరి. వీర్యబలవంతుఁడగు సుగ్రీవుఁడు జనులనందఱను లేవనెత్తి హెచ్చరించి, చక్కనైయున్న తన యన్నగారి యంతఃపురము సొచ్చెను. అంతట నా సుగ్రీవునిహితులందఱు గూడివచ్చి యంతిపురినుండి వెలువడివచ్చిన వానరపుంగవుఁడగు సుగ్రీవుని, దేవతలు వేయికన్నులతేనిఁ బోలెఁ గిష్కింధాపురమునకుఁ బట్టభద్రునిఁ గావించిరి. అప్పుడు వానరు లతనికి బంగరుపూతపూసిన తెల్లనిగొడుగు పట్టిరి. బంగరుకాడలుగల కీర్తికరములైన తెల్లని వింజామరలు వీచిరి. సకల రత్నములను, సకలవిధములగు విత్తనములను, ఓషధులను, పాలుకాఱుచెట్ల, చిగుళ్లను, పువ్వులను, తెల్లజరీబట్టలను తెల్లనిగంధమును, నెత్తావిగల పూలదండలను, స్థలజనీరజకమలములను, మేలిమిగంధములను, పెక్కుతెఱఁగులగు ననేకపరిమళద్రవ్యములను, విఱుగనిపసపక్షతలను, తెల్లావాలును, తేనెను, నేయిని, పెరుగును, వ్యాఘ్రచర్మమును, అడవిపందితోలుతోఁ జేయఁబడిన చెప్పులను దెచ్చియిచ్చిరి. అప్పుడు పదునాఱుగురు కన్నెపడుచులు మైపూఁతలను, గోరోచనమును, మణిశిలను గైకొని సంతసముతోఁ దెచ్చి కానుకలర్పించిరి. అంత వానరులందఱు సుగ్రీవపట్టాభిషేకసమయమున బ్రాహ్మణోత్తములను వస్త్రకనకరత్నములచేతను, భక్ష్యభోజ్యాదులచేతను దనివినొందించిరి. అప్పుడు మంత్రవేత్తలయిన ఋత్విజులు దర్భలు చుట్టు పఱవఁబడియున్న యగ్నిని బ్రజ్వరిల్లఁజేసి మంత్రములచేఁ బావనములయిన హవిస్సులతో వేల్చిరి. తర్వాత బంగారుకాళ్లుగలదియు, మంచిపఱుపు పఱువఁబడినదియు, పలువన్నెలుగలదియు, పుష్పమాలికలతో నలంకరింపఁబడినదియునైన రమ్యమగు రాచనగరుయొక్క పైభాగమున సుగ్రీవుని దూర్పుమొగముగ సింహాసనాసీనుంజేసి, నదీనదములనుండియు, సకలతీర్థములనుండియు, సకలసముద్రములనుండియుఁ దెచ్చి బంగారుకలశములందు నింపియున్న సుగంధి నిర్మలోదకములను జక్కనియెద్దుకొమ్ములలోను, బంగారుగిండీలలోనుఁ బోసికొని శాస్త్రములందు మహర్షులు చెప్పినతెఱఁగున, వసువులు దేవేంద్రునిఁబోలె నభిషేకించిరి. సుగ్రీవునికిఁ బట్టాభిషేకమయినయప్పుడు వేలకొలఁదిగనున్న

బలశాలు రగువానరశ్రేష్ఠులందఱు సంతోషభరితులై, కోలాహలము లొనర్చిరి.

అంత వానరశ్రేష్ఠుఁడయిన సుగ్రీవుఁడును రామునిమాటచొప్పున నంగదునిఁ గౌఁగిలించికొని యువరాజపట్టాభిషిక్తుం జేసెను. అంగదుఁడు యువరాజ్యపదవి నందినప్పుడు వానరులందఱు తండ్రిలేని యంగదుని యందు జాలినొందినవారలై, సుగ్రీవుఁ డొనర్చినపని బాగుబాగని యాతనిం గొనియాడిరి. అట్టి పట్టాభిషేకమహోత్సవము జరిగినప్పుడు వానరులందఱు సంతసించినవారలై, మహాత్ములయిన రామలక్ష్మణుల వలనఁ గదా యీ మహోత్సవము జరిగెనని వారి నిరువురుని బలుమాఱు పొగడిరి. పర్వతగుహాయందుండు నా చక్కని కిష్కింధాపురమున నుండువారందఱు సంతసముచే నుప్పొంగిరి. పట్టణమెల్లఁ డెక్కెములచేఁ బ్రకాశించుచుండెను. తర్వాత వీరుఁడగు వానరసేనానాయకుఁడయిన సుగ్రీవుఁడు తనపట్టాభిషేకము జరిగినవృత్తాంతమును రాముని కెఱిఁగించి తనభార్యయగు రుమనుగ్రహించి, దేవేంద్రుఁడు స్వర్గమును బోలెఁ గిష్కింధాపురరాజ్యమును బొందెను.

## 27-వ సర్గము

### రాముఁడు ప్రస్రవణపర్వతము చేరుట

సుగ్రీవుఁడు పట్టాభిషిక్తుఁడై గిరిగుహంజొచ్చినపదంపడి, తిన్నని స్వభావముగలవాఁడు పుణ్యాత్ముఁడునైన రాముఁడు సుగ్రీవునితో నేర్పాటుకావించుకొని, లక్ష్మణసమేతుఁడయి భయంకరముగా నఱచు సింహవ్యాఘ్రాదిమృగముల నాదములతో మ్రోగుచున్నదియు, పెక్కుపొదలతోను, తీఁగెలజొంపములతోను మఱుగుపఱుపఁ బడినదియు, ఎలుఁగుబంట్లు, కోఁతులు, కొండముచ్చులు, జంగుపిల్లులు మొదలగు మృగముల కునికిపట్టును, మొగిళులకూటముమాడ్కి నున్నదియు, నెల్లప్పుడు తేటనీటితోఁగూడినదియు నైన ప్రస్రవణపర్వతమునకు నేతెంచి, యాపర్వతశిఖరమున నొక్కవిశాలగుహాయందు నివసించి కాలము పుచ్చఁగోరి, యడఁకువగలవాఁడును, కాంతిమంతుఁడునయిన లక్ష్మణునితో సమయోచితముగా నిట్లనెను.

శత్రువుల నణఁగఁద్రొక్కినట్టి యో లక్ష్మణా! యీ పర్వతగుహ విశాలమయి, గాలి చక్కఁగా వీచుచు మనోహరమయియున్నది. రాజపుత్రా! తెలుపు, నలుపు, నెఱుపురంగుగల ఱాలచే మెఱయుచున్నదియు, నానావిధ గైరికాది ధాతువులతో నిండినదియు, గుహలతోను, సెలయేళ్లతోను నొప్పారుచున్నదియు, పెక్కుతెఱఁగులగు చెట్లతోను, తీఁగెలజొంపములతోను జెన్నారునదియు, నెమ్మికూఁతలు మొదలగు పలుపులుఁగులకూఁతలతోఁ గూడినదియు, విపులతోఁగూడిన మొల్లల మల్లెలపొదలు, వావిలి, గోరంట, కడప, ఏఱుమద్ది, మద్దిచెట్లచే వెలయునదియునైయున్నది. రాజపుత్రా! పుష్పించిన తామరపువ్వులచేనలంకృతమై యున్న యీమనోహరమగు కొలనును మనముండు గుహకు దాపుననే యున్నది. ఈశాన్యమూలయందున్న యీగుహయొక్క ద్వారము నైరృతి ముఖముగ నుండుటవలన నీశాన్యమూలనుండివచ్చువానజల్లుకొట్టదు కావునను, వెనుకటివైపున నెత్తుగనుండుటచే తూర్పునుండి వచ్చు చలిగాలియు సోఁకకుండునుగావునను నిది సుఖముకరముగ నుండఁగలదు. సౌమిత్రీ! గుహయొక్క వాఁకిట చదునైన చక్కనిఱాయియున్నది. అది నున్నగను, చాలవిశాలముగను, విఱియఁబోసినకాటుకరాశివలె, నున్నది. నాయనా! ఉత్తరముననున్న యీగిరిశృంగమును చూడుము. కాటుకప్రోవునుబోలి పైకెగసినమబ్బువలె నున్నది. దక్కినంపుదెసయందును, పెక్కు కావిఱాలతో నలంకరింపఁబడినది, అపరకైలాసపర్వతశిఖరమో యనఁబరఁగినదియునయిన యొక శిఖరమున్నది. మఱియు నీ గుహకుఁ దూర్పువైపున సంపెంగ, బొట్టుగు, మద్ది, రేఁగు, కురువెంద, పద్మకము, సరళము, అశోకము, ప్రబ్బలి, తినాస, పొగడ, మొగలి, చంద్ర, గిలకతాటి, లొద్దుగు, కడప, వేప, రేల మొదలగు రెండుగట్టులందలి మొలచిన చెట్లచే వస్త్రాభరణములతోఁ జక్కఁగా నలంకరించుకొనిన యువతివలె శోభిల్లుచు, బురదలేని తేటనీటితో దూర్పునకుఁ బాఱెడు నదియొకటి; త్రికూటపర్వతముచేరువ గంగానదిమాడ్కిఁ బాఱుచున్నది. మఱియుఁ బెక్కుతెఱఁగులయిన కూఁతలుకూయు పక్షుల గుంపులతోఁ గూడినదియు, అన్యోన్యానురాగముగల చక్రవాకములు, రాయంచలు బెగ్గురులు మొదలగు జలపక్షులతోఁగూడిన యిసుకతిన్నెలుగలదియునై యీనది సర్వాభరణముల ధరియించి చిఱునవ్వు

నవ్వుచున్న జవ్వనివలెఁ బ్రకాశించుచున్నది. ఈనదియందొక్క చోట నల్లకలువలున్నవి; మఱియొకప్రక్కఁ జెంగల్వలు మెఱయుచున్నవి; మఱియొకప్రక్క దివ్యములయిన తెల్లగలువలమొగ్గలు వెలయుచున్నవి. లక్ష్మణా! ఈ నదీతీరము పెక్కు జలపక్షులు, నెమళ్ళు, కొంగలు మొదలగు పక్షులకూఁతలతో నిండి మనోహరమయి మునిశ్రేష్ఠుల కునికియై వెలయుచున్నది. లక్ష్మణా! నేప్పుతో మాలవలెఁ గూర్పఁబడినవో యన్నట్లులుండు శ్రీగంధపుఁజెట్లను ఏలుమద్దిచెట్లులను వరుసలనుజూడుము. సంకల్పించినమాత్రమున పుట్టి పెఱిగినట్లులున్నవి. పగతుఁరకుఁ గంటకుఁడా! యీ ప్రదేశము మిగుల రమణీయమైయున్నది. కావున నిచ్చటనే విహరింతము. ఇదియె మంచిది. ఇచ్చటనే నివసింతము ఇంతియకాక, యీ ప్రదేశమునకుఁ గడుదాపున వివిధవృక్షశోభితమైన కాననములుగల యా సుగ్రీవుని పట్టణమున్నది. జయశీలురలో శ్రేష్ఠుఁడా! వానరులు మద్దెలలువాయించుచు పాడుచుండుపాట లిచ్చటికిఁ వినఁబడుచున్నవి. కపిశ్రేష్ఠుఁడయిన సుగ్రీవుఁడు స్నేహితులతోఁగూడి రాజ్యమును, భార్యను, గొప్పకలిమిని బొంది యానందము నొందుచున్నాఁడు. ఇది నిస్సంశయము" అని యిట్లు రాముఁడు లక్ష్మణునితోఁజెప్పి, రమణీయములయిన పెక్కుగవులతోడను, పొదలతోఁడను నిండియున్న యా ప్రస్రవణపర్వతముననే లక్ష్మణునితోఁగూడ నివసించెను.

ఆ ప్రస్రవణపర్వతము సకలద్రవ్యములుగలిగి, మిగుల సుఖకరమయియున్న యా పర్వతమున నున్నను ప్రాణములకన్న మిన్నయైన రావణుఁడు గొంపోయిన తనభార్యను తలఁచుచుండుటంజేసి రామునకుఁ గొంచెమైనను ప్రీతిగలుగదయ్యెను. పగళ్ళెట్టులోకడపినను, రాత్రులందుఁ దూరుపుకొండపై నుదయించిన చంద్రునిఁజూచిన, విరహవేదనచే రాముఁడు మిక్కిలి నెమ్మదితప్పి, నిద్రలేకయుండెను. అట్లు సీతావిరహవేదనచే మనసునఁ బరితపించుచుండువాఁడును, ఎల్లప్పుడు దుఃఖపడుచుండువాఁడును, శోకమే ముఖ్యముగాఁ గలవాఁడునునయిన రామునిఁజూచి, లక్ష్మణుఁడును నతనితో సమముగ దుఃఖముఁజెందినవాఁడై, యన్న నూఱడింపుచు నిట్లనియె.

"శూరుఁడా! వ్యథపడినది చాలును. నీవు శోకము నొందఁ దగదు. వ్యసనపడువానికిఁ గార్యములెల్లఁ జెడునన్నవిషయము నీవె ఱెఁగినదియే. లోకమున నీవు కార్యముసాధనమే ప్రధానముగాఁ గల వాఁడవు. దైవమును నమ్మియున్నవాఁడవు; ఆస్తికుఁడవు; సత్కార్యములు చేయువాఁడవు. ప్రయత్నముచేయువాఁడవు. అట్టి నీవిట్లు వ్యసనంబునొందుట తగదు. నీవిట్లు ధైర్యంబులేక, వ్యసనముగలిగి, పూనిక లేకయుందువేని, నీ కపకారమొనర్చిన యా రాక్షసుని యుద్ధరంగమున నెట్లు వధింపఁగలవు? కావున నీవు శోకము మొదలంటఁ బెఱికి వేయుము; తిరమైన పూనికతలఁపెట్టుము. అట్లుగానిచో నీ వారాక్షసుని సపరివారముగా నెట్లు నాశము సేయఁగలవు? కకుత్థ్సవంశోద్భవా! నీవు పూనిక గలిగినవాఁడవైనచో సముద్రారణ్యపర్వతములతోఁ గూడియున్న భూమండలమునెల్లఁ బొరలింపఁగలవు. అట్టి నీకీ రావణుని వధించుట యొకపనియా? వర్షాకాలమువచ్చినది. శరదృతువు వచ్చువఱకు వేచియుండుము. అంతట రావణుని, వానిబంధుపరివారములను సంహరింతువు. వాని రాజ్యమును బాడుసేయుదువు. నివురుగప్పిన నిప్పును వెలుఁగుచున్న వేల్ములచేఁ బ్రజ్వరిల్లఁజేయునట్లు, అణఁగియుండు నీ ప్రతాపమును నేను పురికొలుపఁగలను" అని లక్ష్మణుఁడు రాముని శోకోపశమనముఁ జేసెను.

రాముఁడును లక్ష్మణుఁడు చెప్పిన హితమైన మంచిమాటను విని, తనయందుఁ బ్రేమగల తమ్మునిగూర్చి "లక్ష్మణా! ప్రేమగలవాఁడును, స్నేహితుఁడును, ఆప్తుఁడునయినవాఁ డెట్టిమాట చెప్పవలయునో, తిరమగు మగఁటిమిగల నీ వట్టిమాటను జెప్పితివి. అన్నికార్యములను జెఱుపునట్టి యీ శోకమును వదలితిని. శత్రువుల నాక్రమించుటలో నడ్డులేని నా తేజస్సును బ్రేరించెదను. నీ మాటయందె నిలిచెదను. సుగ్రీవునియొక్కయు, నదులయొక్కయు ననుగ్రహము నెదురుచూచుచు శరత్కాలమురాకకయి వేచియుండెదను. శూరుఁడగువాఁడు తన కుపకారముచేయువారికిఁ బ్రత్యుపకారముసేయును. ఒకఁడుచేసిన యుపకారమునుమఱచి, ప్రత్యుపకారముసేయని మానవుఁడు సాధువుల మనస్సును జెఱచును. కావున సుగ్రీవుఁడు మనకుఁ గృతజ్ఞత గనఁబఱపకయున్నను, సత్పురుషుల కాగ్రహము గలుగునన్న భీతితో

నైనను బ్రత్యుపకారమునేయును.” అని చెప్పఁగా, లక్ష్మణుఁడును రాముని పలుకులు విని, చేతులుజోడించి, యాతనిమాటలకుఁ దల పంకించి, తన మంచినడతను దెల్పుచు, కడుఁ జక్కనయిన రామునిఁ గూర్చి, “యోరామా! వానరేంద్రుఁడగు సుగ్రీవుఁడు నీవు కోరినది కోరినట్లెల్ల వేగిరమే చేయఁగలఁడు. నీవును శత్రువధమును పూని, శరత్కాలము నెదురుచూచుచు నీవ్యసన మోర్చియుండుము. శత్రువధమునకుఁ దలపెట్టినవాఁడవై, కోపమడఁచుకొని, శరత్కాల మున కెదురుచూచుచు నీ నాలుగునెల లోర్చికొని సింహముల కునికి పట్టయినయీపర్వతశిఖరమున నుండుము” అని చెప్పెను.

## 28-వ సర్గము

### శరత్కాలవర్ణనము

అప్పుడు రాముఁడు వాలివధమును గావించి, సుగ్రీవునికిఁ బట్టము గట్టి, తర్వాత మాల్యవంతము దరియందున్నవాఁడయి, లక్ష్మణునిఁజూచి యిట్లనియె: “లక్ష్మణా! సుగ్రీవుఁడు తనపురమునను, మనమిచ్చటను నుండున ట్లేర్పఱచుకొన్న యావర్షాకాలము సంప్రాప్తమయినది. ఆకాశము కొండలంబోలు మేఘములచే దట్టముగాఁ గప్పఁబడియున్నది, బాగుగాఁజూడుము. ఆకాశము సూర్యునికిరణములమూలమున సముద్ర జలము త్రావి, తొమ్మిదినెలలుమోసిన గర్భరూపమయిన రసముల కెల్ల ముఖ్యమైన జలమును బ్రసవించుచున్నది. ఇప్పుడు మేఘము లనెడి మెట్లమీఁదుగ నాకసమునకెక్కి, కొండమల్లె పూలదండలతో సూర్యునిఁ బూజింపవచ్చును. వర్షముగురిసిన తర్వాతఁ దెల్లనై యుండు మేఘము సాయంకాలము సంధ్యారాగము సోఁకుటచే నడుమ నెఱ్ఱ నివియు, గొనలందు మిక్కిలి తెల్లనివియునయి యాకసమంతయు నిండి యుండుటచే నాకాశమునకు గాయములు దగులఁగా నడుమ నెత్తురు సోఁకగా నెఱ్ఱనయిన తెల్లనిగుడ్డలతోఁ గట్టినకట్టులో యన్నట్లు దెలి యుచున్నవి. పిల్లగాలియను నూర్పుగలదియు,సంజయెఱుపనెడు చందనపు మైపూఁతగలదియు, అంతటను తెల్లనయిన మబ్బుగలదియునగు నాకా శము కాంతనెడబాసి సంతాపపడుచున్నవాఁడోయన్నట్టు లాకాశము ప్రకాశించుచున్నది. ఈ భూమియు, వేసవివేఁడిమికిఁ గ్రాఁగినదియు గ్రొత్త

టిచేఁ బడిసినదియునయిన శోకసంతాపమునొందినసీతవలె బాష్పమును (ఆవిరిని-కన్నీటిని) విడుచుచున్నది. మేఘములనుండి వెడలినవియు, యొజ్జగలుపలవలె సుఖమును గలిగించు చల్లఁదనముగలవియు వీచు టచేఁ జల్లనివై, మొగిలిపూవులవంటి వాసనగలవియు నగువాయువులు దోసిళ్ళతోఁ ద్రాగఁదగియున్నవి. వికసించిన మద్దిచెట్టులతోఁగూడినదియు, మొగలిపూవుల నెత్తావిగలదియు నయిన యీ పర్వతము, శత్రుసంహార మయినతర్వాతఁ బుష్పమాలాలంకృతుఁడై, సువాసనగల గంధముపూసి కొన్న సుగ్రీవుఁడు పట్టాభిషేక సమయమునఁ దీర్థజలములచే నభిషిక్తుఁ డయిన చందమున వర్షధారలచేఁ బడుపఁబడుచున్నది. పర్వతములు మేఘములనెడు జింకతోళ్ళుదాల్చి, నీటిధారలనెడిజందెములుగలవై, గుహలందు గాలిచే నిండియుండుటవలన వేదాధ్యయనము చేయుచున్న బ్రహ్మచారులమాడ్కి వెలుఁగుచున్నవి. ఆకాశమున మెఱుపులుమెఱయుచు, నుఱుము లుఱుముచునున్నందున నాకాశంబు బంగారు కొరడాలతోఁ గొట్టఁబడి, లోపల వేదనగలిగి మూలుగుచున్న దోయన్నట్లు కనఁబడుచున్నది. నల్లనిమేఘము నాశ్రయించి తళతళ మెఱయుచున్న మెఱుపు నల్లనయిన రావణునితొడమీఁద గూర్చుండ నిష్టములేక పెనఁగులాడుచుండిన దిక్కులేని సీతవలె నాకుఁ దోఁచు చున్నది. ఆకాశమున మేఘములు నక్షత్రములను గ్రహములనుజంద్రుని గ్రమ్మి దిక్కులు దెలియకున్నందున, నాదిక్కులు కాముకులకు మేలుచే యునవో యన్నట్లు కనఁబడుచున్నవి. సౌమిత్రీ! కొన్నిచోట్ల గొండ నెత్తములందు గొండమల్లెచెట్లు బాష్పములతోఁగూడి, వర్షర్తువు వచ్చుటంజేసి చక్కఁగా పుష్పించినవై చిరకాలము ఎడఁబాసియుండిన కాంతలతోఁ గూడుటచే నానందబాష్పములు రాల్చుచు నవ్వు మోముతోఁగూడిన కాముకులమాడ్కి నుండుటంజేసి, ప్రియావియోగ శోకముచేఁ గుందుచున్న నాకు మదనతాపమును మఱింత హెచ్చఁ జేయుచున్నవి.

చూడుము లక్ష్మణా! వానగురియుటచే దుమ్మణఁగెను. వాయువు చల్లగా వీచుచున్నది. ఎండబెట్ట తగ్గెను. రాజులందఱు యుద్ధములకు వెడలుటమానిరి. దూరదేశముల కేగిన జనులందఱు తమదేశముల కేగు చున్నారు. హంసలు మానససరోవరమునకు వెడలినవి. చక్రవాకపక్షులు

కాంతలతోఁ గూడియున్నవి. దారులు వానగురిసి యొంపితో నిండినవై యున్నందున బండ్లు మొదలగునవి నడవకున్నవి. అచ్చటచ్చట మబ్బులు గ్రమ్మి యొక్కొకచోటఁ బ్రకాశముగలిగియు, నొక్కొక్కచోటఁ బ్రకాశములేకయు నున్న యాకాశ మొక్కొక్కచోటఁ బర్వతములచే నడ్డగింపఁబడి, మఱొక్కచోట శాంతమైన యలలతో గూడిన సముద్రమువోలికె వెలయుచున్నది. సెలయేళ్ళయందు ఏఱుమద్దిపూలతోను, కడపపూలతోను గూడినదియుఁ గావిఱాళ్ళతోఁ గలియుటచే నెఱ్ఱనిదియునైన క్రొత్తనీరు నెమళ్ళకూఁతలు వెంబడింపఁగాఁ గడు వేగిరముగాఁ బాఱుచున్నవి. రసముచేఁ బూర్ణములును, తుమ్మెదలవంటి రంగు గలవియు నయిన నేరెడుపండ్లను విశేషముగా జనులు దినుచున్నారు. పెక్కురంగులుగల, మ్రాగిన మామిడిపండ్లు గాలిచే మిగుల నూఁగుచున్నకొమ్మలనుండి క్రిందఁబడుచున్నవి. మెఱుపులను టెక్కెములుగలవియు, కొంగ లనెడుపూవులసరములతో నిండినవియు, పర్వతశిఖరములంబోలు నాకారము గలవియు, గొప్ప గర్జనములుగలవియునైన మేఘములు యుద్ధమున నొండొంటితోఁ బోరునట్టి మదపుటేనుఁగులవోలికె గర్జనముచేయుచున్నవి. వాననీటిచేఁ దనివినొందిన పచ్చికబయళ్లుగలవియు, వేడుకమీఱ నాట్యముసల్పుచుండు నెమళ్లతోఁ గూడినవియు, మేఘములు వర్షించినతర్వాత దెల్లనివియునైన వనములపరాహ్ణములందుఁ గడు వెలుఁగుచున్నవి. మేఘములు నీటిబరువును మోయుచు, కొంగలుకూడ వచ్చుచుండ నుఱుముచు, నెత్తగు పర్వతశిఖరములం దాఁగి యాఁగి యలఁత దీర్చుకొనుచుఁ బోవుచున్నవి. గర్భధారణనిమిత్తము మేఘములను గోరి సంతసముతో నేగునట్టి కొక్కెరలపంక్తి యాకాశమున వ్రేలాడునట్లు కట్టఁబడి గాలి కెగురుచున్న తెల్లదామరపూవులమాలికవలె వెలుఁగుచున్నది. నేల యచ్చటచ్చట నారుద్రపురుగుల పిల్లలచే నెఱ్ఱనై క్రొత్తపచ్చిక బయళ్లుగలిగియుండుటచేచిలుకవలె నాకుపచ్చనిరంగులుగల యచ్చటచ్చట లత్తుకరసముదగిలిన కంబళముగప్పుకొన్న యంగనవలెఁ గనఁబడుచున్నది. కేశవునకు మెల్లగా నిద్దుర వచ్చుచున్నది. ఏఱులు వేగిరముగాఁ గడలిం జేరుచున్నవి. కొక్కెరలు సంతసముతో మేఘములను బొందుచున్నవి. అతివలు వలపుతో మగనిని జేరుచున్నారు. వనమధ్యములందు నెమళ్లు మేఘదర్శన

ముచే నాట్యములు సల్పుచున్నవి. కదంబవృక్షములు కొమ్మలందు విరిసిన పూవులతోఁ గూడియున్నవి. ఆఁబోతు లావులందు వలపుఁజూపుచు వెంబడించుచున్నవి. పుడమి సైరుపచ్చలచే నొప్పుమీఱియున్నది. నదులు ప్రవహించుచున్నవి. మేఘములు వర్షించుచున్నవి. మదపుటేనుఁగులు ఘీంకారములు సల్పుచున్నవి. వనమధ్యములు వెలుఁగుచున్నవి. ప్రియలం బాసియుండువారలు తమప్రియురాండ్రను దలఁచుకొనుచున్నారు. నెమళ్లాడుచున్నవి. వానరులు నెమ్మదిగలిగియున్నారు. వానగురియుటచే సంతసమునందెన మదపుటేనుఁగులు మొగలిపూవుల నెత్తావి నాఘ్రాణించి యానందమునొందినవై, వనమందలి సెలయేళ్లయందుఁ బ్రవాహము మీఁదినుండి క్రిందికిఁబడుటవలనిచప్పుడుచేఁ గలఁగుండువడినవై, నెమళ్ళతోఁగూడ ఘీంకారములు సల్పుచున్నవి. తుమ్మెదలు కదంబపుష్పములందలి మకరందమును గ్రోలి మదించినవై, యా వృక్షములకొమ్మలు క్రిందికి వాలియుండునప్పుడు, వానియందు వ్రేలుచు వాననీటిధారలపాటులచేఁ జక్కఁగాఁ గొట్టఁబడినవై తామంతకుమున్ను సంపాదించిన మదమును దొఱఁగుచున్నవి. నేరెడుకొమ్మలు బొగ్గుపొళ్లరాసులం బోలునవియు, రసపుష్టిగలవియునైన విస్తారములయినపండ్లతో నిండినవై తుమ్మెదలగుంపులతోఁ గూడియున్నవో యన్నట్లు ప్రకాశించుచున్నవి. మెఱుపులతోఁగూడి యుఱుము లుఱుముచున్న మేఘములు యుద్ధములకుఁ బూనినవై టెక్కెములతోఁగూడి ఘీంకారము లొనర్చుచున్న యేనుఁగులమాడ్కి శోభిల్లుచున్నవి. పర్వతవనములలోనికిఁ బోవుటకై తెఱిలి దారినిబోవుచున్న యొక మదపుటేనుఁగు మేఘగర్జనము విని, యెదిరి యేనుఁగు వచ్చుచున్నది యని శంకించి, దానితోఁ బోరుసేయఁ గోరి వెనుకకు మఱలినదాయెను. వనప్రదేశము లొక్కచోఁ దుమ్మెదల ఝుంకారములచే గానము చేయుచున్నటులును, మఱొక్కచో నెమళ్లచే నాట్యముచేయుచున్నటులును, మఱియొకచో మదపుటేనుఁగులవలె మదించియున్నటులును ఈతీరునఁ బెక్కింటికాశ్రయములై వెలుఁగుచున్నవి. వనప్రదేశములు కదంబార్జున సర్జపుష్పములతోఁగూడి, క్రొత్తనీటితో నిండినవై, మదించిన నెమళ్ళకూఁతలతోను నృత్యములతోను గూడి, మద్యపానముచేయు స్థలముంబోలి వెలయుచున్నవి. పలురంగుల టెక్కలతోఁగూడిన పక్షులు సంతసముగలవై, మిక్కిలి తేట

రైనదియు, ముత్యములవలె నాకులందుఁ బడినదియునయిన యుదక మును దప్పిదీరఁ ద్రాగుచున్నవి. వనములందుఁ దుమ్మెదల ఝంకారములె మధురమయిన తంత్రీనాదముగాను, కప్పలబెకబెకనాదములె నోటితాళముగాను, మేఘగర్జితములె మద్దెలమ్రోతగాను నేర్పడుటచే సంగీతము నడుచుచున్నట్లున్నది. వ్రేలాడుచున్న పురులనెడు నాభరణములు దాల్చిన నెమళ్ళు కొన్నిచోట్ల నాడుచును, కొన్ని తావులను గట్టిగాఁ గూయుచును, గొన్ని స్థలములందు నొక కొమ్మలందు కూర్చుండియు నుండుటవలన నాట్యముచేయువారు, పాటపాడువారు, వినువారునుంగల సంగీతసభ వనములందు జరుగుచున్నదో యనఁబరగి యున్నది. పలుతెఱఁగులైన రూపములు, ఆకారములు, వర్ణములు, ధ్వనులుగల కప్పలు మేఘములధ్వనులచే చాలకాలమునుండి తమ్ముఁ గ్రమ్మియున్న నిద్రనుండి మేల్కొలుపఁబడినవై వాననీటిధారలచేఁ గొట్టఁబడినవై బెకబెకమని కూయుచున్నవి. మదించిన యువతులు యున్నతస్తనములతో నొప్పుచు, క్రొత్తవైన కానుకలను, అనుభవ యోగ్యపదార్థములను గైకొని, తమభర్తల చెంతకుఁబోవునట్లు, నదులు ప్రవాహముపైఁ దేలుచుఁ బోవుచున్న చక్రవాకపక్షులతోఁగూడినవై, శిథిలములయిన గట్టులను విడిచి, వడిగాఁబాఱుచు, ప్రవాహవేగము నకుఁ గొట్టుకొనివచ్చిన ఫలపుష్పాదులంగొని, వడిగా సముద్రునిఁజేరు చున్నవి. క్రొత్తనీటితో నిండినవై నల్లనై యున్న మేఘములందుఁ గలిసిన నూత్న జలధరములగు మేఘములు కార్చిచ్చుచే గాల్పఁబడి నల్లపాఱియున్న కొండలమాడ్కి వెలుఁగుచున్నవి. మేఘదర్శనముచేఁ నుప్పొంగిన నెమళ్ళచేయు ధ్వనులతోఁగూడినవియు, ఆరుద్రపురుగు లతో నిండిన పచ్చికబయళ్ళుగలవియు, కదంబపుష్పములయు, మల్లె పూవులయు నెత్తావిచే గుబాళించునవియునై యొప్పుచున్న వన మధ్యములందు గజములు సంచరించుచున్నవి. తుమ్మెదలు క్రొత్తనీటి ధారలచేఁ గొట్టుపడి రాలిపోయిన కింజల్కములుగల, కమలము లను వేగ విడిచి, చక్కఁగా వికసించినవై, కేసరములతో నిండియున్న కదంబపుష్పములలోని మకరందమును పానముచేయుటకై వ్రాలు చున్నవి. గజేంద్రములు మదించియున్నవి. ఆఁబోతు లుప్పొంగుచున్నవి. సింహములు వనములందు సేదదీర్చుకొనుచున్నవి. పర్వతములు

రమ్యములై యున్నవి. రాజులు నెమ్మదినున్నారు. దేవేంద్రుఁడు మేఘములతో విహరించుచున్నాఁడు. మేఘము లాకాశమున నిలిచి, సముద్రఘోషమును మీఱఁజేయుచు జోరువాన గురిపించి, నదులను, చెఱువులను, కొలఁకులను, నడబావులను, బుడమినెల్లను జలమయము సేయుచున్నవి. వానలు ముసురుపట్టికురియుచున్నవి. గాడ్పులు గొప్పధ్వనులతోఁగూడి వీచుచున్నవి. నదులు ప్రవాహవేగముచే గట్టులంగోసికొని, తప్పుదావులంబడి వడిగాఁబాఱుచున్నవి. రాజులు మానవులచే సకలతీర్థములనుండి తేఁబడిన బంగారు గిండీలయందలి తీర్థములచే నభిషేకింపఁబడినవారలై, తమరాజ్యలక్ష్మిని గనఁబఱచు తెఱఁగునఁ గొండలును దేవేంద్రుఁడొసఁగఁగా వాయువు దెచ్చిన మేఘములనెడి కుంభములచే నభిషేకింపఁబడినవై తమసొంపయిన రూపును జూపుచున్నవి. ఆకసమున నక్షత్రములు దెలియకుండునట్లు మేఘములు దట్టముగాఁ గ్రమ్మియున్నవి. సూర్యునిదర్శనమే కాకయున్నది. క్రొత్తనీటివెల్లువ లంతటను వ్యాపించియున్నవి. చీఁకటి క్రమ్మియుండుటంజేసి దెసలు వెలుఁగులేకయున్నవి. వర్షధారలచేఁ గడుగఁబడిన పర్వతములయొక్క శిఖరములు కడునెత్తునుండి వెడల్పుగలిగి ప్రవహించుచున్న సెలయేటిజలపాతములు గలిగియుండుటంజేసి, వ్రేలాడుచున్న ముత్యాలహారములతోఁ గూడియున్నట్లు వెలయుచున్నవి. పర్వతములందలి వెడల్పుగల సెలయేటిజలపాతములు కొండతా లడ్డుపడుటచే వేగముతగ్గినవై, నెమళ్ళకూఁతలతో నిండిన గుహాలయందు దారములు తెగుటచేఁ జెదఱిపడిన ముత్యాలహారములవలెఁ బ్రకాశించుచున్నవి. పర్వతములందు వడిగాఁబాఱునట్టి వెడఁదసెలయేళ్లజలపాతములు కొండకొమ్ములపట్టుల ముఱికిని బోఁగొట్టుచు ముత్యాలహారమువలెఁ బడుచు గొప్ప గుహాల సమీపభాగములందుఁ బ్రవహించుచున్నవి.

స్వర్గలోకమునందలి యంగనల సురతసమయములందుఁ జిక్కుకొనుటచేఁ దెగిన ముత్యాలహారములో యనునట్లు దెసలయందంతటను వర్షధారలు విశేషముగాఁ గురియుచున్నవి. పక్షులు గూళ్ళకుఁ జేరుటచేతను, తామరలు ముడుచుకొనుటచేతను, జాజితీఁగలు పూచుటచేతనుమాత్రము సూర్యుఁ డస్తమించెనని తెలియుచున్నది. రాజుల యుద్ధయాత్రలు నిలిచినవి. సేనలు మఱలుచున్నవి. విరోధములు తగ్గి-

నవి. నీరు పల్లములందు నిండుటవలన భూమియెల్ల సమమైయున్నది. భాద్రపదమాసమున వేదాధ్యయనారంభము సేయఁగోరు సామవేదులగు బ్రాహ్మణులకు వేదాధ్యయనయోగ్యమయిన సమయము ప్రాప్తించినది. కోసలదేశాధిపుఁడగు భరతుఁడు వర్షాకాలము నాలుగుమాసములలో నింటికిఁగావలసిన పనులను జేయుటకును, ద్రవ్యమును సేకరించుటకును వీలుగాదు గావున నాషాఢపూర్ణిమకు ముందే యన్నియుఁ జేర్చియుంచుకొనియుండును. నేనువచ్చునప్పు డయోధ్యాపురజనుల కోలాహలము హెచ్చినట్లు, ఇప్పుడు వానగురియుటచే సరయూనది ప్రవాహవేగశబ్దము నిక్కముగ హెచ్చియుండును. ఇట్టి సకలసుగుణోపేతమయియున్న వర్షాకాలమునందు సుగ్రీవుఁడు శత్రుబాధ దొలఁగించుకొని, భార్యనుబొంది, గొప్పరాజ్యమున నున్నవాఁడై సుఖములనెల్ల ననుభవించుచున్నాఁడు. లక్ష్మణా! నేనన్ననో, భార్యను దారవోసికొని, విస్తారమయినరాజ్యమునుండి భ్రష్టుఁడనై, ప్రవాహముచే నానిన యేటిగట్టునుంబోలె నానాఁట గ్రుంగిపోవుచున్నాను. నాశోకమో కడు గొప్పదైయున్నది. వర్షాకాలమో మిక్కిలి దాఁట నలవికానిది. రావణుఁడన్ననో సులభసాధ్యుఁడుగాని శత్రువు. నాకుఁజూడ నివి మూఁడును దాఁటనలవిగానివని తోఁచుచున్నది. ఇది యాత్రకుఁ దగనిసమయమనియు, దారులు నడచుటకు యోగ్యముగాకయుండుననియు, నిప్పు డేకార్యమును జరుగదనియునెంచి, సుగ్రీవుఁడు చెప్పిన పనిచేయ సర్వసిద్ధముగానున్నను నే నేమియుఁ జెప్పకుంటిని. అంతియకాక, మనకార్యము చాల గొప్పది. సుగ్రీవుఁడు బహుకాలంబు కష్టము లనుభవించి, యెన్నాళ్ళకో భార్యతోఁగలిసెను. అట్టి వానిని గొంతకాలమైనను, సుఖముతో నుండనీయక, యాతనికిఁ బనిపెట్టుట నుచితమని మనపనిచేయ నియోగించనైతిని. సుగ్రీవుఁడు కొంతకాలము తన యలఁతదీర్చుకొని, తానే తగినసమయమువచ్చుటెఱిఁగి తనకుఁ జేసిన మేలునకు బదులుమేలు సేయఁగలఁడు. దీనికి సందియము లేదు. మంచిలక్షణములుగల లక్ష్మణా! నేనును సమయం బెదురుచూచుచు, సుగ్రీవునియొక్కయు, నదులయొక్కయు ననుగ్రహమును నిరీక్షించుచుండెదను. శూరుఁడు తనకుఁజేసిన మేలును మఱవక బదులుమేలొనరించును. అట్లు వాఁడు కృతఘ్నతలేనివాఁడై, ప్రత్యుపకారము సేయఁ

డేని, సత్పురుషులమనస్సును గుందించును. కావున సుగ్రీవుఁడు సాధుజనులయాగ్రహమునకు వెఱచినయైనను మనకు మే లొనరింపఁగలఁడు" అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పఁగా, లక్ష్మణుఁ డన్నపలుకులు విని, చక్కని చూడ్కిగల రాముంగూర్చి తనమంచినడత మెఱయ, "రాజేంద్రా! సుగ్రీవుఁడు నీచెప్పినచొప్పునఁ జేసి వేగిరమే నీ యభిలాషను దీర్పఁగలఁడు. కావున నీవు శత్రువధమున మనస్సుంచి, శరత్కాలము నెదురుచూచుచుండుము" అని చెప్పెను.

## 29-వ సర్గము

### హనుమంతుఁడు సుగ్రీవుని రామునికార్యమునకై హెచ్చరించుట

ఆకాశము మేఘములు మెఱపులునుదొలఁగి, పండువెన్నెలతోఁ గూడి, బెగ్గురుపక్షుల యింపగు నాదములుగలిగి తేటయయి వెలుఁగుచుండఁగా, సుగ్రీవుఁడు తనయందుఁ బ్రేమగలభార్యను, తన్నువలచిన తారను బడసినవాఁడై, కోరినకోర్కెలెల్లఁబొంది యెల్లప్పుడు స్త్రీలయందుఁదవిలి, చెడుగులదారి నవలంబించి, యేకతమున నుండఁగోరి ధర్మార్థసంగ్రహమునందు బుద్ధిలేక, నిర్భయుఁడై, మంత్రులందు రాజకార్యములనెల్లఁ బడవైచి, యా మంత్రులను విచారించుకొనక, రాజ్యసందేహములను దీర్పక, విచ్చలవిడిగా రేయింబవళ్ళును దేవేంద్రుఁడు నందవనమున నప్సరసలతోడంబోలె విహరించుచుండెను. అప్పుడు కార్యములనేర్పఱచువాఁడును, పనులనడవడులకలరూపు నెఱిఁగినవాఁడును, దేశకాలస్వరూపము నెఱిఁగినవాఁడును, మాటాడుట యందు నేర్పరియును నయిన హనుమంతుఁడు మాటలయభిప్రాయము నెఱుఁగఁగలవాఁడును, వానరేంద్రుఁడును నయిన సుగ్రీవునిపాలికిఁ జని, శ్రావ్యములై సకారణములై మనస్సుకు రమ్యములైయుండు మాటలుసెప్పి యాతనిమనమును శాంతపఱపఁగోరి, యథార్థమును, హితమును, పథ్యమును, సామ యుక్తమును, ధర్మార్థములకు విరుద్ధము గానిదియు, స్నేహానురాగములతోఁ గూడినదియునైన తనమాటను వినుననుతలంపుతో నిట్లనియె:

వానరాధిపా! రాజ్యమును గీర్తియుఁబొందితివి. వంశపరంపరగావచ్చిన సంపద హెచ్చెను. మిత్రులను సంపాదించుటయును కార్య

మిఁక శేషించియున్నది. దానిని నీ విప్పుడు చేయవలయును. సమయము నెఱిఁగినవాఁడై యెల్లప్పుడు స్నేహితులందు మంచిమనస్సు గలిగియుం డువానికి రాజ్యమును గీర్తియుఁ బరాక్రమమును హెచ్చును. పుడమి ఱేఁడా! బొక్కసము, సేనయు, మిత్రులును, ధైర్యమును గూడియుండు వానికి విస్తారమయిన రాజ్యమున కాధిపత్యము గలుగును. కావున నీవు మంచినడవడి గలవాఁడవు; సన్మార్గమున నడచువాఁడవు. కావున నీవు ప్రతిజ్ఞ చేసిన చొప్పున మిత్రకార్యమును జక్కఁగా నెఱవేర్పుము. తనకార్యములను విడిచిపెట్టియైనను త్వరపడి యుత్సాహముతో చెలి కాండ్రపనులందుఁ బ్రవర్తించువాని కెన్నఁటికి నాపదలుపొరయవు. స్నేహితులకార్యములను సమయమునఁజేయక, యావల యెంతగొప్ప పనులనైన నొనర్చినను, వాఁడు అదనుదప్పి చేసినవాఁడగుటచేఁ జెలి కానిపనులను జేయనివాఁడే యగును. శత్రుసంహారివగు సుగ్రీవుఁడా! మనమిప్పుడు చేయవలసిన పని రామునికార్యము. అయ్యది సీతను వెదకుటయే. ఆపనిని మనమిప్పుడు తప్పక చేయవలయును. శత్రుసంహా రకా! ఇప్పు డా కార్యమునకు సమయముగూడ మీఱినదయ్యె. వాన రేంద్రా! రాముఁడు నియమితకాలము నెఱిఁగినవాఁడైనను, సీతను జూచుటకుఁ దొందరపడుచున్నను, తెలిసినవాఁడు గనుక నీ యిష్టము చొప్పునఁ బోవఁదలఁచియున్నాఁడు గావునఁ దానుగాఁ గాల మతిక్ర మించినదని నీతోఁ జెప్పఁబోఁడు. రాముఁడు గొప్ప వంశమునందుఁ బుట్టినవాఁడు. జీవితమంతయు నీకు బంధువై యుండువాఁడు; సాటిలేని మహిమగలవాఁడు. గుణములందు సాటిలేనివాఁడు. వానరశ్రేష్ఠా! అతని కిప్పుడు నీవు సాహాయ్యముచేయుము. నీ కతఁ డింతకుమున్ను సాహాయ్యముచేసియున్నాఁడు. కావున ప్రత్యుపకారము చేయుటకై వానరశ్రేష్ఠుల కానతిమ్ము. రాముని ప్రేరణకాకమునుపే కార్యము నారంభింతుమేని, కాలము మీఱదు. అట్లుకాక రాముఁడు ప్రేరణచేసిన పిదపఁ గార్యము నారంభింతుమేని, కాలముమీఱిపోవును. వాన రాధిపా! నీ వుపకారముచేయని వానికైన నుపకారముచేసెడివాఁడవు. నీకు రాజ్యధనము లొసఁగి మహోపకారము గావించిన, రామునికిఁ బ్రత్యుపకారముచేయువిషయమున నాలోచింపవలయునా? వానరు లయు, కొండముచ్చులయు గుంపులకు ఱేఁడా! నీవు బలపరాక్రమం

బలు గలవాఁడవయ్యును, రామునికిఁ బ్రత్యుపకారముగావించి సంతోషము గలిగించుటకై, వానరసేనల కేల యాజ్ఞ సేయకున్నాఁడవు. రాముఁడు దేవతలను, అసురులను మహానాగములను దనబాణములచే స్వాధీనపఱచుకొనఁ జాలినవాఁడే. అయినను, నీవుచేసిన ప్రతిజ్ఞ నెఱవేర్పఁగలవా యని పరీక్షింపఁ గోరియున్నవాఁడు. ప్రాణముల విడుచుటయందుఁగూడ వెఱపులేక నీకతఁడు మేలొనరించెను. అట్టి రామునిపత్నియగు సీతను భూలోకమునను, స్వర్గలోకమునను వెదకుదము. దేవతలొండె, గంధర్వులొండె, అసురులొండె, దేవతాగణములొండె, యక్షులొండె యా రామునికి భీతిగలిగింపఁజాలరు. అట్టి రామునకు రాక్షసు లేమిచేయఁగలరు? సుగ్రీవా! యంతటి శక్తిగల వాఁడును, తొలుత నీకు మేలొనరించినవాఁడును నయిన రాముని కన్ని విధముల నిష్టము నెఱవేర్పవలయును. వానరపుంగవా! నీ యాజ్ఞ యయ్యేనేని, మాలో నెవఁడును, పాతాళమునఁగాని, భూమియందుఁగాని, నీటిలోపలఁగాని, యాకాశమునఁగాని యడ్డములేకుండ సంచరింపఁగలఁడు. శత్రువులకు లొంగనివారును, విధేయులు నగు వానరులు పెక్కండ్రు నీకడ నున్నవారు. ఎవరెవ రేపనిని చేయవలయునో ఆనతిమ్ము" అని హనుమంతుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

సత్త్వగుణవంతుఁడగు సుగ్రీవుఁడును సమయమునఁ జక్కఁగా నెఱిఁగింపఁబడిన యా హనుమంతునిమాటను విని, కార్యముచేయుటయందే యుత్తమబుద్ధినుంచి, సకలదిక్కులందుండు సేనలను రప్పించుటకై,యెల్లప్పుడు ప్రయత్నపరుఁడై యున్న యిష్టుఁడయిన నీలునిఁ బిలిచి, "ఓసేనాధిపా! నా సేననంతటిని యూథపాలురను తడవుసేయక యిచ్చటికివచ్చి చేరున ట్లొనరిమ్ము. వేగిరముగ నడచువారును, ఉత్సాహముగలవారు నగు సేనలహద్దులను గాపాడువారు నా యాజ్ఞనుగొని తమతమ వశమున నున్న సేనలను వేగిరముగఁ గొనివత్తురుగాక! సమీపముననున్న సేనలను నీవే కొనిరమ్ము. నేడు మొదలు పదునైదుదినముల లోపల నిటవచ్చిచేరనివానికి మరణదండన విధింపఁబడును. ఇది నిస్సంశయము. నీవును నా యాజ్ఞగొని యంగదునిఁ దోడ్కొని ముదుసలులగు వానరులను దోడ్కొనిరమ్ము" అని యేర్పాటుచేసి, మఱలఁ దనయంతఃపురము చొచ్చెను.

## 30-వ సర్గము

### శరత్కాల వర్ణనము

సుగ్రీవుఁ డిట్లేఁగగున నీలుని కానతియొసఁగి వెండియు గుహ లోపలికిఁ జొచ్చెను. మేఘములుడివోవఁగా నాకాశము నిర్మల మయ్యెను. రాముఁ డెట్టకేలకు వర్షర్తువుంగడపి, శరదృతువురాఁగా సీతావియోగతాపముచేఁ గడు నొచ్చినవాఁడై, తెల్లనైన యాకాశ మున వెలుఁగుచున్న చంద్రబింబమును వెన్నెలచేఁ బూయఁబడినట్లుండు శరద్రాత్రిని జూచి, సుగ్రీవుఁడు కామపరవశుఁడై తనకార్యముంగూర్చి ప్రయత్నపడకుండుటను, సీతపోవిడి తెలియకుండుటను, దినములు గడ చుటను తలఁచి "యిఁక నేనెట్టు లీ శరదృతువుం గడపఁగల"నని మిక్కిలి నొచ్చినవాఁడై మూర్ఛనొందెను. మతిమంతుఁడయిన యా రాముఁడు మఱికొంత తడవునకు మూర్ఛ దెప్పిఱిలి, సీత తనమనస్సున నున్నను, ఆ సీతనుగూర్చి తలపోయుచు, బంగరుమయమయిన శిలలతో నిండిన ప్రస్రవణపర్వతశిఖరమునఁ గూర్చున్నవాఁడై మెఱుపులును, మబ్బులునుతొలఁగి, బెగ్గురుపక్షులనాదములతో మ్రోఁగుచున్న తేట వెన్నెలతోఁగూడిన శరత్కాలమందలి యాకాశమునుజూచి, ప్రియా విరహముఁ సహింపజాలక దీనములయినపలుకులతో నిట్లు విలపింపఁ దొడఁగెను.



"మున్ను తపోవనములందు బెగ్గురుపక్షివలె మాటాడునట్టి ముగుద యగు నా ప్రియురా లీ బెగ్గురుపక్షుల కూఁతలను విని యానందించు చుండెను. అట్టి నా ప్రియ యిప్పుడెట్లు వినోదించుచున్నదో! తొల్లి నాతో నున్నప్పుడు విరిసినబంగారంపు వన్నెగలిగి నిర్మలములయిన వేగిస చెట్లనుజూచి సంతసంపడుచుండిన యా ముగుద యిప్పుడు నన్నుఁజూడక యెట్లు విహరించుచున్నదో! ఇంపుగాఁ బలుకునదియు, చక్కని యన్ని యంగములుగలదియు నయిన సీత ముందు రాయంచలకూఁతలకు మేలు కొనునది యిప్పుడెట్లు మేల్కొనుచున్నదో! తెల్లదామర రేకులంబోలు కన్నులుగల సీత; తమప్రియులతోఁగూడి సంచరించు చక్రవాకపక్షుల మనోహరధ్వనులను విని, నావిరహముచే నెట్టిస్థితి నొందునో! ఇప్పుడు లేడికన్నులఁబోలుకన్నులుగల నా ప్రియురాలింబాసి, యెన్ని కొలఁ

కులుఁ చెలువులు, నడబావులు, అడవులు, తోపులుం గ్రుమ్మరినను నా మనసునకు సుఖము లేదు. శరత్కాలగుణములచే మఱింత హెచ్చిన మన్మథుఁడు నావియోగమువలనను, సుకుమారతవలనను సీత తాప మోర్వఁజాలదని యెంచి యా భామినిని మరణావస్థకుఁ దేకుండునా ?" అనియిట్లెల్లఁ జాతకపక్షి జలముంగోరి యింద్రునింగూర్చి మొఱయిడి నట్లు రాజశ్రేష్ఠుఁడయిన రాజపుత్త్రుఁడగు రాముఁడు విలపించెను. అప్పుడు లక్ష్మీవంతుఁడయిన లక్ష్మణుఁడు పండ్లకొఱకు కందములయిన కొండచరులయం దంతటఁ దిరిగితిరిగి మఱలివచ్చి యన్ననుజూచెను. అప్పుడు విజనమున రాముఁ డోర్వరానివగపుతోఁగూడి యొంటరియై మైమఱచియున్న యన్ననుజూచి లక్ష్మణుఁడు తానునువగచే ధైర్యమేది యాతనితో నిట్లనియె :

"ఓ పూజ్యుఁడా! యిప్పుడిట్లు కామునికి లోఁబడి విలపించుటచే నేమి యుపయోగము ? ఇట్లు ధైర్యముగోలుపోవుటచే నేమి యుప యోగము ? ఎప్పుడు ఈ నెమ్మది యుండవలసియున్నదో, అప్పుడి ట్లుత్సాహము లేక దుఃఖించుటచే నేమియుపయోగము ? ఓ దీనముకాని స్వభావముగలవాఁడా! కార్యమునకైను ప్రయత్నము, కలవర పాటులేమి, నెమ్మది, ఉపాయము, దేశకాలములు, సుగ్రీవుఁడు మొద లగువారి సహాయసంపద, స్వకర్మకుఁ గారణమైన దేవతాప్రార్థనాదులు కార్యసాధనమునకు హేతువులుగాఁ దెలిసి కార్యమును సాధింపఁదల పెట్టుము. మనోవంశోద్ధారకా! నీ ప్రియయగు సీత యొకనికి దొఱకు నదికాదు. మండుచున్న యగ్నిజ్వాలను గదిసి యెవ్వఁడేని గాలిపోక యుండునే ? నీ వాసందియము వాయు"మని రాముని లక్ష్మణుఁ డూఱ డించెను.

అంతరాముఁడు పగతురకు లొంగనివాఁడును, శుభలక్షణుఁడును, హితమును, పథ్యమును, ధర్మార్థసహితమును సామవచనయుక్తము నయిన మాటం జెప్పినవాఁడును నయిన యా లక్ష్మణుంగూర్చి యిట్లనెను : "కుమారా! లక్ష్మణా! సందియములేక కార్యము తెలియఁగు విచారింపవలసినదే. మిత్త్రసంపదచేర్పుటయు, ఉత్సాహమును బూన వలసినదే. సాధింపరానిదియైన ప్రకృతకార్యముయొక్క ఫలమును గూర్చి యోచింపవలసినదే" అని చెప్పి రాముఁడు పద్మాక్షియగు సీతను

దలంచుకొని యెండుపాఱిన మోముతో లక్ష్మణునికి వెండియు నిట్లనెను:
"లక్ష్మణా! దేవేంద్రుఁడు వానగురిపించి, పుడమిని దనివినొందించి
పైరులను బాగుగఁబండించి, తాఁజేయవలసినకార్యమును బూర్తిచేసి
కొని మఱలిపోయెను. రాజపుత్రా! మేఘములు గంభీరమయిన చక్కని
ధ్వనితోఁగూడి, పర్వత వృక్షములందు సంచరించుచు, వర్షముగురిపించి
యలసిపోయియున్నవి. నల్లగలువ ఱేకులవలె నల్లనయిన మేఘములు
పదిదిక్కులను నల్లవిగాజేసి, మదముడిగిన యేనుఁగులమాడ్కి వేగము
తగ్గినవైయున్నవి. సాధువా! నీటితోఁగూడి, అడవిమల్లెపూవులయు,
ఏఱుమద్దిపూవులయు నెత్తావిగలిగి మహావేగముతో వీచుచు వాన
గాడ్పు లంతట సంచరించి నిలిచెను. అనఘుఁడవగులక్ష్మణా! మేఘగర్జన
ములును, ఏనుఁగుల ఘీంకారములును, నెమళ్ల కేకానినదములును, సెల
యేళ్లు వేగముతోఁబడునప్పుడు గలుగు చప్పుడులును తటాలున నడఁగి
నవి. వివిధములయిన చరులుగల పర్వతములు జడివానలచేఁ జక్కఁగఁ
గడుగఁబడి, మాలిన్యములేనివై, పసురంగులుగల కావిఱాలకూడికచేఁ
గుంకుమాదిపరిమళద్రవ్య మిశ్రమైన గంధ మలఁదికొన్నచందమున
వెలుఁగుచున్నవి. ముగుదలు క్రొత్తగా మగలతోఁ గూడిననాఁడు
సిగ్గుచేఁ గొంతసేపు బిగింపుసేసి తిన్నగాఁ దమజఘనములు చూపినతీరున,
శరత్కాలనదులును ప్రవహించి ప్రవాహములు తగ్గినతరువాత మెల్ల
మెల్లగా నిసుకతిన్నెలను గనఁబఱుచుచున్నవి. శరదృతువురాఁగా,
నేడాకులయరఁటిచెట్లు విరులతోఁగూడియలరుచున్నవి. సూర్యచంద్ర
నక్షత్రములు చక్కఁగా వెలుఁగఁదొడఁగినవి. మదపుటేనుఁగులు సొంపు
మీఱియున్నవి. శరత్కాలగుణములచేఁ గలిగిన సౌందర్యలక్ష్మి పెక్కు
తావులందుఁబలుతెఱంగుల కాంతిగలదైయున్నను ప్రకృతము సూర్యుని
తొలివెలుఁగులు సోఁకినంత వికసించినపద్మములుగల తామరకొలఁకు
లయం దెక్కువ శోభిల్లుచున్నది. వనములందు గాడ్పు లేడాకులరఁటి
పూవులతావిగలవై తుమ్మెదల ఝుంకారములతోఁగూడి వీవఁగా,
మదపుటేనుఁగులకు మదము హెచ్చుచున్నది. ఏళ్లయిసుకతిప్పలనుండి
కవగూడివచ్చినవియు, సరోవరముల యందలినివాసము నిచ్ఛగించు
ననియు, తామరపూవుల పుప్పొళ్లుగ్రమ్మిన విశాలములయిన జక్కని
ఱెక్కలుగలవియునగు జక్కవలతోఁగూడి నంచలు విహరించుచున్నవి.

శరత్కాలలక్ష్మి మదముచే శోభిల్లు నేనుఁగులయందును, ఆ మెక్కిన యాఁబోతులమందలందును నిర్మలోదకములగు నదులందును బంచిపెట్టఁ బడినట్లు సమముగ వెలుఁగుచున్నది. మేఘము లాకాశమును విడిచి పోవుటను గని, వనములందలి నెమళ్లు పురులు ముడుచుకొని, వెంటి నెమళ్ళయం దనురక్తిమాని, కాంతితఱిగినవై, సంతసము దొఱఁగి శ్రావ్యనాదములుచేయక ధ్యానముచేయుచున్నవి. మనోహరములగు సువాసనగల యనేకములయిన వేగిసచెట్లు పుష్పభారముచే వంగిన కొమ్మలుగలవై బంగారువలెఁ బచ్చనై కన్నులకొప్పియుండుటచేత వన ప్రదేశములు దీపములతోఁగూడినట్లు ప్రకాశించుచున్నవి. ఈ ఋతువు నందు వనవిహారజలవిహారములం దాసతోఁగల మేటియేనుఁగులు తమ ప్రియలతోఁగూడి, యేడాకులయరఁటి పూవులవాసనకు హెచ్చిన మదముగలవై, మదజలము గండస్థలములను భేదించికొని కాఱు చుండఁగా మఱింతమదించినవై, తిన్నగా నడయాడుచున్నవి. శరదృతు వునం దాకాశము మేఘములులేమిచేఁ గత్తివలెఁ దెల్లనివన్నెగలిగి యున్నది. నదులు సన్నగాఁ బాఱుచున్నవి. గాడ్పు లెఱ్ఱతామరపూవు వలెఁ జల్లఁగా వీచుచున్నవి. దిక్కులు చీఁకటి తొలఁగఁగా వెలుఁగు చున్నవి. చక్కఁగా నెండకాయుటచే బురదయెండి పుడమినుండి దట్టమైన దుమ్ము లేచుచున్నది. ఒండొరులపై విరోధమును, కోపమును గల రాజులు యుద్ధయాత్రకై వెడలుచున్నారు. ఆఁబోతులు శరదృతుగుణములచే నొప్పారినరూపకాంతులు గలిగినవై యుప్పొంగుచు, దుమ్ము గ్రమ్మిన మేనులతోఁగూడి, మదించినవై, యొండొంటితోడఁ బోరాడఁ గోరి, యావులనడుమ అంకెలువేయుచున్నవి. వనమునందలి యాఁడే నుఁగు లోర్వఁజాలని మోహముగలవై, తమగుంపులతోఁగూడి, కామాతిరేకముతోఁ గూడి, మదించి, తిన్నని నడకనడచుచున్న తమ భర్తలను జుట్టుకొనిపోవుచున్నవి. తొలుత ధనికులుగ నున్నవారు కాలవైపరీత్యమువలన దరిద్రులుగాఁగా, నూతనధనికులు హేళనము చేయ నేమియుఁజేయఁజాలనట్లు, నెమళ్లు వర్షర్తువునందు మేఘోదయ కాలమునఁ దమకలంకారములయిన మేటిపురులను విచ్చియాడుచుండి నవి. ఇప్పుడవి మేఘములుపోవుటంజూచి, తమపురులను ముడుచుకొని, యేటిగట్లులకుఁబోఁగా, హంసలు శరత్కాలము వచ్చుటంజేసి గర్వించి

తమ్ము హేళనముచేయఁబడినవివోలె గర్వమువీడి విన్నదనముతోఁగూడి మఱలిపోవుచున్నవి. మదముచేఁబగిలిన గండస్థలంబులనుండి మదజలంబు గార్చునట్టి మేటియేనుఁగులు కారండవములను, చక్రవాకపక్షులను గొప్పఘీంకారములొనర్చి బెదరించుచు విరిసినకమలములచే శోభిల్లు చున్న కొలఁకులనుఁ గలియఁబెట్టి కలియఁబెట్టి నీటిని ద్రావుచున్నవి. రొంపిలేక, తేఁటనీటితోఁగూడి యిసుకచే నొప్పినవియు, గట్టులం దాల మందలతోఁగూడి, బెగ్గురుపక్షులనాదములతో నొప్పుచున్నవియునగు నదులందు రాయంచలు సంతసముతోఁ దిరుగుచున్నవి. వర్షాకాలము పోయి, శరత్కాలము వచ్చుటచేత నేఱులును, మేఘములును, సెలయేళ్ళ నీటిధారలచప్పుడును, పెచ్చుపెరిగిన గాడ్పులధ్వనులును, నెమళ్ళ కేకలును, సంతసములేని కప్పలకూఁతలును వేగిరముగ నిలిచి పోయెను. పెక్కురంగులుగలవియు, వర్షాకాలమున వానకు వెలుపల రాక పుట్టలలోనెయుండుటచే మిక్కిలిచిక్కినవియు, తీక్ష్ణవిషము గలవియునైన పాములు చాలకాలము బిలములలోపల నాహారము లేక యుండుటవలన నాఁకలిచేఁ బీడితములగుచు శరదృతువురాఁగా వెలుపలికిఁ బ్రాఁకుచున్నవి. * ప్రకాశించుచున్న చంద్రునికిరణములు

*శ్లో. చంచచ్చంద్రకరస్పర్శహర్షోన్మీలితతారకా,
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరమ్.

చంచత్ చంద్రకరస్పర్శహర్ష ఉన్మీలితతారకా=ఉదయించుచున్న చంద్రుని కిరణముల తాఁకుడువలని శోభచే వెలుఁగుచున్న నక్షత్రములుగలది యని యొక యర్థము. వెలుఁగుచున్న చంద్రుఁడను పురుషునిచేతితాఁకుడుచేతఁ గలిగిన సంతోషముచేఁ దెఱచికొన్న కన్నులుగలదియని మఱియొక యర్థము. రాగవతీ=ఎఱ్ఱదనము గలదియని యొకయర్థము. ప్రేమగలదియని యొకయర్థము. సంధ్యా = సంధ్యాకాలము, అని యొకయర్థము. సంధ్యయను నొకస్త్రీయని మఱియొకయర్థము. స్వయం = తానే, అంబరం = ఆకాశమును అని యొకయర్థము. వస్త్రమును అనియొకయర్థము. జహాతి = విడుచుచున్నది. విచ్చివేయుచున్నది. అహో = ఆశ్చర్యము. ఈశ్లోకమున చంద్రపదము పుల్లింగమగుటచేతను, సంధ్యాపదము స్త్రీలింగమగుటచేతను, కరము, తారక, రాగము, అంబరము అను పదములర్థద్వయము గలవగుటచేతను. "ఒకానొక కాముకి యగునతివ తనప్రియునిచేయి తగిలినంతట సంతోషముచేఁ గన్నులువిచ్చినదై, సురతము గోరి తానే కోకవిచ్చుచున్నది. అహా! మోహముయొక్కమహిమ యేమనవచ్చును!" యని యర్థము ధ్వనించుచున్నది. రామాయణమున నిది యొక వాల్మీకిచమత్కారముఁ దెల్పు శ్లోకము. చదువరుల యాహ్లాదమునకై, శ్లోకము నిందుఁ జేర్పఁబడుచున్నది.

పోకుటచే సంతసించి వెలుఁగొందుచున్న తారకలుగలదియు, రక్త వర్ణముగలదియునగుసంధ్య తనంతన యాకాశమును విడిచిపోవుచున్నది. చంద్రుఁడను చక్కనిమోముగలదియు, నక్షత్రములనెడు వెలుఁగుచున్న కన్నులుఁగలదియు, వెన్నెలయను దుప్పటముగలదియునయిన రాత్రి తెల్లని చీరె గప్పుకొన్న చానవలె నొప్పుచున్నది. బెగ్గురుపక్షులు చక్కఁగాఁ బండినశాలిధాన్యపువెన్నులను దిని యేపుమీఱి వరుసలుదీరి గాలికెగిరిన మల్లెపూవులసరమువలె విరాజిల్లుచు నాకసమునఁ బోవుచున్నవి. నిద్రించుచున్న యొంటి రాయంచగలదియు, పెక్కు తెల్లగలువలతోఁ గూడినదియునైన గొప్పమడుఁగులనున్న నిర్మలోదకము, మబ్బులుతొలఁగి, చంద్రబింబముచేతను నక్షత్రగణముచేతను నొప్పుచున్న యాకాశముమాడ్కి వెలుఁగుచున్నది. అచ్చటచ్చట నివసించుచున్న హంసములు చలించుచున్న మొలనూళ్ళయి వికసితకమలోత్పలములు పుష్పహారములై తలిర్ప, మేటినడబావు లలంకృతలయిన యంగనలచందమున నెక్కువ శోభిల్లుచున్నవి. పిల్లనఁగ్రోవులరవమును, వేఁకువనువీఁచునట్టి గాలి చప్పుడును, గొల్లతలు పెరుగు చిలుకునప్పుడు గలుగుధ్వనులును, దూడలకై యఱచుగోవుల యఱపులును, ఆఁబోతులు చేయునట్టి ఱంకెలు నొండొంటితోఁగలసి పెంపొందుచున్నవి. ఏళ్ళగట్టులు పువ్వులచే నొప్పినవై, మెల్లనిగాలికిఁ గదలుచు నుతికిన మఱకిలేని తెల్లనిబట్టలచందమున వెలిఁగెడి ఱెల్లుచేఁ గప్పఁబడినవై తెల్లపట్టుచీరలఁగట్టిన యతివల జఘనములవలె వెలుఁగుచున్నవి. అడవులందు నిరాటంకముగాఁ దిరుగునవియు, పూఁదేనె గ్రోలుటయందు నేర్పుగలవియునైన తుమ్మెదలు ప్రియాసమేతములై కమలంబులందు వ్రాలినప్పుడు, వానిపుప్పొడి యంటుకొనుటచేఁ బచ్చని వన్నెగలవై, గాలియందలి సువాసనగొనుటకై మోదముతో గాలిని వెంబడించిపోవుచున్నవి. తేటనీరును, వికస్వరకుముదములును, కొంగల కూఁతలును, పచ్చగాఁబండిన వరిపైరును, మెల్లనిగాలియు, నిర్మలమగు చందమామయు వర్షర్తువు గతించెనని తెలుపుచున్నవి. కామినులు రేయియెల్లఁ దమప్రియులతోఁ గ్రీడించి వేఁకువలేచి యలసటచేఁ దిన్నగా నడచిపోవుచందమున, చేప లనెడి యొడ్డాణములను గనఁబఱచుచు నదీకాంతలు శరదృతువురాఁగా మెల్లగాఁబాఱుచున్నవి.

చక్రవాకపక్షులతోను, పాచితీఁగెలతోను, వెలిపట్టుచీరెలవంటి తెల్లుపొదలతోనుగూడిన నదులముఖములు మకరికాపత్రములచే నలంకరింపఁబడి, గోరోచనముపూఁతగలిగి వెలిపట్టుచీరల మేలిముసుఁగుగల యువిదలమోములమాడ్కి వెలుఁగుచున్నవి. చక్కఁగా వికసించిన గోరింటపూవులచేతను వేగిసపూవులచేతను మనోహరములై, మదించిన తుమ్మెదల ఝుంకారములతోఁ గూడియున్న వనములందు మన్మథుఁడు వాఁడితూపులను వింటిని దాల్చినవాఁడై విరహిజనులను బాధింప నిశ్చయముగాఁ దిరుగుచున్నాఁడు. వార్షికమేఘములు లోకమును పూర్ణవర్షముచేఁ దనివినొందించి, నదులను చెఱువులను నిండించి, భూమిని పైరుపంటలచే వెలయఁజేసి, యాకాశమువిడిచి పోయెను. కొలఁకులు తేటనీటితోఁగూడినవై, చక్రవాక పక్షులతోను, రమ్యముగాఁ గూయునాఁడుకొంగలరవములతోను గూడి యెక్కువగా వెలుఁగొందుచున్నవి. కొండచరులందు వేఁగిసచెట్లు, ఏడాకులయరఁటిచెట్లు, కాంచనపుఁజెట్లు, మంకెనచెట్లు, ప్రేంకణపుఁజెట్లును జక్కఁగాఁ బూఁచియున్నవి. లక్ష్మణా! యేళ్ళయందలి యిసుకదిన్నెలు, రాయంచలు, బెగ్గురుపక్షులు, చక్రవాకములు, కొక్కెరలు మొదలగు పక్షులతో నంతట నొప్పుచున్నవిచూడుము. రాజపుత్త్రా! మచ్చరము పెచ్చుపెరిగి యొండొరులను జయింపగోరు రాజులదండయాత్రకుఁ బ్రయత్నించునదనిదె వచ్చినది. రాజపుత్త్రా! రాజులు దండయాత్ర వెడలుట కిది ముఖ్యమైనకాలము. సుగ్రీవుఁడును గనఁబడఁడు. అట్టి ప్రయత్నమును గానరాదు. ఓ లక్ష్మణా! సీతనుగానక చింతాక్రాంతుఁడనై యీ వర్షాకాలము నాలుగునెలలను నూఱేండ్లతోపాటు గడపితిని. ఆఁడుచక్రవాకపక్షి తనభర్తను వెంబడించి వనమునఁబోవునట్లు, ఈ సీతయు నన్ను వెంబడించి, పూఁదోటకుఁబోవునట్లే యీ భయంకరమగు దండకారణ్యమునకు సంతసముతో వచ్చినది. లక్ష్మణా! రాజ్యమునుండి తొలఁగింపఁబడి యడవులకుఁ బంపఁబడినవాఁడనై ప్రియురాలినెడఁబాసి, వంతచేఁ గుందినవాఁడనయియున్న నాయెడ సుగ్రీవునకింకను దయపుట్టలేదుగదా! శత్రుసూదనుఁడవయిన యో లక్ష్మణా! “ఇతఁడు దిక్కులేనివాఁడు; రాజ్యముఁబోఁగొట్టుకొన్నవాఁడు; రావణునిచేఁ దిరస్కరింపఁబడినవాఁడు; దీనుఁడు; స్వదేశమునకుఁ గడుదవ్వున

నుండువాఁడు; కాముకుఁడు; నన్నే శరణుచొచ్చినవాఁడు." అను నీకారణములచే నన్ను లక్ష్యపెట్టక దురాత్ముఁడయిన వానరేంద్రుఁడగు సుగ్రీవుఁడు నన్నవమానించినవాఁడు. స్వకార్యము నెఱవేఱెనుగనుక దురహంకారి యగు సుగ్రీవుఁడు శరత్కాలము వచ్చినతోడనే సీతను వెదకుటకుఁ బోయెదనని ప్రతిజ్ఞ సేసియు దినములు లెక్కింపక యట్లుసీతాన్వేషణప్రయత్నము చేయకయున్నాఁడు, నీవు కిష్కింధాపురమునొచ్చి, మూఢుఁడయి, తుచ్ఛసుఖములందుఁ దవిలియున్న సుగ్రీవునితో నా మాటగాఁజెప్పుము. "ఓసుగ్రీవా! లోకమునఁ దొలుత నెవఁడుయాచకుల కును, యోగ్యులకును, తనకు మేలుచేయువారికిని ఆశనుగల్పించి వారడిగినది యిచ్చెదనని చెప్పి యావల నాశాభంగమునుచేయుచున్నాఁడో, వాఁడు మానవాధముండని చెప్పఁబడుచున్నాఁడు. ఎవఁడు మంచిదో, లేక చెడ్డదో యొకపనిని చేసెదనని మాటయిచ్చి యా ప్రకారము జరిపించుచున్నాఁడో, అట్టి యెనగాఁడే మానవులలో నుత్తముఁ డన బరఁగును. తా మొరులచేతఁ బనిచేయించికొని, యొరులకుఁ గష్టము సంభవించునప్పుడు ప్రత్యుపకారము గావింపని కృతఘ్నులు చచ్చినను, వారి శవములను కుక్కలు నక్కలుగూడఁ దినవు" అని చెప్పుము. ఆ సుగ్రీవుఁడును సమరమున నేను బంగారుమయమయిన వెనుకభాగము గల ధనుస్సు నీడ్వఁగా, మెఱుపుగుంపువలె మెఱయుచున్న యద్దాని రూపమునుజూడఁ గోరుచున్నాఁడు గాఁబోలును. ఇది నిజము. నేను కుపితుఁడనై యుద్ధరంగమునఁ జేయు వజ్రఘోషమునుబోలిన యల్లె త్రాటిచప్పుడును మఱల వినఁగోరుచున్నాఁడు గాఁబోలు. ఈ సుగ్రీవుఁడు వాలివధమువలన నీతోఁగూడియున్న నాయొక్క పరాక్రమ మిట్టిదని యెఱిఁగియుండియుఁ గాలముమించినను, సీతాన్వేషణ చింతలేక యున్నాఁడు గదా! శత్రుపురములను ధ్వంసముచేయువాఁడా! యే పని నిమిత్తమై యీ సుగ్రీవునితోడి చెలిమియు, వాలివధమును గావింపఁబడెనో, ఆ స్వకార్యము నెఱవేఱుటచేఁ సుగ్రీవుఁడు ప్రతిజ్ఞను మఱచినవాఁడు. కావుననే యతఁడు వర్షాకాలము వెళ్లఁగా వచ్చెదనని ప్రతినయొనర్చి యా నాలుగునెలలు గడచినను విహారములుసలుపుచుఁ దెలియకయున్నాఁడు. ఆ సుగ్రీవుఁడు మంత్రిపరిజనములతోఁ గూడినవాఁడై వినోదించుచు మద్యపానముననే యాసక్తుఁడయియున్నాఁడు

కాని, శోకపీడితులమయియున్న మనయెడ దయదలఁపక యున్నాఁడు. మహాబలుఁడవగు లక్ష్మణా! సుగ్రీవునికడకుఁబోయి, నాకోపమురీతి యెట్టిదో యతనికిఁదెలిపి జెప్పిరమ్ము. మఱియు "ఓ సుగ్రీవుఁడా! వాలి నాచే హతుఁడయి యేమార్గమునఁ బోయెనో, ఆ మార్గము మూయఁ బడలేదు. నీవు ప్రతిజ్ఞను గాపాడుకొనుము. వాలిదారిని వెంబడింప కుము. నా బాణముతో రణమున వాలియొక్కఁడే మృతినొందెను. నీవు ప్రతిజ్ఞదప్పితివేని, నిన్ను సకుటుంబముగా ధ్వంసముచేసెదను" అని యతనితో నామాటగాఁ జెప్పుము. పురుషశ్రేష్ఠుఁడవైన లక్ష్మణా! కార్య మిాతీరున నున్నది గనుక నికార్యమునకుఁ దగినట్లుగా నే యేమాటచెప్పవలయునో యాయామాటం జెప్పుము. కాలము మించి పోవుచున్నది. త్వరపడుము. నీ వా సుగ్రీవునికడకేగి, "వానరపుంగవా! ఆడినమాటలచొప్పున నడచుట యుత్తమధర్మమనియు, సత్యముతప్ప రాదనియు, నేను ప్రయోగించిన బాణంబులచే యుద్ధరంగమున నీల్గిన వాఁడవై జమునివీటికిఁజని వాలింజూచునట్లు చేసికొనకుము" అని నా మాటగాఁ జెప్పుము." అని రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను. తీక్ష్ణ ప్రతాపుఁడయిన మనువంశమునకుఁ బ్రభువగు లక్ష్మణుఁడు సీతా వియోగశోకముచే దీనుఁడయియున్నను రాముఁడు సుగ్రీవునిమీఁది యాగ్రహముచే నోర్వరాని యెక్కువకోపంబుగలవాఁడై, యూఱ డించినను నిష్కళింపకయుండుటం గని సుగ్రీవునియందు మిక్కిలి కఠిన మయిన తలంపుగలవాఁడయ్యెను.)

## 31-వ సర్గము

### లక్ష్మణుఁడు సుగ్రీవునికడ కేగుట

ఆ దశరథనరేంద్రుని నందనుఁడయిన లక్ష్మణుఁడు కాముకుఁడగు టచే దైన్యమునందినవాఁడును, స్వాభావికముగా ధీరుఁడును, సీతా వియోగఖిన్నుఁడై, సుగ్రీవుఁడు కాలముమీఱి రాకయుండుటచే నతనిమీఁద నెక్కువయాగ్రహము చెందినవాఁడును నయిన యన్న యగు రామునిఁగూర్చి యిట్లనియె. "ఓ పూజ్యుఁడా! సుగ్రీవుఁడు తన కుపకారమొనర్చినవారికిఁ బ్రత్యుపకార మొనరింపవలెనను సజ్జనుల ధర్మమునందు నిలువఁడు. రామునితోడి చెలిమివలననేకదా నా కీ రాజ్య

మును, భార్యయు దొరకెననియుఁ దలఁపఁడు. ఇతండు వానరరాజ్య సంపదననుభవింపఁదగఁడు. కావున, ఈతనిబుద్ధి మనకార్యముల కను కూలింపదు. వీఁడు మదిసెడి, కామసుఖములం దవిలి, నీ యుపకారము నకుఁ బ్రత్యుపకారము సేయుటయందుఁ దలంపులేనివాఁడై యున్న వాఁడు. కావున వీఁడు నాచే హతుఁడై యన్నకడకుఁబోయి చేరును గాక! ఇట్టి చెడుగుణములు గలవాని కెంతమాత్రము రాజ్యము నీయఁ దగదు. నామనస్సున వేగముతోఁబుట్టుచున్న కోపమును నే నాఁపు కొనఁజాలను. బొంకులాడువాఁ డగు నా సుగ్రీవు నిప్పుడే వధించెదను. వాలిపుత్త్రుఁ డంగదుఁడు తక్కుంగల వానరవీరులతోఁ గూడి సీతను వెదకుఁగాక! అని తనమనసునఁగల యభిప్రాయముఁదెలిపి యుద్ధము చేయుటయం దోర్వరాని కోపముగలవాఁడై, ధనుస్సును జేతఁబట్టి యేగుచున్న లక్ష్మణునిగూర్చి శత్రువీరుల సంహరించువాఁడగు రాముఁడు చక్కనియోచనతోఁ గూడినదియు, నెమ్మదిని దెల్పునదియునయిన మాట చెప్పెను.

"లక్ష్మణా! లోకమున నీవంటివాఁడు మిత్రసంహారరూపమయిన చెడుపనిని జేయఁడు. కోపమువచ్చినప్పు డెవ్వఁడు దాని నోర్పుతో నణఁచుకొనునో, వాఁడు పురుషశ్రేష్ఠుఁ డనఁబడును. లక్ష్మణా! నీవు మంచినడవడిగలవాఁడవు గావున నిట్టి పాపము సేయఁ దలంపుగొనకుము. పూర్వము సుగ్రీవునియం దున్నంతప్రేమను, మనమువానితోఁ జేసి కొన్న చెలిమినితలంచి యతనితో నిష్ఠురపుమాట లాడక, తిన్నని మాటలతో, నా సుగ్రీవునితో నిట్లు జాగుసేయుట తగునా యని యడుగవలసినది" అని యన్నపలుకఁగా, మంచి బుద్ధిగలవాఁడు, పండి తుఁడు, అన్నగారి కిష్టమును హితమును జేయుటయం దాస్థగలవాఁడు, తనయన్నకు విధేయుఁడు, బుద్ధియందు బృహస్పతిని బురుడించువాఁడు నయిన లక్ష్మణుఁడు సుగ్రీవునిమీఁదికోపము నడఁచుకొని, ప్రలయ కాలయమునిఁబోలిన వాఁడయి ఇంద్రధనుస్సును బోలినదియు పర్వత శృంగము వంటిదియునగు ధనుస్సునుపుచ్చుకొని శృంగముతో నొప్పారుచున్న మందరపర్వతమువలె కిష్కింధనుగూర్చి బయలుదేరెను. లక్ష్మణుఁడట్లు కామక్రోధములవలనఁ బుట్టిన రాముని కోపాగ్నితోఁగూడి నవాఁ డగుటంజేసి వాయువుతోఁగూడిన యగ్నింబోలి మండుచుఁ

బయనమై, తనవేగముచే నెక్కుడుమద్దులను, తాటిచెట్లను, ఇనుమద్ది చెట్లను గ్రిందఁబడఁద్రోయుచుఁ బర్వత శిఖరములను, మఱియనేక వృక్షములను నెగిరిపడునట్లు చేయుచు, వేగముతో నడుచునట్టి యేనుఁగుకైవడి తాలను దుత్తునియలుసేయుచు, దూరదూరముగ నడుగులిడుచు పనియవసరమువలనఁ గడువడిగాఁబోయి, పర్వతముల నడుమ సేనలతోనిండినదయి, శత్రురాజులకుఁ జొరరానిదగు వాన రేంద్రుఁడయిన సుగ్రీవునిపట్టణము జూచెను.

ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారిలోపల శ్రేష్ఠుఁడయిన లక్ష్మణుఁడు సుగ్రీవునిమీఁది యాగ్రహముచే నదరుచున్న పెదవులుగలవాఁడై పర్వతపుసందున సేనలతో నిండినదియుఁ జొరరానిదియు నయిన వాన రాధిపుని పత్తనంబగు కిష్కింధయొక్క వెలుపటఁ దిరుగుచున్న వెఱపు గలిగించువారగు వానరులనుజూచెను. ఏనుఁగులంబోలు వానరులం దఱు పురుషశ్రేష్ఠుఁడైన లక్ష్మణునిఁ గోపాటోపముతో వచ్చుచున్న వానిని జూచి, శత్రువువచ్చుచున్నాఁ డన్న భీతిచే కొండకొమ్ములను, ఎత్తుగాఁబెరిగినచెట్లను గొని, యా లక్ష్మణునిమీఁదికిఁ గవియఁగా, లక్ష్మ ణుఁడును నెక్కుకట్టెలువేసి మంటపెట్టిన యగ్నిహోత్రునికైవడి క్రోధ ముగలవాఁడయ్యెను. ప్రలయకాలయమునిచందమున మండిపడుచున్న లక్ష్మణుంజూచి, వానరులు, మనమున భయము దోప గడగడవణఁ కుచుఁ బలుదెసలకుఁ బరుగులిడి, సుగ్రీవుని యంతఃపురమునొచ్చి, లక్ష్మ ణుఁడు గోపముతో వచ్చియున్నాఁ డన్నవార్త నెఱిఁగించిరి. అపుడు వానర రాజగు సుగ్రీవుఁడు మన్మథసుఖములం దవిలి, యేకాంతమునఁ దారతోఁగూడి రమించుచుండుటవలన నా కపివీరులమాటను వినఁ డయ్యె. అప్పుడు మంత్రులు సంగతిఁగనుఁగొని రమ్మని యానతియ్యఁగా, పర్వతములను, ఏనుఁగులను, మేఘములనుబోలిన యాకారములు గలవారగు వానరులు నగరునుండి వెడలిరి. ఆ వానరులందఱు గోళ్ళనుగోఱలును నాయుధములుగాఁ గలిగినవారు; వికృతస్వరూ పముగలవారు; పులులమాడ్కి గర్వముగల వారు; భయంకర ముఖులు. వారిలో కొందఱు పదియేనుఁగుల బలముగలవారు. కొందఱు వేయియేనుఁగుల బలంబుగలవారు నయి యుండిరి. అట్టి బలవంతులగు వానరులందఱు చేతులతోఁ జెట్లనుబట్టి

కొని కావలికాచుచుండుటవలన నేరికిఁజొరఁ నలవికాని కిష్కింధా నగరమును లక్ష్మణుఁడు జూచెను. అంత నప్పు డెక్కువ బలిమిగల యా వానరులందఱు ప్రాకారమునకును పరిఖకును నడుమనున్న మార్గమున వెడలివచ్చి యా లక్ష్మణునికిఁ గనఁబడునట్లు నిలిచిరి. అప్పుడు శౌర్య ధైర్యములుగల రాజపుత్త్రుఁడగు లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు సమయము మీఱుటను, తనయన్న నొచ్చియుండుటను దలఁచి, మఱలఁ గోపము నొంది, వేడినిట్టూర్పు నిగిడించి, కోపముచేఁ గన్ను లెఱ్ఱఁగఁజేసినవాఁడై, పొగతోఁగూడిన యగ్నిహోత్త్రునివలె మండిపడుచు, బాణము ములుకు లనెడి మండుచున్న నాలుకలును, ధనుస్సనెడి పడగయు, వెలుఁగనెడి విషముంగల యయిదుతలలపాము వలె భీకరుఁడై యుండెను. అప్పు డంగదుఁడు ప్రలయకాలాగ్నినింబోలెఁ బ్రజ్వరిల్లువాఁడును, తేఁపఁ బడిన మదపుటేనుఁగుంబోలు వాఁడునునయిన లక్ష్మణునిఁజేరి, వెఱపుచే మిక్కిలి విచారమునొంది నిలిచియుండెను. పేరుగాంచిన యా లక్ష్మ ణుఁడు, కినుకచేఁ గన్ను లెఱ్ఱచేసి, యంగదునిఁ జూచి “ఓరీ పిన్నవాఁడా! సుగ్రీవునికడ కేగి, “చిన్నాయనా, శత్త్రువుల నణఁగఁద్రొక్కఁగల వాఁడగు రామునితమ్ముఁడు లక్ష్మణుఁడు రామునిచింతకు నొచ్చినవాఁడై, నీకడకువచ్చుటకయి వాఁకిట నున్నవాఁడు. అతని మాటయందు నీ కిష్టముగలదేని యట్లు నడచుకొనుము” అనిచెప్పి, పగతుర రూపు మాపు నంగదుఁడా, నీవు వేగరమ్ము” అని చెప్పెను.

బలముగల అంగదుఁడును లక్ష్మణునిమాట విని, వగలఁబొగు లుచుఁ దండ్రికడకేగుదెంచి మనసునఁ గలవరమునంది, మోహమున విన్న దనముదోఁపఁ దండ్రిపాదములకును, ఆవల దల్లి పినతల్లుల పాదములకును మ్రొక్కి, లక్ష్మణుఁడు తెలిపిన తెఱఁగెల్ల నెఱిఁగించెను. అయినను సుగ్రీ వుఁడును నిద్రాకామసుఖపరవశుండై, మరునివలపులం దగిలి మైమఱచి యుండెను. అంత వానరులందఱు మిక్కిలి వెఱపునొంది కోపముతోఁ గూడియున్న లక్ష్మణుని శాంతపఱచుటకై యందఱుగూడి గొప్ప ప్రవాహవేగమువలెనున్న లక్ష్మణునిగని పిడుగువలె మ్రోగునట్టి సింహ నాదమును, కిలకిలరవములును జేసిరి. సుగ్రీవుఁడును మత్తుచేఁ దెఱవ నలవికాని కన్నులుగలవాఁడును, క్రిందుమీఁదైయున్న పూలదండ లును ఆభరణములును గలవాఁడునునై, యా సింహనాదమున కులికి

పడి లేచెను. తర్వాత చక్కని యాలోచన చేయఁగలవారును, అంతః పురమునకులోపలఁ బోఁగలవారు నగు ప్లక్షప్రభాసు లనెడు సుగ్రీవుని ప్రియమంత్రు లిద్దఱు నంగదునిమాట విని, యాతనిఁగూడఁదీసికొని "పెక్కుతెఱఁగులగు ధర్మార్థస్వరూపములను దెలుపవచ్చియున్నాఁడు" లక్ష్మణుఁడని నివేదించుకోరికతో లోపలికిఁ బ్రవేశించి, దేవతల కధిపతి యగు దేవేంద్రునిచందమున సింహాసనమునఁ గూర్చున్నట్టిసుగ్రీవుని నిష్టాలాపములచె నూఱడించి, "యో వానరేంద్రా! ప్రతిజ్ఞదప్పని వారును, మహాత్ములును, నీకు రాజ్యమునొసఁగినవారును, రాజ్యపరి పాలనమునకుఁ జాలినవారు నయిన యన్నదమ్ములు రామలక్ష్మణులు నీకుఁ జెలికాండ్రయిరిగదా! ఆ యిరువురిలో నొక్కఁడగు లక్ష్మణుఁడు విం టిని జేతఁబట్టి వచ్చి వాకిట నిల్చియున్నాఁడు. అతనికి వెఱచి, వడఁకుచు వానరులు భయముతోఁ గేకలిడుచున్నారు. ఈ లక్ష్మణుఁడు మాటలు సారథ్యము సేయఁగా, ప్రయత్న మను రథముమీఁదఁ గూర్చుండి యిచ్చటికి వచ్చియున్నాఁడు. లక్ష్మణుఁడుపంపఁగా, ఈ తారయొక్క ముద్దుపట్టియగు నంగదుఁడు వేగిరముగావచ్చియున్నాఁడు. ఆయీ మొనగాఁడగు లక్ష్మణుఁడు కన్నులెఱ్ఱగఁజేసి, వానరులను దహించు మాడ్కిఁ జూచుచు వాఁకిటనున్నాఁడు. కావున మహారాజా! బంధు పుత్రమిత్రసమేతుఁడవై త్వరితముగానేగి యతనికిఁ బ్రణమిల్లి, యతని కోపముం జల్లార్పుము. ధర్మాత్ముఁడగురాముఁడు చెప్పినపనిని జాగరూక తతో నెఱవేర్పుము. చేసినప్రతినయొనర్చి, మాటదప్పనివాఁడవగుము" అని యంగదాదులు సెప్పిరి.

## 32-వ సర్గము

### సుగ్రీవుఁడు హనుమంతునితో నాలోచించుట

బుద్ధిమంతుఁడగు సుగ్రీవుఁడు మంత్రులు దోడ్కొనివచ్చిన యంగదుఁడుచెప్పిన మాటనువిని, లక్ష్మణుఁడు తనపై నాగ్రహముతో వచ్చియున్నాఁ డన్నమాటనువిని, సింహాసనము విడిచిలేచెను. ఆలోచన లందు నేర్పరియగు సుగ్రీవుఁడు స్థూలసూక్ష్మముల నాలోచించి, ఆలో చనలుచేయుటయందు నేర్పరులును, ఆలోచనలయం దనుభవముఁగల వారునైన మంత్రులతో నిట్లనియె.

"మంత్రిపుంగవులారా! నేనెల్లప్పుడు రామలక్ష్మణులతోఁ జెడ్డ మాటయొక్కటియు నాడలేదు. చెడపనియొక్కటియుఁ జేయనులేదు ఇఁక లక్ష్మణుఁడు నాపై నేల కోపగించుచున్నాఁడోయని యాలోచించు చున్నాఁడను. నాకుఁ గీడురోయు నాపగతురు, సందుగని పెట్టియుండి, నేను లేనప్పుడు నాపై లేనిపోనితప్పిదము నేమైనను రామునితమ్మునితోఁ జెప్పియుందురు. ఈ విషయమున మీరందఱు స్వబుద్ధి నుపయోగించి, నీతిశాస్త్రోక్తపద్ధతులను గమనించి, తిన్నగా నీ లక్ష్మణుని కోపమునకుఁ గారణమేమియో యాలోచించి తెలిసికొనవలయు. లక్ష్మణునివలనఁ గాని, రామునివలనఁగాని నాకు భయములేనేలేదు. అయినను చెలి కాఁడు నిష్కారణముగాఁ గోపించుకొనుటవలన నాకు మిగులభయము గలుగుచున్నది. చెలికానిని సంపాదించుట సులభము. ఆచెలికానితోడి మైత్రిని గాపాడుకొనుటయరుదు. మనస్సులు చపలములు గనుక, స్వల్ప కారణము వచ్చినను చెలిమి బెడిసిపోవును. రాముఁడు నాకుఁజేసిన యుపకారమునకు బదులు మేలు నేను జేయఁజాలనను నొక్కకారణము చేతనే మహాత్ముఁడగు రామునికి వెఱచుచున్నాను."

సుగ్రీవుఁడు మంత్రులతో నిట్లుచెప్పఁగా, వానరశ్రేష్ఠుఁడయిన హనుమంతుఁడు తనబుద్ధితో నాలోచించి, మంత్రులగు వానరులు విను చుండ నా సుగ్రీవుని కిట్లనియె. "కోఁతిమూఁకల నేలువాఁడా! నీతో గట్టిచెలిమియొనర్చుకొన్నవాఁడును, నీకు మేలొనర్చినవాఁడునునగు సజ్జనుని మఱవకున్నావనుట యేమాత్రమును వింతగాదు. మొనగాఁ డగు రాముఁడు భయమును దవ్వున నేవిడిచి, నీయిష్టము నెఱవేర్చు టకై దేవేంద్రునింబోలు పరాక్రమముగల వాలిని సంహరించెను. రాముఁ డన్ని తెఱఁగులఁ నీయెడఁగలప్రేమచేతనే కోపగించికొని, సంపదను బెంచువాఁడగు తమ్ముని లక్ష్మణుఁ బంపెను. యీ విషయమున నెంతమాత్రము సందియము లేదు. సమయమునెఱిఁగినవారిలో నుత్త ముఁడా! నీవు మన్మథమోహితుఁడవై సమయము మీఱినదన్న సంగతి యెఱుఁగకున్నావు. ఏడాకుల యరఁటిచెట్టు పుష్పించి సొబగుమీఱిన శరత్కాలము వచ్చియున్నది. ఆకసమున మేఘములుల్లొయి, సూర్య చంద్రాది గ్రహములును నక్షత్రములును తెల్లగాఁ బ్రకాశించు చున్నవి. దిక్కులును, నదులును, కొలఁకులును స్వచ్ఛములై యున్నవి.

వానరశ్రేష్ఠుఁడా! జానకిని వెదకఁబ్రయత్నము సేయఁ దగినకాలము వచ్చినను నీవెఱుఁగకయున్నావు. నీవు మైమఱచి యున్నాఁడవన్న కారణముచేతనే లక్ష్మణుఁ డిచ్చటికివచ్చెను. ఇది నిజము. మహాత్ముఁడగు రాముఁడు భార్యఁగోల్పోయి, వ్యసనసముద్రమున మునిఁగినవాఁడై, మఱియొకని మూలమునఁజెప్పిపంపినమాట కఠినముగానున్నను, నీవోర్చుకొనవలసినదే. నీవు రామునితోఁజేసిన సంకేతసమయమును మీఱితివి గావునఁ దప్పిదము నీపైనున్నది. కావున నీవిప్పుడు చేతులు జోడించి యా లక్ష్మణునికడ కేగి యాతనికోపము నుపశమింపఁజేయుట యుత్తమము. దానికంటె వేఱొక్కటి తగినయుపాయము లేదు. రాజుచే నాలోచన యడుగఁబడినప్పుడు, మంత్రులు రాజునకుఁ దప్పక మేలొనరవుమాటయే చెప్పవలయును. కావుననే నేను నిర్భయముగా నాకుఁదోఁచిన యథార్థవాక్యమును బలికితిని. రాముఁడలిగినచో, ధనుస్సును జేతఁబూని, దేవగంధర్వరాక్షసులతోఁగూడిన ముల్లోకములను దనస్వాధీనతయం దుంచుకొనఁగలఁడు. ఎవఁడు కోపవంతుఁడై యుండఁగా, బతిమాలి నిష్కళపఱుపఁ దగినవాఁడో, అట్టివానికిఁ గోపము వచ్చునట్లు చేయరాదు. అందును, తానొక్కనివలన నుపకారమునొంది, యాయుపకారమును మఱవనివాఁడు తనమిత్రునికిఁ గోపమువచ్చినప్పుడు బతిమాలుకొని శాంతపఱచుట యెన్నటికిఁ దప్పిదముగాదు. కావున వానరరాజా! నీవిప్పుడు పుత్రమిత్ర పరిజన సహితుఁడవుగనేగి, యతనికి సాగిలఁబడిమ్రొక్కి, భార్య భర్తయధీనత యందుండులాగున విధేయుఁడవై యాడినమాటనుజెల్లింపుము. వానరేంద్రుఁడా! రామలక్ష్మణుల యాజ్ఞను మనసులోనైన మీఱుట నీకుయుక్తముగాదు. దేవేంద్రునిఁబోలు ప్రతాపముగల రాముని యస్త్రబలము మాత్రమే కాక, దేహబలమును నీమనసునకుఁ దెలిసియేయున్నదికదా! ఇఁకనే విశేషముగాఁ జెప్పవలసినది లే"దని హనుమంతుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

## 33-వ సర్గము

లక్ష్మణుఁడు సుగ్రీవుని నాశకపురముపఁ జూచుట

ఇక్కడ హనుమంతుఁడిట్లు సుగ్రీవుని కాలోచన చెప్పుచుండఁగా, లక్ష్మణుఁడు రామునియాజ్ఞగొనివచ్చి, కిష్కింధాపురద్వారమున నిలిచి,

యంగదునితోఁ జెప్పిపంపి, యతఁడు మఱలివచ్చి పిలువలోపలికిఁజొచ్చి, రత్నమయమును, పుష్పించిన వనములతోఁగూడినదియు, మణులతో వెలుఁగునదియు, మేడలు, మాడుగులు మున్నగువానిచే మిక్కిలి యిఱుకైనదియు, పెక్కుతెఱఁగులయంగళ్లచేఁ బ్రకాశించుచుండు నదియు, కోరినపండ్లతోనిండి, పుష్పించినచెట్లచే శోభిల్లునదియు, చందనము, అగురు, కమలములయొక్కయు, మద్యమైరేయముల సువాసనలచేఁ బరిమళించుచున్న రాజమార్గములు గలదియు, కమ్మనిపూలదండలను మేలి వలువలనుదాల్చి, చూడఁదగినవారలు, కోరినరూపమెత్తఁగలవారలునై దేవతలకు గంధర్వులకును జనించినట్టివారలునయినవానరులచేఁ దేజరిల్లునదియునగు విశాలమును రమ్యమునునై యున్న కిష్కింధాపురమునొచ్చి, యాపురములోపలఁ దేటనీటితోఁ గూడిన పెక్కుసెలయేళ్లను జూచుచు, రాజమార్గముఁ బ్రవేశించి, యెక్కువదార్ఢ్యముగలవియు, తెల్లమబ్బులమాడ్కి వెలుఁగునవియు, శ్రేష్ఠములైన పుష్పమాలలచే నలంకృతములైనవియు, ధనధాన్యసంపద గలిగి, స్త్రీరత్నములతోఁగూడినవియునైన యంగదమైంద, ద్వివిద, గవయ, గవాక్ష, గజ, శరభ, విద్యున్మాలి, సంపాతి, సూర్యాక్ష, హనుమత్, వీరబాహు, నళ, కుముద, సుషేణ, తార, జాంబవత్, దధివక్త్ర, నీల, సుపాటల, సునేత్రు లను వానరోత్తములయొక్క రమ్యములైన యుత్తమగృహములనుజూచెను. వెంటనే తెల్లని ప్రాకారముచేఁ జుట్టఁబడినదియు, పగతురకుఁ జొరనలవికానిదియు, దేవేంద్రుని గృహమువూడ్కి మెఱయునదియునైన రాజభవనమును దవ్వుననే చూచి, దగ్గఱకువచ్చి, కైలాసశిఖరములంబోలు తెల్లని దేవాలయగోపురములతో నొప్పుచు, కోరిన దివ్యపుష్పఫలములుగలిగి, కాంతిచే నొప్పారుచు, నల్లనిమబ్బులంబోలు డాలుగలిగి, చల్లనినీడతోఁగూడి, బాటసారులకు సేదదీర్చునట్టి వృక్షములచే శోభిల్లునదియు, బలవంతులగు నాయుధధారులయిన వానరులచేఁ గావలికాచఁబడినదియు, దివ్యములైన పుష్పమాలికలచే నలంకరింపఁబడినదియు, మేలిమి పసిఁడితోరణములుగలిగి, తెల్లనై వెలుగుచున్నదియునైన సుగ్రీవుని గృహమును సూర్యుఁడు గొప్పమేఘమును చొచ్చునట్లు, నిరాటంకముగాఁ బ్రవేశించెను. అట్లు లక్ష్మణుఁడు లోపలికిఁజొచ్చి యనేకజనసమూహములతోఁ

గూడినవియగు నేడుతొట్టికట్లను దాటి, అచ్చటచ్చట బంగారువెండి మంచములతోను, మేటిపటవులతోను గూడిన పెక్కుమేలిమి యాసనములతోను వెలుఁగునదియు, కాఁపుదల చేయఁబడినదియునైన యాసుగ్రీవుని యంతఃపురమునొచ్చెను. లక్ష్మణుఁడు ప్రవేశించుతఱి చక్కని శ్రుతితోఁగూడి, తంబురు, వీణె మొదలగువాని ధ్వనితోఁగలియునట్టు లింపుగఁబాడుచున్న సంగీతమును వినెను. మఱియు బలవంతుఁడగు లక్ష్మణుఁడు సుగ్రీవునియంతఃపురమునఁ బెక్కురూపములుగలవారును, సౌందర్యయౌవనములచే మదించినవారునైన జవరాండ్రను బెక్కండ్రను చూచెను. గొప్పకులములఁ బుట్టినవారును, నానావిధ పుష్పమాల్యములను దాల్చినవారును, పంఙ్క్తులోయుట, పూలదండలుగట్టుటలయందు మెలఁకువతోనుండువారును, చక్కనిసొమ్ములను దాల్చినవారునునయిన యాయుత్తమాంగనలనుజూచి, యచ్చటనే సకలవస్తువులఁబడసి తనివినొందినవారై, మెలఁకువతో రాచకార్యములను జరుపుచు, మేటితొడవులఁదాల్చియున్న సుగ్రీవుని సేవకులను జూచెను. తర్వాత లక్ష్మణుఁడు మఱికొంతదవ్వేగి యచ్చట నతివలయందెలప్రోతలను, మొలనూళ్లయందలి చిఱుగజ్జెలధ్వనులను విని, కాంతలు తమప్రియులతో సంగమించుసమయ మని మిక్కిలి లజ్జపడి యచ్చటనే నిలిచెను. మహాబాహువగు వీరుఁడైన లక్ష్మణుఁడు స్త్రీలుండు తావునకుఁ బోవుటతగదనియెంచి, యేకాంతస్థలమునొచ్చి రాముని శోక కోపావేశములచే రేఁగినవాఁడై, యాభరణముల ధ్వనినివిని, వింటి నారినిమీఁటెను. వానరపుంగవుఁడగు సుగ్రీవుఁ డావింటిచప్పుడువిని, లక్ష్మణుఁ డచ్చటికివచ్చియున్నాఁడనియెఱిఁగి, యుత్తమాసనమునుండి దిగ్గునలేచి, "సోదరునందుఁ బ్రేమగల లక్ష్మణుఁడు, అంగదుఁడు నాకింతకు మున్నెఱిఁగించినచందముననే యిదిగో నిజముగావచ్చినాఁ" డని యా లక్ష్మణుని ధనుష్టంకారముచేతను, అంగదుని వార్తచేతను నెఱిఁగెను. వెంటనే సుగ్రీవునిమోము కళవళపోయెను. అంతట వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు తత్తరపాటుచే నేమియుఁదోఁచక కొంతతడవుండి, జాగ్రత్తతోఁ జక్కనిరూపముగలతారను జూచి యిట్లనియె.

"చక్కనికనుబొమ్మలుగలదానా! యీరాముని తమ్ముఁడు తిన్ననిస్వభావముగలవాఁడు. అట్టివాఁడిప్పుడు గోపముతోగూడివచ్చుట కేమి

కారణ ముండవచ్చును? సత్పురుషులకుఁ గారణములేక కోపమురాదు గదా. ఓ యుత్తమాంగనా! యీలక్ష్మణుని కోపమున కేమికారణముండ వచ్చునని నీకుఁదోఁచుచున్నది? మన మీలక్ష్మణునికి సమ్మతముగాని పని యేదియుఁ జేసినట్లు నాకుఁదోఁపదు. నీవు వేగిరము బుద్ధితో యోచించి, దీని కారణమును దెలుపుము. అటుగాదేని నీవే యాలక్ష్మణునిఁజూచి తిన్ననిమాటలుపలికి యాతనికోపము నిమ్మళించునట్లు సేయుము. నిన్నుఁ జూచినంతఁ గలఁకదేఱిన మనస్సుగలవాఁడై లక్ష్మణుఁడు నీపైఁగినుక చూపఁడు. సత్పురుషు లతివలయెడలఁ గ్రౌర్యము నెప్పుడును జూపరు. తమ్మిరేకులంబోలు కన్నులుగల శత్రుసంహారియగు లక్ష్మణుఁడు శాంత మనస్కుఁడైన పిదప, నేనువచ్చి చూచెదను." అని చెప్పిపంపెను.

ఆతారయు సురతశ్రమచేఁ దొట్రుపడుచు, కైపుచే మోడ్చు చున్న కన్నులుగలదై, యొడ్యాణమును, బంగారు మొలకట్టును జాఱి పోవుచుండ, సురతపు గుఱుతులు కనఁబడుచుండ, రతిక్రీడలబడలికచే ముందుకువ్రాలినశరీరముతో లక్ష్మణునిచేరువకు నేతెంచెను. రాజ పుత్రుఁడయిన లక్ష్మణుఁడును ఆఁడుది చేరువకువచ్చుటచేఁ గోపమువీడి, దానిరూపమును జూచుటకు సిగ్గుపడి తలవాల్చెను. అంత, తారయు మద్యపానముచే సిగ్గువిడిచినదిగనుకను, లక్ష్మణుని కోపము చల్లాఱు టచేతను చనవుచే ధైర్యముదెచ్చుకొని, తిన్ననిమాటలతో గొప్ప యర్థముగలుగునట్లును పలికెను. "ఓరాజపుత్రా, కోపమున కేమికార ణము? మీమాట నెవఁడుమీఱెను? ఎండుఁజెట్లుగల వనమును గాల్ప వచ్చిన కాఱుచిచ్చునకెదుట నెవ్వఁడు నిర్భయముగాఁ గూర్చుండఁ గలఁడు?" అని యడిగెను.

అట్లు సందేహింపక వినయపూర్వకముగను, ప్రేమతోడను నడిగిన యాతారమాటనువిని లక్ష్మణుఁడును ప్రేమతో నర్థముగలమాట నిట్ల నెను. "ఓ పెనిమిటికి మేలుగూర్చుదానా! యేమియిది నీమగఁడు మన్మథ పరతంత్రుఁడై ధర్మార్థములను సేకరించుట మాని యేల యిట్లు తెలివి లేకున్నాఁడు! ఏమి యీ యన్యాయ్యము! తారా! నీమగఁడు రాజ్య వ్యవహారములను బరికింపకయు, వ్యసనమేగతిగానున్న మమ్ము విచారిం పకయు నెల్లప్పుడు మంత్రిపరివారములతోడ మద్యపానలోలుడై యున్నాఁడు. ఆవానరాధిపుఁడగు సుగ్రీవుఁడు నాలుగునెలలు సీతను

వెదక గడువుపెట్టి, యీనాలుగునెలలు దాటినను మత్తుచే, విహరిం
చుచుఁ దెలియకున్నాఁడు. ధర్మార్థ సంపాదనము చేయఁ గోరువాఁ డిట్లు
మద్యపానము సేయరాదు. మద్యపానమువలన ధర్మార్థకామములకు
మూటికిఁ జేటు గలుగును. ఉపకారము చేసినవానికిఁ బ్రత్యుపకారము
సేయనివానికి ధర్మలోపము గలుగును. ప్రత్యుపకారము నొందకుండు
టచే గుణవంతుఁడగు మిత్రుఁడు నశించినపు డర్థకామములకు రెంటికిని
లోపమువాటిల్లును. సత్యమును ధర్మమును విడువకయుండు స్నేహితుఁ
డర్థకామములకంటె శ్రేష్ఠుఁ డనఁబడు. ఈసుగ్రీవుఁ డా యర్థ కామ
ములకు మూలమగు చెలికానిని వదలెనుగదా! ధర్మమునుగూడఁ
బరిత్యజించెను! ఓతారా! పనులకలరూపు నెఱిఁగిన నీవే యిప్పుడు
సుగ్రీవుఁ డిట్లు తడవుచేయుచుండ మేముచేయవలసినదేమో యోచించి
చెపుము." అని లక్ష్మణుఁడుపలుకఁగా, తారయు ధర్మార్థములకుఁదప్పనిది
యునైన యాలక్ష్మణుని యాతిన్నని మాటనువిని, రామునికార్యము
నిమిత్తము లక్ష్మణుఁ డేతెంచియున్నాఁడని యెఱిఁగినదై, యాతనితోఁ
బ్రీతి గలిగించునట్టి మాటచెప్పెను.

రాజపుత్రుఁడా! యిది కోపమున కదనుగాదు. తనవారన
వారియెడనెక్కువ యాగ్రహము పూనరాదు. ఈ సుగ్రీవుఁడు నీపని
చేయుటయందుఁ గోర్కిగలవాఁడు. ఈతఁడొక్కవేళ నిప్పుడు సమ
యము మీఱినను, ఆతనియపరాధము మన్నింపవలయును. లక్ష్మణా!
గొప్పగొనములుగల నీయట్టివాఁడు లొంగినవానియెడఁ గోపముచేయునే?
సాత్త్వికగుణముగలవాఁడు, తపస్సుచేయువాఁడునగు నీయట్టివాఁడు
కోపమునొందునే? వానరవీరుఁడగు సుగ్రీవుని హితుఁడగురాముని కోప
మిట్టిదని నేనెఱుఁగుదును. సుగ్రీవుఁడు కార్యము సకాలమునకుఁ జేయ
కున్నాఁడనియు నెఱుఁగుదును. మీరు మాకేమి యుపకారముఁ గావిం
చితిరో యదియు నెఱుఁగుదును. ఇపుడు చేయవలసినదేమియో
యదియు నేనెఱుఁగుదు. రాజోత్తమా! మన్మథునిబలిమి యెంత యోర్వ
రానిదో యదియునెఱుఁగుదు. ఈ సుగ్రీవుఁడు కామాతురుఁడై యెల్ల
పుడు స్త్రీలయందుఁదగిలియున్న సంగతియు నేనెఱుఁగుదును. నీవిప్పుడు
కినుకపూనుటచూడ, నీకు మాకుఁబోలెఁ గామవికారములందు మనము
దగులుటలేదని తెలియుచున్నది. కామవికారములందుఁజిక్కిన మానవుఁ

డిదియదననియు, ఇది తగుచోటనియు, ధర్మార్థములకు లోపమువాటిల్లు ననియు నెఱుఁగఁడు. నీవును సుగ్రీవునట్లు కామపరవశుఁడవయి యుందు వేని, నీవును సుగ్రీవునియట్ల దేశకాలధర్మార్థములను మీఱియుందువు. కావున సుగ్రీవునిప్రమాదమునకుఁ గారణము మదనుఁడే. కాఁబట్టి శత్రువీరుల వధించువాఁడా! మన్మథవ్యాపారములందుఁజిక్కి, మన్మథునిచేఁ జొఱఁబడినవాఁడై సిగ్గుమాలి నాకడనెయుండి కాలముఁబుచ్చుచున్న వానరవంశపుఁటేలికయగు నీతమ్ముని సుగ్రీవుని మన్నింపుము. ధర్మమును, తపస్సునుగోరి యడవులందున్న మహర్షులు సైతము మన్మథపరతంత్రులై వలపులందగిలియుండిరి. అటుండఁగా, నీతఁడు కోఁతిస్వభావముచేతనే చపలుఁడు. అట్టివాఁడు రాజైనపుడు సుఖములం దగుల కుండునా?" అని యిట్లు తార శత్రువులకు లొంగనివాఁడయిన లక్ష్మణునితో గొప్పయర్థముగల మాటనుజెప్పి, వెండియు వేడ్కమీఱ, పానమదముచే ముందుకుఁబడఁబోవుచుఁ దనప్రియునికి హితమగుమాట నిట్లనిచెప్పెను: రాజోత్తమా! సుగ్రీవుఁడు మన్మథునికిలోఁబడియున్నను, మీకార్యము సాధించుటకై, చాలకాలముక్రిందటనే తనపరివారమునకానతిచ్చె. అన్ని కొండలందుండు లెక్కలేని మహావీరులును, బలవంతులునగు వానరులువచ్చిరిగదా! గొప్పబాహువులుగల లక్ష్మణా! స్త్రీలుండెడి యంతఃపురములోపలికిఁ బోరాదని యిచ్చటనిలిచితివి. సజ్జనులు మనసునఁ గామవికారములేక మైత్రిచేఁ దనచెలికానిభార్యలఁ జూచుట దోషము గాదు" అని తార లక్ష్మణునికిఁ జెప్పెను.

తార యిట్లు విన్నవింపగా, కార్యత్వర తన్నుఁ బ్రేరణచేయుచుండఁగా, నిడుదచేతులవాఁడగు శత్రుసంహారియయిన లక్ష్మణుఁ డంతఃపురములోపలికిఁజొచ్చి దివ్యములైన యాభరణములు దాల్చినందునఁ బలురంగులుగల యంగములుగలవాఁడును, రూపరియు, విలువగలబట్టలనుగట్టి, నెత్తావిఁ గుబాళించు పూవులదండలుదాల్చి సూర్యునివలె వెలుఁగువాఁడును, దేవేంద్రుఁడుంబోలె గెలువనలవికానివాఁడును, మేటిసొమ్ములును దండలునుదాల్చిన యంగనలచేఁ జుట్టఁబడి, మేలిమిదుప్పటముపఱచిన బంగారుమంచముమీఁదఁ గూర్చుండియున్న వాఁడును నగు సుగ్రీవునిఁజూచి కడునెఱ్ఱనైన కన్నులతోఁగూడి జమునిమాడ్కి భయంకరుఁ డయ్యెను. పసిఁడివన్నెయు విరివికన్నులునుగల శూరుఁడగు

సుగ్రీవుఁడన్న నో మంచియాసనమున రుమను బిగికౌఁగిటం జేర్చి కూర్చుండి యున్నవాఁడై, ధైర్యముతో నెదుటవచ్చిన విరివికన్నులవాఁడయిన లక్ష్మణుఁ జూచెను.

## 34-వ స ర్గ ము

### లక్ష్మణుఁడు సుగ్రీవుని దూఱుట

ఎదురులేనివాఁడును, పురుషశ్రేష్ఠుఁడునునైన లక్ష్మణుం డెక్కువ యాగ్రహముతోఁ దన యంతఃపురమునఁజొచ్చుటగని, భీతినొంది, యన్నగారివెతచే నొచ్చినవాఁడై, కోపముపూని నిట్టూర్పువిడుచుచుఁ దనతేజస్సుచే ధగధగమని వెలుఁగుచున్న లక్ష్మణుఁజూచి, సుగ్రీవుఁడు తనపసిఁడిపాన్పునుండిదిగి చక్కఁగాఁ గైసేయఁబడిన దేవేంద్రుని గొప్ప ధ్వజముమాడ్కి లేచి నిలిచెను. ఆకాశమునఁ బున్నమచందురుని రిక్క లెల్ల వెంబడించులాగున మంచమునుండి తటాలునదిగిన యా సుగ్రీవుని వెంబడిని రుమమొదలగు నతనికాంతలును మంచమునుండి దిగ్గునడిగ్గి నిలిచిరి. అట్లు కాంతిమంతుఁడైన సుగ్రీవుఁడు తనప్రియురాండ్రతోఁ గూడదిగి, మద్యపానముచే నెఱ్ఱనైన కన్నులుగలవాఁడై, గొప్ప కల్ప వృక్షముకైవడి యా లక్ష్మణుని ముందట కంపించుచు నిలఁబడెను.

రుమను బ్రక్కన నిల్పుండఁబెట్టికొని, తారతోఁగూడనున్న చందురునికైవడి, నాఁడువారినడుమ నిల్చియున్న సుగ్రీవునిఁజూచి, లక్ష్మణుఁడు కోపముతో నిట్లనియె. "బలవంతుఁడు, మంచివంశమునం బుట్టిన వాఁడు, దయగలవాఁడు, ఇంద్రియాశలగెల్చినవాఁడు, నెనరుగల వాఁడు, యథార్థము పలుకువాఁడునగురాజు లోకంబున నందఱిచేతను గారవింపఁబడును. మిత్రులవలన మొదట నుపకారమునేయించుకొని, యధర్మమార్గముఁజొచ్చి, వానికిఁ బ్రత్యుపకారముచేసెదనని వాగ్దత్తముచేసి యట్లువాగ్దత్తము నెఱవేర్పనివాఁడు మిక్కిలి క్రూరుఁడని చెప్పఁబడును. గుఱ్ఱమువిషయమై యొక యసత్యమాడినపక్షమున నూఱుగుఱ్ఱములఁ జంపినవాఁడగును. గోవువిషయమున నసత్యమాడిన యెడ, వేయిగోవులను జంపినవాఁడగును. మనుష్యునివిషయమున నసత్యమాడినచోఁ దన్నును, దనబంధువులను హాత్యగావించిన పాపము నొందును. మొదట మిత్రులచేఁ దనకార్యముఁజేయించుకొని, పని

దీఱినవానికి వారికి బదులొనరింపఁదలంపులేని కృతఘ్నుఁడుచేరి వధింపఁ దగినవాఁడు. తొల్లియొకప్పుడు సుగ్రీవా! స్వాయంభువమను వాఁడు కృతఘ్ననిఁజూచి, సకలలోకములవారిచేఁ గొనియాడఁబడు నీ శ్లోక మును జెప్పెను. అది నేఁజెప్పెదను; ఆలకింపుము. "బ్రహ్మహత్య, మద్యపానము, దొంగతనము చేసినవారును, వ్రతము లేనివారునునగు మానవులకుఁ బ్రాయశ్చిత్తముగలదుగాని, నెనరులేనివానికిఁ బ్రాయ శ్చిత్తమే లేదు." అని స్వాయంభువు వను పుడమిఱేఁడు చెప్పెను. ఓ వానరా! నీవు చెడ్డవాఁడవు; మేలుమఱచువాఁడవు; బొంకులాడు వాఁడవు. కావుననే నీవు మొదటనే రామునిచేతఁ గార్యముచేయించు కొని యిప్పుడా రామునికి బదులు మేలు సేయకున్నాఁడవు. ఓ మర్కటుఁడా! నీవు రామునిచే నుపకారము సేయించికొని, యతనికి బదులు మేలు సేయుటకుఁ దలంపు గలవాఁడవేని, నీవు సీతను వెదకుటకై ప్రయత్నము సేయవలసియుండునుగదా! అట్టిప్రయత్నము నీవు చేయమిచే నీవు కృతఘ్నుఁడవు. కప్పలను దగ్గరకురానిచ్చి వానిని మ్రింగఁగోరి, కప్పవలెనఱచు పామువలె నీవు నెన్నియోనయములునటించి, సత్యమైన ప్రతిజ్ఞ చేసిన ట్లభినయించి, గ్రామ్యసుఖములం దవిలియున్నావు. నీవు గప్పవలెఁగూయు పామువని యారాముఁ డెఱుఁగఁడయ్యె. కరుణ దలఁచువాఁడును, మహాపూజ్యుఁడును, గొప్పవాఁడునైన రాముఁడు పాపంపుఁ బనులు సేయువాఁడవు, చెడునడవడిగలవాఁడవునైన నీకు వానరరాజ్యాధిపతిత్వము నొసఁగెను. వింతపనులుసేయఁగల రాముఁ డొనర్చిన యుపకారము మఱతువేని, నీవు వాఁడిబాణములచే నేయఁ బడినీలిగి, వాలినిజూతువు. వాలిపోయినదారి యింకమూయఁబడ లేదు. అది తెఱవఁబడియున్నది. ప్రతిజ్ఞఁజెల్లింపుము. ఆఁడినమాటతప్పి, వాలి పోయినదారినిబోకుము. నీవిక్ష్వాకు వంశశ్రేష్ఠుఁడగు రామునివింటి నుండి జాఱినవాఁడిబాణములను జూచి యెఱుఁగవేమో! కాఁబట్టియే నీవు రామునికార్యమును, మనసులోనైనను దలంపక, సుఖవంతుఁ డవై సకలసుఖముల ననుభవించుచున్నావు" అని లక్ష్మణుఁడు సుగ్రీవుని నిందించెను.

## 35-వ సర్గము

### తార లక్ష్మణుని కోపము శాంతపఱచుట

అవ్విధమునఁ బలుకుచుఁ దనవెలుఁగుచే మండుచున్నట్లుండు లక్ష్మణుంగూర్చి, చంద్రునిఁబోలు మోముగల తార యిట్లనియె. "ఓ లక్ష్మణా! వానరాధిపుఁడగు నీసుగ్రీవు నిట్లు పరుసనిమాటలాడఁ దగదు. ఇతని నట్టిపలుకులచే నిందింపకుము. అందును బ్రియస్నేహితుఁడ వయిన నీవిట్టిమాటలాడఁదగునా ? కోఁతులదొరయగు సుగ్రీవుఁడు నెనరులేని వాఁడు కానేకాఁడు; మోపకాఁడునుగాఁడు; క్రూరుఁడును గాఁడు; కల్లరియుఁగాఁడు; కపటియుఁగాఁడు. వీరుఁడా! రాముఁడు సుగ్రీవునికి బవరమున నితరులచేఁ జేయనలవికాని యుపకారమును జేసెను. రాముఁడొనర్చినయట్టి మహోపకారమును సుగ్రీవుఁడెన్నఁడైన మఱచునా ! శత్రుతాపనా! రామునియనుగ్రహమునం జేసియే యిపుడు సుగ్రీవుఁడు కీర్తిని, శాశ్వతమైన వానరరాజ్యప్రభుత్వమును, రుమను, నన్నును బొందెను. ముందు సుగ్రీవుఁడు ఋశ్యమూకపర్వతమున నున్నప్పుడు మిక్కిలికష్టముతో నుత్తనేలమీఁద నొంటరిగఁబరుండి యుండినవాఁడిప్పుడిట్టిమేటిసుఖమును బొంది, తొల్లి విశ్వామిత్రమహాముని కామముచే మేనకతోఁగూడి కాలము నెఱుఁగకయున్నచందమున నిప్పుడు రామునితోఁ జేసిన సంకేతకాలము నెఱుఁగకున్నవాఁడు. తపస్సుచేయువాఁడయిన విశ్వామిత్రమునీంద్రుఁడే యొకప్పుడు ఘృతాచియను నప్సరసంజూచి మోహించి యామెతోఁగూడి సుఖము లనుభవింపుచుఁ బదియేండ్లొక్కదినముగా నెంచెను. లక్ష్మణా! త్రికాలజ్ఞులైనవారిలో నుత్తముఁడయిన తపోమహిమగల విశ్వామిత్రమునీంద్రుఁడె యిట్లు కాలముమీఱుట నెఱుఁగనప్పుడు సామాన్యుఁడయిన సుగ్రీవునివంటి సామాన్యుఁడు సమయము నెఱుఁగకుండె ననుట యొకవింతయా ? లక్ష్మణా! సుగ్రీవుఁడు పెక్కేండ్లు, కడగండ్లనుభవించి యిప్పుడు శరీరధర్మమగు సురతసుఖములంబొంది, కామసుఖములందుఁ దనివినొందక కాలముం గడుపుచుండినవాఁడు. కావున నితనియపరాధమును క్షమింపుము. లక్ష్మణా! వాస్తవమైన సంగతినెఱుఁగక ప్రాకృతజనునియట్లు క్రోధమునొందుట నీకుఁదగదు. ఓ పురుషశ్రేష్ఠా! నీవంటిసత్వగుణులు

గలమానవులు పరికింపక తటాలున రోషమునకు లోఁబడరు. నడవడుల నెఱిఁగినవాఁడా! నేను సుగ్రీవుని నిమిత్తమయి జాగ్రత్తతో నిన్ను వేఁడుకొనుచున్నాను. ఊఱడుము. కోపసంజనితమయిన యాతత్తర పాటు వీడుము. శాంతివొందుము. సుగ్రీవుఁడు రామునిపనికై, రుమను, నన్నును, వానరరాజ్యమును, ధనధాన్యరత్నములను సైతము విడుచు నని నాతలంపు. సుగ్రీవుఁడు కలనియందు రావణునింజంపి, చంద్రుని రోహిణితోఁ జేర్చినట్లు రాముని సీతతోఁగూడఁ జేర్పఁగలఁడు. లంక యందు లక్షకోటుల మూఁడులక్షల యఱువది వేవురికంటె హెచ్చిన రాక్షసులున్నారు. వారందఱు కోరినరూప మెత్తఁగలవారు. శత్రువు లకు లొంగనివారు. వారినందఱిని జంపక, సీతాదేవి నపహరించిన రావణుని జంపుట కలవికాదు. లక్ష్మణా! ఎవరికేని యారాక్షసులను జివ్వయందుఁ దోడ్పాటులేక వధించుటకు వీలుగాదు. అందును రావణుఁడు క్రూరకార్యములుచేయువాఁడు. అట్టి యతనిని, వానిపని వాండ్రను సుగ్రీవునికి సహాయసంపద లేక వధించుటకు వీలగునే? ఇట్లని వాలి నాకుఁ జెప్పియున్నాఁడు. ఆవానరపుంగవుఁడగువాలి యందఱి బలాబలముల నెఱింగినవాఁడుగదా! వాలి చెప్పఁగా నేను విన్నదేకాని, నేనేమో ప్రత్యక్షముగాఁజూచి యెఱుఁగను. ఆమాటనుబట్టియే మీకిది సెప్పితిని. మీకార్యమునకుఁ దోడ్పడుటకుఁగానే పెక్కండ్రు వానర శ్రేష్ఠులను బిలిచికొనివచ్చుటకై సుగ్రీవుఁడు తనసేనాధిపతులగు వానర శ్రేష్ఠులను బంపియున్నవాఁడు. రామునికార్యము సేయ బలపరాక్రమ ములుగల యావానరశ్రేష్ఠులరాక నెదురుచూచుచు నంతఃపురము విడిచి రాకయున్నవాఁడు. లక్ష్మణా, సుగ్రీవుఁడు మునుపు మీయెదుట నెట్లు ప్రతిజ్ఞ సేసెనో, యట్లే యిప్పుడును వానరులందఱు పదునైదు దినములలోపల వచ్చి చేరవలయునని యుత్తరువు చేసియున్నాఁడు. శత్రువుల నణఁగఁద్రొక్కునట్టి లక్ష్మణా! ఎక్కువ వెలుఁగుగల పెక్కండ్రు వానరులును, అనేకకోటులు కొండముచ్చులు నీదినమున రాఁగలరు. ఇప్పుడు నీవు కోపము విడువుము. లక్ష్మణా! కోపముచే నెఱ్ఱనైన నీమోమును, నెత్తుటివలె నెఱ్ఱనైన నీకన్నులనుజూచి, వానరాధిపుని కాంతలందఱు వాలివధము సమయమునంబోలె భీతిని బొంది, యట్టి యాపద యిప్పుడు జరుగునేమోయని సందియపడి నెమ్మది తప్పి

యున్నారు. కావున నీవు వేగిరముగఁ గోపము విడిచి, యోర్పు నొందుము" అని తార లక్ష్మణునితోఁ జెప్పెను.

## 36-వ సర్గము

**లక్ష్మణసుగ్రీవు లొండొరుల నోదార్చుకొనుట**

తార యిట్లు వినయముతోడను, ధర్మయుక్తముగను బలికిన మాటను విని తిన్నని నడవడిగలవాఁడగు లక్ష్మణుఁ డామెమాట నంగీకరించి, కోపము విడిచి నెమ్మదినొందెను. వెంటనే సుగ్రీవుఁడును లక్ష్మణునివలనఁ గలిగియుండిన కడుగొప్ప వెఱపును దడిబట్టను విడుచునట్లు విడిచి, తనమెడయందుండిన పలురంగులపువ్వులు గ్రుచ్చిన నెత్తావిగల పూవులసరమును ద్రెంచివైచి, మన్మథపారవశ్యమును విడిచి, భయంకర పరాక్రమముగల లక్ష్మణుని సంతోషపఱచుచు నడఁకువమెఱయ నిట్లనియె.

లక్ష్మణా! నన్ను విడిచిపోయినకాంతియు, కీర్తియు, శాశ్వతమగు వానరరాజ్యమును రాముని యనుగ్రహమువలననే మఱల నేను బడసితిని. తనపరాక్రమంపుఁజేష్టచేఁ బ్రసిద్ధిచెందిన యా మహాత్ముఁడు రాముఁడు చూపినయట్టి విక్రమకార్యమునకుఁ బ్రత్యుపకారము నెవఁడు సేయఁగలఁడు? ధర్మాత్ముఁడగు రాఘవుఁడు నన్నుఁ జేరునకు బాసటగా నుంచుకొని, తనతేజస్సుచూపియే సీతను బొందఁగలఁడు; రావణుని వధింపనుగలఁడు. ఒక్కబాణముచేతనే యేడుమద్దిచెట్లను, పర్వతమును భూమినిదొలఁచినట్టి యారాముని కొక్కరి సాహాయ్య మేల? వింటినారిని మీటి యాచప్పుడుచేత, భూమిని పర్వతవనములతోఁగూడ గడగడవడఁకించిన యారామునికిఁ దోడివాఁడు సేయుపని యేమి? పురుషశ్రేష్ఠా! రాముఁడు శత్రువగురావణుని సంహరించుటకై సేనలతోఁగూడఁ బోవునప్పుడు నేనును రాముని వెంబడించి పోయెదను గాని యతనికి సాహాయ్యముచేయఁగలంతటివాఁడను గాను. దాసుఁడు నమ్మకమువలనఁగాని, చనవుచేఁగాని తమయాజ్ఞను మీఱియున్నయెడ, దానిని మన్నింపవలయును. లోకమున నెంతటివానికైనఁ బ్రమాదము వాటిల్ల దనుట లేదు" అని యిట్లు మహాబుద్ధిమంతుఁడగు నాసుగ్రీవుఁడు

పలుకుచుండఁగా, లక్ష్మణుఁడు సంతసించి వేడ్కమీఱ నా సుగ్రీవుని కిట్లనియె:

వానరాధిపుఁడవగు సుగ్రీవా! మీఁదుమిక్కిలి వినయవంతుఁడవైన నీవు రామునికిఁ దోడ్పైయుండ, నాతఁడన్ని తెఱఁగుల నాథునితోఁ గూడినవాఁడే. సుగ్రీవా! నీయుత్తమప్రభావమును, నీయోర్పును జూడ మేటివానరరాజ్యలక్ష్మిని బొందుటకు నీవే తగినవాఁడవు. నీవు సహాయుఁడవైయుండఁగ, ప్రతాపముగలవాఁడైన రాముఁడు యుద్ధమునఁ బగతురను శీఘ్రమే వధింపఁగలఁడు. దీని కేమియు సంశయము లేదు. సుగ్రీవా! నీవాడినమాట, ధర్మముల నెఱిఁగినవాఁడవు, నెనరుగలవాఁడవు, యుద్ధములందు మఱలనివాఁడవునైన నీకుఁదగినదిగను, న్యాయ్యముగను నున్నది. వానరశ్రేష్ఠా! నేర్పున్నను, తాను జేసినతప్పిదము నెఱిఁగినవాఁడు, నీవును మాయన్నయుఁదప్ప నెవ్వఁడు తనయపరాధము నొప్పుకొనును? వానరాధిపా! నీవు బలపరాక్రమములందు రామునితో నెనవచ్చువాఁడవు. బహుకాలముక్రిందటనే దేవతలు నిన్ను రామునిసాహాయ్యమునకై సృజించిరి. ఇప్పుడు నేఁ జెప్పునది యేమనిన, వీరుఁడా! నీవును వేగిరముగా నాతోడ నిచ్చటినుండి వెడలివచ్చి, భార్యావిరహశోకమ్ముచేఁ జిక్కియున్న చెలికాని నోదార్పుము. వగచేఁ గొట్టఁబడినవాఁడైయున్న రాముఁడు సెప్పినమాటను విని నీకడ కేగుదెంచి నిన్నుఁ జెప్పిన పరుసనిమాటల నెల్ల మన్నింపవలెను అని లక్ష్మణుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

## 37-వ సర్గము

### సుగ్రీవుఁడు వానరుల నందఱిని బిలిపించుట

మహాబుద్ధియగు లక్ష్మణుఁ డిట్లుపలుకఁగా, సుగ్రీవుఁడు చేరువ నిలఁబడియున్న మంత్రియగు హనుమంతునిఁ జూచి, "మహేంద్రము, హిమవంతము, కైలాసము, వింధ్యము, తెల్లనికొనలుగలమందరము ననెడి యీయైదుకొండలందున్నవారిని, బాలసూర్యునిమాడ్కి నెఱ్ఱనైయంతట వెలుఁగుచున్న పడమటిదిక్కునఁ బడమటిసముద్రమున నున్న పర్వతములందున్నవారిని, సంజవేళయందలి మేఘములఁ బోలిన యుదయపర్వతము నందును, భీకరమయిన పద్మతాళవనమున నుండు కాటుక

కొండయందు నివసించునట్టి కాటుకను, క్రొక్కారు మొగుళులను బోలి యేనుఁగులం బురుడించువారిని, మనశ్శిలా గుహాయందుండు పసిండిఛాయగలవారిని, మేరుధూమ్రపర్వతములం దుండువారిని, గొప్పదైన యరుణపర్వతంబున వసించుచు మైరేయమనుమద్యముఁ ద్రావువారు, బాలసూర్యుని కాంతివంటికాంతి గలవారు కడువేగిరముగాఁ జనువారు నైనవారిని, మఱియుఁ గమ్మనితావులు గలిగి, జడదారుల మనికిపట్టయి చూపఱకింపుగలిగించునవై యున్న గొప్ప యడవులందును, తత్ప్రదేశములం దంతటను వసించునట్టి వానరులనందఱిని బిలిచికొనివచ్చుటకై సామదానాద్యుపాయము లుపయోగించి, వానరులను వేగిరముగాఁ బంపుము. వానరులను బిలిచికొనిరా నేను మొదటఁ బంపిన వేగవంతులగు నాదూతలను త్వరపెట్టుటకై, మరికొందఱి వానరులను మఱలఁ బంపుము. ఎవరు మన్మథవ్యాపారములందుఁ జిక్కియున్నారో, ఎవరు తడవుచేయుచున్నారో, వారినందఱిని వేగిరముగా నాయుత్తరవయ్యె నని పట్టితెమ్ము. నాయాజ్ఞమేర కెవరిచ్చుటికిఁ బదిదినములలోపల వచ్చిచేరరో, యట్టి నాయాజ్ఞనుల్లంఘించువారిని వధింపవలయును. మనపురమున నాయభిమతముప్రకారము నడచుకొనుచునున్నట్టి మబ్బులనుగొండలనుబోలిన భయంకరాకారముగల కోట్లకొలఁది వానరశ్రేష్ఠులంద ఱిచ్చటినుండి తరలి యాకాశమును గప్పునట్లు కన్పట్టుచుఁ బుడమియందుఁ దా మెఱిఁగిన దారులం దెల్లఁబోయి నాయానతి యయ్యె నని వానరవీరులను దోడితెత్తురుగాక!" అని హనుమంతుని కానతియొసఁగెను.

వాయుతనూజుఁడును నామర్కటములయేలికయొక్క మాటను విని, యన్ని దెసలకును బలశాలురయిన వానరవీరులను బంపెను. సుగ్రీవుఁడు పంపిన యావానర వీరులందఱు వెంటనేతరలి పక్షులును నక్షత్రములును దిరుగునట్టి యాకాశమార్గమునఁ బోయి, పర్వతములందును, సముద్రములందును, కానలయందును, కొలఁకులయందును వసించెడి వానరులనందఱిని "రామునికార్యమునకై మిమ్ము సుగ్రీవుఁడు పిల్చుకొని రమ్మనెను" అని చెప్పిరి. అంత వానరులందఱు యమునిఁబోలు రాజరాజగు సుగ్రీవుఁడు చెప్పిపంపిన మాటను విని, పోకున్న సుగ్రీవుఁడేమి సేయునో యని వెఱచినవారై, యన్ని దెసలనుండి వచ్చిరి. అంజన

పర్వతమునుండి యాకొండవంటి మేనిచాయగలవారైన వానరులు మూఁడు కోట్లమంది వచ్చిరి. అస్తమయపర్వతమునుండి పుటముదీర్చిన పసిఁడివన్నెగల పదికోట్ల వానరులు వచ్చిరి. కైలాసపర్వతము కొనల నుండి సింగపుజూలువంటి డాలుగల వానరులు వేయికోట్లు విచ్చేసిరి. హిమవంతమునఁ బండ్లు దుంపలు దిని బ్రతికెడి వేయి కోట్లు వానరులు విచ్చేసిరి. వింధ్యపర్వతమునుండి వెఱపు పుట్టించుకార్యములు సేయు వారు, అంగారకునితో సమానులునైన వానరులు పెక్కువేలకోట్లమంది వేగిరముగాఁ బఱతెంచిరి. మఱియు క్షీరసముద్రతీరమున నుండువారు, తమాలవననివాసులు, నారికేళములఁ దినువారునగు లెక్కపెట్టనలవి కాని వానరు లేతెంచిరి. వనములనుండియు, గుహలనుండియు, నదీతీర ములనుండియుఁ గడుబలముగల వానరసేన సూర్యుని మ్రింగులాగునఁ గనఁబడుచు నేతెంచెను. మొదట నీలునిచేఁ బంపఁబడిన యేవానరులు తక్కినవానరులందఱిం బిలువఁబోయిరో, ఆశూరులగు వానరులందఱు పయనమైపోయి గొప్పవృక్షములతోఁగూడినదగు హిమవత్పర్వతమును జూచిరి. ఆమనోహరమైన పర్వతరాజమునందు దేవతలకెల్లఁ దృప్తి కరమును, జనులకు సంతోషకరమును నుత్తమమునునైన యొకమహే శ్వర దేవతాకమైన యొకయాగము గావింపఁబడెను. అచ్చట వానరు లందఱు హవిస్సుల ప్రవాహములవలనఁ బుట్టినవియు, అమృతముతో సమానములునైన పండ్లను దుంపలను జూచిరి. ఆ దివ్యములైన కంద మూలఫలముల నొకదినమునఁ దినువాని కొకనెలవఱకును ఆఁకలిపుట్టదు. పండ్లదిండులైన వానర యూథంబు యజ్ఞశాలాదేశంబునందలి యుత్త మములగు మూలికలను, దుంపలను, బండ్లను, కమ్మనితావిగల పుష్పము లను సుగ్రీవుని సంతోషపఱుపఁగైకొని, పుడమింగల వానరయూథము లనుబిలిచి, యందఱికంటె ముందుగా మఱలి వేగముగావచ్చి యొక ముహూర్తములోపలఁ దమయధిపుఁడైన సుగ్రీవుఁడున్న కిష్కింధా పురమునేరి, తమప్రభువును దర్శించి, తాము గొనివచ్చినమూలికలను, మూలఫలములను ఆతనికిఁ గానుకపెట్టి, "వానరేంద్రా! మేము కొండలు, వనములు నన్నిటిని జుట్టి యచ్చటివానరుల నందఱిం బిలిచి వచ్చితిమి. వారందఱు "దేవరయాజ్ఞప్రకారము వచ్చుచున్నార" మని చెప్పినట్లు చెప్పిరి. తరువాత వానరులయెకిమీఁడగు సుగ్రీవుఁడు వాన

రులు చెప్పినపలుకులు విని యానందించి, వారు తనకుఁ గానుక పెట్టిన యన్ని వస్తువులను గైకొనెను.

## 38-వ సర్గము

సుగ్రీవుఁడు రామునికి జూడవచ్చుట

సుగ్రీవుఁడు వానరవీరులు దెచ్చిన కానుకలం గైకొని, పనిసాధించి కొని వచ్చినవారి నందఱిని మాటలచే నూఱడించి, వారి వారిగృహము లకుఁబోవ సెలవిచ్చి తనయొక్కయు, బలవంతుఁడగు రాముని యొక్కయుఁ గార్యము నెఱవేఱెనని తలంచెను. అప్పుడు లక్ష్మణుఁడు భీమబలుఁడయిన వానరపుంగవుని సుగ్రీవు నెసఁగఁజేయుచుఁ దిన్నని పలుకులతో "ఓ సాధువా! నీకిష్టమేని, కిష్కింధవిడిచి రామునికడకు రమ్ము" అనెను. సుగ్రీవుఁడు లక్ష్మణునిమాట విని మిక్కిలి యానంద మొంది. "లక్ష్మణా! అట్లె కానిమ్ము, వచ్చెదను. నీ యాజ్ఞయందుఁగదా నేనుండవలయు"అని మంచిచూపుగల లక్ష్మణునితోఁ జెప్పి, తార మొదలగు స్త్రీలను వదలి, "రండు రం"డని వానరవీరులను బిగ్గఱఁగా బిలిచెను. అంతఃపురపు టతివలఁ జూడఁదగినవానరు లా సుగ్రీవునిపలుకు విని, దోసిళ్లు కట్టుకొన్నవారై యాసుగ్రీవునిముందట వచ్చి నిలిచిరి. సూర్యునిమాడ్కిఁ దేజరిల్లు సుగ్రీవుఁడు వచ్చిన తనపనివారిం జూచి, "మీ రీక్షణముననే నా పల్లకిఁదెచ్చి సిద్ధముచేయుఁడు" అని యాన తిచ్చెను. వడిగాఁబోవునట్టి యావానరులు తమయధిపునిమాటనువిని బహురమ్యమైన పల్లకిని దెచ్చియుంచిరి. అంత వానరపుంగవుఁడు "లక్ష్మణా! నీవు పల్లకిని వేగిరముగా నెక్కుము" అనిచెప్పి యాతని నెక్కించి, వెంటనే తానును సూర్యునింబోలె వెలుఁగు నాపల్లకి నెక్కి కూర్చుండెను. అంత గొప్పదేహముగలవార లాపల్లకిని మోయఁ జొచ్చిరి. కొందఱు వానరులు సుగ్రీవునకుఁ దెల్లనిగొడుగుపట్టిరి; మఱికొందఱు వింజామరములు వీచిరి. శంఖదుందుభివాద్యముల మ్రోఁతలుచెలఁగెను. వానరులందఱు స్తుతిపాఠములఁజేసిరి. అట్టులు వానరులచే శుశ్రూషలుగొనుచు రాజ్యలక్ష్మిచే వెలుఁగొందుచుఁ గిష్కింధాపురమునుండి వెడలి, యాయుధములు చేతఁబట్టిన క్రూరులగు పెక్కువానరులు చుట్టునడచుచుండ రాముఁడున్న ప్రస్రవణ

పర్వతముఁజేరి, లక్ష్మణుఁడును దానును బల్లకినుండి దిగి, రాముని చెంతకుఁ బోవఁగనే చేతులుజోడించికొని నిలిచెను. తక్కిన వానరులును, నట్లే చేతులుజోడించుకొని నిలువఁబడిరి. తామర మొగ్గలతోఁగూడిన చెఱువు మాడ్కి ముడిచిన చేతులతో నున్న యాగొప్పవానరసేనంజూచి, సుగ్రీవుఁడు తనకార్యమును జేయఁబూనెఁగదాయని యపారసంతోషము నొందెను. అంత సుగ్రీవుఁడు బద్ధాంజలియై రాముని పాదములందుఁ బడఁగా, రాముఁడాసుగ్రీవునిఁ బ్రేమగౌరవములతో నాలింగనముచేసి కొని కూర్చుండ నానతిచ్చెను. సుగ్రీవుఁడు కూర్చుండిన పదంపడి రాముఁ డతనితో నిట్లనియె.

"ఓ వానరశ్రేష్ఠా! కాలమును విభజించుకొని ధర్మార్థకామముల నయ్యై కాలములందుమాత్రము సేవించువాఁడే మేటియగు రాజనఁ బడును. ఎవఁడు ధర్మార్థసంగ్రహమును విడిచి యెల్లప్పుడు కామమును సేవించుచున్నాఁడో, వాఁడు చెట్టుకొనయందు నిద్రించి, క్రిందఁబడి మేలుకొన్న పిమ్మట జింతించును. శత్రువధమున నాసక్తిగలవాఁడై చెలి కాండ్రను సేకరించుటయందు శ్రద్ధవూని, ధర్మార్థకామముల నాయా సమయములందు సేవించువాఁడు సుకృతము చేసినవాఁడగును. శత్రు నాశకా! శత్రువధమునకై ప్రయత్నపడవలసిన సమయము వచ్చినది. నీవు మంత్రులతోడఁగూడి చేయవలసిన కార్య మాలోచింపుము".

ఇట్లు రాముఁడు పలుకఁగ సుగ్రీవుఁ డిట్లనియె: "జయించువారి లోపల నుత్తముఁడా! నేను పోఁగొట్టుకొన్న కలిమియు, కీర్తియు శాశ్వతమగు వానరరాజ్యప్రభుత్వమును, తమయనుగ్రహమువల నను, తమతమ్మునిదయవలనను నాకు మఱల లభించెను. ఉపకారము సేసినవారి కెవఁడు ప్రత్యుపకారముసేయఁడో, వాఁడు పురుషాధముఁ డనఁబడు. శత్రునాశకా! నూఱులకొలఁదినున్న యీసేనాధిపులందఱు పుడమినెల్లఁ దిరిగి, బలవంతులగు వానరులనందఱిని బిలుచుకొనివచ్చిరి. అడవులందును వనములందును జొఱరాని ప్రదేశములనెల్లఁ దెలిసిన భయంకరు లగు పెక్కురుకొండముచ్చులు, భల్లూకవీరులు నేతెంచిరి. రాఘవా! దేవతలకు గంధర్వులకుఁ బుట్టిన కామరూపులగు వానరులు తమతమసేనలతోఁ గూడినవారై, వచ్చి మార్గములందు నిల్చియు న్నారు, పగతురను నొప్పించునట్టి యోరాఘవా! దేవేంద్రునిఁబోలు

మగంటిమిగలిగినవారు మేరుమందరపర్వతములను బురుడించువారును నైన మేరువింధ్యాదిపర్వతములందు వసించు పెక్కండ్రు వానరవీరులు నూఱులు, వేలు, పదివేలు, లక్షలు, కోటులు, శంకువులు, అర్బుదములు, నూఱర్బుదములు, మధ్యములు, అంతములు, సముద్రములు, పరార్థము లను సంఖ్యగల సేనలను వారివారిశక్తికిఁ దగినట్లుగాఁ దీసికొని వచ్చుచున్నారు. ఆ వానరవీరులు సేనలతోఁగూడినవారై రావణునిమీఁదికిఁ గవిసి, రావణుని బంధుమిత్రపరివారములతోఁ గూడ సంహరించి సీతాదేవిని మీసన్నిధానమునకుఁ దెచ్చి యప్పగింపఁగలరు" అని సుగ్రీవుఁడు పలుకఁగా, బుద్ధిమంతుఁడగు రాముఁడు తనయాజ్ఞ ప్రకారము సుగ్రీవుఁ డొనర్చిన గొప్పప్రయత్నముం జూచి, యిఁక సీతాన్వేషణప్రయత్నము జరుగఁగలదుగదా యని యానందముచే వికసించిన నల్లకల్వవంటి కన్నులుగలవాఁ డయ్యెను.

## 39-వ సర్గము

### నలు దెసలనుండి వానరసేన లేతెంచుట

ఇట్లు సుగ్రీవుఁడు పలుకఁగా, ధర్మవేత్తలలోపల శ్రేష్ఠుఁడైన రాముఁడు చేమోడ్చి నిల్చియున్న యా సుగ్రీవుని గట్టిగాఁ గౌఁగిలించుకొని "ఓసాధువా! దేవేంద్రుండు వానగురిపించి జనులను దనివినొందించుటయు, వేయివెలుఁగులఱేఁడు చీఁకటిని బోకార్చి వెలుతురొసఁగుటయు, చంద్రుఁడు రేలయందుఁ దనకిరణములచేఁ బుడమిని తేటపఱచి, యానందముఁ గలుగఁజేయుటయు, శత్రుసంహారీ! నీవంటివాఁడు చెలికాండ్రకుఁ బ్రత్యుపకారము సేయుటయు నొక్కవింతసంగతి గాదు. ఇట్లె నీయందు మంచిగుణముండుట యొక వింతగాదు. సుగ్రీవా! నీవు నాకెల్లప్పు డిష్టముగా మాట్లాడువాఁడవని యెఱుఁగుదును. నీవె నామేలు గోరు చెలికాఁడవు. నీవు నాకు సహాయుఁడవై యుందువేని, నేను శత్రువులనందఱను గెల్వఁగలను. కావునఁ జెలికాఁడా! నీవు నాకు బాసట సేయవలయును. పూర్వము దేవేంద్రుని మోసపుచ్చి శచీదేవిని దొంగిలించుకొనిపోయినట్లు, రాక్షసాధముఁడయిన రావణుఁడు తన చేటుకై వైదేహిని (సీతను) నపహరించెను. యుద్ధరంగమున వేల్పుల ఱేఁడు శచీదేవి ననుహ్లాదుం డపహరించినందుకై సమ్మతించియుండిన

గర్వితుఁడయిన శచీదేవితండ్రియగు పులోమునిఁ జంపినట్లు, నేనును వేగిరమే వాఁడిబాణముల నేసి యారావణునిఁ జంపెదను" అని సుగ్రీవునితోఁ జెప్పెను.

ఇట్లు రామసుగ్రీవులు మాట్లాడుచుండఁగా నింతలో నాకాశమున వెలుఁగు వేవెలుఁగుయొక్క వేఁడివెలుతురుం గ్రమ్ముచు దుమ్ము లేచెను. అట్లు వృద్ధినొందుచున్న దుమ్ము దెసలెల్లఁ గ్రమ్మి యేమియుఁ దెలియకుండెను. పర్వతవనములతోఁగూడిన పుడమి కదలెను. అంతఁ గొండంతయెత్తుగలవారు, వాఁడికోఱలుగలవారు, ఎక్కువబలిమిగలవారు, లెక్కపెట్ట నలవిగానివారు, పెక్కుకోట్ల పరివారములతోఁ గూడినవారు, కోరినరూపముదాల్చువారు, మేఘగర్జనంబోలు ధ్వనులు గలవారునైన బలవంతులగు వానరవీరులు నదులగట్టులందుఁ బుట్టినవారు, కొండలందుఁబుట్టినవారు, కడలిగట్టులందుఁ బుట్టినవారు వచ్చి నిమిషములోపలఁ బుడమియెల్లఁ గ్రమ్మిరి. అందు కాంతిమంతుఁడగు శతవలి యను నొక వానరులమేటి బాలసూర్యునివంటి మేనిచాయగలవారు, చందురునివలెఁ దెల్లనివారు, పద్మకేసరములవంటి వన్నెతోఁ గూడినవారునైన పదివేలకోట్ల వానరసేనలతోడఁ గన్పట్టెను. మేరుపర్వతపుంజాయగలవాఁడు, వీర్యవంతుఁడు నయిన తారతండ్రి సుషేణుండు పెక్కువేలకోట్ల వానరసైన్యములఁ దోడ్కొనివచ్చెను. అట్లు రుమ తండ్రియగు సుగ్రీవునిమామయైన తారుఁడు వేయికోట్లసేనలం గొనివచ్చెను. పద్మకింజల్కములఁబోలు వన్నెగలవాఁడు, బాలసూర్యునివంటి మోముగలవాఁడు, బుద్ధిమంతుఁడు, వానరు లందఱిలోపల బలవంతుఁడు నుత్తముఁడు కాంతిమంతుఁడు హనుమంతుని తండ్రియునయిన కేసరి పెక్కువేల వానరసేనలతో వచ్చి చూపట్టెను. భీతిగలిగించు విక్రమముగల కొండముచ్చుల రాజగుగవాక్షుఁడు వేయికోట్ల కోతిమూఁకలతోఁగూడ నేతెంచెను. శత్రువులఁబరిమార్చు ధూమ్రుఁడు వడిగాఁబోవు రెండుకోట్ల యెలుఁగుబంట్లసేనలను వెంటఁగొనివచ్చెను. మహావీర్యుఁడగు పనసుఁ డను కోఁతిగుంపుకాఁపు గొప్పకొండలంబోలు ఘోరరూపులయిన మూఁడుకోట్లసేనలతోఁగూడి వచ్చెను. నల్లనికాటుకరాశివంటి డాలుగల గొప్ప మేనుగలవాఁడయిన నీలుఁడను వానరయూథపుఁడు పదికోట్లసేన

లతోఁ గూడుకొన్నవాఁడై వచ్చెను. మఱియు, పసిఁడికొండవలె వెలుఁగు గొప్పశూరుఁడగు గవయుఁడను వానరయూథపాలుఁడు పది కోట్లసేనలతోఁ గూడివచ్చెను. అట్లె దరీముఖుండను బలవంతుఁడగు నొకకోఁతిగుంపు వేయికోట్లవానరబలగముతోడ సుగ్రీవునికడ కేగుదెంచెను. అశ్వినీదేవతలబిడ్డలయిన బలిష్ఠులగు మైందద్వివిదులు వేయివేయికోట్ల సేనలతో చనుదెంచిరి. ఎక్కువ ప్రతాపముగల గజుఁడును మూడుకోట్లసేనలతోఁగూడి సుగ్రీవునిసన్నిధి కేతెంచెను. మహాతేజస్సుగల జాంబవంతుఁ డను భల్లూకరాజును బదికోట్లసేనలతో సుగ్రీవునిచేరువకు వచ్చి నిలఁబడెను. మొనగాఁడగు రుమణ్వంతుఁడను వానరుఁడు నూఱుకోట్లబలగముతో సుగ్రీవుని సన్నిధానమున కేతెంచెను. అంత గంధమాదనుఁడు పదిలక్షలకోట్ల వానరులతోను, లక్షకోట్లవానరులతోను గూడి యా సుగ్రీవునిసన్నిధి కేతెంచె. పరాక్రమమునఁ దండ్రితో నీడయిన యువరాజగు నంగదుఁడు వేయిపద్మములు, నూఱుశంకువులు సంఖ్యగాఁగల సేనలతోఁగూడి పినతండ్రికడ కేగుదెంచెను. భీమబలుఁడు నక్షత్రప్రకాశుఁడునయిన తారుఁ డైదు కోట్ల సేనలతోను, ఇంద్రజానుఁ డను యూథపాలుఁడు పదునొకండు కోట్ల సేనలతోను విచ్చేసిరి. అంత సూర్యునిఁబోలు వెలుఁగుగల రంభుఁడను వానరుఁడు పెక్కువేల వానరులం దోడ్కొని వచ్చెను. తర్వాత గుంపుకాఁపును శూరుఁడునునైన చేవకాఁడగు దుర్ముఖుఁడను వానరుఁడు రెండుకోట్లసేనలతోఁ గన్పట్టెను. హనుమంతుఁడు కైలాసశిఖరమువలె నెత్తయినవారు, పగతురను జడిపించు మగతనముగల వారునునైన వానరవీరుల వేయికోట్లమందిని దోడ్కొనివచ్చెను. మహావీరుఁడగు నలుఁడును పదిలక్షలకోట్ల వానరపరివారమును వెంటఁ గైకొని వచ్చెను. అట్లే కాంతిమంతుఁడును, సుగ్రీవునికిఁ బ్రియస్నేహితుఁడునునైన దధిముఖుఁడు పదికోట్ల కోతిమూఁకతో వానరాధిపునికడకు వచ్చెను. శరభుఁడు, కుముదుఁడు, వహ్ని, రంహుఁడు మొదలగు కామరూపులయిన పెక్కండ్రు వానరులు తమతమ సేనలను గూడఁదీసికొని పుడమినెల్లను, పర్వతములను, వనములను గ్రమ్ముచు వచ్చిరి. వారిని లెక్కింప నలవియే కాదు. అట్లువచ్చి పుడమియెల్లనిండిన యావానరసైనికు లందఱు సంతోషముచే నెగురుచు, దాఁటుచు, కిల

కిలధ్వనులు చేయుచు, మేఘములు సూర్యునిఁగప్పినచందమున నాసుగ్రీవునిఁ జుట్టుకొనిరి. ఎక్కువబలముచే నొప్పిన యావానరవీరులుపొంగుచుఁ బెక్కుతెఱఁగులఁ గిలకిలధ్వనులు సేయుచుఁ దలలు పైకెత్తి వానరరాజగు సుగ్రీవునికిఁ దమరాక యెఱిఁగించిరి. మఱికొందఱు వానరశ్రేష్ఠులు బట్టలను బిగించి కట్టుకొని యాసుగ్రీవునిప్రక్క చేతులుమోడ్చి నిలఁబడియుండిరి. అప్పుడు ధర్మముల నెఱిఁగిన సుగ్రీవుఁడు త్వరితముగా లేచి నిలిచి చేమోడ్పుచేసి రాముని కాసేనలం జూపెను. అంత తాను వానరసేనలం జూచి, "వానరేంద్రులారా! సేనల కాఁపరులు దమసేనలను పర్వతములందును సెలయేళ్ళయందును సుఖముగాను యథావిధిగను విడియునట్లుచేసి, నప్పుడు బలమునెఱిఁగినవాఁడు దనబలఁగ మింతయని యెఱుఁగఁగలిగియుండవలెనని చెప్పెను.

## 40-వ సర్గము

### సుగ్రీవుఁడు వానరవీరులను తూర్పునకు పంపుట

అంత వానరులకు ఱేఁడగు సుగ్రీవుఁడు కావలయువారి నెల్లఁ జేర్చికొన్నవాఁడై, శత్రువుల నడఁగార్పఁగల నరోత్తముఁడగు రామునిఁ జూచి, "ఓ రాజేంద్రా! బలవంతులు, కోరినరూపమెత్తఁగలవారు, దిగ్గజములఁ బోలువారునైన నానాదేశవాసులగు వానరులందఱు వచ్చి విడిసియున్నారు. దైత్యదానవులం బోలువారు, వెఱపు పుట్టించువారునైన మేటివానరులందఱు విశేషబలపరాక్రమములుగల వానరసేనలతోఁగూడినవారయి వచ్చియున్నారు. వీరందఱు వీరకార్యములచేఁ బ్రసిద్ధికెక్కినవారు, బలిమిగలవారు, శ్రమలకోర్చువారు, పగతురముట్టడులందు వాసికెక్కినవారు, పనులందు మిక్కిలిపట్టుదలగలవారు, నీటను బుడమిని దిరుగునట్టివారు,నానాపర్వతములనున్న వారునైన యీవచ్చిన వానరసైనికులు కోట్లకంటె మించియున్నారు. వీరందఱు నీ సేవకులు; విధేయులు; యజమానులకు మేలొనఁగూర్చుటయందు నేర్పరులు.శత్రువుల నణఁగఁద్రొక్కువాఁడా! వీరు నీకోరినకార్యము సాధింపఁజాలుదురు. వీరు పెక్కువేల సేనలతోఁగూడ వచ్చియున్నారు. నరశ్రేష్ఠా! మీ కెయ్యది యుక్తముగాఁ దోఁచెడి దానిని జెప్పుము. నీయధీనతయందుండఁగోరిన యీసైన్యంబున కాజ్ఞ యొసఁగుము. ఈ వానరవీరు

లిప్పుడు చేయవలసినపని యిది యని వాస్తవముగా నెఱుఁగుదును. అయినను నీవే యీవానరసేన కాజ్ఞయొసఁగుము" అనిచెప్పెను.

దశరథునికొమరుఁడగు రాముఁ డిట్లెఱుఁగునఁ బలుకుచుండు సుగ్రీవుని నిరుకేల గట్టిగాఁ గౌఁగిలించుకొని, "ఓ చెలికాఁడా! యోగొప్ప తెలివికాఁడా! నాప్రాణనాయిక యగు సీత ప్రాణములతో సున్నదా లేదా?" యనియు "ఆరావణుఁ డుండుదేశమేదియో" అనియు నెఱుఁగవలయును. సీత జీవించియుండు సంగతిని, రావణునియునికిపట్టు నెఱిఁగినపిదప నీవును నేనును చేయవలసినది చేయుదము. వానరులకు ఱేఁడా! యీకార్యమున నేనుగాని, లక్ష్మణుఁడుగాని సమర్థులము గాము. నీవె యీకార్యము నేర్పఱచువాఁడవు; సాధింపవలసినవాఁడవు నై యున్నావు. నేర్పుకాఁడా! నీవ యిప్పుడు చేయఁదగినపనిని వీరి కాజ్ఞాపింపుము. ఏలయన శూరుఁడా! నా కిప్పుడు సేయవలసినపని యేదియో నీవెఱుఁగుదువు. ఇదినిక్కము, ఇదినిక్కము. నీవుమంచిమనసు గలవాఁడవు; సరివాఁడవు; మగఁటిమిగలవాఁడవు; తెలివికాఁడవు; కాలముయొక్క తీరునెఱిఁగినవాఁడవు; మాకు మేలొడఁగూర్చుట యందు శ్రద్ధగలవాఁడవు; పుణ్యకార్యముచే ప్రయోజనముగాఁ గల వాఁడవు. కార్యములనడవడిఁ జక్కఁగాఁ నెఱిఁగినవాఁడవు" అని సుగ్రీవునికే తనకార్యము సేయ నానతిచ్చెను.

అట్లు రాముఁడు పలుకఁగా, సుగ్రీవుఁడును రామలక్ష్మణులసమ క్షమున నే కొండంతవాఁడు, ఉఱుమువంటిగొంతుగలవాఁడు, బలిమి గలవాఁడు నయిన వినతుఁడనెడి యొక గుంపుకాఁపును బిలిచి యిట్లనియె: "ఓ వానరోత్తమా! దేశకాలోచితమగు నీతి ననుసరించి యుక్తాయుక్త ముల గమనించుచు, బలవంతులగు లక్షవానరులను, చంద్రసూర్యుల పుత్త్రులగువానరులను బాసటగాఁగొని తూర్పుదెసకేగి, యచ్చటి పర్వత శిఖరములందును, నదులందును, వనములందును, సీతాదేవిని, రావ ణునినివాసస్థలమును వెదకుము. మీరంద ఱిచ్చటినుండి వెడలి తూర్పు మొగముగా బయలుదేరి, మనోహరమయిన గంగాతీరమునను, సర యువు, కౌశికి, యమునానదులగట్టులందును, యామున మను గొప్ప కొండయందును, సరస్వతి, సింధువు, మణివలె తేటనైన నీటితోఁ గూడిన శోణనదము నను నదుల వీనిగట్టులందును, కొండలతోడను అడ

పులతోడను నొప్పారుమహికాల మహియను దేశములందును బ్రహ్మామాలము, విదేహము, మాళవము, కాశి, కోసలము, గొప్పగ్రామములు గల మాగధము, పుండ్రము, వంగము నను దేశములందును కోశకారుల పత్తనంబునను, వెండిగనులుగల దేశమునందును మీరు రాముని ప్రియ భార్యయు, దశరథుని కోడలునైన సీతాదేవి నచ్చటచ్చట నన్ని ప్రదేశములందును బాగుగా వెదకవలయును.

సముద్రములోపల నున్న కొండలను, పట్టణములను, మందర పర్వతంపు నిడివికోనలను భయంకరరూపులగు మనుష్యు లాశ్రయించి యున్నవారు. వారిలోఁ గొందఱు చెవులులేనివారు; కొందఱు పెదవులందుఁ జెవులుగలవారు; కొంద ఱుక్కువలె గట్టిమోముగలవారు; వడిగాఁబోవువారు; ఒంటికాలితో నడుచువారు; నాశములేనివారు; బలిమిగలవారు; మానిసిదిండులైనవారు. బోయలు చెవులందు జుట్టు గలవారు, పసిఁడివన్నె దేహముగలవారు, చూడఁదగినరూపముగల వారునై యున్నారు. మఱియు పచ్చిచేఁపలనే తినువారై నీటిలోపలనే తిరుగునట్టి భయంకరులయిన సగము మనుష్యరూపము, సగము పులి దేహమును దాల్చిన కిరాతులు వసించుచున్నారు. వీరందఱి గృహము లన్నియు వెదకవలయును.

పర్వతములుదాఁటి పోవలసిన ద్వీపములకును, ఎగిరి దాఁటి పోయి చేరఁదగిన ద్వీపములకును, తెప్పలమీఁద దాఁటఁదగినద్వీపములకును బోయి, రత్నములు గలదియు, నేడురాజ్యములచే శోభిల్లునదియు నయిన యవద్వీపమును, బంగారు గనులచే వెలుఁగు సువర్ణరూప్యకద్వీపమును వెదకి యారెంటినిదాఁటి, దేవదానవులకు మనికిపట్టును, నింగినిదాఁకు శిఖరములతోఁ గూడినదియునైన శిశిరపర్వతము చేరి యాపర్వతమున సెలయేళ్లయందును, చొరరానిదుర్గములందును, చరియలందును, వనములందును మీరందఱుగూడి పేరెన్నికగన్న సీతాదేవిని వెదకవలయును.

తర్వాత మీరు లవణసముద్రంపు టావలిగట్టుచేరి, యచ్చట సిద్ధచారణులతోఁ గూడినదియు, వడిగాఁబాఱునదియు, లోఁతయినదియు, నెఱ్ఱనినీరుగలదియు నయిన శోణనదమునొంది, యానదిగట్టున నున్న విచిత్రములయిన వనములందును, రమ్యములయిన రేవులందును

సీతాదేవిని, రావణుని వెదకవలయును. అంతఁ బ్లక్షద్వీపమందు, కొండలనుండి పుట్టుమనోహరములయిన నదులందును, ఆ నదీతీరములందలి పొదలందును, పెక్కుచఱియలతోఁగూడిన పర్వతములందును వనములందును వెదకవలయు. అంత కడుభీకరములగు నిక్షుసముద్రమునందలి ద్వీపములను, గాలికిఁబైకిలేచి మ్రోయుచుండు పెక్కుతరంగములుగల యిక్షుసముద్రమును జూడవలయు.

అచ్చట, గొప్పమేనులు గలరాక్షసులు బహుకాలమునుండి నిరాహారులై యున్నందున బ్రహ్మదేవుని యాజ్ఞవడసి, యెల్లప్పుడు జీవకోటులనీడనులాగి మ్రింగుచుందురు. అటుపిమ్మట ప్రళయకాలమేఘముఁ బోలినదియు, గొప్పపాముల కునికిపట్టును, గొప్పనాదముగలదియునయిన యయ్యిక్షుసముద్రము నుపాయముచేత రాక్షసులచేతఁజిక్కక దాఁటి, యావల నెఱ్ఱనిజలముగలదియు, భీతినిగలిగించునదియునయిన లోహితమను సముద్రమునుబొంది యచ్చటఁ బ్రసిద్ధమయిన గొప్పదగు కూటశాల్మలిని అచ్చటనే విశ్వకర్మచేఁ గట్టఁబడిన నానావిధరత్నములచే నలంకృతమైయున్న కైలాసముంబోలు గరుత్మంతునిగృహమును జూడఁగలరు. ఆశాల్మలిద్వీపమునఁ బలురూపములు గలిగి, భీతిగలిగించువారు, పర్వతసదృశులు నయిన మందేహులనెడి రాక్షసులు పర్వతశిఖరములందు వ్రేలాడుచున్నారు. ఆమందేహులనెడి రాక్షసులు నిత్యము ప్రతిదినము నరుణోదయకాలమున బ్రాహ్మణులు జపించు గాయత్రీమంత్ర జపప్రభావముచేఁ గొట్టఁబడినవారలయి సముద్రోదకములందుఁ బడుచుందురు.

తదనంతరము పగతురకెదిరింపనలవిగాని మీరు తెల్లనిమేఘముఁ బోలి, తెల్లనితరఁగలచే ముత్యాలహారముగలదానివలె శోభిల్లు పాల్కడలినిఁ జూడఁగలరు. ఆ పాల్కడలినడుమ మేటితావిగలిగి, పుష్పించిన రజతమయంపుఁజెట్లతోఁ గూడినదైన గొప్పదగు ఋషభ మను నొక పర్వతము గలదు. బంగారుకింజల్కములు కలిగి వెలుఁగుచున్న వెండివన్నె తామరపువ్వులతోఁగూడి, రాయంచలతో నిండిన సుదర్శన మనుపేరుగలయొక సరస్సుగలదు. యక్షకిన్నరగంధర్వ చారణాప్సరసలును దేవతలును జలక్రీడలు సల్పుటకై యాకొలనికి సంతసముతో వచ్చుచుందురు.

వానరులారా! పొల్కడలిం దాఁటినపిదప జంతువులకన్నిటికిని భీకరము, దానికోపమువలనఁబుట్టిన సముద్రములలో శ్రేష్ఠమునయిన మంచినీటిసముద్రమును జూడఁగలరు. ఆమంచినీటి సముద్రమున గుఱ్ఱముమోముగల బడబాగ్ని యను నొక గొప్పతేజస్సు నెలకొని యున్నది. ఆబడబాగ్నికి స్థావరజంగమములతోఁ గూడినదియు, విశేష వేగముగలదియునయిన యా శుద్ధజలసముద్రమే యాహారముగానున్న దని చెప్పుదురు. ఆ సముద్రమున నున్నట్టి భూతములు సామర్థ్యముగల వైనను, ఆ బడబాగ్ని ముఖమును జూచి యేమియుఁ జేయఁజాలక యఱచు చుండును. ఆ శబ్దమును మీరును వినఁగలరు. మంచినీటికడలికిఁ బదుమూడు యోజనము లుత్తరమ్మున జాతరూపశిలము (బంగారుఱాలు గలది) అనుగొప్పపసిఁడి కొండయొకటి కనఁబడును. వానరులారా! అప్పర్వతమునఁ జంద్రునివలెఁ దెల్లనై తామర రేకులంబోలుకన్నులు, వేయితలలు గలిగి, నల్లనివలువ దాల్చి సకలజంతువులచేఁ నమస్కరింప బడుచు నా పర్వతశిఖరమునఁ గూర్చుండి భూభారము మోయుచున్న యాదిశేషునిఁ జూడఁగలరు. మహాత్ముఁడగు నయ్యాదిశేషుని ధ్వజ మయిన మూఁడుతలలుగలబంగారు తాటిచెట్టు పర్వతశిఖరమునఁ దిన్నె యందు స్థాపింపఁబడినదై వెలుఁగుచున్నది. దేవతలకుఁ బ్రభువులయిన బ్రహ్మ విష్ణు రుద్రు లా తాటిచెట్టును దూర్పుదిక్కు నెల్లగా నేర్పఱిచి యున్నారు.

ఆ పర్వతము వెంబడిఁ బసిఁడిమయమై కాంతిగల పొడుపుగుబ్బలి కనఁబడును. బంగారుమయమైన తిన్నెతోఁగూడి దివ్యమై వెలుఁగుచున్న యా పొడుపుగుబ్బలికొన నూఱామడల పొడవుగలదై నింగినిఁదాఁకుచు వెలుఁగుచున్నది. ఆయుదయపర్వతశిఖరమున బంగారుమయములై సూర్యబింబమువలె వెలుఁగు సుందరములైన పూచిన మద్దిచెట్లు, తాటి చెట్లు, కానుఁగుచెట్లు, కొండగోఁగుచెట్లు కడుశోభిల్లుచుండును. అచ్చట యోజనము వెడల్పును, పదియోజనముల యెత్తునుగలిగి బంగారుమయమైయున్న కదలనిదగు సౌమనస మను శిఖరము వెలుఁగు చున్నది. తొల్లి వామనావతారమున విష్ణువు మూఁడడుగులు పెట్టి నప్పుడు, ఆ సౌమనసశిఖరమున మొదటియడుగు పెట్టి, రెండవయడుగు మేరుశిఖరమున నుంచెను. సూర్యుఁడు జంబూద్వీపము నుత్తరభాగ

మును జుట్టివచ్చి, మిక్కిలి యెత్తయిన యా శిఖరము సేరినతోడనే, మేరుపర్వత దక్షిణభాగమున నున్న వారికందఱికి వెల్తురు గానఁబడు. అప్పర్వతశిఖరమునఁ దపస్సుచేయుచుఁ బ్రభాకరునిమాడ్కి వెలుఁగు వాలఖిల్యులు, వైఖానసులు ననెడి మహర్షులు గనఁబడుదురు. సమస్త జీవరాసులకుఁ గంటికి వెలుతురొసఁగు సూర్యుఁ డేయుదయపర్వతమున వెలుఁగుచున్నాఁడో, అయ్యది సుదర్శనద్వీప మనఁబడును. ఆ ద్వీపమున నచ్చటచ్చట రావణుని సీతాదేవిని వెదకవలయును.

ఆ బంగారుకొండడాలుచేతను, మహాత్ముఁడగు సూర్యుని వెలుఁగుచేతను వ్యాప్తమై ప్రాతస్సంధ్య యెఱ్ఱనై వెలుఁగుచుండును. తొల్లి యిది పుడమికిని, లోకములకును ప్రథమద్వారముగాను, సూర్యుఁ డుదయించుతావుగాను బ్రహ్మదేవునిచే నిర్మింపఁబడియెఁ గాన నిది పూర్వదిశ యని చెప్పఁబడుచున్నది. ఆ యుదయపర్వతముఁయొక్క చరియలందును, సెలయేళ్ళయందును, గుహాలయందును అచ్చటచ్చట రావణుని, సీతాదేవిని వెదకవలయు. ఆ యుదయపర్వతమున కావలఁ దూర్పుదిక్కు సూర్యచంద్రులవెలుఁగు సోఁకమిచేఁ జీఁకటితోఁగూడి, చూడ నలవికానందునఁ బోనలవికాకయుండును గాన నచ్చట దేవ తలుమాత్రమే సంచరింతురు. వానరులారా! తూర్పుదెసను నేనుజెప్పక విడిచిన యాయా గుహాలందును, కానలయందును, వేయేల, యన్ని ప్రదేశములయందును సీతాదేవిని వెదకవలయును. వానరులారా! తూర్పుదెసయందు మీ రింతవఱకే పోఁదగును. సూర్యరశ్మిసోఁకక, హద్దులులేక యున్నందున, నావల నేమి యున్నదో తెలిసినదికాదు. కావున నింతవఱకుఁబోయి, యచ్చటచ్చట వెదకి రావణునియొక్కయు, సీతాదేవియొక్కయు పోవిడి గనుఁగొని రావలయు. మీ రొక్కనెల కంటె నెచ్చుదినము లెచ్చట నుండఁగూడదు. అట్లువఁడైన నుండునేని, వాఁడు వధ్యుఁడగును. కావున నాసీతాదేవిసంగతిఁ దెలిసికొని, కృతార్థులై మఱలిరండు. ఓ వానరులారా! దేవేంద్రునిచేఁ బాలింపఁబడినదియు, పెక్కు వనములచేఁ బ్రకాశింపఁజేయఁబడినదియునైన తూర్పు దిక్కున నేర్పుతోఁ దిరిగి, రఘురామునిభార్యయొక్క వృత్తాంతముఁ దెలిసి మఱలివత్తురేని, సుఖములఁ బొందుదురు” అని సుగ్రీవుఁడు వానరులతోఁ జెప్పెను.

## 41-వ సర్గము

**సుగ్రీవుఁడు హనుమదాదులను దక్షిణదిశకుఁ బంపుట**

వీరుఁడు, వానరాధిపుఁడు, భృత్యులతారతమ్యము నెఱిఁగినవాఁడునైన సుగ్రీవుఁ డవ్విధమున విస్తారమైన వానరసేనను తూర్పు దిక్కునకుఁ బంపి, అగ్నియొక్కపుత్త్రుని నీలుని, వాయుపుత్త్రుఁడగు హనుమంతుని, బ్రహ్మమానసికపుత్త్రుఁడైన జాంబవంతుని, సుహోత్రుని, శరారిని, శరగుల్మని, గజుని, గవాక్షుని, గవయుని, సుషేణుని, ఋషభుని, మైందద్వివిదులను, విజయగంధమాదనులను, అగ్ని పుత్త్రులగు నుల్కాముఖుని, అసంగుని, అంగదుఁడు మొదలగు బలవేగములుగల ప్రసిద్ధులైన పెక్కు వానర వీరులను దక్షిణంపుదిశకుఁ బంపఁదలచినవాఁడయి, యా వానరవీరులముందట వడిగాఁబోవునట్టి గొప్పసేన నొక్కదానిని నియమించి యా వానరవీరుల కాదిక్కునందుఁ దెలియని ప్రదేశము లేవియున్నవో, వానినెల్లఁ దెలుపఁగోరినవాఁడై యిట్లనియె.

ఓ వానరపుంగవులారా! మీా రిక్కడనుండి తఱలి దక్కినంపు వైపునకుఁ దిరిగినవెంటనే పలువిధములయిన చెట్లతోఁగూడి వేయిశిఖరములు కలిగియున్న వింధ్యపర్వతమును, పెనుఁబాములతో నిండినదై దాఁట నలవికాకయుండు నర్మదానదిని, తరువాత దండకారణ్యమునందలి మనోహరమగు గోదావరీనదిని, మహానదియగు కృష్ణవేణీనదిని, మహిమగలదియు, మహాసర్పముల కావాసమునైన వరదానదిని, మేఖలానదిని, ఉత్కలానదిని దాఁటి, దశార్ణదేశములను, అశ్వవతి, యవంతి యను దేశములను మఱియు ననేకదేశములను జూడఁగలరు. తర్వాత విదర్భ ఋషిక దేశములను, మనోహరములైన మాహిషకదేశములను, వంగ, కళింగ, కౌశికదేశములను గలయం జూచి; పర్వతములతోను, గుహలతోను, నదులతోను గూడిన దండకారణ్యమును చక్కఁగాఁ దిలకించి, మఱల గోదావరిని దాఁటి యావల నాంధ్ర పుండ్రచోళ పాండ్య కేరళ దేశములను జూడఁగలరు. ఆదేశములందంతటను మీారు సీతాదేవిని వెదకవలయు. అచ్చటనుండి కొంతదవ్వేగినచో గైరికాదిధాతువులచే శైనేయఁబడియున్న సహ్యపర్వతము గానిపించును. విచిత్రమయిన శిఖరములుగలదియు; పుష్పితములైన నానావిధవృక్షములచే బ్రకా

శించునదియు, చందనవృక్షములతోఁ (పులతోఁ గూడినదియునై సొబగు మీఱుచున్న యా గొప్పసహ్యపర్వతమున సీతను చక్కఁగా వెదక వలసినది.

అటుతర్వాత నిర్మలజలముగలిగి, పావనమై యప్సరసలచేఁ బూజింపఁబడినదై ప్రసిద్ధిగాంచిన దివ్యమైన కావేరీనదిం జూడఁగలరు. మఱికొంతదూరము పోయిన మీకు మలయమను పర్వతము పొడ సూపును. ఆపర్వతశిఖరమునఁ దనతపోమహిమచే సూర్యునిపగిది వెలుఁగువాఁడును, ఋషులలో నుత్తముఁడునునైన యగస్త్యము నీంద్రునిఁ జూడఁగలరు. అమ్మునీంద్రునిఁ జూచి, పూజలుసల్పి, సంతుష్టుఁ డయినమహానుభావుఁడగు నాతనివలన నానతివడసినవారలై, మఱి కొంతదూరమునని మొసళ్లతోఁగూడిన తామ్రపర్ణియను గొప్ప నదిని దాఁటుఁడు. చందనము లలఁదుకొని, యున్నతస్తనములతోఁగూడిన ప్రియురాలగు జవ్వని తనప్రియునికడ కేగునట్లులిరుదరుల చందనవనము లచే నొప్పుచు, దీవులచేఁ బ్రకాశించుచున్న యా తామ్రపర్ణినది సముద్ర మును బొందుచున్నది. ఆనదిని దాఁటి నడచినతరువాత, బంగారుమయ మయి ముత్యములచే శోభితమయి వెలుఁగుచున్న పాండ్యదేశపు రాజులనగరద్వారకవాటమును జూతురు.

అచటినుండి వెడలి మఱికొంతదవ్వేగినచో దక్షిణసముద్రము గనఁబడును. అచ్చటికిఁ జేరి సీతాన్వేషణకార్యమునకై యాలోచించి కార్యనిశ్చయము నేయవలసినది. అక్కడనుండి వెడలినచో, నా సము ద్రముచేరువ నగస్త్యమునీంద్రుఁ డుంచినదియు, నానావిధవృక్షములు గలదియుఁ గాంతిగలదియునైన మహేంద్రమను పర్వతశ్రేష్ఠము సముద్రజలము లానికొనియున్నది. నానావిధములగు వృక్షలతలచే మెఱయునదియు, దేవర్షియక్షోత్తములచేతను, అచ్చరలచేతను, సిద్ధ చారణసంఘములచేతను గొల్వఁబడినదియుఁ గడునింపు గులుకునదియు నైన యా మహేంద్రపర్వతమునకు దేవేంద్రుఁ డెల్లప్పుడు పర్వదివ సములందు సముద్రస్నానమునిమిత్తము వచ్చుచుండును. ఆ మహేం ద్రముదాఁటి, ఆకడలినడుమ నావలితీరమువైపుగా నూఱుయోజన ములు వైశాల్యముగల యొక్క ద్వీపమున్నది. అయ్యది మానవులకుఁ బోఁదగినదికాదు. ఆద్వీపము దేవేంద్రునితో సమానమగు వెలుఁగుగల

దుష్టుఁడయిన రాక్షసాధిపుఁడగు రావణునియొక్క యునికిపట్టు. ఆ ద్వీపమున మీరు తక్కినచోట్లకంటె నెక్కువగా సీతాదేవిని వెదకవలయును.

దక్షిణసముద్రమధ్యమున నంగారకుని తల్లియగుసింహికయని ప్రసిద్ధిగాంచిన యొకరాక్షసి నీటిపైఁ బరుండి నింగిని బోవువారినీడనీడ్చి భక్షించునది. మీరు దానికిఁ జిక్కక జాగ్రత్తతోఁ బోవలయును. అపరిమితపరాక్రమముగల వానరులారా! మీరు భయము మానినవారలై, యెచ్చటెచ్చట సీతాదేవి యుండవచ్చునని సంశయము గలుగునో, అట్టి సంశయస్థలములందెల్ల సీతాదేవిని వెదకి సంశయంబుఁ దీర్చుకొని రండు. లంకాపురము దాఁటి నూఱుయోజనములు పోయినతర్వాత, సముద్రముననే సిద్ధచారణుల కునికిపట్టయిన పుష్పితక మను పర్వత మొక్కటి యున్నది. ఆ పుష్పితకపర్వతము చంద్రునివలె నొక్కప్రక్కఁ దెల్లనిదై, సూర్యునివలె మఱొకప్రక్క నెఱ్ఱనై సముద్రజలముచేఁ జుట్టఁబడి యెత్తు కొనలతో నింగి నొఱయుచున్నదో యనునట్లు వెలుఁగుచుండును. దాని శిఖరములలోఁ గాంచనశిఖరమును సూర్యుఁడు దక్షిణాయనమునఁ బొందును. చంద్రుఁడును వెండిశిఖరమునుబొందును. ఆకొండ నెనరు లేనివారికిని, క్రూరులకును, నాస్తికులకును గానఁబడదు. మీ రా పర్వతమునకుఁ బ్రణమిల్లి యచ్చట సీతాదేవిని వెదకుఁడు.

శత్రువులకు లొంగని యో భృత్యులారా! మీరు పుష్పితక పర్వతము దాఁటి పోనలవికానిదారిని పదునాలుగుయోజనముల దవ్వేగితిరేని, యచ్చట సూర్యవంతమను పర్వతమును మీరు చూడఁగలరు. అది దాఁటిన, నన్నికాలములలోను మనోహరములై కోరినపండ్లుగలవైన చెట్లతోఁగూడిన వైద్యుతమను నొకకొండ తెలియనగును. వానరులారా! ఆపర్వతమున నుత్తమములయిన గడ్డలను, దుంపలను, మంచి తేనెలను గ్రోలి, యానలఁ బొండు. అచ్చటనే కుంజరమను పేరుగల యొక మహాపర్వతమున్నది. ఆ పర్వతము మనస్సునకుఁ గన్నులకు నానందదాయకమై యుండును. ఆపర్వతమున యోజనము వెడల్పును, పదియోజనముల నిడివియుగలిగి యెత్తుగానుండు సువర్ణమణిభూషితమైన యొక గృహమును విశకర్మ యగస్త్యమునికిఁగాను కట్టియిచ్చెను. దానికిఁ బ్రక్కన బొఁపతేఁడగు బుద్ధిమంతుఁడయిన వాసుకి కునికి పట్టును, వాఁడికోఱలుగలిగి, యోర్వరాని విసముగలవైన భీకరము

లగు పాములచేఁ గావలి కాచఁబడినదియు, అన్నివైపులఁ జక్కఁగాఁ గావలియుంచఁబడి యుండుటచే నొరులకుఁ జొఱ నలవికానిదియు, వెడల్పు తొట్టికట్లు గలదియునైన పాముల కిరవగు భోగవతియను పురమున్నది. మీ రచ్చటఁ జక్కఁగా నామెను వెదకవలసినది.

అక్కడికిఁ జేరినట్లుగానున్న దేశములందును సీతను మీరు బాగుగా వెదకవలసినది. ఆభోగవతీపురము దాఁటఁగా, సకలరత్నములచేనిండినదై యెద్దురూపముననుండు సుందరమయిన ఋషభమను గొప్ప పర్వతము గనఁబడును. ఆఋషభపర్వతమున గోరోచనపు వన్నె గలది, కమలవర్ణముగలది, ఆకుపచ్చ వన్నెగలది, నీలవర్ణముగలదియై, యగ్నితో సాటిగా వెలిఁగెడి దివ్య శ్రీగంధవృక్షవనము గనఁబడును. శ్రీచందనవనమును మీరు చూచినను, మీ రెప్పటికిని దానిందాఁక వలదు. ఆవనమునకు భీకరులయిన రోహితులనెడి గంధర్వులు గావలి యున్నవారు. శైలూషుఁడు, గ్రామణి, శిగ్రువు, బభ్రువు, శుభ్రుఁడు నను పేరుగల యేవురుగంధర్వనాయకు లాచందనవనంబున వాసము చేయుచుందురు. సూర్యునివలెను, చంద్రునివలెను, అగ్నివలెను తేజరిల్లు పుణ్యాత్ములకది యునికిపట్టు. భూమియొక్క చిట్టచివరనున్న యాప్రదేశమున స్వర్గమునుజయించిన మహాత్ములుందురు. ఆ ఋషభపర్వతమున కావలఁ గడు భీకరమై, యమునిరాజధానియగు పితృలోకమున్నయది. అది యాఁడరాని కారుచీఁకటితో నిండి యుండును గావున నది ప్రవేశింపఁదగదు. ఓ వీరులగు వానరపుంగవులారా! మీ రా దిక్కునందుఁ బోఁదగినది యంతవఱకే. వెదకవలసినది యంతవఱకే. దాని కావలఁ బోవుటకు సాధ్యముకాదు. మీ రీ దేశములను, ఇంకను నే విడిచిన దేశములను అచ్చటచ్చట వెదకి సీతాదేవిపోవిడి తెలిసికొని రావలెను. మీలో నెవ్వఁడొక్క నెలలోపల "నేను సీతను జూచితిని" యని వచ్చి చెప్పుచున్నాఁడో, వాఁడు నాతో సమానవిభవము గలవాఁడై సుఖముగా నుండఁగలఁడు. వాఁడు నాకుఁ గడుఁ బ్రియుఁడు. వేయేల? వానిని నాప్రాణసఖునిగా నెంచెఁగెదను. వాఁ డెన్ని తప్పిదము లొనరించినను, వాని తప్పిదములు మన్నించి, వానిని నా బంధువునుగాఁ జూచుకొందును. విశేషగుణములుగల కులములందుఁ బుట్టినవారలై, బల పరాక్రమ సంపన్నులయిన యో వానర

వీరులారా! సీతాదేవి యెట్లు దొరకఁగలదో యట్టి ప్రయత్నము విశేషముగాఁ జేయుఁడు” అని సుగ్రీవుఁడు నీలుఁడు మున్నగువారితోఁ జెప్పెను.

## 42.వ సర్గము

సుగ్రీవుఁడు సుషేణాదులను పడమటిదిక్కునకుఁ బంపుట

అంత సుగ్రీవుఁడు హనుమదాదివానరవీరులను దక్కినంపు దెసకుఁ బంపి, యావలఁ దారకుఁ దండ్రియు, తనకు మామగారునునైన భయంకరవిక్రముఁడగు సుషేణుఁడను వానరయూథపతిని జూచి, చేతులు జోడించి మ్రొక్కి, “యో వానరేంద్రా! తాము తేజస్సుగలవాఁడును, శూరులైన వానరులతోఁ గూడినవాఁడును, దేవేంద్రునిఁ బోలు వెలుఁగుగలవాఁడును, తెలివియు మగటిమియుఁ గలవాఁడును, గరుత్మంతునిఁ బోలు ప్రకాశముతోఁ గూడినవాఁడునైన మరీచిమహర్షి జ్యేష్ఠపుత్త్రుఁడయిన మారీచుని, కాంతులకుఁ దావలములును బలవంతులునునైన యా మారీచుని తమ్ములను, తక్కిన మరీచి మహర్షి కొడుకుల నందఱిని మఱి రెండులక్షలసైన్యములను దోడ్కొని సీతాదేవిని వెదకుటకై పడమటిదిక్కునకుఁ బొండు” అని చెప్పి యందఱు వానరులం జూచి యిట్లనెను! వానరయూథములకుఁ గాఁపులారా! మీ రిచ్చటి నుండి తఱలి, సురాష్ట్ర, బాహ్లీక, శూరదేశములను, సకలసంపదలతో నిండిన చక్కని గ్రామములను, వైశాల్యముగల పట్టనములను, పున్నాగవనమును, బొగడ, విఱిగిచెట్లతో నిండియున్న కుక్షిదేశమును, మొగలిపొదలుగల కేతకషండదేశమును జూచి యచ్చట సీతాదేవిని వెదకుఁడు. అచ్చటనుండి తఱలి, పడమటికిఁ బాఱెడి తేటనీటితోఁ గూడిన పుణ్యనదులను, ఆనదులగట్టులందున్న యడవులను, ఋషుల తపోవనములను, చేరువనుండు పర్వతములను బొంది యచ్చట సీతాదేవిని వెదకుఁడు. అక్కడనుండి వెడలి మఱికొంతదవ్వేగిన, నచ్చట నీరులేని బయళ్ళును, గొప్ప బండలతోఁగూడిన పర్వతములును, చొఱరాని పెక్కు కనుమలవరుసలును గానిపించును. వానియందంతట సీతాదేవిని బాగుగా వెదకి యచ్చటఁ గానరేని, మొసళ్ళు, సొరచేఁపలు మొదలగు జంతువులతో నిండినదై ప్రవేశించుటకలవిగాని పడమటి

సముద్రతీరమునకుఁ బోండు. ఆ సముద్రతీరమున నున్న పర్వతము లందును, వనములందును, మొగలిపొదలందును, కానుఁగుతోఁపు లందును సేనలతోఁగూడఁ గొంత తడవు విహరించి, యా ప్రాంతపుఁ గొండలందును, అడవులందును రావణుని యునికిపట్టును, సీతాదేవిని వెదకుఁడు.

అక్కడనుండి వెడలి సముద్రతీరముననున్న మురచపురమును, మనోహరమైన జటీపురమును, ఆవంతి, అంగలోపములనెడి పురము లను, అలక్షితవనమును, మఱియు నచ్చటచ్చటనున్న వెడల్పయిన పత్తనములను, దేశములను జూచి, యా దేశములందును, ఆపురములం దును సీతాదేవిని వెదకుఁడు. సింధునది సముద్రముతోఁ గలియుచోట, నూఱు శిఖరములుగల్గి, పెక్కువృక్షములతోఁ గూడియున్న హేమగిరి యను పర్వతమున్నది. చక్కనైయున్న యా కొండచరియలందు ఱెక్క లుగల సింహములున్నవి. అవి సముద్రమునందలి సొరచేపలను, ఏనుఁగులను గొని తమగూండ్లలోనికిఁ దీసికొనిపోవును. ఆపర్వతంపుఁ గొనయందును, విశాలమయిన యాజలమయిప్రదేశమందునుగల యేనుగులు మదించి మిగుల నుల్లాసముతో నురుములమాడ్కి గర్జిల్లుచు, నాసింగములగూండ్లయందు విచ్చలవిడిగాఁ దిరుగుచుండును. ఆకసమును దాఁకునంతటి యెత్తుగలదియు, చిత్రవృక్షములు గలది యునైన యా కాంచనమయ శిఖరమునందుఁ గామరూపులగు మీ రాలస్యముచేయక సీతాదేవిని వెదకవలయును. అట్లే సముద్రమునఁ గొంతదూరము పోయిన, నచ్చట సముద్రమధ్యముననున్నదియు, నూఱు యోజనముల పొడవుగలదియు, చూపు చెదఱునట్లుచేయు కాంతి గలదియునైన పారియాత్ర పర్వతముయొక్క బంగారు శిఖరమును జూడఁగలరు. ఆపారియాత్ర పర్వతశిఖరమున బలముగలవారును, అగ్నివలె వెలుఁగు వారును, చూపఱకు వెఱపు పుట్టించువారును, కోరినరూపము ధరింపఁగలవారును నైన యిరువదినాలుగుకోట్ల గంధ ర్వులున్నవారు. ఓవానరశ్రేష్ఠులారా! మీ రెక్కువమగఁటిమిగలవా రుగనున్నను, ఆ గంధర్వు లగ్నిహోత్రునిమాడ్కి వెలుఁగువారగుటం జేసియు, గుంపులు గుంపులుగాఁ గూడియుండుటంబట్టియు, వారినిఁ జేరకుఁడు. వా రుండు పర్వతశిఖరమునుండి మీ రొక్క పండునైనను

దీసికొనఁగూడదు. ఏలయనిన, ఎక్కువ దిట్టతనమును, బలిమియు, మగటిమియుఁగలవారగుటంజేసి, యొరులకుఁ జేరరానివారలై యా శూరులగు గంధర్వు లాపర్వతశిఖరమునందలి పండ్లను దుంపలను గావలి కాచుచుందురు. మీరు వానరులు గావున మీకు వారివలన నెంత మాత్రము భయముగలుగదు గనుకఁ బూనికతో నా పర్వతశిఖరమున సీతాదేవిని వెదకవలయును. ఆపర్వతము దాఁటిపోయిన వైడూర్య వర్ణముగలదియు, వజ్రమువలె గట్టిగనుండునదియు, నానావిధవృక్షల తలతోఁ గూడిన దియునైన వజ్రమను గొప్పకొండయున్నది. ఆపర్వతము సముద్రమధ్యమున నూఱుయోజనముల వైశాల్యమును నౌన్నత్య మును గలదైయున్నది. వానరవీరులారా! ఆపర్వతగుహాలందు మీరు ప్రయత్నపూర్వకముగా సీతాదేవిని వెదకవలయును.

ఆసముద్రముయొక్క నాలుగవభాగమునఁ జక్రవంతమను పేరు గల పర్వతమొక్కటియున్నది. ఆపర్వతమున విశ్వకర్మ నూఱంచులుగల చక్రము నొక్కదానివి నిర్మించెను. ఆపర్వతమునఁ బురుషోత్తముఁడగు విష్ణువు చక్రరక్షకుఁడయిన హయగ్రీవుఁ డసురాక్షసుని సంహరించి చక్రమును, పంచజనుఁ డనురాక్షసుని సంహరించి, శంఖమును గైకొ నెను. ఆపర్వతమునందలి విశాలములై వింతగొల్పునట్టి గుహాలందును రావణుని, సీతాదేవిని వెదకవలయును. తర్వాత నరువదియోజనముల దవ్వేగిలిరేని, యగాధమగు సముద్రమున బంగారు శిఖరముగలదియు, విశేషకాంతితోఁగూడినదియునైన వరాహగిరి కనఁబడును. ఆ వరాహగిరి యందు బంగారుమయమైన ప్రాగ్జ్యోతిషమను పురమొండుకలదు. చెడుస్వభావముగల నరకుఁడను దానవుఁ డప్పురము నేలుచుండును. మీ రాపర్వతముయొక్క వింతలైన చరియలందును, విశాలగుహాల యందును రావణుని, సీతాదేవి నచ్చటచ్చట వెదకవలయును.

ఆపర్వతము దాఁటినఁ సెలయేళ్ళతోఁగూడినదియు, బంగారు వన్నెగల గుహాలతో వెలుఁగునదియునైన సర్వసౌవర్ణమను పర్వత మొక్కటి కాననగును. ఆపర్వతమున నెల్లెడల సింహవ్యాఘ్ర వరాహ ములు మాఱుమ్రోఁత లీనునట్లు గర్జించుచు నామాఱుమ్రోఁతలకు మదించి, వానికిఁ బ్రతిగాను గర్జించుచుండును. దానికి వెంబడే మేఘ వంతమను పర్వత మొక్కటి యున్నది. దానియందే వేల్పులు పాకాసు

రుని వధించిన దేవేంద్రుని స్వర్గరాజ్యపట్టాభిషిక్తుం గావించిరి. దేవేంద్రునిచేఁ బాలింపఁబడు నా మేఘవంతమను పర్వతమును దాఁటి, చక్కఁగాఁబూఁచిన పసిఁడివన్నెగల చెట్లచే శోభిల్లునవియు, బాల సూర్యునిమాడ్కి నంతట వెలుఁగునవియునైన పసిఁడితిప్పలఱువదివేలు వరుసగాఁ గనఁబడును. ఆ పర్వతములనడుమ మేరువను నుత్తమపర్వత మున్నయది. సూర్యుఁ డొక్కప్పుడు సంతసించినవాఁడై, "ఓ పర్వత శ్రేష్ఠమా! నా వరప్రభావమున నీయందున్నట్టి యన్నివస్తువులును రేయింబవళ్ళు బంగారంపు వన్నెగలిగి వెలుఁగుచుండును. నీయందున్నట్టి దేవదానవ గంధర్వులును పసిఁడిచాయయు, నెఱ్ఱనికాంతియుగల వారై యుండఁగలరు" అని యా పర్వతరాజమునకు వర మొసఁగెను. మఱియు విశ్వేదేవులును, మరుత్తులును, అష్టవసువులును, దేవతలును సాయంసంధ్యాకాలమున నా పర్వతమునకు వచ్చి, సూర్యునుపాసింతురు. సూర్యుఁడును వారిచేఁ బూజలను గొన్నవాఁడై యన్నిభూతములకుఁగానఁబడక యస్తపర్వతమును జేరుచుండును. మేరుపర్వతమునకును నస్తపర్వతమునకును బదివేల యోజనముల దూరమున్నది. సూర్యుఁడింతదవ్వును అర్ధముహూర్తములోపల దాఁటి, యస్తగిరినిజేరుచుండును. ఆ మేరుపర్వతశిఖరమున, వింతవింతల పక్షులతోడను బలురంగుల చెట్లతోడను శోభిల్లునట్టిదియు, విశ్వకర్మచే నిర్మింపఁబడినదియు, పెక్కు మేడలతోఁగూడినదియు, సూర్యునివలె వెలుఁగునదియునైన మహాత్ముఁడగు పాశముదాల్చిన వరుణుని దివ్యభవనము వెలుఁగుచున్నది. ఆ మేరు పర్వతమునకు నస్తమయ పర్వతమునకును నడుమఁ బలురంగులతిన్నె గలిగి, పసిఁడిమయమైన పదికొనలు గలిగియున్న యొకగొప్పతాటిచెట్టు వెలుఁగుచున్నది. సకలధర్మముల నెఱిఁగినవాఁడును, తపోమహిమచే వెలుఁగువాఁడును, బ్రహ్మతో సమానుఁడునునైన మేరుసావర్ణికి నివాస స్థానమైన యా మేరుపర్వతముయొక్క దుర్గములం దన్నింటియందును రావణుని యునికిపట్టును, సీతాదేవిని వెదకవలయును. వానరులారా! సూర్యునివలె వెలుఁగునట్టి మేరుసావర్ణిమహర్షికడకేగి, యా మునీంద్రునికి సాష్టాంగముగాఁ బ్రణమిల్లి, సీతాదేవిని గూర్చిన పోవిడి య్మెమైనను దెలియునా, యని యాతని నడిగి తెలిసికొనుఁడు.

ఇంతవఱకే సూర్యుఁడు వేకువలేచి, యుదయపర్వతము మొదల స్తమయ పర్వతమువఱకుఁగల ప్రదేశమునంతయుఁ దనకిరణముల వ్యాపింపఁజేసి, చీకటినంతయుఁబోఁగొట్టి, యస్తపర్వతమునకుఁ జేరుచుండును. ఓ వానరశ్రేష్ఠులారా! వానరుల కస్తమయపర్వతమువఱకే పోవ శక్యమగును. ఆపర్వతమున కావలిప్రదేశము సూర్యునిరశ్మి లేకయు, ఎట్టు లుండునదియు తెలియకయు నుండుటవలన నావలిప్రదేశ మెట్టిదో మాకుఁ దెలియదు. మీ రిచ్చటినుండి యస్తపర్వతమువఱకుఁ బోయి సీతాదేవిని, రావణుని స్థానమును గనుఁగొని యొక నెలలోపల వచ్చి చేరవలయును. ఒకనెలకంటె నెక్కువకాలము మీ రెక్కడ నుండఁదగదు. అట్లుకాక, మీలో నెవ్వఁడయిన నా యాజ్ఞ మీఱి తడవుసేయు నేని, వానికి వధమే దండనగా విధింపఁబడును. ఓ వానరులారా! మీకుఁదోడుగా మామామ శూరుఁడగు సుషేణుఁడు మీతోడ వచ్చును. నా యాజ్ఞప్రకారము నడవఁగోరుదు రేని, మీరంద ఱీతని మాటప్రకారము నడవవలయును. ఈ నా మామగారును పెద్దవాఁడు; బలిమిగలవాఁడు దీర్ఘబాహువు. మీరును బరాక్రమముగలవారలు. కావున నన్నిపనులను మీ యిష్టమునసుసరించి జరుపవచ్చును. మనకుఁ గార్యసిద్ధికావలయును. ఈసుషేణుని ముఖ్యునిగాఁజేసికొని పడమటిదిశకుఁ బోయి వెదకిరండు. సాటిలేని వెలుఁగుగల రామనృపాలుని భార్యను మీరు గనుఁగొని వచ్చితి రేని, యుపకారికిఁ బ్రత్యుపకారము సేయుటచే మేము కృతార్థులమగుదుము. నే నిప్పుడు చెప్పినదానికంటె నెద్దియైన నీ కార్యమునకుఁ దగినట్లుగాఁ జేయవలసినదియుండిన నట్టి కార్యమును దేశకాలముల కనుగుణముగా, మీరంద ఱాలోచించి చేయవలయును" అని వానరులకందఱికిని సుగ్రీవుఁ డానతిచ్చెను. అంత సుషేణుఁడు మున్నగు వానరులు సుగ్రీవునిమాటను నేర్పుతో విని, వానరేంద్రుని వీడ్కొని పడమటిదిక్కునకుఁ దఱలిరి.

## 43-వ సర్గము

సుగ్రీవుఁడు శతవలిని నుత్తరదిశకుఁ బంపుట

ధర్మముల నెఱింగిన వానరేంద్రుఁడగు సుగ్రీవుఁడు తన మామను సుషేణునిఁ బడమటిదిక్కునకుఁ బోవఁ బనిచి, పదంపడి,

శూరుఁడును, వానరు లందఱిలోపల నుత్తముఁడునునైన శతవలిం గూర్చి, తనకును రామునకును హితమగుమాట యివ్విధమునఁ జెప్పఁ దొడఁగెను.

ఓ శతవలీ! నీయట్టి బలవంతులగు లక్షమంది సైనికులను దీసికొని, యమపుత్రులగు నీ మంత్రులం దోడ్కొని హిమవంతమే శిరోరత్నముగాఁగలదియు, విశాలమునునైన యుత్తరదిక్కున నంతటఁ బతివ్రతయని ప్రసిద్ధిగాంచిన సీతాదేవిని వెదకుఁడు. కార్యవేత్తలలో నుత్తములారా! యీ కార్యము నెఱవేర్చి, రామునికిఁ బ్రీతియొనర్చితిమేని, మనము ఋణమునుండి విడువఁబడి కృతార్థులమగుదుము. మహానుభావుఁడగు రాముఁడు మన కుపకారముచేసెను. మనము దానికి బదులు మేలొనర్చితిమేని, మనజన్మములు సార్థకములగును. ఒకఁడు మన కుపకారముసేయనివాఁడయినను యడిగినదానిని నెఱవేర్చినచో, నట్టివాని జన్మము సార్థకమగునని పెద్దలు సెప్పుదురు. అట్టుండ మొదట నుపకారము సేసినవాని కుపకార మొనర్పకున్న నతనిజన్మము నిరర్థకము గదా! ఓ వానరవీరులారా! మీరీ తలంపును జ్ఞప్తియుంచుకొని, మా కిష్టమును మేలును జేయఁగోరుదురేని, సీతాదేవిని వెదకుటకుఁ బ్రయత్నింపుఁడు. శత్రువులపట్టణములఁ బాడుసేయునట్టి, సకలప్రాణులచే గారవింపఁదగిన యీ రాముఁడు మనయెడ నెక్కువ ప్రేమగలిగి యున్నాఁడు. కావున నతఁడు పూర్వోపకారి గనుకను, మనయందుఁ బ్రేమగలవాఁడు గనుకను మన మతనికార్యముఁ దప్పకచేసి తీరవలయును.

కావున మీ రుత్తరదిక్కునకుఁ దరలి, యచ్చట మ్లేచ్ఛ, పుళింద, శూరసేన, ప్రస్థల, భరత, కురు, మద్ర, కాంభోజ, యవన, శక, ఆరట్టక, బాహ్లీక, ఋషిక, పౌరవ, టంకణ, చీన, పరమచీన, విహార, దరద దేశములను, హిమవంతమునుబొంది, యచ్చట మీ యావత్తుబలవిక్రమముల నుపయోగించి,చొఱరాని నదులందును,పర్వత గుహాలందును, లొద్దుగు, చందనము, దేవదారువు గలవనములందును రావణుని, సీతాదేవిని వెదకవలయును.

అవియెల్ల వెదకి, దేవదానవుల కునికిపట్టగు సోమాశ్రమము దాఁటిన, నావల గొప్పచఱులుగల కాలపర్వతమును బొందుదురు ఆ

కాలపర్వతముయొక్క విశాలములైన కోనలయందును,గుహాలయందును మహాపతివ్రతయగు రాముని దేవి నచ్చటచ్చట వెదకుఁడు.అంతట బంగారు గనులుగల యాకాలమను పర్వతశ్రేష్ఠమునుదాఁటి, సుదర్శనమను పర్వతమునకుఁ బోవలయును. పర్వతనివాసులారా ! ఆ సుదర్శన పర్వతము దాఁటి, పెక్కు చెట్లతోఁగూడి, యనేకవిధములగు పక్షుల గుంపులతో నిండిన దేవసఖమను పర్వత మొక్కటి మీకుఁ గానిపింపఁగలదు. మీరా పర్వతమున నచ్చటచ్చట నడవులగుంపులందును, సెలయేళ్ళ గట్టులందును, గుహాలయందును సీతాదేవిని, రావణుని వెదకవలయును.

ఆ దేవసఖపర్వతము దాఁటినపిమ్మట, నూఱుయోజనముల దూరమే తట్టును గొండలుగాని, నదులుగాని, వనములుగాని యుండ దనువుగాక, యెట్టి జంతువున కునికిపట్టుకాక యుత్త యెడారియై యుండఁగలదు. మీ రాభయంకరమైన యెడారిని దాఁటితిరేని, తెల్లనైన కైలాసపర్వతము గనఁబడును. మీ రా పర్వతమునుజూచి మిక్కిలి సంతసము నొందఁగలరు. ఆ కైలాసపర్వతమునఁ దెల్ల మబ్బు చాయ గలదై, బంగారుచే నలంకృతమైన విశ్వకర్మ నిర్మించినట్టి కుబేరుని దివ్య నగ రున్నది. ఆ నగరుచేరువ విస్తారములైన కమలములు నుత్పలములుఁ గలదై రాయంచలకు, బెగ్గురుపక్షులకుఁ దావలమై, యచ్చరలకు నివాసమై యొప్పుమీఱు నొక విశాలసర స్సున్నది. అచ్చట సకలజన వందితుఁడును, జక్కులకు ఱేఁడును, రొక్కముల నిచ్చువాఁడునునైన కుబేరుఁడు వైభవోపేతుఁడై, యక్షులతోఁగూడి విహరించుచుండును. చంద్రునిఁబోలు నా పర్వతములయొక్క తిప్పలందును, గుహాలయందును సీతాదేవిని, రావణుని వెదకవలయును.

అటుతర్వాతఁ గైలాసముదాఁటి, క్రౌంచపర్వతము సేరి, యందలి గుహ చొఱరానిదియని చెప్పఁబడును గనుక, మీరు జాగ్రత్తగలవారలై యందుఁ బ్రవేశింపవలయును. ఆగుహాయందు సూర్యుని మాడ్కి వెలుఁగువారును, దేవతలచేఁగూడ లెస్సగాఁ బూజింపఁబడినవారును, వెలుఁగుచున్న రూపములుగలవారునునైన మహాత్ములగు పరమర్షులు తపము లొనరించుచుందురు. మీ రాపర్వతముచేరి, దాని గుహాలయందును, చఱియలయందును, శిఖరములందును, కోనలందును, మధ్యభాగములందును నచ్చటచ్చట సీతాదేవిని వెదకవలయును.

ఆ క్రౌంచపర్వతముయొక్క ప్రధానశిఖరమునను, చెట్లులేని కామశైలమునందును, పక్షుల కునికిపట్టగు మానసపర్వతమునను వెదకవలయును. ఆ మానసపర్వతమున సకలభూతములకు మాత్రమే కాక దేవదానవరాక్షసులకుఁ గూడ సంచరింపనలవిగాదు. మీ రంద ఱాపర్వతమునఁ జఱియలందును, విషమప్రదేశములందును, శిఖరములందును సీతాదేవిని జాగ్రత్తతో వెదకవలయును.

క్రౌంచపర్వతము దాఁటినపిదప మైనాకమను పర్వతమొక్కటి యున్నది. ఆమైనాకపర్వతమున మయుఁడు స్వగృహమును దానే నిర్మించికొని యున్నవాఁడు. ఆ పర్వతమున గుఱ్ఱపు మోములుగల కిన్నరస్త్రీలయొక్క నివాసము లున్నవి. మీ రాపర్వతముచేరి, యాచఱులయందును, విషమభూములందును, గుహలయందును, ఆ కిన్నరస్త్రీల యునికిపట్టులందును సీతాదేవిని వెదకవలయు. ఆ పర్వతప్రదేశము దాఁటినతరువాత నచ్చట సిద్ధులుండెడి యాశ్రమమున్నది. ఆ యాశ్రమమునందు నష్టైశ్వర్య సిద్ధిగలవారును, తపస్సుచేయు స్వభావము గలవారునైన వైఖానసులును, వాలఖిల్యులు నను మును లున్నవారు. వారు తపస్సుచేఁ బరబ్రహ్మసాక్షాత్కారమువడసి, పాపముల నుండి విడువఁబడినవారు. వారికి మీ రడఁకువతో నమస్కరించి, వారిని సీతాదేవిసంగతింగూర్చి యడుగుఁడు.

ఆ యాశ్రమమున బంగారుకమలములు గలదియు, బాలసూర్యుని పగిది వెలుఁగు నందములైన రాయంచలతోఁ గూడినదియునైన వైఖానసమను సరస్సున్నది. సార్వభౌమమను పేరుగల కుబేరుని పట్టపేనుఁగు ఆఁడేనుఁగులతోఁ గూడి యాకొలని గట్టులయందుఁ దిరుగుచుండును. ఆ వైఖానససరస్సున కావల సూర్యచంద్రుల సంచారము లేదు. నక్షత్రగణములు గానరావు. మేఘసంచారమును లేదు. ఆకాశము నిశ్శబ్దమైయుండును. అయినను అచ్చట శ్రమదీర్చుకొనుచుండువారును తపస్సుచేసి సకల కామములఁ బడసినవారును, దేవతలతో సమానులై తమంతట వెలుఁగువారునునైన సిద్ధులచే నాదేశము సూర్యకిరణములచే వ్యాప్తమైయుండునట్లు వెలుఁగుచున్నది. ఆ ప్రదేశమున కావల శైలోదమను పేరుగల నదియొక్కటి పాఱుచున్నది. ఆ నదియొక్క యిరుప్రక్కలను బొంగువెదుళ్లు విశేషముగా నున్నవి,

ఆ వెదుళ్ళు మిక్కిలి పొడుగుగా ముందుకు నదులలోనికి వాలియుండు టచే సిద్ధులీతట్టునుండి యాతట్టునకు దాఁటిపోవుచుందురు. ఆ నది కావలఁ బుణ్యాత్ముల కాశ్రయములైన యుత్తరకురుదేశము లున్నవి.

ఆ కురుదేశము పుణ్యముచేసినవారు పుణ్యఫలము ననుభవించుటకై యేర్పడిన దేశముగనుక, నచ్చట బంగారుతామరపూవులతోఁ గూడి, నీలవైడూర్యమణుల వన్నెగల తామరతీఁగలతోఁ గూడిన మంచినీరుగల పెక్కునదులు పాఱుచున్నవి. మఱియు నచ్చటఁ గొలఁకులు బాలసూర్యునిచందమున మెఱయు బంగారుమయపు టెఱ్ఱగలు వలవనముతోఁగూడినవై దీపించుచున్నవి. అంతియకాక, ఆ కురుదేశము మేలైన నీలములవంటి రేకులును, పసిఁడిచాయగల కింజల్కములును గలిగి విచిత్రములై యున్న నల్లఁగలువలతోఁగూడిన కొలఁకులు గలిగి యున్నది. మఱియు నాకురుదేశమునందలి నదులు సాటిలేనిముత్యముల చేతను, మిగులవిలువగల రతనములచేతను, బంగారుచేతను నిండిన యిసుకదిన్నెలుగలవియు, నడుమనడుమ నానావిధరత్న ప్రచురములై, పసిఁడితోఁగూడి, పలురంగులుగలిగి, యగ్ని మాడ్కిఁ దేజరిల్లు తిప్పలతోఁ గూడినవియునై వెలుఁగుచుండును. అచ్చటి వృక్షములు విడువని పువ్వులు పండ్లతోఁగూడి నెత్తావియుఁ దీపియుఁ స్పర్శముగలిగి, యన్ని కోర్కులను నొసఁగుచుండును. మఱికొన్ని వృక్షములు పలుతెఱఁగులగు బట్టలను గాచుచుండును. కొన్ని వృక్షరాజములు ముత్యాలును, పచ్చలును జెక్కియుండుటచేఁ బలువన్నెలుగలవియు, స్త్రీలకుఁ బురుషులకును నన్నిఋతువులందుఁ దాల్చుటకు యోగ్యములునయిన భూషణములను బండుచున్నవి. కొన్ని వృక్షములు మిగుల విలువగలవియు పలురంగులు గలవియు పలువన్నెలపైబట్టలు పఱచినవియునైన బంగారు పాన్పులను గాయుచున్నవి. కొన్ని చెట్లు మనోహరములగు పువ్వులదండలను, మేలైన పానద్రవ్యములను, వివిధ భక్ష్యములను, సొంపును, బ్రాయమును గలిగిన గుణవతులగు నతివలను నొసఁగును. సూర్యునింబోలె వెలుఁగునట్టి గంధర్వ, కిన్నర, నాగ, విద్యాధర, సిద్ధులు తమ చెలులం గూడి యీ కురుక్షేత్రవనములందు విహరించుచుందురు. అచ్చట నుండువారందఱు పున్నెంపుఁబనులు సేయువారు, క్రీడలందాసక్తులు, కోరిన కోర్కులం బడసినవారునై తమ చెలువలంగూడి విహరించు

చుందురు. మఱియు నచ్చట నవ్వులచప్పుడు గలదియు, నన్ని జంతువులకు మనస్సుల కింపైనదియునైన పాటలయొక్కయు, వీణాదివాద్యములయొక్కయు నాదం బెల్లప్పుడు వినఁబడుచుండును. అచ్చట సంతసమునొందనివాఁడు లేఁడు; చెడ్డవిషయములం దాశగలవాఁడు లేఁడు. అచ్చట దినదినమునను మనోహరములగు సుగుణములేవియో వృద్ధి నొందుచునే యుండును. ఆ కురుదేశము దాఁటిన నావలనుండునది యుత్తరసముద్రమే.

ఆ సముద్రమునడుమ బంగారుమయమయిన సోమగిరి యను గొప్పపర్వత మొక్కటియున్నది. ఇంద్రలోక బ్రహ్మలోకములనొందిన వేల్పులు స్వర్గమున నుండి యాపర్వతశ్రేష్ఠమును జూచుచుందురు. ఆ ప్రదేశము సూర్యరశ్మిలేనిదియయ్యు, సూర్యరశ్మిగల ప్రదేశము వెలుఁగుగలదియగునట్లు అమ్మహాపర్వతముయొక్క వెలుతురుచే వెలుఁగుచుండును. అచ్చటఁ బ్రపంచస్వరూపుఁడగు విష్ణువును, ఏకాదశ (పదునొక్కండు) రుద్రాత్మకుఁడగు శివుఁడును, దేవదేవుఁడయిన బ్రహ్మర్షి సమేతుఁడగు బ్రహ్మయు వసింతురు. మీ రుత్తర కురుదేశమున కావల నెప్పటికిని బోవలదు. అది మీకుమాత్రమేకాక, యితరులకును నెంతటి సామర్థ్యముగలవారికేని బోవ నలవికాదు. ఆ సోమగిరి దేవతలకుఁ గూడఁ బోవీలుగాదు. కావున మీ రా సోమగిరినిజూచినవెంటనే, వెనుకకు మఱలవలయును. వానరశ్రేష్ఠులారా! వానరులకంతవఱకే పోవ సాధ్యమగును. ఆ పర్వతమున కావల సూర్యరశ్మిలేకయు, అడవులు మొదలగు నేర్పాట్లులేకయు నుండుటవలన నావల నేమియున్నదో మన మెఱుఁగము. ఇప్పుడు నేఁజెప్పిన ప్రదేశములం దెల్ల నామెను వెదకవలయును. నేను జెప్పక విడిచినది యే తావేనిఁ గనఁబడినచో నచ్చటఁగూడ సీతాదేవిని మీరు వెదకవలయును. అగ్నివాయువులంబోలు వానరులారా! మీరు సీతాదేవిని జూచివత్తురేని, మీరు రామునికి గొప్ప ప్రియముచేసిన వారలగుదురు. నాకు రామునికంటె మఱెంత యొక్కువ ప్రియమొనర్చిన వారలగుదురు. ఓ వానరులారా! పిమ్మట మీరు కృతార్థులరై, నాచే సకలవిధ రమ్యవస్తువులచే సమ్మానింపఁబడినవారలై, శత్రువులులేక, బంధువర్గములతోను, ప్రియురాండ్రతోనుగూడి ప్రాణి

కోటులధరించిన పుడమిని సంచరింపఁగలరు” అని సుగ్రీవుఁడు శతవలి మొదలగు వానరవీరులతోఁ జెప్పెను.

## 44-వ సర్గము

రాముఁడు హనుమంతునిచేతికి నుంగరమిచ్చుట

వానరులకెల్ల నధిపుఁడగు సుగ్రీవుఁ డివ్విధంబున నలుదెసలకును సేనలఁబోవఁ బనిచినను, హనుమంతుఁడే యీకార్యము సాధింపఁగలవాఁడను నమ్మికకలవాఁడై, యందఱితోఁ జెప్పినదేకాక ప్రత్యేకముగా బలశాలియయిన వాయునందనుఁడగు హనుమంతునిఁజూచి, కడు మోదముతో నిట్లనెను. “వానరశ్రేష్ఠా! భూమ్యంతరిక్షములందుఁగాని, సిద్ధ విద్యాధరాదులు సంచరించెడి యంబరమునందుఁగాని, స్వర్గమునందుఁగాని నీటిలోపలఁగాని, నీకడ్డము లేదు. దేవాసుర గంధర్వ సిద్ధ చారణ గరుడ సర్పములు, సముద్రపర్వత పాతాళములు గలిగిన యన్నిలోకములును నీకుఁ దెలియును. వానరోత్తమా! నీకును బలిమిగలవాఁడయిన నీతండ్రికుండునట్టి బలవేగప్రతాపలాఘవములకంటె మించినవి యున్నవి. నీప్రతాపముఁబోలు ప్రతాప మీభూలోకమున మఱెవ్వనికిని లేదు. కావున నెన్నివిధములనైనను సీతను గనిపెట్టుభారము నీదియే. న్యాయవిశారదుఁడా! హనుమంతుఁడా! బలిమియు, తెలివియు, పరాక్రమమును, దేశకాలములకుఁ దగినట్లు నడచుకొనుటయు, వినయమును నీయందె . యున్నవి. కావున నీవె యీకార్యము సాధింపవలె”నని సుగ్రీవుఁడు హనుమంతునిఁ బ్రోత్సాహపఱచెను.

రాముఁడును సుగ్రీవుఁ డిట్లు హనుమంతునితోఁ జెప్పు మాటనువిని, “సుగ్రీవుఁ డెంతయు హనుమంతునియందే కార్యానుకూల్యము గాఁగలదని నిశ్చయించియున్నాఁడు. హనుమంతుఁడును కార్య మనుకూలించువఱకుఁ జెప్పినంతపని చేయఁగలవాఁడనితోఁచెడి. ఈ హనుమంతుఁడును మున్నెన్నియో కార్యములు సాధించి ప్రసిద్ధిచెందియుండువాఁడు గావున సుగ్రీవుఁ డితనినిఁ జేరఁదీసి యింతగా నితనితోఁ జెప్పినట్లున్నది. కావున నీతనియెడలఁ గార్యముసఫలమగుట తప్పదు”అని యాతనినింగూర్చి తనమనమునఁ దలపోసి, హనుమంతుఁడు మిక్కిలి పూన్కిగలవాఁడై యుండుటఁ జూచి, తనివి

నొందినవాఁడై, తనపని నెఱవేఱెననియె తలఁచి, యా హనుమంతుని చేతికి సీతకుఁ జూపునిమిత్తమై తన ముద్రుటుంగరమును గుఱుతుగా నొసఁగి "యో వానరోత్తమా! యీ యుంగరముఁ జూపితివేని, జానకి భీతినొందక నాకడనుండి యేతెంచిన నిన్నునమ్మకముతోఁజూచును. మొన కాఁడా! నీ పూనికియు, నీబలపరాక్రమములును సుగ్రీవునియొక్క యాజ్ఞయుఁ జూడఁగా కార్యము నెఱవేఱఁగలదని తోఁచెడి" అని చెప్పఁగా హనుమంతుఁడా రాముని ముద్రుటుంగరమును గైకొని నెత్తినిబెట్టుకొని, చేతులుమోడ్చి రామునిపాదములకు మ్రొక్కి పయనమై, తనతోవచ్చెడి వానరబలమునెల్లఁ దీసికొని, నిర్మలమైన యాకసమునకెగిరి, నిర్మలబింబముఁగలిగి, నక్షత్రగణములచేఁ జుట్టఁబడిన చంద్రునిమాడ్కి వెలుఁగుచుండెను. ఆ హనుమంతుఁడట్లు పయనమైనప్పుడు రాముండు వెండియు నతనింజూచి "ఓ బలవంతుఁడా! నీబలిమిని నే నాదరవుచేసి యున్నాను. సింహముంబోలిన పరాక్రమవంతుఁడా! నీపరాక్రమమెల్లవినియోగించి, సీతకనఁబడునట్లు ప్రయత్నపడుము" అని హనుమంతునితోఁ జెప్పెను.

## 45-వ సర్గము

### వానరవీరులు సీతను వెదక వెడలుట

అంత వానరాధిపుఁడగు సుగ్రీవుఁడు రామునికార్యము నెఱవేఱునిమిత్తమై వానరవీరుల నందఱఁబిలిచి, "యో వానరవీరులారా! మీరు నేఁ జెప్పినతావులకెల్లఁ బోయి బాగుగ వెదకిరావలయును" అని యానతిచ్చెను. వానరశ్రేష్ఠులందఱు తమయొడయనికడఁదియానతిని శిరసావహించి, మిడుతలంబోలె భూమినెల్లఁ గప్పికొని వెడలిరి. రాముఁడును సీతను వెదకుటకై యేర్పడిన యాయొక్కనెల యెప్పుడు ముగియునాయని యెదురుచూచుచు నాప్రస్రవణపర్వతమున నుండెను.

వానరవీరుఁడగు శతవలి హిమవత్పర్వతముచేఁ జుట్టఁబడియున్న యుత్తరదిశకుఁ దఱలెను. వానరయూథపాలుఁడగు వినతుఁడు తూర్పు దిశకుఁ బయనమయ్యెను. వానర యూథనాథుఁడగు మారుతతనయుఁడగు హనుమంతుఁడు తారుఁడు, అంగదుఁడు మొదలగు వానరులతోఁగూడి దక్షిణదిశకేగెను. వానరుల కధిపుఁడును బలవంతుఁడును నగు సుషే

ణుఁడు వరుణునిచే నేలఁబడుచున్నట్టి పడమటిదిశకుఁ బోయెను. ఇట్లు సుగ్రీవుఁడు వానరముఖ్యుల నందఱిని నన్నిదిశలకుఁ బంపి, రామునికార్యము నకై ప్రయత్నపడుటచే సుఖసంతోషములం బొందెను.

అప్పుడు వానరసేనా నాయకులందఱు తమ యేలిక యానతిని గొని, "మేము సీతను దెత్తుము. రావణునిఁ బరిమార్తుము" అని చెప్పుచుఁ దమతమకు నియమించిన దెసలకు వేగిరముగాఁ దఱలిరి. వారి వెంబడించిన వానరులలో నొక్కఁడు "నే నొక్కఁడనే యుద్ధమునకు వచ్చిన యారావణునిఁ జంపెద" ననియు, వేఱొక్కఁడు "నేను రావణుని హింసించి, బడలికచే వడకుచున్న సీతాదేవిని దెచ్చెదను. మీరందఱిక్కడ నిలువుఁడు" అనియు, మఱొక్కఁడు "నే నొక్కఁడనే పాతాళమందున్న దానినైనను సీతాదేవిని దెచ్చెద" ననియు, వేఱొక్కరుఁడు "నేనా సీతాదేవిని దొఱకువఱకుఁ జెట్లను విఱిచెదను. పర్వతములను ద్రోచెదను. భూమి బ్రద్దలు సేసెదను" అనియు "సముద్రములనుగలఁచి వైచెదను. నే నొక్కయోజనము దవ్వైనను ఎగురఁగలను. దీనికి సంశయము వలదు" అని యొక్కఁడును, "నేను నూఱుయోజనముల దవ్వునకంటె నెక్కువ దూరమైనను దాఁటఁగలను" అని యొక్కరుఁడును, "నాకు భూతలమునను, సముద్రములందును, కొండలందును, వనములందును, పాతాళమునందును నడ్డులేదు" అని వేఱొక్కఁడును దమ రాజునెదుట బలగర్వితులై పొగడ్తలఁ జేసికొని, యందఱు తఱలి, యఱచుచుఁ, గేకలిడుచు, నుఱుముమాడ్కి నుఱుముచు, సింహనాదంబులు సేయుచు, దుముకుచు, వికారంపుఁ గూఁతలు కూయుచుఁ బరువులిడుచుఁ బయనమై పోయిరి.

## 46-వ సర్గము

### సుగ్రీవుఁడు తనభూలోకపరిజ్ఞానమునకుఁ గారణముఁ దెల్పుట

వానరాధిపులందఱు దఱలఁగా, రాముఁడు సుగ్రీవుఁ జూచి, "నీవెట్లు భూమండల మెల్ల నెఱుఁగుదువు చెప్పుము" అని యడుగఁగా, సుగ్రీవుఁడు రాముని మ్రొక్కి యిట్లనియె. "ఓ నరశ్రేష్ఠా! సంగతియంతయు విస్తరించిచెప్పెదను వినుము. తొల్లి మహిషరూపుఁ డగు దుందుభిపుత్త్రుఁడయిన మాయావియను రాక్షసుఁడు వాలితోఁ

బోరాడవచ్చినప్పుడు, వాలి యా రాక్షసుని మలయపర్వతమువఱకుఁ దఱిమెను. అప్పు డాతఁడు వెఱచి యొక గుహాయందుఁ బ్రవేశించెను. వాలియు నా మాయావిని సంహరింపఁగోరి యా గుహాలోపలికిఁ దానును బ్రవేశించెను. అప్పుడు మాయన్న విధేయుఁడనైన నన్నా గుహాముఖమునఁ గావలిపెట్టెను. అట్లు నే నొక్కసంవత్సరము నిండు వఱకుఁ గావలియుంటిని. వాలి యొక్కయేఁడు గడచినను రాఁడయ్యె. అప్పు డాగుహ రక్తప్రవాహముచే నిండఁగా, నేను భయంపడి, యన్న కేమి హాని గలిగెనో యన్న శోకముచే నొచ్చినవాఁడనై, కడపట మా యన్న తప్పక మృతినొందెనని యెంచి, మహిషరూపుఁడగు మాయావి, వెలుపటికి రాఁజాలక లోపలనే మడియునుగాక యను తలంపుతోఁ బర్వతంబుఁ బోలు నొక్క బండ నాగుహకడ్డముగా వేసితిని. అంత మాయన్న ప్రాణములం దాశమానినవాఁడనై, కిష్కింధకు మఱలి వచ్చి, గొప్ప రాజ్యమును బడసి, రుమను దారను గూడి సుఖముంటిని. ఏనును మిత్రులంగూడి సుఖముననుండఁగా, వాలి యా రాక్షస శ్రేష్ఠుని సంహరించి, యిక్కడి కేతెంచెను. నేనును బెద్దవాఁడన్న గౌర వముచేతను, యేమిచేయునోయన్న భయముచేతను రాజ్యము నొసఁగి తిని. అయినను, వాలి కలవరపాటునొందినవాఁడై, తనకు నేను ద్రోహంబుచేసితినని తలఁచి, నన్నుఁ దఱిమెను. వాలి నన్నట్లు తఱు మఁగా, నే నెందును శరణుగానక, సపరివారుఁడనై పెక్కునదులను, వనములను, పట్టనములను జూచుచుఁ బరుగెత్తితిని. అప్పుడు నా కీ పుడమియెల్ల నావుపాదము మోపునంతటిదిగానై, యద్దమువలెను, కొఱవిచక్రమువలెను జక్కఁగాఁ జూడ వీలుగలిగెను. మొదటఁ దూర్పుదిశకేగి, పెక్కు వృక్షములను, మనోహరములైన పలు పర్వ తములను, నదులను, చెఱువులను జూచితిని. ఆ దిక్కుననే గైరికాది ధాతువులచే నలంకరింపఁబడిన యుదయపర్వతంబును, ఎల్లప్పుడు నప్స రసల కునికిపట్టయిన పాల్కడలిని జూచితిని. అచ్చటికిని వాలి నన్నుఁ దఱుముకొని వచ్చుటచే, త్వరగా వెనుకకు మఱలి, మఱియొక పార్శ్వ మునకు మఱలితిని. అచ్చటికిని నన్నుఁ దఱుముచు వచ్చినందుచే నా తూర్పుదిక్కునుండి మఱలి, వింధ్యవనములతోఁ గూడినదియు, చందనవృక్షములచే శోభిల్లునదియునైన దక్షిణదిశకు మఱలితిని.

అచ్చోటి పర్వతములను వనములను పట్టనములను జూచుచు నచ్చోటికిని వాలి దఱుముచువచ్చినందునఁ బడమటిదిక్కునకు మఱలితి. అచ్చోట నస్తమయపర్వతమువఱకుఁగల దేశములను, అస్తమానపర్వతమును జూచుచుఁ బోఁగా, వాలి యచ్చోటికిని నన్నుఁ దఱుముకొనుచు వచ్చెను. అంత నుత్తరదిక్కునకు మఱలి, హిమవన్మేరు పర్వతములను, ఉత్తర సముద్రమును జూచితిని. అచ్చోటికిని వాలి దఱుముకొనిరాఁగా నిఁక నెందును బోలేక తత్తరపడి యిఁక నేమి చేయుదునని దిగ్భ్రమ నొందితిని. సమయోచిత స్ఫురణగల హనుమంతుఁడు "వానరాధిపా! యేల యిట్లు పరుగెత్తెదవు? తొల్లి మతంగమహర్షి తన యాశ్రమము లోపల రాఁగూడదని వాలికి శాపం బొసఁగెనుగదా! వాఁ డచ్చోటఁ బ్రవేశించునేని వానితల నూఱుప్రయ్యలుగాఁగలదు. కావున మన మచ్చట నిర్విచారముగా నుండఁగలము" అని నాతోఁ జెప్పఁగా, నది మొదలు నేనీ మతంగాశ్రమమున నున్నాను. వాలియు శాపభయము వలన నిచ్చటికి రాకయుండెను. నృపాలా! నేనిట్లు మొదట భూమండల మెల్లఁ బ్రత్యక్షముగాఁ దిలకించి యావల నీగుహాలో వాసముచేయు చుంటిని" అని రామునితోఁ జెప్పెను.

## 47-వ సర్గము

**తూర్పు, పడమర, దక్షిణదిశలకు బోయిన వానరవీరులు మఱలుట**

వానరసేనానాయకు లందఱు సుగ్రీవుని యాజ్ఞను శిరసా వహించినవారలై, సీతను వెదకుటకై వారివారి కేర్పఱచిన దిశలకు శీఘ్రముగాఁబోయి, చెఱువులను. ఏళ్ళను, పొదలను, ఆకసమును, నగరములను, కోటలను, కొండలను గలయఁ జూడసాగిరి. వారు పగ లెల్ల నన్నిఋతువుల ఫలములతోను, పుష్పములతోను గూడి యొప్పు చున్న సకలదేశములందలి వనములను వెదకుచు రాత్రులందుఁ జక్కఁగాఁ బండిన చెట్లమీఁదఁ బరుండుచు వచ్చిరి. వానరవీరు లెల్లరు సుగ్రీవునియొద్ద సెలవుగైకొన్నది మొదలు లొకనెల పూర్తిగా వెదకి సీతనుగానక, యాశ నిరాశచేసికొన్నవారలై ప్రస్రవణపర్వతమునకు మఱలివచ్చిరి. మహాబలుఁడగు వినతుఁడు సేనలతోఁగూడి తూర్పు దిక్కెల్ల వెదకి, యాదిక్కున సీతాదేవిని గానకవచ్చెను. ఉత్తరదిక్కు

నకుఁ బోయియుండిన శతవలియు నచ్చట నామెను సేనాసమేతుఁడై వెదకియుఁ గానక వచ్చెను. సుషేణుఁడును వానరసైన్యముతోఁ గూడి, పడమటిదిక్కునందెల్ల వెదకియు నామెను గానక నెల పూర్తికాఁగా సుగ్రీవునికడ కేగుదెంచెను. వారందఱువచ్చి, ప్రస్రవణపర్వతమున రామునితోఁగూడఁ గూర్చుండియున్న సుగ్రీవునిఁజేరి, మ్రొక్కులిడి, "యో వానరేంద్రా! మేము తమయానతిచొప్పునఁ బర్వతములన్నియు, చొఱరాని యడవులన్నియు, నదులన్నియు, దేశములన్నియు, తమరు చెప్పిన గుహలన్నియు, తీఁగెల జొంపములతో దట్టములైయున్న గొప్ప పొదలన్నియు వెదకితిమి. ప్రవేశింపరాని దేశములందును, ఎక్కరాని కోటలందును గొప్పదేహములు గలప్రాణుల నడిగితిమి. వారినెల్ల సంహరించితిమి. అయినను సీతాదేవి మాత్రము కనఁబడ దయ్యెనని చెప్పిరి. గొప్ప నడతయు, సత్కులప్రసూతియుఁగల బుద్ధిమంతుఁడగు సుగ్రీవుఁడు, సీతాదేవి యేదిశకుఁ బోయినదో, యాదిశకు హనుమంతుఁడుపోయియున్నాఁడని తనలోఁ దలఁచెను.

## 48-వ స ర్గ ము

### హనుమంతుఁడు సీతను వెదకఁ బోవుట

ఆ హనుమంతుఁడు తారాంగదులు మొదలగువారితోఁ గూడినవాఁడై, సుగ్రీవుఁ డానతియొసఁగిన చొప్పున దక్షిణదిశకుఁ దఱలెను. అట్లతఁ డా వానరవీరులను తోడ్కొని, కడుదవ్వేగి, వింధ్యపర్వతము చేరి, యాపర్వతమునందలి గుహలను, అడవులను, కొండకోనలను, ఏళ్ళను, దుర్గములను, కొలఁకులను, విశాలవృక్షములను, తోఁపులను, దట్టమగుచెట్లుగల పెక్కుతిప్పలను వెదకెను. ఆవానరులు ఆదిశయందంతటను సీతాదేవినివెదకియుఁ గానరైరి. పగతురకు గెల్వనలవికాని యా వానరులు సీతను వెదకుచు, నచ్చటచ్చటనున్న దుంపలను, నానావిధములగు పండ్లను దినుచు నచ్చటచ్చట విశ్రమించిరి. ఆ వింధ్యాద్రి ప్రాంతము పెక్కుగుహలును, అరణ్యములును గలదినై గొప్పదిగానుండుటవలన వెదక నలవిగాకయుండెను. ఎవరికిని వెరవని వానరవీరులందఱు నట్టియడవులనెల్ల వెదకి, కడు నలసినవారలై, జనరహితమును, నీళ్ళులేనిదియు, శూన్యమునైనందుచేఁ జొఱరానిదై గగ్గురు

పాటు పుట్టించునదియు, దాటనలవిగానిదియునైన మఱియొక్క దేశము నకుఁ బోయిరి. ఆదేశముననున్న చెట్లాకులుం బూవులులేనివై కాయలు కాయకయుండును. నదులు నీరింకియుండును. దుంపలు గడ్డలు దొర కుట కడు నరిది. దున్నలు, జింకలు, ఏనుఁగులు, పులులు మొదలగు మృగములును, పక్షులును, తక్కుంగల వనసంచారులగు పశుపక్ష్యాదు లును అచ్చటలేవు. చెట్లును, ఓషధులును లేవు. తీఁగలును లేవు. తీఁగెలజొంపములును లేవు. మెట్టదామరతీఁగలు సునుపయినయాకులు, విరిసినపుష్పములుంగలవై, నెత్తావులుచిమ్ముచుఁ జూడఁదగినవిగానున్నను, తుమ్మెదలు లేకుండినవి.

సత్యవాదియు, తపస్సే ధనముగాఁగలవాఁడును, మహామహిమ గలవాఁడును, నియమములచేఁ జేరుపకువచ్చుటకుఁ గూడఁ దగనివాఁ డునై, యోర్వరాని కోపముగలవాఁడగు కండువను మహాముని యొక్కరుఁ డచ్చట నుండెను. ఆతనికొడు కొక్కఁడు పదునాఱేండ్ల వాఁ డా యరణ్యమున బ్రవేశించి కానరాక యందే నశించిపోయెను. అమ్మహాముని యా కాననముపై నలిగినవాఁడై, యీ వనమంతయు మృగపక్షులులేనిదై, యొక్కరికిఁ బ్రాపుగాక, చొఱనలవిగానిదై పాడు పడిపోవునుగాక యని శపించెను. ఆ వానరసైనికు లంద ఱా పాడు పడిన యడవిప్రాంతములను, నదులయుత్పత్తులను, పర్వతగుహలను సుగ్రీవుని మెప్పువడయఁగోరి, సీతాదేవిని, సీత నపహరించినరావణుని వెదకిరిగాని వారిని గానరైరి. తరువాత నా వానరవీరులు తీఁగెల జొంపములచే నిండిన ప్రసిద్ధమగు భీకరమయిన యొక యడవిం జొచ్చి, యచ్చటఁ గ్రూరంపుఁబనులు సేయువాఁడును, దేవతలకుఁగూడ వెఱవని వాఁడునైన యొక రాక్షసునిఁ జూచిరి. వానరులందఱు మఱియొక్క పర్వతమో యనఁదగియున్న యా యసురునిఁజూచి, యందఱును దట్టి బిగించికట్టిరి. బలవంతుఁడగు నా యసురుఁడు పర్వతములంబోలు నవ్వానరవీరుల నందఱం జూచి, "ఇదిగో చచ్చితిరి మీరంద ఱిప్పుడు" అని పలికి యార్భాటముతో గట్టి పిడికిలిపట్టి యెత్తి వారిపైకి దుముకఁ బోయెను. అట్లు వచ్చునట్టి యా యసురునిఁజూచి యతఁడు రావణుఁ డని యెంచి యంగదుఁడు వానిఱొమ్మునఁ బిడికిటితోఁ గ్రుమ్మెను. ఆ యసురుఁడు వాలిపుత్త్రుని చేతిగ్రుద్దు దిని నోట నెత్తురుగ్రక్కుచు, పర్వ

తము క్రిందఁ ద్రోయఁబడి కూలినట్లు పుడమిని గూలెను. ఆ యసురుఁ డూపిరివిడిచినంతటనె యా వానరులందఱు జయశాలురై, యాకొండ గుహాయందంతటను బలుమారు చక్కఁగా వెదకిరి. అవనమున వెద కియు, సీతను గానక, వానరవీరులు భయంకరమైన మఱియొక పర్వత గుహను జొచ్చి, యచ్చటను మాటిమాటికి వెదకియుఁ గానక, యంద ఱొక్క యేకతమగు చెట్టుమొదటఁ గూర్చుండి, వగలపాలై యుండిరి.

## 49-వ సర్గము

### ఆంగదుఁడు వారలను ప్రేరణచేయుట

అటుతరువాత గొప్పవివేకవంతుఁడగు నంగదుఁడు మిక్కిలి యల సటనొందినవాఁడయినను, ఊరటదెచ్చుకొని, యా వానరుల నందఱ నూఱడించి తిన్నగా నిట్లనెను: "ఓ వానరవీరులారా, మనము వన ములు, కొండలు, కోటలు, కొండచఱియలు, పర్వతగుహలును అంత టను వెదకితిమి. అచ్చట నెక్కడేని నొక్కచోటనైన నాసీత గానరాదు. వేల్పుటన్నువలంబోలు నా సీత నపహరించిన యారాక్షసుఁడును గానఁ బడఁడు. మనగడువుకాలము చాలవఱకుఁ జెల్లినది. సుగ్రీవుఁ డన్ననో క్రూరముగా దండనచేయువాఁడు. కావున మీరందఱుఁగూడి యంతట సీతను వెదకుఁడు. మీరు సోమరితనమును, చింతను, వచ్చుచుండెడి నిద్రను విడిచి, యా జానకిని పరిశోధించి వెదకి కనుఁగొనవలెను. విసుగు లేకుండుటయు, పట్టుదలయు, మనస్సుయొక్క నిలుకడయుఁ, గార్యాను కూలతయుఁ జేయునవియని పెద్దలందురు గాఁబట్టి, నేను మీతో నిట్లు చెప్పితిని. ఇప్పటికీ మీరు విచారముమాని యాయా వనములందు సీతను వెదకుఁడు. విడువక చేయునట్టి పని కెన్నఁటికైనను సిద్ధిగాక మానదు. వగచినది చాలును. మన మిట్లు సోమరులమైయుండుట యుక్తముగాదు. వానరరాజగు సుగ్రీవుఁ డోర్వరాని కోపముగల వాఁడు; కఠినముగ దండించును. కావున నతనికిని మహాత్ముఁడయిన రామునికిని మనము వెఱచి వారియాజ్ఞను నడచుకొనవలయును. లేనిచో వారు మనలను వధింతురు. నే నిప్పుడు మీ మేలుగోరి యీ మాట పలికితిని. మీకిది యుక్తముగాఁ దోఁచిన నట్లు చేయుఁడు. లేనిచో మనకందఱ కేది యుక్తమనితోఁచెడి దానిం జెప్పుఁడు!"

అని యంగదుఁడు చెప్పినమాటను విని, గంధమాదనుఁడను వానరుఁడు దప్పిచేతను దారియలసటచేతను మాటలు దొట్రుపడుచుండఁ జిన్నగొంతుతో "వానరులారా! యంగదుఁడు చెప్పినమాట మీకందఱకుఁ దగియున్నది; మేలయినది; అనుకూలమైనది. కావున నీతని మాటప్రకారము సేయవలయును. మనము మఱలఁ బర్వతములు, గుహలు, బిలములు, జనరహితవనములు, సెలయేళ్ళు వెదకుదము. సుగ్రీవమహారాజు చెప్పినచొప్పున నందఱముగూడి పర్వతములందలి దుర్గములందు వెదకుదము" అని చెప్పెను.

ఆ బలవంతులగు వానరులందఱు మఱల లేచి, దక్షిణదిక్కునందే వింధ్య పర్వతారణ్యములందుఁ దిరుగుచు, శరత్కాలమేఘము మాడ్కిఁ దెల్లనైనదియు, వెలుఁగుగలదియు, శిఖరములుగలిగి, గుహలతోఁగూడియున్నదియు వింధ్యపర్వతములోని యొకభాగమగు రజతపర్వతమునెక్కి, యచ్చట చక్కనైన యాడుగుపైరునందును, ఏడాకుల యరఁటితోఁపులందును సీతాదేవిని వెదకిరి. విస్తారమగు శౌర్యముగల వారగు వానరు లలఁతచెందినవారలయ్యు నా పర్వతాగ్రమునెక్కి రాముని కనుఁగుపట్టుపుదేవియగు సీతను వెదకిరి. వా రట్లు వింధ్యపర్వతంపు గుహలయం దన్నింటను గలయఁజూచియు సీత యగుపడనందున నచ్చటనుండి దిగి, మిక్కిలి డస్సినవారయినందునఁ బ్రజ్ఞదప్పి, కొంత తడవు నిలిచియుండి, యొకచెట్టుక్రింద విడిసిరి. హనుమంతుఁడు మొదలగు వానరోత్తము లట్లు ముహూర్తకాల మూఱట నొంది, కొంచెము నేద దీర్చుకొని, మఱలఁ బూనికతో నా దక్షిణదిశనే వెదక నారంభించి, యావింధ్యపర్వతమునే మొదటనుండి కడవఱకు నచ్చటచ్చట ప్రదేశములనెల్ల వెదకిరి.

## 50-వ సర్గము

### హనుమదాదులు సీతాదేవిని వెదకుట

హనుమంతుఁడు తారాంగదులతోఁ గూడినవాఁడై వింధ్యపర్వతమందలి గుహాలయమందును, అడవులందును, సింహశార్దూలాదు లుండెడి యెగుడుదిగుడుగానున్న ప్రదేశములందును, గొప్పసెలయేళ్ళయందును నుండెడు నదులను, బండలను వెదకుచు నా పర్వతముయొక్క

నిర్భృతిమూలయందున్న శిఖరమును జేరి యచ్చటనే చాలకాలము గడఁపిరి. పెక్కు గుహలు, అడవులుగలది యగుటచేత నాదేశము వెదకుట కలవికాకయుండెను. అట్టి యాపర్వతంపు నిర్భృతిమూల నొండొరులకు జేరువనే యొండొరులుగూడి వెదకిరి. హనుమంతునివెంబడివచ్చిన గజ, గవాక్ష, గవయ, శరభ, గంధమాదన, మైంద, ద్వివిద, సుషేణ, నళ, జాంబవంతులును, యువరాజగు నంగదుఁడును, తారుఁడును దక్షిణ దిశయందుఁ గొండలతో నిండియున్న దేశములను వెదకి యావల నచ్చట విశాలమైన యొకగుహను జూచిరి.

దానికిఁ జేరువ ఋక్షబిలమను పేరుగల యొక్క గుహ యున్నది. అయ్యది మయుఁడను రాక్షసునిచేఁ గాపాడఁబడుచుండు. అ వానరవీరు లాఁకలిదప్పులచేఁ జుట్టఁబడినవారును, అలసినవారు నైనందున నీరు ద్రావఁగోరినవారయి, తీఁగెలజొంపములతో నిండిన యా బిలమును గాంచిరి. ఆ బిలమునుండి క్రౌంచ, సారస, చక్రవాక పక్షులు నీటిచేఁ దడసినవియు, పద్మములపుప్పొళ్లు తగులుటచే నెఱ్ఱనైన యొడళ్లతోఁ గూడినవియునై వెడలినవి. హనుమంతుఁడు మొదలగు వానరశ్రేష్ఠులందఱు కష్టనితావిగలిగి, చొర నలవికాక యున్న యమ్మహాబిలమునుగాంచి, యెక్కున యానందము నొందిరి. అంతటఁ దేజోవంతులయిన వానరోత్తములు పలువిధంబులైన జంతువులతోఁ గూడియు, పాతాళమును బోలియు, చూడనలవికాకయు, నే వైపునను జొఱ నలవికాకయుఁ గడు భయంకరమైయున్న యా సొరంగమును జూచి, యిది యెవరిదో, పాతాళలోకమో, లేక రాక్షసమాయయో యని సంశయించి యా బిలమును జేరుటకు వెఱచిరి.

అప్పుడు కాననములను వనదుర్గములను జక్కఁగా నెఱిఁగినవాఁడు, పర్వతశిఖరముఁబోలువాఁడు నైన వాయునందనుఁడగు హనుమంతుఁడు వానరులనతడఱిని జూచి, "మనము దక్షిణదిక్కున పర్వతములగుంపుచేఁ జుట్టఁబడిన యన్ని దేశములను వెదకి వేసారితిమిగాని యా మైథిలిం జూడమైతిమి. ఈ బిలమునుండి హంసములు, క్రౌంచపక్షులు, సారసపక్షులు, చక్రవాక పక్షులు నీటఁదడిసిన యెఱకలతోఁ గూడి యన్నివైపులనుండి వెడలుచున్నవి. తప్పక యిచ్చట నీటితో నిండిన యొక బావియో, లేక గుంటయో యుండి తీరవలెను. దానికి

సూచనగా నీ బిలద్వారమున నున్న యీ వృక్షములు పచ్చనై వెలుఁగుచున్నవి” అని చెప్పఁగా, వానరులందఱు చంద్ర సూర్య సంచారములేమింజేసి చీఁకటిచే నిండినదై భయము గల్గించుచుండు నాబిలమునుండి సింహములు, మఱి యాయా మృగంబులు, పక్షులును వెలువడుటంజూచి, యిది యేదియో కనుఁగొందమని యా సొరంగములోపలఁ బ్రవేశించిరి. వారి కాగుహయందు, గన్నులు కానిపింప వయ్యె. తేజస్సును, శౌర్యమును, నడఁగెను. వారు వాయువుంబోలె మిట్టపల్లములు దెలియక యిచ్చవచ్చినట్లెల్లఁ బోయిరి. ఆవానరోత్తము లట్లు పోయిపోయి, సౌందర్యముతో వెలుఁగుచున్న యుత్తమదేశము నకుఁ బోవుదారింబడి, సకలవృక్షములతో నిండి, చోఁటు నలవికాక యున్న యా దేశమున నవ్వానరశ్రేష్ఠు లొండొరులచేతులు పట్టుకొని యామడదూరము పోయిరి. అటుపై వారు పోఁజాలక దప్పిగొని, నీరుగానక, మైమఱచి తొట్రుపాటుపడుచున్నను, గొంతతడవు సోమరితనంబులేక యాబిలంబునఁ దిరిగిరి. అట్లు ఆ వానరులు చీఁకటియందుఁ దిరుగుచు నీరువట్టుచేఁ జిక్కి మోమున దీనభావము దోఁప నలసట హెచ్చఁగాఁ బ్రాణములం దాశవిడిచినవారలై వగచుచుఁ గొంతసేపటికి నొక వెలుతురుం జూచిరి.

ఆ హరిశ్రేష్ఠులు చీఁకటిలేక యందమై యొప్పుచుండు నా దేశమునుబొంది, మండుచున్న యగ్నిహోత్రుంబోలు వెలుఁగుగలవియు, పసిఁడివన్నెగలవియునైన మద్దిచెట్లను, త్రాటిచెట్లను, పొన్నచెట్లను, ఏఱుమద్దిచెట్లను, అశోకవృక్షములను, చంద్రచెట్లను, సంపంగిచెట్లను, నాగకేసరవృక్షములను, చక్కఁగా విరిసిన కొండగోఁగుచెట్లను, పలువన్నెలుగల బంగారుగంట పూలగుత్తులను, ఎఱ్ఱని చిగుళ్ళను, కొనలును, తీఁగెలునుగల్గి, బంగారు భూషణములచె నలంకరింపఁబడినవై బాలసూర్యునివలె వెలుఁగుచు, వైడూర్యమణులతోఁ గట్టఁబడిన తిన్నెలుగలిగి, మిక్కిలి తేజరిల్లుచున్న పసిఁడిమ్రాఁకులను, నీలవైడూర్యమణులకాంతిగలిగి, పక్షులతో నిండి, బాలార్కసదృశద్యుతిగల గొప్ప పసిఁడితామరపువ్వులచే వెలుఁగుచు, సువర్ణస్వరూపములగు గొప్పచేపలును, తాఁబేళ్ళను గలిగి, తేటనీటితోఁ గూడియున్న కొలంకులను, బంగారు గవాక్షములు గలవియు, ముత్యాలజాలరములచే

నలంకరింపఁబడినవియు నైన బంగారు వెండి విమానములను, సువర్ణ రజత మయమయిన నేలలతోఁగూడి, పచ్చలు చెక్కియున్న యుత్తమగృహము లను, పుష్పఫలములతోఁ గూడినవైన పగడపువన్నెగల వృక్షములను, బంగారపుఁ దుమ్మెదలను, పూఁదేనియలను, రత్నములు చెక్కిన బం గారుమంచములను, పీటలను, ఉత్తమవాహనములను, బంగారు వెండి కంచుపాత్రల రాసులను, మేలిమివాసనగల యగురుచందనముల రాసు లను, చక్కఁగాఁ బండి తినఁదగియున్న ఫలమూలములను, ఉత్తమపాన ద్రవ్యములను, తీపిగల మద్యములను, మిగుల విలువగల మేటివలు వలరాసులను, అచ్చటచ్చటఁబడినవై యగ్నిహోత్రునిమాడ్కిఁ దేజరిల్లు చొక్కపు బంగారురాసులను జూచుచు, నా బిలమున నచ్చటచ్చట సీతాదేవిని వెదకుచు సమీపమున నొక్క తాపసాంగనను గాంచిరి. ఆ తాపసి నారబట్టలను గట్టి, కృష్ణాజినమును గప్పుకొన్నదై, యాహార నియమము గలిగి, తపస్సుచేయుచుఁ దనతపోమహిమచే వెలుఁగు చుండుటనుజూచి యా వానరులందఱు మిక్కిలి భయముచే నులికిపడి వెఱఁగుపాటుతో నచ్చటనే నిలిచిరి. అంతఁ బర్వతమునంబోలు హను మంతుఁడా తాపసిని జూచి, చేతులుమోడ్చి మ్రొక్కి "నీ వెవతెవు? ఈ బిలమెవనిది? ఈ గృహ మెవ్వనిది? ఈ రత్నము లెవ్వనివి? మాకుఁ జెప్పు" మని యా తాపసి నడిగెను.

## ౕ51-వ సర్గము

హనుమంతుఁడొకతాపసితో మాటలాడుట

హనుమంతుఁడు కృష్ణాజినముదాల్చినదియు, పుణ్యకార్యములు చేయునదియు, తపస్సుచేయునదియు నైన యా యంగన నవ్విధమున నడిగి, మఱల నావిడఁగూర్చి, "ఓ మహాత్మురాలా! మేము చాల దవ్వు నడచి నడచి యాఁకలిదప్పులచే మిక్కిలి నొచ్చినవారమై, యిం దున జల ముండు నని యెంచి యంధకారబంధురమైయున్న యీ బిల మునఁ జొచ్చితిమి. మాకు నీరువట్టు హెచ్చైయున్నందున నీబిలమున నెచ్చటనైన నీరు దొరకఁగలదని యెంచి యీ బిలము నొచ్చితిమి. ఇచ్చట వింతవింతలై యున్న వస్తువులనుజూచి, మేము మిక్కిలి వ్యస నమునొంది, తొట్రుపాటునొంది, సొలితిమి. బాలసూర్యునింబోలె

వెలుఁగునవి, నెత్తావియు, పూవులు పండ్లును గలవియునైన బంగారు వృక్షములును, పరిశుద్ధములై తినఁదగియున్న ఫలమూలములును, బంగారుకిటికీలును, రతనాలతెఱలును గలిగియున్న బంగారు వెండి విమానములును హారములును నెవ్వనివి? ఎవనితేజస్సుచే నీ వృక్షములును నిర్మలోదకమునఁబుట్టిన పద్మములును బంగారుమయములై యున్నవి ? ఎట్లు మత్స్యములు, తాఁబేళ్ళును బంగారువన్నెగలిగి యున్నవి ? ఇవి నీ ప్రభావముచేతనా ? లేక, మఱియెవ్వరితపః ప్రభావముచేతనా? మాకుఁ దెలియక యడుగుచున్నాము గావున, నీవు మా కీ సంగతియెల్ల వివరించి చెప్పుము" అనవుడుఁ బుణ్యకార్యములు సేయునదియు, సర్వభూతములకు మేలుసేయునదియునైన యా తాపసి హనుమంతునితో నిట్లనియె:

"పూర్వము మహాప్రతాపవంతుఁడును, తంత్రశాలియునైన మయుఁడను పేరుగల రాక్షసశ్రేష్ఠుఁ డొక్కరుఁ డుండెను. ఆతఁ డీ వనము నంతయుఁ దనతంత్రముచే బంగారుమయముగ నిర్మించెను. తొల్లి మయుండు దానవశ్రేష్ఠులకెల్ల వడ్రంగియై యుండెను. ఈ దివ్యమైన బంగారపుమేడను మయుండు నిర్మించెను. ఆ మయుఁ డీ మహావనమున వేలకొలఁది సంవత్సరములు తపస్సుగావించి, బ్రహ్మదేవునివలన శుక్రునికి సంబంధించిన యా వర్ధనమును దనకుఁ దెలియునట్లు వరముఁ బొందెను. అట్లతఁడు బ్రహ్మవలన వరముఁ బడసి యీవనము నిర్మించి యందఱు కోరుకొను ధనము నొందుచుఁ గొంతకాల మీవనమున సౌఖ్యముతో నుండెను. ఆ యసురవరుఁడు హేమయను నప్సరసయందుఁ దగులుగలిగియున్నాఁడని యెఱిఁగినవాఁడై, దేవేంద్రుఁడు కినుకపూని వజ్రాయుధముఁ బ్రయోగించి యామయుని గొట్టెను. మయుఁ డీవనము విడిచినతర్వాతఁ బితామహుఁ డీ యుత్తమవనమును, నిత్యానుభవయోగ్యపదార్థములను, సువర్ణవికారమయిన యీగృహమును హేమ కొసఁగెను. వానరోత్తమా! ఏను మేరుసావర్ణియొక్క కూఁతురను; స్వయంప్రభ యనుదానను. నే నా హేమకుఁ జెలికత్తెనై దానియింటిని గావలికాచియుందును. హేమ నా కనుఁగుఁజెలికత్తె. నాట్యమునందును, పాటయందును నేర్పుకత్తె. నే నామెవలన నొరుల్లకుఁ దిరస్కరింప నలవికాక యుండునట్లు వరముఁ

బడసినదానను గాన, ఈ దివ్యభవనమును గాపాడుచుందును. వానరులారా ! మీ రేమిపనిపడి యిచ్చటికి వచ్చితిరి ? ఏల యడవులఁ గ్రుమ్మరుచుఁ జూచుచున్నారు? చొరనలవి కాని యీవనము నెట్లు మీరు కాంచఁగల్గితిరి? ఈభక్షణీయములైన కందమూలఫలములను భక్షించి, నీరుద్రావి, మీసంగతి యావత్తును విస్తరించి చెప్పుడు" అని యా తాపసి హనుమంతు నడిగెను.

## 52-వ స ర్గ ము

**హనుమంతుఁడు స్వయంప్రభకుఁ బ్రత్యుత్తర మొసఁగుట**

ఏకాగ్రతగలదై పుణ్యపుఁబనులు సేసెడి యాతాపసి బలిమిగల యావానరశ్రేష్ఠుల నందఱను జూచి, "వానరులారా ! పండ్లుదినుటవలన మీదారిబడలిక దీరియుండెనేని, మీరాకకుఁ గారణము నాచే వినఁదగియుండెనేని వచింపుఁడు. నేను వినఁగోరెదను" అనఁగా, వాయునందనుఁడగు హనుమంతుఁ డత్తాపసియొక్క పలుకులు విని, కపటము లేకయున్నది యున్నట్లు చెప్పఁబూనెను.

సకలలోకములకు రాజును, పరాక్రమమున నింద్రుని, శాంతము నందు వరుణునిఁబోలినవాఁడును, సౌందర్యవంతుఁడును నైన రాముఁడు తమ్ముఁడగు లక్ష్మణునితోను, భార్యయగు వైదేహితోనుగూడి దండకావనముఁ బ్రవేశించెను. వారు జనస్థానముననుండఁగా, రామలక్ష్మణులు దగ్గఱ లేనప్పుడు రావణుఁడను నసురుఁడు సీతాదేవిని బలవంతముగా నెత్తికొనిపోయెను. ఆ రామునికి సుగ్రీవుఁ డను వానరుఁ డొక్కఁడు స్నేహితుఁడుగలఁడు. ఆతఁడు వానరులకెల్ల రాజు. ఆసీతాదేవిని వెదకుటకై యగస్త్యమహాముని చరించినదియు, యమునికాపురదలలోనుండు నదియు నైన దక్షిణదిశకు మమ్ముఁబంపి, "ఓ హనుమంతుఁడా ! భయంకరులగు నంగదుఁడు మున్నగు వానరులతోఁగూడి, కామరూపుఁడగు రావణాసురుని, సీతాదేవిని వెదకుము" అనిచెప్పెను. మేమందఱము దక్షిణపుదిక్కెల్ల సంచరించి యీఁకిలిచేఁ డస్సి యొక్క చెట్టుక్రిందఁ జేరితిమి. మేము మోముల విన్నదనము దోఁపఁ జింతయె ప్రధానముగాఁ గొని, చింత యను గొప్పకడలియందు మునిఁగి, యాఫలిగట్టు దొరకక శ్రమపడితిమి. అప్పుడు మేము నలుదెసలఁ దేఱి పాఱఁజూచి,

తీఁగెలజొంపములతోను, వృక్షములతోను గప్పఁబడి, యంధకార బంధురమైయున్న యీబిలముఁ బొడఁగాంచితిమి. ఈబిలమునుండి రాయంచలు, కొక్కెరలు, సారసములు మొదలగుపక్షులు నీట మునిఁగి, తమరెక్కలనుండి నీరు విదిలించుచు వెడలుటఁజూచి, యీబిలమునఁ గొలఁకున్నట్లున్నది. ఈబిలమునఁ బ్రవేశింతమని నేనుచెప్పితిని, వారును ప్రభువుకార్యము నెఱవేర్చుటయం దాసక్తులై “అట్లె పోదము; ప్రవేశింతము. ఇచ్చట సీతాదేవి యుండునేమో” యని సంశయపడిరి. అంత మే మొకరిచేతుల నొక్కరు పట్టుకొని, చీఁకటిచే దట్టమైయున్న యీ గుహాయందుఁ బ్రవేశించి వేగిరముగా వచ్చితిమి. ఓతాపసీ! యిది మాపని. ఈ పనిని నుద్దేశించి యీదేశమునకు మేము వచ్చితిమి. మేము మిక్కిలి యాఁకలిదప్పులచే డస్సినవారమై నిన్ను శరణుఁజొచ్చితిమి. అతిథుల కొసఁగవలయుమర్యాదతో నీవిచ్చినమూలఫలంబులను క్షుధార్తులమైయున్న మే మెక్కువ యాతురతతో భుజించితిమి. చావనున్న యీ వానరులందఱిని నీవుగాపాడితివి. దీనికి వీరేమి ప్రత్యుపకారము సేయవలయు చెప్పుము” నావుఁడు, సర్వము నెఱిఁగిన యాస్వయంప్రభ యావానరయూథనాథులను జూచి, “బలిష్ఠులగు మీ యొక్క సాహస కృత్యమునకు నేను సంతసించితిని. ధర్మసంపాదనమం దాసక్తురాలనైన నాకు మీ ప్రత్యుపకారముతోఁ గావలసినది లేదు” అని చెప్పెను.

## 53-వ సర్గము

హనుమదాదులు గడువుమించినందుకై చింతించుట

వానరవీరుఁడగు హనుమంతుఁ డివ్విధంబునఁ దాపసిచెప్పిన ధర్మ యుక్తమును హితమునైన పలుకును విని, సత్కార్యము లొనరించునట్టి యాస్వయంప్రభఁ జూచి, “ధర్మము నడపుదానా, మేమందఱము నిన్ను శరణుచొచ్చితిమి. సుగ్రీవుఁడు మాకొక నెల గడువిచ్చెను. మే మీ బిలమునఁ దిరుగుచుండఁగా నొక్కమాసము గడచెను. మేము సుగ్రీవునిమాట మీఱితిమి గావున మస్స్వామి తప్పక సంహరించును. గతాయుష్కులమై, యాతనివలనిభయముచే భీతిలియున్న మమ్ము నీవు గాపాడవలయును. మే మెంతయో గొప్పకార్యము చేయవలసినది యున్నది. ఈ బిలమున నుండినందున నా గొప్పపనిని జేయనైతిమి.

కావున ఓధర్మపరురాలా! నీవు మమ్మీభయంకరమైన గుహనుండి వెలుపలికిఁ జేర్పుము" అని యాస్వయంప్రభను బ్రార్థించెను.

హనుమంతునిమాట విని యాస్వయంప్రభ యాహనుమదాది వానరులంజూచి, "ఓశాఖాచరులారా, యీగుహయందుఁ బ్రవేశించినవాఁడు ప్రాణములతో బయటికి వెడలుట సాధ్యముగాదు. నేను నియమపూర్వకముగా సంపాదించిన తపోబలముచే మిమ్ము నందఱను వెలుపలికిఁ జేర్చెదను. వానరశ్రేష్ఠులారా, మీరు కన్నులు మూసికొనుఁడు. కన్నులుమూసికొనక యీగుహనుండి వెడలుట కెవనికిఁ దరముగాదు" అనిచెప్పఁగా, వానరులందఱు బయటికిఁబోవఁ గోరికతో మెత్తనివ్రేళ్లుగల తమచేతులతోఁ గండ్లు గట్టిగా మూసికొనిరి. వెంటనే యాస్వయంప్రభ యొక నిమిషములోపల వానరుల నందఱిని బిలమునుండి వెలుపలికిఁజేర్చెను. ధర్మమునడచుకొనునట్టి తాపసియగు స్వయంప్రభ, కష్టసాధ్యమైన యాబిలమునుండి యావానరుల నందఱను వెలుపలికిఁజేర్చి, వారి నూఱడించి, "వానరశ్రేష్ఠులారా, పెక్కుచెట్లతోను దీఁగెలతోనుగూడిన వింధ్యపర్వత మిది. ఇది ప్రస్రవణపర్వతము. ఇది మహాసముద్రము చూడుఁడు. మీకందఱకు మేలయ్యెడుఁగాక. పోయి వచ్చెద" ననిపలికి తనగుహలోపలికిఁ జొచ్చెను.

అంత నావానరవీరులు దరిదెలియనిదియు, భీకరములైన యలలతోఁ గూడి వీచుచున్నదియునైన వరుణునియునికిపట్టగు కడలింగాంచిరి. మయుఁడు తనమాయతోఁజేసిన పర్వతబిలమును వెదకుచుండఁగా, వారికి సుగ్రీవుఁ డొసఁగిన గడువుగడచెను. అప్పుడు మహాబలశాలురగు వానరులంద ఱావింధ్యపర్వతమున వసంతఋతువునందుఁ బూఁచునట్టి మామిడి, జువ్వి మొదలగు చెట్లుల్లెల్లఁ బువ్వులబరువుచే ముందఱకు వంగినవై, పెక్కుతీఁగలచేఁ జుట్టఁబడి యుండుటనుజూచి, శిశిరఋతువు పోయి వసంతసమయము సంప్రాప్తమగుచున్నదని యొండొరు లనుకొని, సీతాదేవిని కాంచకపోవుటచే, సుగ్రీవుని యాజ్ఞను గడువును మీఱుటచే మిక్కిలి వెఱచినవారలై స్మృతిదప్పి క్రిందఁబడిరి. అప్పుడు సింహవృషభములమూఁపురములంబోలు మూఁపురములుగలవాఁడును, బలిసిన నిడుపు చేతులుగలవాఁడును, గొప్పబుద్ధిమంతుఁడునగు యువరాజగు నంగదుఁడు తనకంటెఁబెద్దలైనవానరులను, తక్కినవానరుల

నందఱిని నింపుమాటలచేఁ బిలిచి తగుమర్యాదలు సేసి, వారితో నిట్లనెను:

ఓ వానరులారా, మనము వానరేంద్రుఁడయిన సుగ్రీవునియాన తిగ్గైకొని వెడలితిమి. మనము బిలమున నుండఁగా నెల గడచెను. మీకిది యేల తెలియలేదు. మనము మొదట నాశ్వయుజమాసంబు ననే పదునైదుదినంబులు గడవుపెట్టి పంపఁ బడితిమి. అదికాక లక్ష్మణుఁడు కోపపడినతర్వాత మఱలఁ బదిదినములు గడవుపెట్టి పంపఁబడితిమి. ఆవల మార్గశీర్ష మెల్ల గడచె. పుష్యమాసారంభమున నెలకు మఱలవచ్చి చేరున ట్లాజ్ఞాపింపఁబడితిమి. ఆయాజ్ఞప్రకారమే మనము వెడలివచ్చితిమి. ఆ సమయముదాఁటెను. ఇఁక మన మిప్పుడు చేయవలసినపనియేమి? మీరందఱు జ్ఞానవంతులు నీతిమార్గము నెఱిఁగినవారలు. యజమానుని మేలుసేయుటయం దాసక్తిగలవారలు. అన్నిపనులం దెదురులేని వారలు. దెసలందుఁ బ్రసిద్ధికెక్కిన పరాక్రమముగలవారలు. సుగ్రీవుని యాజ్ఞచే నావెంబడి వచ్చినవారలు. మనము మనరాజు నాజ్ఞ మీఱితిమి గావున నిఁకమృతినొందవలసినవారమే. అందుకేమియు సందియములేదు. వానరరాజు నుత్తరువు మీఱినతర్వాత నెవఁడు చావును దప్పించుకొనఁగలఁడు? వానరేంద్రుఁడొసఁగిన గడువుమీఱితిమిగాన మనమిప్పుడు ప్రాయోపవేశముచేయుటయుక్తము. సుగ్రీవుఁడు స్వాభావికముగాఁ గ్రూరుఁడు. ఇప్పుడు తానేరాజైయున్నాఁడు. కావున మనము కార్యమును సాధింపక, గడువునుమీఱి యాతనికడకుఁబోతిమేని తప్పక యాతఁడు మనలఁ బొలియించునుగాని, మనయపరాధము క్షమింపఁడు. మనము గడువుమీఱినను, సీతాదేవిపోవిడి తెలిసికొని పోవుదుమేని, యతఁడు కొంతమన్ననచేసినను చేయవచ్చును. మనము గడువు దప్పి సీతాదేవి వృత్తాంతమును దెలియక పోయితిమేని సుగ్రీవుఁడు తప్పక మనకు వధమునే విధించునుగావున, మనమందఱము భార్యాపుత్రులను, బిడ్డలను, ఇండ్లువాఁకిళ్లను, ధనధాన్యములనువిడిచి యిప్పుడిచటనే ప్రాయోపవేశముచేయుట యుక్తము. మనమిచటినుండి బయలుదేరిపోతిమేని, రాజు మనలను తప్పక వధించును. అన్యాయముగా నాతనిచేతఁ జచ్చుటకంటె నిచ్చటఁజచ్చుటయే మేలు. నాకు సుగ్రీవుఁడు యువరాజపట్టముగట్టఁడయ్యె. ఎంతటికార్యమునయినను శ్రమలేక చేయునట్టిరాముఁడే నాకుఁబట్టాభిషేకము సేసెను. సుగ్రీవుఁడు మొదటనే

నాతో వైరము పూనియున్నాఁడు. నాయెడ స్వల్పాపరాధము గనఁబడె నేని, తప్పక వాఁడోర్వరాని కఠినదండనను జేయును. నేను కిష్కింధా పురమునకుఁబోయి, యచట సుగ్రీవునిచే మరణదండనను బొందిన, నామిత్రులందఱు నన్నుఁగూర్చివిలపింతురు. అట్లు వారిని దుఃఖింపఁ జేయుటచే నేమియుపయోగము? కావునఁ బవిత్రమైన యీసముద్రతీరముననే ప్రాయోపవేశముసేసెదను" అని యనెను.

అంగదుఁడు సెప్పినమాట విని యావానరశ్రేష్ఠులందఱును, "సుగ్రీవుఁడు స్వాభావికముగాఁ గ్రూరుఁడు. రాముఁడన్ననో ప్రియురాలియందు దాసక్తిగలిగియున్నాఁడు. మనము సీతనుగానక చెప్పిన గడువు నకే యాతనిసన్నిధికిఁబోయినను, మనము కార్యముసాధింపకవచ్చినామన్న కోపముచే రామునియిష్టమునకై మనలను దండించును. ఒకవేళ సీతాదేవివృత్తాంతమును దెలిసికొని, సమయముమీఱిపోయినను, మనలను గార్యము సాధించితి మన్న హేతువుచే నేమియుఁజేయకుండును. కావున మన మిప్పుడు తప్పిదమొనర్చి ప్రభువుసమీపమునకుఁ బోవుట యుక్తము గాదు. కావున నిచ్చటనే సీతాదేవిని వెదకిచూచి కాని, సీతాదేవి పోవిడి తెలిసికొని కాని పోతిమేని మన కుగ్రదండనముతప్పినను తప్ప వచ్చును. అట్లుకాక యూరకపోతిమేని, మనలను సుగ్రీవుఁడు యమునివీటికి నంపుట నిజము" అని మిక్కిలి దీనముగాఁ బలుకఁగా, తారుఁడు వెఱపుచేఁ బీడింపఁబడియున్న యా వానరులమాటలను విని, "ఏల మీరిట్లు దిగులుపడెదరు. మీకందఱికి కిష్టమేని, యీగుహాలోఁ బ్రవేశించి సుఖముందము. ఈ బిలము మయుఁడు తనమాయచే నిర్మించినది; చొరరానిది; వృక్షములు, నీరు, ఆహారపదార్థములు, పానీయ ద్రవ్యములును విస్తారముగాఁగలది. ఇచ్చట మనకు దేవేంద్రునలనఁ గాని, రామునివలనఁగాని,సుగ్రీవునివలనఁగాని భయములేదు" అని వానిరులతోఁజెప్పెను. అప్పు డంగదునిమాటను విన్న మఱికొందఱు వానరులును దమకుఁదోఁచిన యభిప్రాయములఁజెప్పి, యెట్లుచేసిన మనకు మృత్యువుసంభవింపదో యట్టిప్రయత్నము వెంటనే చేయుఁడని యందఱుం జెప్పిరి.

54-వ సర్గము

హనుమంతుఁ డంగదునకు హితముసెప్పుట

చంద్రునింబోలు కాంతిగలతారుఁ డామాటచెప్పఁగా విని, హనుమంతుఁడు సుగ్రీవునిరాజ్య మంగదునిచే హరింపఁబడినదేయనియు, అంగదుఁ డెనిమిదివిధంబులగుబుద్ధియు, చతుర్విధమగు బలమును, పదునాలుగువిధములైన సుగుణములును గలవాఁడని దలఁచి ఎల్లప్పుడు విడువనితేజస్సు, బలము, పరాక్రమము గలవాఁడును, శుక్లపక్షారంభమునాఁటి చంద్రునికైవడిఁ గాంతిచే వెలుఁగువాఁడును, బుద్ధియందు బృహస్పతితో సమానుఁడును, పరాక్రమమునఁ దండ్రికీడగువాఁడును దేవేంద్రుఁడు బృహస్పతివచనము వినునట్లు, తారునిమాట వినఁగోరుచున్నవాఁడును, యజమానుని కార్యమునకై మిక్కిలి శ్రమపడినవాఁడును, అన్నివిషయములను జక్కఁగా నెఱిఁగినవాఁడునైన యాయంగదునికి నీతిగఱపఁదలఁచి, సామదానభేదదండములను నాలుగు విధములైన యుపాయములలోపల భేదోపాయము వర్ణించి, యావానరుల నందఱి నంగదునితోఁగూడ నాబిలమున నుండువిషయమున భిన్నాభిప్రాయు లగునట్లుచేసెను. వారందఱు నంగదునియభిప్రాయమునకు వ్యతిరిక్తాభిప్రాయులగుట యెఱిఁగి, దండోపాయమున కనుసరించిన భయంకరములైన పెక్కుమాటల నీక్రిందితెఱఁగునఁ జెప్పి యంగదుని వెఱపింపఁదొడఁగెను.

"తారాపుత్త్రుఁడా! నీవు తండ్రికంటె యుద్ధమునందుఁ జాలినవాఁడవా ? నీతండ్రి రాజ్యభారము వహించినట్లు, నీవు వానరరాజ్యభారము మోయఁగలవా ? వానరోత్తమా, వానరులెల్లప్పుడు తిరమైన మనస్సుగలవారుకారు. వారు భార్యలను బిడ్డలనుబాసి, నీయాజ్ఞకు లోఁబడి యుండఁజాలరు. నీసమక్షముననే చెప్పెదను. జాంబవంతుఁడు, నీలుఁడు, సుహోత్రుఁడు మొదలగువారందఱు నీయభిప్రాయము ననుసరించియుండఁజాలరు. ఆ యీ వానరులును, నేనును సుగ్రీవుని యందు మిక్కిలి యనురాగముగలవారము. సామదానభేదదండోపాయములలో నొక్కదానిచేతను మమ్ము సుగ్రీవునినుండి చీలఁదీయుటకు నీకలవికాదు. బలవంతుఁడు దుర్బలునితో విరోధించి యుండ

వచ్చునుగాని, బలహీనుఁడు బలవంతునితోఁ బగవూనుట యెన్నఁటికిని క్షేమంకరముగాదు. కావునఁ దన్నుఁగాపాడుకొనఁగోరుదుర్బలుఁడు బలవంతునితో విరోధము పూనరాదు. అంగదా, నీ వేబిలమును నీకుఁ గాఁపుదలయని తలఁచుచున్నావో, ఆయీబిలమును భేదించుట యా లక్ష్మణునిబాణముల కెంతమాత్రము ? తొల్లి దేవేంద్రుఁడు వజ్రాయుధముఁ బ్రయోగించి, కొలఁదిపనియే చేసెను. లక్ష్మణుఁడైనచో దీని నాకు దొన్నెనుబోలెఁ దనవాఁడిబాణములచే జిల్లులుపడ నేయఁగలఁడు. లక్ష్మణునికడ వజ్రాయుధముఁబోలు పెక్కుబాణములున్నవి. అవి పర్వతములనైన భేదింపఁగలవి. వాని కీగుహ యొంతమాత్రము. శత్రుహింసనా, నీవెప్పుడు సుగ్రీవునితోఁ బగవూనుదువో, అప్పుడే వానరులందఱు లోలోపల నొకకట్టు కట్టుకొని నిన్ను విడిచిపోఁగలరు. వీరు నీతోఁగూడ బిలముఁ బ్రవేశించినను, తమయాలుబిడ్డలను దలఁచుకొని, యెడతెగని దుఃఖముగలవారలై, యాఁకలికి డస్సి, యీతాలమీఁదఁ బరుండుకొనఁజాలక, నిన్ను వెనుకఁ ద్రోచిపోగలరు. అప్పుడు నీవు నీమిత్రులను, ఆప్తులను, బంధువులనువిడిచి, మిక్కిలివగచి, కదలుచుండు గడ్డిపోచకంటెఁ జులకనైపోవుదువు. అంతియకాక, శత్రువులను జంపునవియు, కడువేగముతో నేగునవియు, శత్రువులకు సైరింపరానివియు నైన బాణములతో లక్ష్మణుఁ డెన్నటికైన నీతను వెదకకపోవుటయేకాక రాజునాజ్ఞనుల్లంఘించినవాఁడవగు నిన్నుఁ జంపకుండుననుమాటలేదు. అట్లుకావున నీవు మాతోడవచ్చి యడఁకువతో మ్రొక్కి యతని నెప్పటివలెఁ గొల్చుచుంటివేని, సుగ్రీవుఁడు క్రమక్రమముగా నీకేరాజ్యమునఁ బట్టాభిషేకము గావింపఁగలఁడు. నీపినతండ్రి యెల్లప్పుడు న్యాయము గోరువాఁడు; జనులకిష్టముసేయఁగోరువాఁడు; నియమముతప్పనివాఁడు; కపటములేనివాఁడు; ఆడినమాట తప్పనివాఁడు. కావున నిన్నెప్పటికి వధింపనొల్లఁడు. అంతియకాక, నీతల్లి కిష్టముచేయఁగోరినవాఁడు. ఈ సుగ్రీవుఁడు ప్రాణములతోనుండుట యామెకొఱకే. అదిగాక సుగ్రీవునికి నీకంటె వేఱు బిడ్డలును లేరు. కావున నంగదా! నీవు సంశయపడక మాతో రమ్ము" అని హనుమంతుఁ డంగదునితోఁ జెప్పెను.

## 55-వ సర్గము

వానరులు ప్రాయోపవేశమునకుఁ బూనుట

అంగదుఁడు హనుమంతుఁడు న్యాయమునకు విరుద్ధముగాకయు, రాజభక్తిగనఁబఱచునట్లును, అడఁకువ మెఱయఁగను జెప్పినమాటనువిని యతని కిట్లనియె: ఓ హనుమంతుఁడా! నిలుకడయు, దేహమనశ్శుద్ధియు, మోసములేమియు, క్రౌర్యములేమియు, మగతనమును, దిట్టతనమును సుగ్రీవునియెడ లేవు. ఏ సుగ్రీవుఁడు తనయన్న బ్రతికియుండఁగా, నతని పట్టపుదేవిని, న్యాయముగాఁ దల్లినిబోలుదాని నందఱు చీయనునట్లుగాఁ దాను గ్రహించెనో, ఏసుగ్రీవుఁడు మహాసమర్థుఁడయిన వాలి యుద్ధమునకుఁబోవుచు, బిలద్వారమునఁ గావలియుంచిపోఁగా, నాతనిబలము నెఱిఁగియుండియు బిలద్వారమును మూసికొనివచ్చెనో, యట్టిపాపాత్ముఁడు ద్రోహియునగు నాసుగ్రీవునికడ ధర్మమున్నదన నెట్లు పొసఁగును. అదిపోనిమ్ము! ఇప్పు డగ్నిసాక్షికముగా స్నేహముచేసికొన్నవాఁడు, తనయన్నను జంపుట, తనకురాజ్యము నిప్పించుటయను నుపకారముఁ జేసినవాఁడు, బలాదులచేఁ బ్రసిద్ధిచెందినవాఁడునైన రాముని మఱచి యాతనికార్యమును మఱచినాఁడె. అట్టికృతఘ్నుఁ డెవని కార్యము మాత్రము జ్ఞప్తియుంచును? ఇప్పుడు వాఁడు లక్ష్మణునికి వెఱచి సీతాదేవిని వెదకుటకై మనల నాజ్ఞాపించెనేకాని, యుపకారికిఁ బ్రత్యుపకారము సేయకున్నఁ బాపముసంభవించునని యెంచి యీపని సేయలేదు. అట్టివానియెడ న్యాయ మనున దెక్కడిది? అట్టిపాపాత్ముఁడు, కృతఘ్నుఁడు, బుద్ధిలేనివాఁడు, చపలబుద్ధియునగు వానిని మంచికులమునఁబుట్టి, కొంతకాలము బ్రదికి బాగొందవలెనని కోరికగల యోగ్యుఁ డెవ్వఁడు నమ్మును? సుగ్రీవుఁడు గుణహీనుఁడయినను, గుణవంతుఁడయినను దనకొడుకునకు రాజ్యమునఁ బట్టముగట్టునుగాని, శత్రువంశమునఁబుట్టిన నన్నెట్లు పట్టాభిషిక్తుఁ జేయును? నేనుచేసిన యాలోచన వెల్లడియయ్యె. నే నసలు తప్పుచేసినవాఁడను, బలహీనుఁడను. నేను కిష్కింధకువచ్చితినేని, సుగ్రీవుఁడు నామీఁది తప్పిదమును, నేనతనికి వెఱచి యీఋక్షబిలముననే యుండ నెంచినసంగతిని తెలిసికొన్నచో, నేను దిక్కులేనివాఁడుంబోలె బలహీనుఁడనై యెట్లు మనఁగలను. మోస

గాఁడు, కటికివాఁడు, ఘాతకుఁడునైన సుగ్రీవుఁడు రాజ్యముమీఁది యాసచే నన్నెవరికిఁదెలియకుండ నులిమి చంపును. కావున నేను కిష్కింధకువచ్చి యచ్చట సుగ్రీవునిచేత నురిదీయఁబడిచచ్చుటకంటె నిక్కడఁ బ్రాయోపవేశము చేయుటమేలు. కావున మీరందఱు నాకనుజ్ఞ యిండు. మీరందఱు గృహంబులకుఁబొండు. నేనొక్కఁడె ప్రతిజ్ఞ యొనర్చెదను. నేను పట్టణంబునకురాను. ఇచ్చటఁ బ్రాయోపవేశంబు నేసెదను. నేనచ్చటికి వచ్చుటకంటె నిచ్చటఁ బ్రాయోపవేశంబుచేయుటయే మేలు. బలశాలురగు రామలక్ష్మణులకు నానమస్కృతులఁ జెప్పుఁడు. వానరాధిపుఁడగు మాపినతండ్రియైన సుగ్రీవునికి నానమస్కారములు సెప్పి, యావల నా క్షేమంబును జెప్పవలసినది. మాపినతల్లి యగు రుమను క్షేమమునడిగి, నాయారోగ్యమును జెప్పవలసినది. మాతల్లిని బుత్రవియోగమునకుఁ జింతింపవలదని యూరడింపవలసినది. మాతల్లి స్వాభావికముగా నాయెడఁబ్రేమయు, దయయుఁగలది. ఆమె, నేనిచ్చట నశించితినని యెఱిఁగినదై, మిక్కిలి దుఃఖించి, ప్రాణములఁదొఱఁగును" అని యీమాటచెప్పి యంగదుఁడు కలవరపాటుతో లేచి, యచ్చటి పెద్దలకెల్ల నమస్కరించి, శోకించుచు భూమియందు దర్భలపైఁ బరుండెను.

అట్లతఁడు ప్రాయోపవేశముచేసినప్పుడు, అచ్చటనున్న వానరశ్రేష్ఠులందఱు పలవించి తమకన్నులనుండి వెచ్చనికన్నీరువిడిచిరి. అప్పుడు వానరులంద ఱంగదునిపలుకులువిని వాలిని పొగడుచు, సుగ్రీవుని దూఱుచు నంగదునిఁజుట్టుకొని ప్రాయోపవేశముచేయ నిశ్చయించి, యాసముద్రతీరమునొంది, స్నానముచేసి పైయుత్తరీయము నడుముకుఁ గట్టికొని దక్షిణంపుఁగొనలుగల దర్భలుపఱచి, "యీసమయమునకిదియే తగినది" యని యెంచి మరణమునొంద నపేక్షతో నాదర్భలపైఁ దూర్పు ముఖముగాఁ గూర్చుండిరి. అప్పుడు ప్రాయోపవేశమునకుఁబూనిన గొప్పపర్వతశిఖరములంబోలు నావానరోత్తములందఱు రాముఁడు వనమునకేతెంచుట, దశరథుఁడు మృతినొందుట, రాముఁడు జనస్థానమును బాడుచేయుట, రావణుఁడు సీతనపహరించుకొని పోవుచు నడ్డము వచ్చిన జటాయువును బరిమార్చుట, వాలిని రాముఁడువధించుట, సుగ్రీవుఁడు చెప్పినప్రకారము సీతనువెదకఁబోవుటకై రాకపోవుటచే

రామునికి కోపము వచ్చుట, సుగ్రీవుఁడు వానరులను సీతాన్వేషణమునకై పంపుట మొదలగు నడచిన వృత్తాంతములు చెప్పుకొనుచుండఁగా, మిక్కిలి యుఱుముచున్న వర్షాకాలపు మేఘముల గర్జనము బోలు నా వానరశ్రేష్ఠుల యార్తధ్వనులా పర్వతముయొక్క గుహలయందంతట నిండుటచే నా పర్వతమునందు గొప్పధ్వని గలిగెను. ఆధ్వనిని విని సంపాతి యను గృధ్రరాజు వారిని భక్షింపనేతేరఁగా, వారికి మిక్కిలి వెఱపు గలిగెను.

## 56-వ సర్గము

[illegible]

జటాయువునకు నన్నయు, బలపరాక్రమములందుఁ బ్రసిద్ధి చెందినవాఁడును, తేజోవంతుఁడును, చిరకాలజీవియు నైన సంపాతియను గ్రద్దలఱేఁడు వింధ్యపర్వతముయొక్క గుహలోపలినుండి వెలువడి వానరులు ప్రాయోపవేశము చేసియున్న పర్వతసమీపమునకే తెంచి, ప్రాయోపవిష్టులై యున్న యా వానరులనందఱిని జూచి, కడుసంతోషమునొంది, "లోకమున దైవము మానవునికి వానివాని కర్మాధీనముగా మేల్లొడఁగూర్చును. కాఁబట్టియే నాకుఁ జాలకాలమునకీ భక్ష్యపదార్థమును నిర్మించినాఁడు. నేనీ వానరులలో నొక్కొక్కనిగాఁ జచ్చినవానినెల్ల భక్షించెదను" అని తనలోఁ దాననుకొనెను. అప్పుడు తమ్ముఁ దినఁగోరుచున్న యా సంపాతిమాట విన్నవాఁడయి యంగదుఁడు గడువిగులొంది హనుమంతునితో నిట్లనెను.

"హనుమంతుఁడా! చూచితివా గ్రద్దరూపము ధరించి యముఁడే వానరులను రూపుమాపుటకై యీ తావునకువచ్చి యున్నాఁడు. మనము రామునికార్యముఁ జేయనైతిమి; రాజునానతిని మీఱితిమి. కావున నిప్పుడు వానరులకుఁ దలఁపని యాగడమున్నట్టు లుండి దుమికెను. వైదేహికి మేలుచేయఁగోరి జటాయువు దండకారణ్యమునఁ జేసిన పనియెల్ల మీరు వినియుందురుగదా! మనవలెనే తిర్యగ్యోనియందుఁ బుట్టినజంతువులు సైతము ప్రాణములవిడిచియైనను రామునికిఁ బ్రియము సేయఁగోరుచున్నవి. ఒక్కొక్కరును ప్రేమయు దయయుఁగలవారలై రామున కుపకారము సేయుచున్నారు. కావున

ధర్మములనెఱిఁగిన జటాయువు తన ప్రాణములు వదలునప్పుడుగూడ రాముని కుపకారము సేసెను. మనము రామునినిమిత్తమై యడవులకు వచ్చి త్రిమ్మరిఁదిఱిగి వేసారి యలసి ప్రాణములవిడువ సిద్ధలమైతిమి. కాని మనకా సీతాదేవి గానఁబడకయ్యెను. గ్రద్దలఱేఁడగు జటాయువు యుద్ధరంగమున రావణునిచేఁ జంపఁబడి, సుగ్రీవుని భయముఁబాసి యుత్తమగతిని బొందెను. జటాయువు చచ్చుటచేతను, దశరథనృపాలుఁడు మృతినొందుటచేతను, రావణుఁడు సీతాదేవిని నపహరించుటచేతను వానరుల కిట్టియవస్థ సంభవించెను. జటాయువు బ్రతికియున్న సీతాదేవిని రావణుఁడెత్తికొనిపోయిన సంగతి రామునకుఁ దెలిసియుండును. దశరథుఁడు బ్రతికియున్నచో రామునిఁ గొంతకాలమునకైనను దనకడకుఁ బిలిపించుకొనియుండును. రావణుఁడు సీతను గొనిపోక యున్నచో మనకు వెదకవలసిన ప్రయత్నములేక యుండును. రామలక్ష్మణులు సీతాదేవితోఁగూడ వనవాసముచేయుటయు, రాముని బాణముచే వాలి చచ్చుటయు, రామునికోపముచే జనస్థానమునఁ బెక్కురు రాక్షసులు చచ్చుటయు నీమొదలగునట్టి విపరీతములెల్లఁ గైకేయికి దశరథుఁడు వరములొసఁగుటచే గలిగినవి" అని యంగదుఁడు వానరులతో ననెను. మహాబుద్ధిగల యాగృధ్రరాజు అంగదుఁడుచెప్పిన యా యింపుగానిమాటనువిని, వానరులట్లు ప్రాయోపవిష్టులయి యుండుటఁజూచి, మిక్కిలి యులికిపడి దీనముగా వారితో నిట్లనెను.

వాఁడిముక్కుగలవాఁడగు సంపాతి యంగదునినోటినుండివచ్చిన మాటవిని పెద్దెలుఁగున నిట్లనెను: "నాకుఁ బ్రాణములకంటెఁ గడుఁ బ్రియుఁడయిన జటాయువధ వృత్తాంతమును బిగ్గరగాఁజెప్పి, నామనస్సునకు నెవ్వఁడు కలవరము పుట్టించుచున్నాఁడు? జనస్థానమున రాక్షసుఁడగు రావణునికి గృధ్రమగు జటాయువునకు నెట్లుపోరు గలిగెను? నాతమ్మునిపేరు చాలదినములకు తఱువాత నేఁడువింటిని. గుణముల నెఱిఁగినవాఁడును, కొనియాడఁదగిన పరాక్రమము గలవాఁడునునైన నాతమ్మునిపేరు బహుదినములకు మీవలన వినఁగలిగినందుకు నేను సంతసించితిని. వానరశ్రేష్ఠులారా! జనస్థానమున నున్న నాతమ్ముఁడు జటాయువెట్లు చంపఁబడెను? నాకుఁ దెలియఁజెప్పుఁడు. గురుజనులందుఁ బ్రియుఁడయిన రాముఁడెవనికిఁ బెద్దముద్దులకొడుకో, అట్టిదశరథునకు

నాతమ్మునికి నెట్లు చెలిమిగలిగెను ? సూర్యునికిరణముల వేడిమికి నా ఱెక్కలు మాడిపోవుటంజేసి, నేను పర్వతమునెక్కి మీకడకు రాఁజాలకున్నాను. శత్రుసంహారులారా! మీరే యీపర్వతమునుండి దిగివచ్చి నాకీసంగతిఁ దెలుపుదురుగాక” యని యాసంపాతి వానరుల నడిగెను.

## 57-వ సర్గము

అంగదుఁడు సంపాతికి జటాయువధ వృత్తాంతము నెఱిఁగించుట

ఆ వానరయూథనాథులు సంపాతి మిగులవగతోఁగూడి తిన్నని గొంతుతోఁజెప్పిన మాటనువిని, యాసంపాతి యేమిచేయునోయని వెఱచి, యాతనిమాటను నమ్మరైరి. అంతియకాక, ప్రాయోపవేశము చేసిన వారందఱు ఆసంపాతినిఁజూచి “యితఁడు మనలను దినవచ్చినవాఁడు” అను చెడుతలంపుచేసి, యాతనికడకువచ్చుటకు మొదట వెఱచిరి. మఱికొంత సేపటికి వానరులు “ఎట్లయినను మనము చావఁదెగఁబడి మనము ప్రాయోపవేశము చేసియున్నాము. ఇతఁడు మనలను భక్షించెనేని, మనము కృతార్థులమే యగుదుము కావున సంపాతి దగ్గఱకుఁబోవుదము ” అనుతలంపుగొనిరి. అంత నంగదుఁడు కొండనుండి దిగివచ్చి సంపాతితో నిట్లనెను.

ఓ గృధ్రరాజా ! ప్రతాపశాలియగు ఋక్షరజసుఁడను వానరరాజొక్కఁడుండెను. ఆతఁడు నాకుఁదాత; ధర్మజ్ఞుఁడు. నూఱుకోట్ల పురుషులబలముగల వాలి సుగ్రీవులను నిర్వురు పుత్రులతనికిఁగలిగిరి. నాతండ్రియగు వాలి లోకప్రసిద్ధములైన సాహస కృత్యములుచేసెను. భూమండలము నెల్లనేలువాఁడును, ఇక్ష్వాకువంశస్థులలో మహారథుఁడునునైన దశరథనందనుఁడగు రాముఁడు తండ్రియాజ్ఞను పాలించుటయందు శ్రద్ధవహించి, న్యాయమార్గమునుబూని, తమ్ముఁడు లక్ష్మణునితోను, భార్యయగు సీతతోను గూడి దండకారణ్యమున కేతెంచెను. వారు జనస్థానమున నుండఁగా, రామలక్ష్మణులను వంచించి, రావణుఁడు సీతాదేవి నెత్తుకొనిపోయెను. రామునితండ్రికి నెచ్చెలియు, గ్రద్దలకు ఱేఁడునగు జటాయువు, రావణుఁడు సీతనెత్తికొని పోవుటను జూచి, రావణు నడ్డగించి, యతనిరథము నుగ్గునేసి, సీతను నిలిపెనుగాని, రావణునితోఁడిపోరునందు డస్సినవాఁడగుటచేతను, ముసలి

వాఁడగుటచేతను రావణునిచేత సంహరింపఁబడెను. ఇట్లు జటాయువు రావణునిచేత మృతినొందెను. తర్వాత రాముఁడు వచ్చి విచారించి యతనికి దహనసంస్కారము గావించుటచే నుత్తమగతినొందెను. రాముఁడు సీతనుబోఁగొట్టుకొని, విచారముతో ఋశ్యమూకపర్వతమునకు వచ్చెను. అప్పుడు నాపినతండ్రియగు సుగ్రీవుఁడు నాతండ్రితోఁ బగవూని యాపర్వతముననే తనమంత్రులఁగూడియుండెను. రాముఁడును నాపినతండ్రియగు సుగ్రీవునితోఁ జెలిమిచేసికొని యాతనికిఁ బ్రియముగావించుటకై నాతండ్రిని వాలిని జంపి, కిష్కింధారాజ్యము నాతనికిచ్చెను. రామునిచే రాజ్యమున నుంచఁబడినతర్వాత సుగ్రీవుఁడు రామునిభార్యను వెదకుటకై మమ్ముఁబంపెను. మేమారాముని నిమిత్తమువచ్చి యెక్కడెక్కడ వెదకియు రాత్రియందు సూర్యుని కాంతిఁజూడఁజాలనట్లు సీతను గానకున్నాము. మేము మొదట దండకారణ్యమెల్ల జాగ్రత్తతో వెదకి తెలియక యిచ్చటనొక తాపసియొక్క గుహఁ బ్రవేశించితిమి. మయునిమాయచే నిర్మింపఁబడిన యాగుహయందు వెదకుచుండఁగా, మారాజు మాకొసఁగిన యొక నెలగడువు తప్పిపోయెను. ఆసుగ్రీవుని భృత్యులమైన మేము రాజునాసతిమీఱుట చేత నతనికడకుఁబోవ వెఱచి ప్రాయోపవేశము చేయఁబూనితిమి. మే మక్కడికిఁబోయినను మాకుఁబ్రాణములు దక్కవు. మేము కాలము మీఱివచ్చితిమని రామలక్ష్మణులును, సుగ్రీవుఁడును మాపై సత్యాగ్రహముగలవారై, మమ్ముఁజంపుదురు గనుక, మేమిక్కడనే చావనెంచితిమి” అనియంగదుఁడు సంపాతితోఁ జెప్పెను.

## 58-వ సర్గము

### సంపాతి వానరులకు సీతసంగతి నెఱిఁగించుట

ప్రాయోపవేశంబుకుఁ బూనిన వానరులిటు చెప్పినమాటనువిని, సంపాతి కన్నీరునించి, పెరెలుఁగున వానరులతో నిట్లనెను: “వానరులారా! బలవంతుఁడయిన రావణునిచేఁ జంపఁబడినాఁడని మీరిప్పుడను నట్టి యాజటాయువు నాతమ్ముఁడు. నేను ముదుసలినగుటచేతను, ఱెక్కలు లేనివాఁడనగుటచేతను, రావణుఁడు జటాయువుఁజంపినాఁ డని విని నను, ఓర్చియున్నాను. నాతమ్ముని వధించినవానిపైఁ బగదీర్చుకొన

నాకిప్పుడు బలిమిచాలదు. తొల్లి వృత్రాసురసంహారముజరిగినప్పుడు మేమన్నదమ్ముల మిరువురము నొండొరులజయముఁగోరి యాకాశమునఁ జరించుచున్న సూర్యునికడకుఁబోతిమి. అప్పుడు మేమాకాశమార్గమునఁ బలుమాఱుచుట్టిచుట్టి వేగముతోఁ దిరుగుచుంటిమి. అట్లుమేము తిరుగునప్పుడు, సూర్యుఁడు నడినెత్తికివచ్చుటయు, జటాయువుడస్సెను. అప్పుడు నేను తమ్మునిమీఁదిప్రేమచేఁ గడువ్యసనము నందినవాఁడనై, ఎండవేఁడిమికి నొచ్చియున్న నాతమ్ముని నా ఱెక్కలతో నెండసోకకుండఁ గప్పితిని. వానరశ్రేష్ఠులారా! అప్పు డాయెండసోఁకుటచే నా ఱెక్కలు మాడిపోఁగా, నే నీ వింధ్యపర్వతమునఁ బడితిని. నాటినుండి నేనెగురలేమిం జేసి యిచ్చటనే యున్నాఁడనుగానఁ దమ్మునివృత్తాంతము నేనెఱుఁగను. మీరిప్పుడు చెప్పఁగా నది దెలిసినది" యని జటాయువు తోఁబుట్టువగు సంపాతిచెప్పఁగా విని, గొప్పపండితుఁడయిన యువరాజగు నంగదుఁ డతనితో నిట్లనియె.

"ఓగృధ్రరాజా, నీవుచెప్పినదివింటిమి. నీవు జటాయువు నన్నయగుదువేని, యారావణుని యునికిపట్టెఱుఁగుదువేని, మాకెఱిఁగింపుము. దీర్ఘాలోచనలేని (బుద్ధిహీనుఁడైన) యారావణుఁడు దగ్గఱను గాని, లేక, దవ్వునఁగాని యెక్కడనుండునది యెఱుఁగఁజెప్పుము" అని యంగదుఁడడుగఁగా, నెక్కువ వెలుఁగుగలవాఁడును, జటాయువు నన్నయునగు సంపాతి, వానరులకు సంతసం బెసఁగఁజేయుచుఁ దనశక్తికిఁ దగినమాట యిట్లనెను.

ఓ వానరయూథనాథులారా! నేను ఱెక్కలుగాలినవాఁడను గావున బలిమియుడిగినవాఁడను. ఏను మీతోఁగూడవచ్చి రామునికి సాహాయ్యముచేయఁజాలను గావున నోటిమాటతోమాత్రము సాయము చేసెదను. నేను వరుణునికి సంబంధించినఅతల, వితలాదులగు క్రిందిలోకములను, త్రివిక్రమావతారమున విష్ణువుపాదములతోఁ గొలిచిన పైలోకములను, దేవాసురులయుద్ధములను, దేవతలు క్షీరసముద్రమును జిలికి యమృతముఁదీయుటయు నెఱిఁగియున్నాను. రామునియే యీకార్యము మీరుచేయనున్నారో, ఆకార్యమును నేనే ముఖ్యముగాఁ జేయవలసినది. అయిన, ముదిమిచే నాబల ముడిగినది. అంగములును చివికియున్నవి. ప్రాయముగలదియు, చక్కఁదనముతోఁ

గూడినదియు, తొడవులనన్నింటిని ధరించినదియునైన సీత నాదురాత్ముఁడగు రావణుఁ డెత్తుకొనిపోవుచుండఁగా నేను జూచితిని. ఆసీతయు, రావణుఁ డెత్తికొనిపోవునప్పుడు, "హా రామా" యనియు "హా లక్ష్మణా" యనియు నఱచుచుఁ దొడవులఁదీసివేయుచు నంగముల విదిలించుకొనుచుఁ బోవుచుండఁ జూచితిని. ఆనల్లని యసురునియందున్న యా వెలిపట్టుచీరగట్టిన సీతాదేవి పర్వతాగ్రమునందలి యెండవలెను, క్రొక్కాఱు మేఘమునందలి మెఱుపువలెను వెలుఁగుచుండెను. ఆమె పోవునప్పుడు "రామరామ"యని యఱచినందున నామె సీతయైయుండవచ్చునని తలఁచెదను. ఆ సీతాదేవి నెత్తుకొనిపోయిన యా రావణుని మనికిపట్టిదియనని జెప్పెద నాలింపుఁడు.

విశ్రవసునికిఁ గుమారుఁడును, కుబేరునికి సాతోబుట్టుగాఁ దమ్ముఁడునైన రావణుఁడు లంకాపురమునం దుండువాఁడు. ఇక్కడికి నూఱు యోజనములదూరమున సముద్రమధ్యమున నాలంకాపురమున్నది. అయ్యది విశ్వకర్మచే నిర్మితమయి, బంగారు మయములైన ద్వారములును, బంగారపుఁ దిన్నెలును గలిగి, సూర్యునిమాడ్కిఁ దేజరిల్లు ప్రాకారముతోఁగూడి చక్కనైయుండును. లంకాపురమునఁ దెల్లని వల్కలముఁ దాల్చిన సీతాదేవి రావణుని యంతిపురమున నుంపఁబడినదై, రాక్షసాంగనలచేఁ గావలికాచఁబడుచున్నది. ఓవానరులారా! మీరు దక్షిణసముద్రముచేరి, యచ్చటనుండి తఱలి నూఱు యోజనముల దవ్వేగి సముద్రముచె నలువైపులఁ జుట్టఁబడియున్న యా లంకాపురము ప్రవేశింతురేని, యచ్చట సీతాదేవిని, రావణాసురునిఁ జూడఁగలరు. ఓ వానరులారా! మీరు త్వరతో నచ్చటికే పొండు. ఆసీతను రావణునిఁ జూచుకొని మఱలరాఁగలరని నేను జ్ఞానదృష్టితోఁ జూచితిని. పిచ్చుకలును, ధాన్యజీవులగు తక్కిన జంతువులు నాకాశమున మొదటి మార్గమునను, కాకులు, మఱియుఁ బండ్లుదిని జీవించునవియు రెండవ మార్గమునను, నీరుకాకులు, కొంగలు, లకుముకులు మూడవమార్గమునను, డేగలు నాలవమార్గమునను, గ్రద్దలైదవమార్గమునను బోవును. బలవీర్యరూపయౌవనములచే నొప్పిన హంసము లాఱవమార్గమునను, వినతాపుత్రులగు వారేడవమార్గమునను బోవుచుందురు. వానరశ్రేష్ఠులారా! మేమెల్లరు వినతాపుత్రుఁడయిన యరుణునివంశమునఁ బుట్టిన

వారము. ఇచ్చటనుండియె రావణుని సీతను జూచుచున్నాను. మాకును గరుడునికివలెనే దివ్యదృష్టియు బలమున్నవి. వానరులారా! యాహార బలముచేతను, స్వభావముచేతను బూర్తిగా నూఱుయోజనములదవ్వు వఱకు నేవస్తువునైనఁ జూడఁగలము. కోళ్లకుఁ దమపాదములమొదటనే యాహారము దొరకునట్లు, మాకును స్వాభావికముగా దూరముననే యాహారము దొఱకునట్లేర్పఱుపఁబడియున్నది. సీతాదేవ్యపహరణరూప మయిన నిందితకార్యముగావించిన యారావణుని మీరు గనుఁగొని యాతనిని రామునిచేఁ జంపించితిరేని వాఁడు నాతమ్మునిఁజంపిన పగను నేను దీర్చికొన్నవాఁడ నయ్యెదను. మీరు లవణసముద్రమును దాఁటుటకుఁ దగినుపాయము వెదకుఁడు. మీరు సీతను జూచి కార్యసిద్ధినందిన వారలై మఱలిరాఁగలరు. నేను స్వర్గమునొందిన బలశాలియగు నాతమ్మునికిఁ దర్పణంబుఁ గావింపఁగోరెదను. మీరు నన్ను సముద్రతీరముఁ జేర్పుఁడు" అని సంపాతి యడిగెను.

మహాబలతేజస్సులుగల వానరు లా ఱెక్కలుకాలిన సంపాతిని సముద్రపువరిం జేర్చి యాతండు తన తోఁబుట్టువునకుఁ దర్పణముచేసిన తరువాత మఱల నతనిని యథాస్థానముచేర్చి, యా సంపాతివలన సీతయు రావణుఁడు నున్నతా వెఱుఁగుటచే మిక్కిలి సంతసించినవారలైరి.

## 59-వ సర్గము

### సంపాతి వానరులకు సీతావృత్తాంతము నెఱిఁగించుట

అంతట వానరోత్తములందఱు గృధ్రరాజగు సంపాతి చెప్పిన యమృతముఁబోలు మాటనువిని, సంతసముచే గగ్గురుపాటొందిరి. అప్పుడు జాంబవంతుఁడను వానరశ్రేష్ఠుఁడు కోఁతులందఱితోఁగూడి, వేగిరముగాఁ బ్రాయోపవేశము విడిచిలేచి, యా సంపాతినిఁజూచి, "గృధ్రరాజా! సీత యెక్కడ ఆమె నెవ్వఁడు చూచెను? ఎవఁడామె నెత్తుకొనిపోవుచుండెను? ఎవఁడు రాముఁడును లక్ష్మణుఁడును వజ్రాయుధముఁబోలు బాణములపోటు నెఱుఁగకయున్నాఁడు? ఇవియెల్ల నీ వెఱిఁగించి, మాకు రక్షకుఁడవగుము" అని యడుగఁగా, సంపాతియుఁ బ్రేమమీఱ సీతావృత్తాంతము నాలకింప సావధానులైయున్న వానరుల నోదార్చుచు నిట్లనియెను.

వానరులారా! సీతను రావణుఁ డెత్తుకొనిపోయిన సంగతి నే నెట్లు విన్నదియు, ఎవఁడు నాకీసంగతిఁ జెప్పినదియు, ఆ నిడివికన్నులుగల సీత యిపు డెచ్చటనుండునదియు నెఱిఁగించెదను. వినుఁడు; ఏను పెక్కు యోజనములనిడివిగల యీ చొరనలవికాని పర్వతమునఁ బెక్కేండ్లకు ముందు తెక్కలుగాలఁగాఁ బడి, బలపరాక్రమములు లేకయుండి, యిపుడు ముసలివాఁడనయితిని. అదిమొదలుకొని, నా పుత్త్రుఁడయిన సుపార్శ్వుఁడను పక్షిశేఖరుఁడిట్టి గతినొందిన నా కాహారముఁ దెచ్చి పెట్టి నన్నుఁ గాలముతప్పక పోషించుచుండును. గంధర్వులు కామ మోర్వఁజాలనివారు; పాములు కోపము నాపుకొనఁజాలనివి. మృగములకు భయమెక్కువ. మేమన్ననో యాఁకలి కోర్వఁజాలని వారము. నే నొక్కదినమున నాఁకలికి నకనకలాడుచు-నాహారముగోరు చుండఁగా, ప్రొద్దుగ్రుంకిన తర్వాత, నాపుత్త్రుఁడెరచి తేకయె వట్టిచేతు లతోవచ్చెను. ముసలివాఁడను, ఆఁకలిదప్పులచే మిక్కిలి నొచ్చిన వాఁడను నైనందున నే నాగ్రహముతో నా కుమారునిఁ దిట్టఁగా, నప్పుడు ప్రీతినెసఁగఁజేయువాఁడగు నా పుత్త్రుఁ డాహారము లేమింజేసి నకనకలాడుచుండు నన్నూఱడించి యానాఁడు నడచిన సంగతి నిట్లని నాతోఁ జెప్పెను.

నాయనా! నే నెప్పటియట్ల వేళతప్పక యెర తెచ్చుటకై యాకా శమున కెగిరి, మహేంద్రపర్వతద్వారముసేరి, సముద్రమధ్యమున వసించు జంతువుల నడ్డగింపఁదలఁచి తలవాల్చి యొంటిగా నుంటిని. అప్పుడు కాటుకకొండవంటి మేనుగల యొక్కపురుషుఁడు సూర్యుని కాంతిఁబోలు కాంతిగల యొక కాంతను గైకొని పోవుచుండుట గం టిని. అప్పుడు నేను వారి నిరువురినిజూచి, వారినే యాహారముగాఁ గొనుట కిచ్ఛగించితిని. ఇంతలోపల నాపురుషుఁ డడఁకువ మెఱయఁ దిన్ననిపలుకులతో దారిదీయమని యాచించెను. ఎంతనీచులయినను బతిమాలినవారిని గొట్టరుగదా! ఇఁక నాయట్టివాఁడు బతిమాలినవాని నేమియైనఁజేయునే? అంత నాపురుషుఁడు తనబలముచే నాకాశము ఛేదించువానివలె వేగిరముగా నేగెను. అప్పు డాకాశమునందుఁ దిరి గెడు భూతములెల్లను, మహర్షులును నాకడకువచ్చి, "నాయనా! బ్రతికితివిగదా. ఈతఁ డెట్టకేలకుఁ రక్ష్యవస్తువుతో దాఁటిపోయెను,

నీకు మేలయ్యెను. సందియములేదు." అని చెప్పఁగా, నేను గడు యోగ్యులైన యా మహాత్ములంజూచి, వారలెవ్వరని యడుగఁగా, వారు నన్నుఁగూర్చి, "ఓ పక్షీంద్రా! యాతఁడు రావణాసురుఁడు. దశరథపుత్త్రుఁడగు రామునికి భార్యయు, జనకరాజుకూతురు నగు సీత తనతో రానిష్టములేక, యాభరణములనెల్లఁ బాఱవైచి, దుఃఖాతిశయమునకు లొంగినదై, జుట్టు విఱియఁబోసికొని, "రామా! లక్ష్మణా!" యని వాపోవుచుండ నాసీతను గొనిపోవుచున్నాఁడు" అని తెలిపిరి. ఓ తండ్రీ! నే నాలస్యముగా వచ్చినందుకుఁ గారణమిదియ" అని కాలము నెఱిఁగినవారిలోపల నుత్తముఁడయిన సుపార్శ్వుఁ డీసంగతిని బూర్తిగా నా కెఱిఁగించెను.

ఆమాట వినినతర్వాతను నాకు ఆరావణునిపయిఁ బరాక్రమము నెఱప బుద్ధి పొడమదయ్యె. నేను పక్షిని; నాకుండునవి ఱెక్కలే. కావున నాఱెక్కలు పోయినపదంపడి నే నేపనిని జేయఁగలను? కావున మాటలు, యుక్తిని దెలుపునట్టి వాక్సాహాయ్యమైనఁ జేసెదను. దానిని మీరు పౌరుషముచే సాధింపవలెను. అది యేదియో చెప్పెద వినుఁడు. ఏది రామునికార్యమో యది నాకార్యమే. దానికి సందియములేదు. మీకందఱకు నాపనివిషయమయి మీరడిగినదానికి బదులుచెప్పెదను. నాకుఁదోఁచినంత యోచనయుఁ జెప్పెదను. మీరందఱు బుద్ధిమంతులరు; బలవంతులరు; ధైర్యవంతులరు; వానరరాజగు సుగ్రీవునిచేఁ బంపఁబడినవారలు. మిమ్మెదిరింప దేవతలకును వశముగాదు. కావున సుగ్రీవుఁడు చక్కఁగా యోచనచేసియే మిమ్ముఁ బంపియుండును. రామలక్ష్మణులబాణములు వాఁడిమిగలవి. కంకపత్త్రములు గట్టినవి. ముల్లోకములవారిని ముంచను తేల్చను జాలినవి. రావణుఁడన్నను విశేషబలపరాక్రమములుగలవాఁ డన్నమాట వాస్తవమే. అయినను మీరందఱు చాలినవారలుగనుక, మీకలవికాని పని యొందును లేదు. కావున నాలస్యముచేయవలదు. మనమున నొకవిషయము తిరముచేసికొనుఁడు. మీబోటి బుద్ధిమంతులు కష్టకార్యములు వచ్చినప్పుడు వెనుకపడరుగదా" అని సంపాతి వానరులతోఁ జెప్పెను.

## 60-వ సర్గము

సంపాతి వానరులకు గుఱుతుసెప్పుట

సంపాతి తనతమ్ముఁడయిన జటాయువునకుఁ దిలతర్పణ మొనర్చి, స్నానముచేసి వచ్చినతరువాత, వానరవీరులందఱు చోటఱ నలవికాని యా పర్వతమున నా సంపాతిచుట్టును గూర్చుండిరి. అంత సంపాతి, మంత్రులందఱితోఁగూడి దగ్గఱఁగూర్చుండియున్న యంగదునిఁజూచి, వానరులు తనమాటలను శ్రద్ధతో వినుటచే నచ్చుకముగలవాఁడై, సంత సముతో నా యంగదాదులతో నిట్లనియె :

"వానరులారా! సందడిసేయక, గమనముంచి, నామాటను వినుఁడు. నేను సీతాదేవివృత్తాంతము నెట్లు తెలిసికొన్నది చెప్పెదను. నేను సూర్యునిచేరువకేఁగ, నాతరి వేఁడివెలుఁగు వెలుఁగులు నాదేహము సోఁకి, నాఱెక్కలను మాడ్చివేయఁగా, నీవింధ్యపర్వత శిఖరమునఁ బడితిని. పడిననాటినుండి యీఱుదినములవఱకు నాయొడలు నాకుఁ దెలిసినదికాదు. ఆఱవనాఁడు తెలివినొంది కన్నులు తెఱచిచూచినను స్వాధీనత దప్పినవాఁడనై, మైకము గ్రమ్మునట్లుండెను. అన్నిదిక్కులను జూచితిని. ఏదియును దెలియదయ్యె. తరువాత సముద్రమును పర్వతము లను, నదులను, కొలఁకులను, వనములను, సముద్రతీరమును జూచిన తర్వాత, నిది సంతసముగల పక్షులతో నిండిన నెత్తములును, గుహ లును, శిఖరములునుగల దక్షిణ సముద్రతీరమునందలి వింధ్యపర్వత భాగమని నిశ్చయించితిని.

ఈ వింధ్యపర్వతమున దేవతలకుఁగూడఁ బూజసేయఁదగిన పరి శుద్ధమైన యాశ్రమ మొకటి యుండెను. దానియందు నిశాకరుఁ డనెడి యొక మహాముని వాసముచేయుచుండెను. ధర్మజ్ఞులారా, ఆ నిశా కరమహర్షి గతించినపిదప, నేనీవనమున నమ్మహర్షినివదలి యెనిమిదివేల సంవత్సరములుగా నున్నాఁడను. నేను మిక్కిలి ప్రయాసముతో నెగుడుదిగుడైయున్న వింధ్యపర్వతశిఖరమునుండి మెల్లగాఁ గ్రిందికి దిగి, మునులు త్రుంచుటచే వాఁడికొనలుగలవైయున్న దర్భమొక్క లతోఁగూడిన యాయాశ్రమమునకుఁ బరమదుఃఖముతో మఱల వచ్చితిని. నేనును, నాతమ్ముఁడు జటాయువును బలుమాఱు

ఆ మునీంద్రునికడకేగి యాతని సందర్శించియుండుటవలన నేను మిక్కిలి దుఃఖముతో వచ్చి యమ్మహామునినిఁ జూడఁగోరియుంటిని. ఆ మునీంద్రుని యాశ్రమముచేరువ వాయువులు నెత్తావులతోఁగూడి వీచినవి. పువ్వులును బండ్లును లేని యొక్కచెట్టును నా యాశ్రమమునఁ గానరాదయ్యె. అట్టి యాశ్రమమున నొకచెట్టుమొదటఁ గూర్చుండి, మహాత్ముఁడయిన నిశాకరు నెదురుచూచుచు నుంటిని. అంతఁ గొంతతడవునకు స్నానముచేసినవాఁడై, తన వెలుఁగుచేఁ జూడ నలవికానివాఁడై, యుత్తరదిక్కు నెదుర్కొనివచ్చుచున్న యా నిశాకరమునీంద్రునిఁ జూచితిని. బ్రహ్మాదేవునిఁ బ్రాణులెల్ల వెంబడించు లాగున, నామునీంద్రునిఁ జుట్టుకొని ఎలుఁగుబంటులు, చమరమృగములు, సింహములు, ఏనుఁగులు, పులులు, పాములువచ్చి, రాజు పురము ప్రవేశించినతోడనే మంత్రులు మున్నగు సేనలెల్లఁ దమతమ నివాసములకుఁ జనునట్లు, ఆ మహర్షి యాశ్రమము ప్రవేశించినతోడనే, తమతమ పొదలలోనికిఁ బోయెను.

అంతట నమ్మునీంద్రుఁడు నన్నుఁగాంచి సంతసించి, హెచ్చరించికొని పర్ణశాలలోపలికిఁ జొచ్చి, మరల గొంతసేపటికివచ్చి, నన్నుఁ జూచి "యేమిపనిపడి వచ్చితివి. నాయనా! నీకు నీకలు లేకయుండుట చూడ నీరూపమె గుఱుతు తెలియకయున్నది. ఈ నీ ఱెక్కలు గాలిపోయియున్నవి. నీచర్మమును మాఁడి పుండయియున్నది. వాయువేగముబోలు వేగముగలవారును, గ్రద్దలఱేఁడులును, కోరినరూపమెత్తఁగలవారునైన యన్నదమ్ములగు రెండు గ్రద్దలను జూచియున్నాను. సంపాతీ, నీవు పెద్దవాఁడవుగదా! జటాయువు నీతమ్ముఁడుగదా! మీ రప్పుడప్పుడు మానుషరూపముతో వచ్చి నాకు మ్రొక్కుచుందురుగదా! నీకేమి వ్యాధివచ్చెను? ఏల నీకు ఱెక్కలు పడిపోయెను. ఎవఁడు నిన్నిట్లు చావమోదెను! నేను వినఁగోరియున్నాను. వాస్తవము చెప్పు"మని యా నిశాకరమహర్షి నన్నడిగెను.

## 61-వ సర్గము

**సంపాతి నిశాకరునితో సంభాషించిన సంగతి చెప్పుట**

అమ్మునీంద్రుఁ డట్లడుగఁగా, నప్పుడు నేను సాహసముతోఁ జేసినదియుఁ, జేయనలవికానిదియునైన సూర్యుని వెంబడించుటయను సర్వ

కార్యము నమ్మునీంద్రునితోఁ జెప్పితిని. ఓ మునీంద్రా! నాయొడలు కాలి మాంసపుముద్దయై యుండుటవలనను, సిగ్గుచే మదికలఁగినవాఁడ నగుటవలనను డస్సి యున్నాఁడనుగాన మాటలాడఁజాలకయున్నాను. అయిన నెట్టులో చెప్పెదను. శూరులమైన జటాయువును, నేనును బలమువలని గర్వముచే మంచిచెడ్డల నెఱుఁగనివారమై యొండొరుల బలిమి నెఱుఁగఁగోరి, కైలాసశిఖరముననున్న మునులయెదుట "ఉదయ పర్వతము మొదలస్తమయపర్వతమువఱకు నెవరు ముందుపోవుదురో, వారు బలశాలు"రని పందెముకట్టి యాకాశమునకెగిరి, సరిసమానముగాఁ బోవుచుఁ గ్రిందఁజూడఁగా, పట్టణములెల్ల వేలువేలుగా బండిచక్రముల వలెఁ గనఁబడినవి. మేము పోవునపుడు మార్గమధ్యమున వాద్యధ్వను లను, వేదఘోషలనువినుచు, ఎఱ్ఱనిబట్టలుగట్టిన పాటపాడెడు వెక్కండ్రు కాంతలను జూచుచుఁ ద్వరితముగా నాకాశమునకెగిరి, సూర్యమార్గ మునుబొంది యచ్చటినుండిచూడఁగా నీవనము పచ్చికపడియపలెను, భూమియందలి పర్వతములు చిన్నఱాలవలెను, నదులెల్ల దారముల వలెను, హిమవంతము, వింధ్యము, మేరు మహామహీధరములు నొక మడుగులోపల విహరించెడి యేనుఁగులమాడ్కియుఁ గానఁబడినవి. అంత దూరముపోయినతర్వాత మా కిరువురకు నోర్వని చెమటయు, బడలికయు, వెఱపును, మోహమును, మసకయు, మూర్ఛయుఁ గలి గెను. ఇది దక్షిణము, ఇది యాగ్నేయము, ఇది పడమర, యనుదిక్కుల జ్ఞానమే లేకపోయెను. లోకమెల్ల మర్యాదదప్పి ప్రలయకాలాగ్నిచేఁ గాల్పఁబడి నశించినట్లు కానఁబడెను. మనస్సు చెదరుటవలనఁ బలువూఱు దృష్టి తప్పిపోయెను. మఱల బహు ప్రయాసముతో మనస్సును జక్షు రింద్రియమునందుఁ జొప్పించి సూర్యునివైపు చూచితిని. అప్పుడు సూర్యుఁడు భూమియంత ప్రమాణముగలవాఁడుగా మాకుఁ దోచెను. అంత జటాయువు నాతోఁజెప్పకయ భూమియందుఁ బడెను. అతఁ డుప్ప రమునుండి నేలకుదిగుచుండుటఁజూచి, నేను ధైర్యవముపదలి, యా జటాయువున కెండసోఁకకుండవలెనని తలంచి నాఱెక్కలతో నాతని దేహముఁ గప్పితిని. నేను పొరపాటున నాఱెక్క లడ్డపెట్టుటవలన, నెండవేఁడిమికి నాఱెక్కలు మాత్రము గాలిపోయినవి. ఆ జటాయువు జనస్థానమునఁ బడియుండునని తలఁచెదను. నేను మాత్రము ఱెక్కలు

గాలుటచే నిశ్చేతనుఁడనై యీ వింధ్యపర్వతమునఁ బడితిని. నేను జేసిన బుద్ధిపూర్వకమైన కర్మముచే రాజ్యమును, దమ్ముని, ఱెక్కలను, పరాక్రమమును బోఁగొట్టుకొని, యిట్లుండుటకంటె మృతినొందుట మేలని యెంచి, యొక్క పర్వతశిఖరమునొంది యచ్చటినుండి పడఁగోరి యున్నాను" అని నే నా నిశాకరమహర్షితోఁ జెప్పితిని.

## 62-వ సర్గము

**సంపాతి వాక్యము**

ఓ వానరులారా! నే నీప్రకార మామునిశ్రేష్ఠునితోఁ జెప్పి వెక్కి వెక్కి యేడ్వఁగా, అంత భగవంతుఁడగు నిశాకరముని కొంత తడవు మనమున ధ్యానించి నాతో నిట్లనియెను. "ఓ సంపాతీ! నీకుఁ గావలసిన నిప్పుడే ఱెక్కలును, పిల్లఱెక్కలును మఱలఁబుట్టును. కన్నులును, మగటిమియు, బలిమియు వచ్చును. నీవలన నుత్తరకాలమున గొప్పకార్యంబు గావలసియున్నదని నేను వింటిని. తపోబలముచే నెఱుఁగుఁగొంటిని. నేను పూర్వికులవలన వినియున్నాను. ఓ సంపాతీ! యిక్ష్వాకువంశమున దశరథుఁడను రాజుండును. ఆతనికి రాముఁడను పేరుగల యొకపుత్త్రుఁడు పుట్టఁగలఁడు. తండ్రి వనవాసముసేయు నిమిత్తమై యానతిచేయఁగా, నప్పుడు సత్యమును దప్పని శూరుఁడయిన యా రాముఁడు తమ్ముని లక్ష్మణుని, భార్యను సీతను దోడ్కొని రాఁగలఁడు. వారు జనస్థానమున నుండఁగా, దేవదానవులకు వధ్యుఁడు గాని రావణుఁడను నొక్క యసురుఁ డా రామునిభార్యను సీత నెత్తి కొనిపోఁగలఁడు. ఆసీతాదేవి మహాపతివ్రతయని కీర్తి వడసినదియగుటం జేసి, రావణుఁడు భక్ష్యభోజ్యవస్తువుల నిచ్చెదనని చెప్పినను, వానిని గైకొనక, భర్తృవిరహజనితశోకసాగరమున మునిఁగి యాతఁడిచ్చినది దేనిని గైకొనదు. అప్పు డింద్రుఁ డా సీత భుజింపకుండుట యెఱిఁగి యమృతముఁ దెచ్చి యీయఁగలఁడు. దేవతలకుఁగూడఁ బొంద నలవికాని యమృతముఁబోలు నాహారమును బొంది, యది దేవేంద్రుఁ డొసఁగినది యని తలఁచి, యందుఁ మీఁదిభాగమును దీసి "నాభర్తయు నామఱఁది యుఁ బుడమిని జీవించియున్నను, లేక దైవత్వమునొందినను ఈ యన్నమును దిందురుగాక" యని నేలఁ బెట్టఁగలదు. రామునిదూతలు వాన

రులు సీతను వెదకుచు రాఁగలరు. పక్షిరాజా! నీవు వారి కా సీత వృత్తాంతము నెఱిఁగింపవలసినది. నీ వెన్ని యిడుములు వచ్చిన నెచ్చటికిఁ బోవలదు. ఇట్టివాఁడ వెక్కడికిఁ బోఁగలవు? దేశమును కాలము నెదురుచూచుచు నుండుము. నీకు మఱల ఱెక్కలురాఁగలవు. నీ కిప్పుడే ఱెక్కలు వచ్చుట నాకిష్టము గాదు. నీ విక్కడ యిచ్చటనే యుందువేని, లోకములకు మేలగుకార్యమును జేయఁగలవు. ఆ రాజపుత్రులకును, బ్రాహ్మణులకును, దేవతలకును, మునులకును, దేవేంద్రునికిని మేలు గోరి, నీ వీకార్యము సేయవలయును. నేనును అన్నదమ్ములగు నా రామ లక్ష్మణులను జూడఁగోరుచున్నాను. చిరకాలము ప్రాణములతో నుండ సమ్మతిలేదు. నే నీశరీరము వదలఁగలను" అని సకలతత్త్వార్థసూక్ష్మముల నెఱింగిన యమ్మహర్షి నాతో నీవిధమునఁ జెప్పెను.

## 63-వ సర్గము

### సంపాతి వాక్యము

మాటలాడువారిలో నేర్పరియగు నిశాకరమునీంద్రుడు నాతో నీమాటలును, ఇంకఁ బెక్కుమాటలును మాటాడి, నన్నూఱడించి, వీడ్కొలిపి తనయాశ్రమమునకుఁ బోయెను. నేనును తరువాత మెల్ల మెల్లఁగాఁ బర్వతగుహనుండి ప్రాఁకుచు వచ్చి, పైకెక్కి, మీరాక కెదురుచూచితిని. ఇప్పటి కీసంగతి నడచి, పూర్ణముగా వేయియేండ్లు గడచినవి. అయినను, అమ్మునీంద్రునిమాటను మనసునఁ బెట్టుకొని, యెప్పు డెచ్చట నావానరులను జూడఁగలనని యెదురుచూచితిని. నిశాకరమునీంద్రుఁడు మహాప్రస్థానముఁ బొంది స్వర్గతుఁడైనపిదప, నాకుఁ బెక్కు సంశయములు గలుగుటచే నేను గడు దుఃఖము నొంది, "మన మిఁక జీవింపరాదు. ప్రాణములు విడువవలసినదే" అని నిశ్చయ చేసికొని, మఱల మునివాక్యములు తలఁచికొని యింతకాల మూరక యుంటిని. నా ప్రాణములరక్షణముకొఱకయి యా మునీంద్రుఁ డేమి మాట చెప్పెనో, ఆ మాటయే దీపము చీఁకటిని పోఁగొట్టునట్లు నావెత నడఁగించుచున్నది. దురాత్ముఁడయిన రావణునిమగఁటిమి నెఱిఁగిన వాఁడను గనుక నేను నాపుత్రునిఁజూచి "ఓరీ నాయనా! రావణుఁడు సీతనెత్తుకొని పోవునప్పు డేల చూచుచుంటివి? రావణునిచేతిలోనుండి

పట్టువదలించి యాసీత నేల కాపాడవయితివి” అని బెదరించితిని. ఆ సీతా దేవియొక్క విలాపమును విని, సీతాదేవి నెడఁబాసి విచారంపడుచున్న యా రామలక్ష్మణులను దలఁచుకొని, దశరథునిమీఁదఁ బ్రేమయుంచి, నాపుత్త్రుఁడు సీతను విడిపించుకొని నాకు సంతోషముఁ గలిగింపఁజాలఁ డయ్యెను” అని సంపాతి యంగదాదులతోఁ జెప్పెను.

సంపాతి వానరులతోడ నిట్లు మాటాడుచుండఁగా, వానరుల యెదుటనే యా ముని యనుగ్రహమునఁజేసి యా సంపాతికి ఱెక్కలు పుట్టెను. అప్పుడు సంపాతి తనదేహ మెల్లను ఱెక్కలతోఁ గప్పఁబడి యుండుటఁజూచి యపారసంతోషమునుబొంది వానరులనందఱంజూచి, “ఆ సాటిలేనిప్రభావముగల నిశాకరమునీంద్రుని ప్రభావమువలననే సూర్యునికిరణములకుఁ గాలిపోయిన ఱెక్కలు మఱల పుట్టినవి. తొల్లి నేను ప్రాయముననుండునప్పు డెంత బలపరాక్రమములు గలవాఁడనై యుంటినో, ఇప్పుడుగూడ నంతటి బలపరాక్రమంబులు గలవాఁడ నైతిని. మీరన్ని తెఱఁగులఁ బ్రయత్నముసేయుఁడు. సీత దప్పక దొరకఁ గలదు. నాకిప్పుడు ఱెక్కలు వచ్చుటయు మీ కార్యసిద్ధికి సూచనమే” అని పక్షీంద్రుఁడయిన సంపాతి వానరులతోఁజెప్పి, తనకుఁ గ్రొత్తగా వచ్చిన ఱెక్కలబలిమిఁ జూడఁగోరినవాఁడై యాకాశమున కెగిరెను. అంత వాయువుంబోలు మగఁటిమిగల వానరశ్రేష్ఠులును సంపాతి మాటను విని మిక్కిలి యానందభరితులై, పరాక్రమము చూపుటకును మేలొందుటకును గోరి, యుత్సాహముపూని, యా సీతాదేవిని వెదకఁ బూని, దక్షిణదిక్కును గూర్చిపోయిరి.

## 64-వ సర్గము

### వానరులు దక్షిణసముద్రము సేరుట

సింహవిక్రములగు వానరశ్రేష్ఠులు సంపాతివలన సీతయున్న స్థలము నెఱిఁగినవారై, యంద ఱొక్కటిగాఁగూడి కిలకిలారవములు సేసి, సీతను జూచుటకై రావణునిమనికియగు లంకాపురమునకుఁ బోవు టకై సముద్రమునకుఁ దఱలిరి. భీకర బలపరాక్రమములుగల యా వానరేంద్రు లాప్రదేశముదాఁటి, మహాప్రపంచముయొక్క ప్రతిబిం బమో యనునట్లుండు దక్షిణసముద్రమునుజూచి, దాని యుత్తరపు

గట్టుచేరి యచ్చట విడిసిరి. వానరశ్రేష్ఠులందఱు నీటియందు విహరించు చున్న వికృతరూపముగలవి, గొప్ప మేనుగలవియు, నోలుతెఱచికొని యున్నవియు నగు పెక్కుజంతువులతోఁ గూడినదియు, నలలచే నల్లోల కల్లోలమైనదియు, ఒక్కచోట నిద్రించునట్లు నెమ్మదిగను, మఱియొక చోటఁ గ్రీడించునట్లును నుండునదియు, కొన్నిచోట్ల పర్వతములం బోలు జలసమూహములతోఁ గూడినదియు, పాతాళలోకముననుండు రాక్షసులచే వ్యాపింపఁబడినదియు, దేహమునకు గగ్గురుపాటొదవించు నదియు, ఆకాశమువలెఁ దెలియరాని యావలిగట్టుతోఁ గూడి నదియునైన సముద్రమునుజూచి, వెంటనే విచారమునొంది యెట్లీ సముద్రము దాఁటఁగలమని పలికిరి.

వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు సముద్రముఁ జూచుటచే "మన మెట్లీ సముద్రమును దాఁటఁగలము?" అని దిగులుపడియుండు సైన్య మునుజూచి, "మీరు భయపడవల" దని యూరడించెను. అట్లు బుద్ధి మంతుఁడును, బలవంతుఁడునునైన వాలినందనుఁడగు నంగదుఁ డెంత యూఱడించినను, గడు వంతతోఁ జలికిలఁబడియున్న వానరశ్రేష్ఠుల నందఱను జూచి, "మీరు విషాదము నొందవలదు. విషాదము మహా దోషము. పసివట్టిన పాము బాలునిఁజంపునట్లు, విషాదము పురుషునిఁ జంపును. పరాక్రమము చూపవలసినప్పు డెవఁడు విషాదమునొందునో, అట్టి ప్రతాపహీనుఁడైనవానికిఁ గార్యము సిద్ధింపనేరదు" అని చెప్పి యారాత్రి యందఱితో నచ్చటఁ గడపెను. మఱునాటియుదయమున నంగదుఁడు వృద్ధులయిన వానరులతో నాలోచింపఁదలఁచెను. వానర సేనల నంగదుఁడు హనుమంతుఁడును దప్ప నెవ్వరును నిలుపఁజాలరు గనుక, అప్పుడు వానరులందఱు, దేవతలు దేవేంద్రునిచుట్టు నిల్చిన చందమున నా యంగదుఁ జుట్టునుకూడియుండిరి.

అంతటఁ గాంతిమంతుఁడయిన యంగదుఁడు వృద్ధులగు వానరు లను, తక్కిన సైనికులనుజూచి గొప్ప యర్థముగలుగు మాట చెప్పఁ బూని, "ఏ పరాక్రమశాలియగు వానరుఁ డిప్పు డీ సముద్రమును దాఁటఁగలఁడు? ఏవానరుఁడు శత్రుసంహారియగు సుగ్రీవుని యథార్థ వాదినిగాఁ జేయఁగలఁడు? వానరులారా! యే వానరవీరుఁ డీ నూఱు యోజనముల దూరమును దాఁటి, సీతాదేవిం జూచివచ్చి, యా

యూథపాలురగు వానరులనందఱను ఈ మహాభయమునుండి విడిపింపఁ గలఁడు ? ఎవని ప్రభావమువలన మనము గార్యము సాధించికొని యిచ్చటినుండి యూరికిఁబోయి, ఆలుబిడ్డలను, ఇంట్లువాఁకిళ్ళను బొంది సుఖముతో నుండఁగలము ? ఎవనియనుగ్రహమువలన మనము కార్యమును సాధించికొని సంతసముతో బలవంతులగు రామలక్ష్మణ సుగ్రీవుల సన్నిధానమును బొందఁగలము ? వానరవీరులారా ! మీలో నెవ్వఁడైన నూఱుయోజనములు సముద్రమును దాఁటఁగలవాఁ డుండునేని, ఆతఁ డిప్పుడు మా కభయదక్షిణ నొసఁగునుగాక! దాన మహాపుణ్యము వానికిఁ గలుగును" అని వానరులతోఁ జెప్పఁగా, నా సేనలో నొక్కఁడయిన నొక్కమాటయు బదులు చెప్పకుండెను. ఆ వానరసేనయెల్లనిశ్చలముగానుండెను. అంతట నంగదుఁ డావానరులంజూచి, "ఓ వీరులారా! మీరు బలవంతులలో మేటులు; దిట్టమయిన పరాక్రమము గలవారలు ; గొప్ప కులములందుఁ బుట్టినవారలు ; పలుమాఱు గొప్ప కార్యములు గావించి మన్ననలఁ బడసియుండువారలు. మీలో నొక్కనికి నెప్పుడును, ఎచ్చటికిని బోవుటకు నడ్డంకిలేదు. కావున మీలో నెవ్వని కెవ్వని కెంతెంతదూరము దాఁట శక్తిగలదో చెప్పుఁడు" అని వానరవీరుల నడిగెను.

## 65-వ సర్గము

### వానరవీరులు తమతమశక్తులం దెలుపుట

అంతట గజ, గవాక్ష, గవయ, శరభ, గంధమాదన, మైంద, ద్వివిద, సుషేణ, జాంబవంతులనెడు వానరోత్తములందఱు సముద్రము దాఁటువిషయమునఁ దమకుఁ దమ కెంతటి శక్తియున్నదో, దాని నంగదునికి దెలిపిరి.

ఆ వానరులలో గజుఁడు పదియోజనములు, గవాక్షుఁ డిరువది యోజనములు, గవయుఁడు ముప్పదియోజనములు, శరభుఁడు నలువది యోజనములు, మహాపరాక్రమశాలియగు గంధమాదనుఁడు నిస్సంశయముగా నేఁబదియోజనములు, మైందుఁ డఱువదియోజనములు, ప్రతాపశాలియగు ద్వివిదుఁడు సందియములేక డెబ్బదియోజనములు,

వానరశ్రేష్ఠుఁడగు సుషేణుఁడు ఎనుబదియోజనములు దాఁటఁగలమని చెప్పిరి.

అట్లు వారందఱు తమతమ లావులం జెప్పినతరువాతఁ బండు ముసలివాఁడయిన జాంబవంతుఁడు వారి యందఱి సెలవుగైకొని, వారిఁ జూచి, "తొల్లి నేనును నడకయం దెక్కువ వడిగలవాఁడనై యుంటిని. అప్పు డట్టివాఁడనైనను, ఇప్పుడు ముసలితనంబు నొందినవాఁడనైతిని. అయినను రాముఁడు స్వకార్యమును సుగ్రీవునితోఁ జెప్పఁగా, సుగ్రీవుఁడు, నేను సాధించెదనని చెప్పియుండఁగా, నే నుపేక్షించియుండుట యెంతమాత్రము తగదు. ఇప్పుడు ముసలివాఁడనైనందున నాకిప్పుడు శక్తి యెంతమాత్రమనిన, నేనిప్పుడు నిస్సంశయముగాఁ దొంబది యోజనములు దాఁటఁగలను. పూర్వము నాకున్న శక్తియంతయెకాదు. తొల్లి నేను ప్రాయమున నున్నప్పుడు మహాబలిచక్రవర్తి యాగము చేయుచుండఁగా, ఆదిదేవుఁడయిన విష్ణువు మూఁడడుగుల భూమి యాచించి, దానిని గొల్చుటకై తన యాకారము పెంచినసమయమున, నాత్రివిక్రమరూపధారియగు విష్ణువును బ్రదక్షిణముగాఁ జుట్టివచ్చితిని. నేను ప్రాయమున నున్నపు డొరులకుఁ బొందనలవికాని గమనబలము గలవాఁడనైయుంటిని. ఇప్పుడు ముసలివాఁడ నగుటచే నానాఁటికి గమనశక్తియుఁ దగ్గిపోయెను. ఇప్పుడు నాకుండు శక్తి యింతమాత్రమే యని యూహించెదను. నూఱుయోజనముల దూరము దాఁటవలసి యుండఁగాఁ దొంబదియోజనములు దాఁటుటచే నేమి యుపయోగము? ఇంతమాత్రమున మనకార్యము సిద్ధింపనేరదు" అని యంగదాదులతోఁ జెప్పెను.

అంతట నంగదుఁడు గొప్ప పండితుఁడయిన జాంబవంతుని యనుజ్ఞగైకొని, వానరులంజూచి, "ఓ వానరులారా! నేనీ నూఱుయోజనముల దూరము దాఁటఁ గలుగుదుఁగాని, మఱలవచ్చునప్పు డీశక్తి యుండునో, యుండదోయని సంశయించుచున్నా" నని తన గొప్పతనమునకుఁ దగిన యర్థగౌరవముగల మాటను జెప్పెను.

వానరోత్తముఁడగు జాంబవంతుఁ డంగదుం జూచి, వానరసత్తమా! నీకుఁగల ప్రయాణశక్తి నే నెఱుఁగుదును. నీకు స్వేచ్ఛగా నూఱే కాదు వేయియోజనముల దూరమైనను దాఁటను, మఱల

నచ్చుటనుండి తిరిగి వచ్చుటకును శక్తిగలదు. అయినను నిన్నీపని కాజ్ఞాపించుట యుక్తముగాదు. యజమానుఁడు భృత్యులను బంపువాఁడే కాని, యెప్పటికిని భృత్యులచేఁ బంపఁదగినవాఁడు కాఁడు. వానరోత్తమా! మేమెల్లరము నీచేఁ బంపఁదగినవారమే కాని నిన్నుఁ బంపునంతటివారము కాము. నీవు మాకు రక్షింపఁదగినవాఁడవు; అధికారిగా నియమింపఁబడినవాఁడవు. రాజు సేనకురక్షింపఁదగినవాఁడు. కావున మగండన్ని తెఱఁగులఁ బెండ్లామును గాపాడినట్లు, సేనలెల్లపుడు తమ యజమానునిఁ గాపాడవలయును. అట్లే నిన్ను మే మందఱమును గాపాడవలయును. శత్రుసంహారీ, నీ విక్కార్యమునకు మూలమైనవాఁడవు. చెట్టునకు వేఱు పదిలముగానున్న నే, యా చెట్టునఁ బువ్వులు, కాయలు మొదలగునవి పుట్టుచుండును. అట్లే యీ కార్యమునకుఁ గారణమైన నిన్నుఁ గాపాడుచుండినచో, కార్యము చక్కఁబడును. తఱుగని మగతనముగలవాఁడా! బుద్ధిబలమును బాహుబలమును గలవాఁడవైన నీవే యీ కార్యసాధనమునకుఁ గారణమవు. కపివీరుఁడా! నీవు మాకు రాజవు. రాజపుత్త్రుఁడవు. నీయండనుంటిమేని, మే మెంతటి పనినైనను సాధింపఁగలము" అని చెప్పఁగా, నంగదుఁ డట్లు చెప్పిన యా గొప్ప చదువరియైన జాంబవంతునితో నిట్లు బదులుసెప్పెను.

"మఱి నేను బోకపోతినేని, యింక దాఁటఁగలవాఁడు మఱొక్కఁడు లేఁడు. ఇప్పుడు మన మందఱము మఱల ప్రాయోపవేశము సేయవలసినదే. తెలివికాఁడగు నా వానరశ్రేష్ఠుఁడయిన సుగ్రీవు నానతిని నెఱవేర్పక యచ్చటికిఁ బోయినను ప్రాణములను గాపాడుకొనఁజాలము. ఆ సుగ్రీవుఁడు సంతోషించినయెడ, మనల రక్షింపను, కోపమువచ్చిన మనలను శిక్షింపను గలఁడు. ఆతనియాజ్ఞ మీఱి యచ్చటికిఁ బోతిమేని, మనకుఁ జావు తప్పదు. కావున నిక్కార్యమెట్లు విపరీతముగాదో యట్టి యుపాయమును కార్యముల నెఱిఁగినవాఁడవైన నీవే యాలోచించి చెప్పవలయును" అని చెప్పఁగా, వీరుఁడైన వానరోత్తముఁడగు జాంబవంతుఁ డాయంగదుని నుద్దేశించి, "యోయంగదా! యీ నీకార్య మెన్నఁటికిని జెడదు. ఈకార్యమును సాధింపఁగలవాని నిదిగో పురికొల్పుచున్నాఁడను" అని చెప్పి, యేకతంబున సుఖముగాఁ గూర్చున్నవాఁడును, ప్రసిద్ధికెక్కినవాఁడును, దాఁటగల

వారిలో మేటియు, వానరోత్తముఁడునునైన హనుమంతునే సముద్రమును దాఁటుటకుఁ బ్రేరణసేయఁ దలఁచెను.

## 66-వ సర్గము

జాంబవంతుఁడు హనుమంతునిఁ బురికొల్పుట

అంత జాంబవంతుఁడు పెక్కు లక్షలకోలఁది వానరసైనికులు మోమునఁ గళలేక విచారముతో నుండుట చూచి, హనుమంతునితో నిట్లనెను. "ఓ హనుమంతుఁడా! వానరు లందఱిలోపల శూరుఁడా, సకలశాస్త్రములందు నిపుణుఁడా! వానరవీరులందఱు తమతమబలములఁ దెల్పుచుండ, నీవేల యొకమూలలో డాగి మాటడకయున్నావు? హనుమంతుఁడా! నీవు బలప్రతాపములచే సుగ్రీవునితో సమానుఁడవు. యోచించిచూచిన, రామలక్ష్మణులతో సమానుఁడవనియు చెప్పనొప్పును. కాశ్యపునకు వినతయందుఁ బుట్టినవాఁడు, బలవంతుఁడు, పక్షులకెల్ల ఱేఁడునైన గరుత్మంతుఁడను వాఁడొక్కఁడుండెను. బలశాలియని పేరువడసిన యా గరుత్మంతుఁడు సర్పమును ముక్కునఁ గఱచికొని సముద్రమున వేగముతోఁ బోవుచుండునప్పుడు, నే నతనిని సముద్రమధ్యంబునఁ బెక్కుమాఱులు చూచితిని. ఆ వైనతేయునకు ఱెక్కలం దెంతటిబల మున్నదో, ఆబలము నీకు బాహువులందె యున్నది. వేగమునందును, మగఁటిమియందును నీ వాతనికిఁ దీసిపోవు. నీయందలి బలము, బుద్ధి, వెలుఁగు, సత్త్వ, యనుగుణము లన్నిభూతములం దున్నవానికంటె హెచ్చుగా నున్నవి.

నాయనా! ముల్లోకములందును బ్రసిద్ధురాలును, భూలోకమున రూపమున సాటిలేనిదియు, కోరినరూపమెత్తఁగలదియు నప్సరలలో శ్రేష్ఠురాలునైన, పుంజికస్థలయను నప్సరస శాపవశమున మహాబలుఁడయిన కుంజరుఁడను వానరేంద్రునికిఁ గూఁతురైపుట్టి యంజనయను పేరువడసి, కేసరియను వానరునికి బెండిలియయ్యెను. ఆపె కపిరూపముతో నున్నను, కోరినరూపం బెత్తఁగలది గనుక, ఒకనాఁడు మానుషరూపము ధరించి, రూపయావనములచేఁ బ్రకాశించుచు, వింత గొల్పుపువ్వులసరములు, సొమ్ములును దాల్చి, మేలిమి పట్టుచీర గట్టు

కొన్నదై, వర్షాకాలపు మేఘముంబోలు పర్వతపుఁ గొనను సంచరించు చుండెను.

అప్పర్వతమున నా మచ్చెకంటి విహరించుచుండఁగా, నామెకట్టిన యెఱ్ఱంచుగల పచ్చపట్టుచీరచెఱఁగు గాలికిఁ గొంచెము దొలఁగెను. అప్పుడా వాయుదేవుఁడు కడుఁజేరిన గుండ్రని తొడలును, ఒండొంటితోఁ గదిసియుండు బలిసిన స్తనములును, మిక్కిలి చక్కనైన మొగమును, విశాలదీర్ఘములైన పిఱుఁదులును, సన్నని నడుమునుగలదై యొప్పులకుప్పయైయున్న సర్వాంగసుందరియగు నాయంజనాదేవిని గాంచినవెంటనే, మన్మథునివలలం దగిలినవాఁడై, యా కాంతనే మనమున ధ్యానించుచు, సర్వాంగములందు మదనుఁడు చొచ్చుటఁజేసి, పతివ్రతయయిన యా యంజనాదేవిని దన నిడుపుచేతులతో దృఢముగాఁ గౌఁగిలించుకొనెను.

ఆ మంచి యాచారములు గలదియగు నంజన యచ్చటనే మ్రాన్పడినదై, "ఎవఁడు నా పాతివ్రత్యమును జెఱుపనున్నాఁడు" అని యడుగఁగా, వాయుదేవుఁ డంజనపలుకులువిని, "ఓసీ చక్కని పిఱుఁదులదానా! సౌందర్యవతీ! నిన్ను నేను బీడింపను. నీకు భయమువలదు. పతివ్రతయని ఖ్యాతివహించిన నీ రూపుచూచి మోహించి, నిన్నుఁ గౌఁగిలించి మనసుచె నీలోపలఁ బ్రవేశించితిని. దాననే నీపాతివ్రత్యమునకు లోపము వాటిల్లదు. నీకు వీర్యవంతుఁడు, బుద్ధిమంతుఁడునైన పుత్త్రుఁడు పుట్టఁగలఁడు. అతఁడు మహాబలుఁడు, మహాతేజుఁడు మహాపరాక్రముఁడునై, దాఁటుటయందును, దుముకుటయందును నన్నుఁ బోలియుండును" అని చెప్పఁగా నంజన సంతోషపడినదై యుండి, యావల వానరోత్తముఁడవయిన నిన్నొక గుహాయందుఁ బ్రసవించెను.

అంతట నీవు పుట్టినతోడనె పసిబాలుఁడవుగా నుండునప్పుడే యమ్మహారణ్యమున సూర్యుఁ డుదయించుటగని, యది పండని భ్రమించి యా పండును దినఁగోరిన వాఁడవై పైకెగిరి, యాకాశమునకుఁ బోతివి. నీ వట్లు మున్నూఱుయోజనముల దూరమేగి, యా సూర్యుని యెండవేఁడిమి సోఁకుచున్నను, గొంచెమైన నలసటనొందవైతివి. వానరోత్తమా! నీవు మహావేగముతో నాకాశమునఁ జనుచుండఁగా, ధీమంతుఁడయిన దేవేంద్రుఁడు మిక్కిలి కోపముతోఁగూడినవాఁడై, వజ్రా

యుధముం బ్రయోగింపఁగా, నీయొక్క చెక్కిలి పర్వతంపుఁగొనకుఁ దగులుటచేఁ జీలెను. కావుననే నీకు హనుమంతుఁడని పేరువచ్చెను. దేవేంద్రుఁడు నిన్ను వజ్రాయుధముతోఁ గ్రిందఁద్రోసి, చెంపఁ బగులఁ గొట్టుటను జూచి, యన్నిటిని విఱుగఁద్రోయువాఁడు, నెత్తావిగొను వాఁడునైన వాయుదేవుఁడు మిక్కిలి యాగ్రహము నొందినవాఁడై ముల్లోకములందును వీవకుండెను. అప్పుడు మూఁడులోకములవారు నూపిరాడక మిక్కిలి కలఁతనొందిరి. అంత వేల్పులు దిగులుచేఁ దత్తర పడి, యాగ్రహగ్రస్తుఁడై యున్న వాయుదేవుని శాంతపఱచి యథా ప్రకారముగా వీవఁజేసిరి. సత్యపరాక్రమా! వాయువు శాంతుఁడగు టయు, బ్రహ్మదేవుఁడు నీవు శస్త్రములచేఁ జంపఁదగినవాఁడవు గాకుండు నట్లు వరమొసఁగెను. వజ్రాయుధము ప్రయోగించినను నీకు నొప్పి లేకుండుట జూచి వేయికన్నులవేల్పు మెప్పువడసి, నీ కిచ్చవచ్చినప్పుడు మృతినొందునట్లు వరమొసఁగెను.

పగతురఁ వెఱపించు బల్మిగల హనుమంతుఁడా! నీవు కేసరికి క్షేత్రజపుత్త్రుఁడవు. వాయువున కౌరసపుత్త్రుఁడవు. ప్రతాపమునను, నాతనితో సమానుఁడవు. ఓ పిన్నవాఁడా! నీవు వాయునందనుఁడవు గనుక, దాఁటుటయందు నాతని కీడయినవాఁడవు. నేర్పు, మగటి మియుఁ గలిగి, మాఱురూపమెత్తిన గరుడుఁడో యనఁదగినవాఁడవు. మే మిప్పు డించుమించుగా ప్రాణముపోయినవారివలె నున్నారము. కావున నీవిప్పుడు మమ్ము రక్షింతువుగాక. ఓరి నాయనా! విష్ణువు త్రివిక్రమావతారమెత్తినప్పుడు నేను భూమండలమెల్లఁ బర్వతా రణ్యములతోఁగూడ నిరువదియొక్కమాఱు చుట్టివచ్చితిని. మఱియు నమృతము చిలికినప్పుడు దేవతలపంపున నేను పెక్కు మూలికలు సంపా దించితిని. వాని నన్నింటిని వేసి చిలుకుటచేతనే సముద్రమున నమృతము పుట్టినది. ఆ సమయమున మాకెక్కువ బలముగలిగినది. అప్పు డట్టి వాఁడనయిన నేనిప్పుడు ముసలివాఁడను; బలముడిగినవాఁడను. ఇచ్చట నుండువారందఱిలోపల నీవె సకలగుణములతో నిండిన వాఁడవు. దాఁటువారిలోపల నుత్తముఁడవు గావునఁ బరాక్రమము పూనిన వాఁడవై నీయొడలిని బెంచుము. వానరవీరుఁడా! యీ కోఁతిమూఁక యెల్ల నీ వీర్యమును జూడఁగోరి యున్నది లెమ్ము. మహాసముద్రమును

దాఁటుము. హనుమంతుఁడా! లోకమున నీతో సమానముగాఁ బోవు వాఁడు లేఁడు. హనుమానుఁడా! వానరులందఱు మిణఁకరించుచుం డఁగా, నీవేల యిట్లుపేక్షసేయుచున్నావు. ఇది నీకుఁ దగదు. విష్ణువు త్రివిక్రమావతారమెత్తి మహావేగముతోఁ బుడమినెల్ల మూడడుగులతోఁ గొల్చినట్లు నీ వీ సముద్రము నొకదాఁటుతో నెగిరి దాఁటుము" అని జాంబవంతుఁడు హనుమంతునితోఁ జెప్పెను. అంతటఁ బ్రసిద్ధ వేగముగల వాయునందనుఁడగు హనుమంతుఁ డట్లు జాంబవంతుని ప్రేరణచే నావానరసేనను సంతసింపఁజేయుచుఁ దనరూపమును బెంచినవాఁడయ్యెను.

## 67-వ సర్గము

### హనుమంతుఁడు లంకకుఁ బయనమగుట

అంతట నూఱుయోజనములదూరము దాఁటుటకై పెరుగుచు, నప్పటికప్పటికిఁ బెంపొందుచున్న దేహముగలవాఁడై యున్నవాఁడును, బలవంతులలోపల నుత్తముఁడునైన హనుమంతునిఁజూచి, తత్క్షణమే వానరులు శోకముఁబాసి, యత్యానందముతోఁగూడినవారలై, సింహనాదముచేసి, యా హనుమంతునిఁ బొగడిరి. ప్రజలు త్రివిక్రమావతార మెత్తఁగలందులకై యుత్సహించుచున్న విష్ణువునుంబోలె నా వానరవీరులు సంతోషాశ్చర్యములుగలవారై యా హనుమంతునిఁ జూచుచుండిరి.

అట్లు వారు స్తోత్రములు సల్పుచుండఁగా, బలశాలియగు హనుమంతుఁడు తోఁక యాడించియుఁ దన యాకారము పెంచి, సంతసముచే నప్పటప్పటి కెక్కువబలమునొందెను. పెద్దలగు వానరపుంగవులు స్తోత్రముచేయుచుండఁగా, పరాక్రమముచే నిండిన యా హనుమంతుని రూపము చూపఱ కత్యద్భుతముగాఁ దోఁచెను. కొండగుహాయం దొక సింహము పెరుగుచు నెల్లు వ్యాపించునో యట్లు లావాయునందనుఁడును దన దేహమును మిక్కిలి పెంచెను. అవ్విధమునఁ బెరుగుచున్న ధీమంతుఁడయిన హనుమంతుని మోము మండుచున్న పేఁపుడు మంగలమువలెను, పొగలేకుండ మండుచున్న యగ్నిహోత్రునికైవడియు వెలుఁగుచుండెను.

అప్పుడు హనుమంతుఁడు సంతోషముచే గగ్గురుపాటు నొందినవాఁడై, ముదుసలులయిన వానరవీరుల నందఱిని నమస్కరించి, "యగ్నిహోత్రునికి నెచ్చెలియు, బలిమిగలవాఁడు, కొలఁతపెట్టరాని రూపముగలవాఁడు, ఆకాశసంచారము చేయువాఁడునైన వాయుదేవుఁడు తన వేగబలముచేఁ బర్వతాగ్రములను విఱిచెను. అట్టి తీక్ష్ణ బలముగలవాఁడు, వడిగాఁ బోవువాఁడునైన మహాత్ముఁడయిన మారుతునికి నౌరసపుత్త్రుఁడను. దాఁటుటయందు నాతో సమానుఁ డొక్కరుఁడు లేఁడు. విశేషవిస్తారముగలిగి నింగి నొఱయుచున్నట్టులుండు మేరుపర్వతమును శ్రమలేకుండ వేయిమాఱులైనను జుట్టిరాఁగలను. నేను నాబాహువులవేగముచే సముద్రంపునీటిని జల్లి పర్వతనదీతటాకములతోఁగూడ లోకమును ముంచఁజాలుదును. నాతొడలయుఁ బిక్కలయు వేగమునకు వరుణుని కునికిపట్టగు సముద్రమును దానిలోపలనున్న గొప్ప మొసళ్లతోడ మీఁదికెగయునట్లు చేయఁగలను. పక్షులు నిండిన యాకాశమునఁ దిరుగునట్టి గరుత్మంతునిఁ గడు వేగముతో వేయిమాఱులైనను జుట్టివచ్చుటకుఁ జాలియుందును. సూర్యుఁ డుదయపర్వతమునుండి వెడలినపుడు నేనతనితోడ బయలుదేఱి, యస్తపర్వతమునకుఁ బోయి మఱలి యాతఁడు ఆకాశమధ్యమునఁ గిరణంబులఁ బ్రసరింపఁజేసి, వెలుఁగుచున్నప్పుడే, ఓవానరపుంగవులారా ! పుడమిని దాఁకకయే మహాభీమబలముతోడనె మఱల సూర్యు నెదుర్కొనఁ జాలుదును. అంతియకాక, యాకాశమున సంచరించు భూతముల నన్నింటిని దాఁటి పోఁగలను. వానరులారా ! నేనాకసమున నెగురుచు సముద్రము నింకింపఁగలను; పుడమిని బ్రద్దలుసేయఁగలను, పర్వతములను నుగ్గుసేయఁగలను. నేను పైకెగిరి, తొడలవేగముచే గొప్ప సముద్రమును గూడఁ గొనిపోఁగలను.

నేనాకాశమున వేగముతో నెగురునప్పుడు, అన్నివృక్షములయు, తీఁగలయుఁ బుష్పములు నన్ను వెంబడించిరాఁగలవు. అట్లు నా మార్గము పుష్పములచే నిండియుండుటచే నాకాశమునందలి స్వాతీ నక్షత్రమార్గమువోలె నుండఁగలదు. వానరులారా ! నేనాకసమునఁ బోవునప్పుడుగాని, పుడమినుండి పైకెగురునప్పుడుగాని, క్రిందకుదిగునప్పుడుగాని సకలభూతములు నన్నాశ్చర్యముతోఁ జూచును. వానరు

లారా! నేను మహామేఘమువంటి శరీరముతో నాకాశమును మ్రింగు వానికైవడి నాకాశమును గ్రమ్ముచుఁ బోవునప్పుడు నన్ను మీరును జూడఁగలరు. ఏను పూనికతో దాఁటునప్పుడు మేఘములఁ జెదరఁ గొట్టఁగలను. పర్వతములఁ గదలింపఁగలను. సముద్రమును గలఁత వెట్టఁగలను. అంతటిశక్తి గరుత్మంతుని కొండె, నాకొండె, నాతండ్రి యగు వాయుదేవునికొండె యున్నదిగాని తక్కినవారికి లేదు. కడు వడిగల గరుత్మంతుఁడు వాయుదేవుఁడు తప్ప మఱొక్కఁడు నేఁ బరుగెత్తునప్పుడు నన్ను వెంబడించి రాఁజాలఁడు. కనుమూసి కనుదెఱచునంతలోపల మేఘమునుండి మెఱుపు హఠాత్తుగా తోచునట్లు పుడమినుండి యాకాశమున కెగురఁగలను. నేను సముద్రమును దాఁటునప్పుడు, నారూపము, బలిచక్రవర్తి యొసఁగిన మూఁడడుగుల భూమిని గొల్చుటకై ధరించిన త్రివిక్రమావతారుఁడగు విష్ణువు రూపమువలె నుండఁగలదు. వానరులారా! నాబుద్ధికి సీతఁ జూడఁగలనని తోఁచుచున్నది. నామనస్సును నంత యుత్సాహముగలిగియున్నది. నాచేష్టలు నట్లేయున్నవి. నేనెట్లులైనను సీతను జూడఁగలను. మీరు సంతసముతో నుండుఁడు. నేను వేగమునందు వాయువును, బలమున గరుత్మంతునిఁబోలినవాఁడను. గావున నేను బదివేలయోజనముల దూరమైన నేగఁగలనని తలఁచుచున్నాఁడను. వజ్రాయుధమును బట్టిన యింద్రునియొక్కగాని తనంతఁబుట్టిన బ్రహ్మదేవునియొక్కగాని చేతినుండి యమృతమును శీఘ్రముగాఁ దేఁగలను. లంకాపట్టణమును బెళ్ళగించుకొనినైన రాఁగలనని నేను దలఁచెదను. అని యిట్లు వానరవీరుఁడగు హనుమంతుఁడు తన ప్రతాపము దేజరిల్లుచుండ ఱొప్పుచుఁ జెప్పినమాటను విని యందఱు వానరులు సంతోషముఁ బొంది విస్మయముతోఁజూచుచుండిరి.

బంధువులకు శోకనాశకమయిన యా హనుమంతునిమాటను విని జాంబవంతుఁడు పరమానందమునొంది హరివీరుని హనుమంతు నుద్దేశించి, "వీరుఁడవు, కేసరికి క్షేత్రజుఁడవు, వాయువున కౌరసుఁడవునైన యో హనుమంతుఁడా! నాయనా! బంధువులకుఁగలిగిన విస్తారశోకమును నీవు పోఁకార్చితివి. మంచికాంతిగల వానరులందఱు గూడి నీవుపోయెడి కార్యము సిద్ధించునిమిత్తమై, యదేమనస్సుతో నీశ్వర

ధ్యానాదులగు శుభకార్యములఁ జేయఁగలరు. ఋషులయనుగ్రహము వలనను, వానరవృద్ధుల దీవనలబలమువలనను, గురువులయనుగ్రహము వలనను నీవు సముద్రమునుదాఁటుము. మా యందఱి ప్రాణములు నిన్నుఁ బొందియున్నవి గావున, నీవు వచ్చునంతవఱకు మే మొంటికాలి మీఁద నిలఁబడియుండుము" అని చెప్పెను.

అంతట వేగమున వాయువునుబోలువాఁడు, శత్రువుల నణఁచు వాఁడు నైన హరిశార్దూలుఁ డా వానరులను జూచి, "నే నెగురు నప్పుడు, భూమి నావేగమును దాళఁజాలదు. ఒండొంటితోఁ గ్రిక్కిఱిసి యుండు బండలుగల యీ మహేంద్రపర్వతముయొక్క శిఖరములు కదలనివియు, గొప్పవియునైయున్నవి. పెక్కు వృక్షములచే నిండిన వియు, అంతట వ్యాపించిన గైరికాది ధాతువులయొక్క కాంతులుగల వియునైన యీ మహేంద్రపర్వతశిఖరము లెక్కి యచ్చటినుండి నే నెగిరెదను. వానరవీరులారా! యీపర్వతశిఖరములే యిచ్చటనుండి నూఱుయోజనములదవ్వు దాఁటఁబోవు నా కాళ్ళతాఁకుడు నోర్వఁగ లవు" అని పలికి యా మహేంద్రమను పర్వతశ్రేష్ఠమునెక్కెను.

ఆ మహేంద్రమను పర్వతము నానావిధములగు వృక్షములచేఁ జుట్టఁబడినదియు, జింకలతోఁగూడిన పచ్చికబయళ్లు గలదియు, తీఁగెల జొంపములతోను, పువ్వులగుత్తులతోను గ్రిక్కిఱిసినదియు, విడువని పుష్పఫలసమృద్ధిగలదియు, సింగములును, పులులును, మదపుటేనుఁగు లును గలిగి, మదించిన పక్షులగుంపులకూఁతలతో నిండినదియు, గొప్ప నీటిప్రవాహములచే నల్లకల్లోలమైనదియు, మహోన్నతశిఖరములు గలదియునై సొంపుమీఱియుండెను. బలవంతుఁడును, దేవేంద్రునిఁబోలు విక్రమముగలవాఁడునైన వానరవీరుఁ డా పర్వతోత్తమమునెక్కి తిరుగు చుండెను. బలవంతుఁడైన యా హనుమంతుని కాళ్ళత్రొక్కుళ్ళకు నొచ్చిన యా మహేంద్రనగరము సింహముచేఁ ద్రొక్కఁబడిన గొప్ప మదపుటేనుఁగుకైవడిఁ బ్రకాశించెను. మఱియు నాపర్వతమునందలి బండలెల్లఁ గదలి గొప్ప యూటనీటిప్రవాహములు పుట్టెను; ఏనుఁగులు మొదలగు మృగములు వెఱచి యిట్టటు పరుగెత్తెను, చెట్లెల్లఁ గద లెను, మధుపానపరవశులైయున్న నాగులయు గంధర్వులయు దంప తులు నా కొండచరియలనుండి తొలఁగిపోయిరి. పక్షులెల్ల నెగిరి

పోయెను. శిఖరములందలి తాలగుంపులెల్లఁ గదలెను. పుట్టల లోపలనుండు పాములెల్ల నడలి పైకి దమపడగలెత్తి బుసకొట్టుచుం డుటవలన నాపర్వతము టెక్కెములతోఁగూడినదో యన్నట్లు వెలుఁగు చుండెను. ఆపర్వతమునఁ దపస్సు చేయుచుండిన ఋషులు భీతిచేఁ దత్తర పడి వేఱు ప్రదేశములకుఁ బోవుటచే నాపర్వతము, తోడులేక పోవు టచే గొప్ప యడవియందు భీతినొంది, చదికిలఁబడిన బాటసారికైవడిఁ గనఁబడఁజొచ్చెను. అప్పర్వత మట్టిస్థితియందుండఁగా, శత్రుసేనల సం హారించువాఁడు, వడిగలవాఁడు, వడిగఁబోవుటయం దాస్థగలవాఁడు, కీర్తిమంతుఁడునైన మహాసమర్థుఁడగు హనుమంతుఁడు మనస్సును గుదుటఁ బఱచికొని, యప్పుడే లంకాపురమును మనస్సుచేఁ బొందినవాఁడయ్యెను.

కిష్కింధాకాండము సమాప్తము

ఓం, తత్, సత్.

కిష్కింధాకాండ పఠన శ్రవణములకు ఫలము

శ్లో. కిష్కింధాఖ్య మిమం శృణ్వన్ పఠన్ వాపి విధానతః,
ఇహ సంపూజితః సర్వై ర్వరంతే బ్రహ్మణి లీయతే.

ఏమానవు డీకిష్కింధాకాండమును చదువుచున్నాఁడో, లేక వినుచున్నాఁడో, వాఁ డీలోకమున నందఱిమన్నన వడసి యంతమునఁ బరబ్రహ్మయందు లయించుచున్నాఁడు.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951

# వచనగ్రంథములు

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటము | ... | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనమహాభారతము:— | | | |
| ,, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, అరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | ... | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము:— | | | |
| బాలకాండము | ... | 2 | 8 |
| అయోధ్యాకాండము | ... | 5 | 0 |
| అరణ్యకాండము | ... | 2 | 8 |
| తక్కినకాండలు | అచ్చగుచున్నవి | | |
| పంచతంత్రహితోపదేశకథామంజరి | ... | 1 | 12 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| న్యాయవిచారణ, (ప్రమాణసము) | ... | 0 | 12 |
| శ్రీతిలకుగారి సెక్యూరిటీకేసుఉపన్యాసములు | ... | 0 | 14 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| భారతరమణీమణులు, 1 భాగము | ... | 1 | 4 |
| డిటో 2 భాగము | ... | 0 | 10 |
| డిటో 3 భాగము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, శ్రీచిన్నయసూరి, | ... | 0 | 12 |
| ,, టీకతో | ... | 1 | 4 |
| పంచతంత్రము, వచనము | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| పతివ్రతలచరిత్రలు | ... | 3 | 0 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I-భాగము | ... | 1 | 0 |
| II-భాగము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| సంస్కృతనాటకకథలు 1,2 భా॥ చ. సీతారామశాస్త్రి | ... | 2 | 0 |
| ,, 3 భాగము బులుసు వేంకటరమణయ్యగారిది | ... | 2 | 0 |
| రాజశేఖరుఁడు, గోపాలుఁడు | ... | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | ... | 1 | 0 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 12 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 8 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| రేచుక్కపగటిచుక్కకథ | ... | 0 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |
| ఋషులచరిత్ర | ... | 0 | 8 |
| పురాణగాథలు I | ... | 1 | 0 |
| ,, II | ... | 1 | 0 |
| కాటేరాయనిచరిత్ర | ... | 1 | 4 |
| రఘువంశకథ | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, శ్రీ భా. రామమూర్తిశాస్త్రి | ... | 1 | 8 |
| ఈసపునీతికథలు, 1-వ భాగము | ... | 0 | 8 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 12 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| పంజాబు అల్లరి, శ్రీ మాలవ్యా జీవితము | ... | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 3 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్రము | ... | 0 | 12 |
| ద్వాదశోపనిషత్తులు, తెలుగువచనము | ... | 5 | 0 |
| గురుజాడ అప్పారావుగారి చిన్నకథలు I సంపుటము | ... | 1 | 0 |
| గేయములు పాటలు II ,, | ... | 1 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| నీతిరత్నాకరము | ... | 0 | 8 |
| వైద్యులకథలు | ... | 0 | 6 |
| వీరాంగనలు | ... | 0 | 12 |
| శకుంతలచరిత్ర, చిన్నసైజు | ... | 0 | 6 |